# చరిత్రకెక్కని చరితార్థులు



రచయిత

డాక్టర్ బి. రామరాజు



ప్రచురణ:

# చరిత్రకెక్కని చరితార్థులు

(విస్మృత కవులు - కృతులు)



రచయిత

ఆచార్య బి. రామరాజు

ప్రచురణ

ఆచార్య బిరుదురాజు రామరాజుగారి

# ముందుమాట

ఈ గ్రంథకుసుమానికి మూలస్థానమై అది ఈనాడు విరిసి, వాసించ ానికి కారణమైన సాహిత్యశాఖిక సరిగా అరవైయేండ్లక్రిందట అప్పుడే మొసులెత్తిన రక్తపల్లవం. తెలుగుదేశంలో చిన్నచిన్న గ్రామాలు సంస్కృతి మహావృక్షానికి కాసిన అరముగ్గిన పండ్లు. ఆ ఫలసముదాయంలో వరంగల్ రిదాపుల్లో ఉన్న రెండు గ్రామాలు ఈ సందర్భంలో పేర్కొన వలసిన గ్రామాలు. ఒకటి దేవునూరు, రెండోది మడికొండ. దేవునూరు గడ్డపైన దిగిర్చిన కెంజిగురు శ్రీ బి. రామరాజు. మడికొండలో పెదనాన్న శ్రీ రాఘవ రాజు పర్యవేక్షణలో ఈ చిగురే కపటాక్షై, ఆమీద ఆంధ్రసరస్వతి ముంగిట తోరణపత్రమై శాసించింది ఆరోజుల్లో రాఘవరాజుగారి కుటుంబం జమీందారీ పాయాలో నడిచేవి. రామరాజు గారి స్కూలు చదువు మడికొండలోనే ఆరంభమై జయప్రదంగా అక్కడే ముగిసింది.

అప్పటి నైజామ్ రాజ్యంలో ఇంటర్మీడియట్ చదువు చెప్పే కళాశాలలు మొత్తం నాలుగే ఉండేవి. అందులో ఒకటి గుల్బర్గాలో, రెండోది ఔరంగ బాదులో, మూడవది హనుమకొండలో నాలుగవది హైదరాబాద్ నగరంలో; ఇప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాలగా రూపొందిన 'సిటీ కాలేజి'. రామరాజుగారు ప్రైమరీ స్కూలు చదువు ముగించుకుని, హనుమకొండ చేరు కున్నారు. మడికొండలో పుట్టి పెరిగి, ఈనాడు వివిధ రంగాలలో అంతో ఇంతో పేరు మిగుల్చుకున్న పెద్దలు కొందరు, రామరాజుగారికి సన్నిహితులు. అందులో ఒకరు అభినవపోతన బిరుదాంచితులు శ్రీ వానమామలై వరదా చార్యులుగారు ఆయనా, ఆయన సోదరులు మరో అయిదుగురూ, పాండిత్య ఖనులు. వరదాచార్యులుగారు మీదు మిక్కిలి కవిత్వనిధి — సౌహార్దమూ సౌజన్యమూ మూర్తీభవించిన మూర్తి. ఆయన కవితలో దురన్వయమూ, దుర్గ్రాహ్య లక్షణమూ లేనట్లే ఆయన పలుకులో కాఠిన్యం లేదు. ముఖంమీద ఎంత నిశితంగా వెతికినా, కాఠిన్యరేఖగానీ. మాత్సర్యచ్ఛాయ కానీ పట్టుకో లేము. మరొకరు శ్రీ కాళోజీ నారాయణరావు. "కాళోజీ అంటాండు" — అంటూ; చక్కటి వరంగల్ నుడికారంతో జనాన్ని కవిత్వంలో ఉద్బోధించిన ప్రజాకవి కాళోజీ, జనం గొడవంతా కాళోజీ గొడవే, ఇంకొకరు ఛా. వల్ల

దుర్గయ్యగారు. దుర్గయ్యగారు ఉస్మానియా యూనివర్సిటీలో పనిచేసినవారు. కవితా హృదయం ఉన్నవారు. మంచి హాస్యప్రియత్వం ఆయనలో ఉంది. పన్ను కనపడనీయకుండా ముఖంలో హాసరేఖల్ని విరియించి, తాను నవ్వనట్లే ఉండి, ఇతరుల్ని నవ్వించగల నేర్పరి. ఒక్కసారైతేమిటి పదేపదే ఆయన విసిరిన చెణుకుల్ని ఉస్మానియా తెలుగు కుటుంబంవారిమి మేమంతా నెమరు వేసుకుంటూనే ఉంటాము.

ఇటువంటివాళ్ళతో సాన్నిహిత్యంవల్ల రామరాజుగారికి సాహిత్య సౌగంధ్యం అబ్బింది. బ్రతుకుతున్నది ఏదో సాధించడానికే కానీ కేవలం రోజులు గడపడానికి కాదన్న పట్టుదల ఏర్పడింది. హాస్యప్రియత్వం చేకూరింది. ఇంతేకాక, కళాప్రియుల్ని కొందర్ని కూడగట్టుకుని రామరాజుగారు నాటకాలు ఆడడం కూడా అప్పుడే మొదలుపెట్టారు. గయోపాఖ్యానం ఈయనకు నచ్చిన నాటకం. అప్పుడు ఇంటర్ పరీక్షలు, ఏ కాలేజిలో చదివే విద్యార్థి అయినా హైదరాబాద్ సిటీ కాలేజీలోనే వ్రాయవలసి వచ్చేది. తీరా పరీక్షలకు వెళ్ళేనాటికి విద్యార్థికి టైఫాయిడ్ జ్వరం. రామరాజుగారు ఇంటర్ మీడియెట్ ఆఖరుపరీక్ష సంస్కృతానికి హాజరుకాలేకపోయారు. అందువల్ల 1945-48 లో ఇంటర్ పూర్తి చెయ్యనందువల్ల ఆ సంవత్సరం రికామీగా ఉండిపోవలసి వచ్చింది. ఆ రోజుల్లో మెట్రిక్‌దాకా చదువుకున్న వాళ్ళకో సౌకర్యం ఉండేది. వాళ్ళు ఒక సంవత్సరం న్యాయశాస్త్రం చదివి, చిరు డిగ్రీ ఒకటి తీసుకొని చిన్న కోర్టుల్లో పని చేసుకోవచ్చు. ఊరికే ఉండడం ఎందుకని రామరాజుగారు 'లా' చదివారు. అంతేకాక, అప్పటి హైదరాబాద్ సివిల్ సర్వీస్ కమిషన్ పరీక్షకు కూర్చుని అందులో సెలక్షన్ తెచ్చుకున్నారు. ఆ సెలక్షన్‌వల్ల తొలిసారిగా ఉద్యోగం, గెజిటెడ్ హోదాలో, జిల్లా పంచాయితీ ఆఫీసరుగా వచ్చింది. దాన్నే అంటిపెట్టుకుని ఉంటే ప్రభుత్వంలో మంచి పదవిలోనికి వచ్చి ఉండేవారు. అప్పటి రామరాజుగారితో పాటు ఎన్నికైన వారే ముఖ్యకార్యదర్శిగా పనిచేసిన బి. యన్. రామన్, ఐ.జి.పి. మహేందర్ రెడ్డి మొదలైనవారు.

ఇక్కడో విషయం చెప్పాలి. ఇంటర్ పూర్తి చేయడానికి, హైదరాబాద్‌లో ఉన్న కాలంలో ఈయనకు బాగా సహాయం చేసినవారు N. K. రావుగారనే ఒక సహృదయుడు, ఆయన ఇల్లు మొజంజాహి మార్కెట్‌దగ్గర,

అక్కడే సంస్కృతభాషా శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఉండేవారు. రామరాజుగారు ఆ ప్రదేశానికి రాకపోకలు చేయడంవల్ల ఈ దిగ్గంతులతో పరిచయం ఏర్పడ్డది. అనగా, ఒకవిధంగా ఈయన వకీల్ చదువు సాహిత్యకులతో పరిచయం పెంచుకోగల అనుసంధానవిషయంగా ఏర్పడ్డది. అందుకు కారణం పరోక్షంగానైనాసరే, శ్రీ ఎన్. కె. రావుగారు. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారికి రామరాజుగారు శిష్యుడు కావడం ఆ రకంగా జరిగింది. ఇంటర్ మీడియట్ దశలోనే ఆయనదగ్గర ఈ శిష్యుడు బరువైన పాఠాలు చెప్పించుకోవడం జరిగింది. ఆయనకు మిక్కిలి ప్రియమైన విషయం తాళపత్రగ్రంథ సేకరణ, శోధన. అందులో ఆయనకు ఈయన కుడిభుజంగా, శక్తిమంతమైన సాధనంగా, ఉపకరణంగా నిలిచారు. ఈ గ్రంథంలో పరిశీలించిన చరిత్రకెక్కని చరితార్థులంతా ఆ తాళపత్ర గ్రంథాలనుండి అవిష్కరింపబడినవారే. ఆ రకంగా, నివురుగప్పిన నిప్పులా లోలోన దాగున్న రామరాజుగారి ప్రతిభను ఉజ్జ్వలం చేసిన స్థానం హైదరాబాదు. హస్తం శ్రీ సురవరం వారిది. ఈ విషయం రాజుగారే ఎప్పుడూ కృతజ్ఞతతో స్మరించుకుంటూ ఉంటారు.

మెల్లిగా ఇంటర్ ఒడ్డునపడి నిజాంకళాశాలలో బి ఏ. చదువును ఈదడం మొదలుపెట్టిన తరువాత, ఈయన ఉత్సాహం బహుముఖాలుగా ప్రతిఫలించింది. హైదరాబాద్ విద్యార్థిసమాఖ్యకు ఈయన అధ్యక్షుడు శ్రీ బూర్గుల రామకృష్ణారావు, స్వామీ రామానందతీర్థ, శ్రీ కె. వి. రంగారెడ్డి ప్రభృతుల నేతృత్వంలో, ఒక కార్యకర్తగా ఉంటూ, వారితో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకున్నారు. అప్పుడు హైదరాబాద్‌ను నిజాం ప్రభుత్వపు శృంఖలాలనుండి తప్పించే ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతుండేవి. హైదరాబాద్ విమోచనం కొరకు, డా. మేల్‌కోటే నాయకత్వంలో గౌలీగూడా చమన్ దగ్గర ఒక సత్యాగ్రహం జరిగింది. అందులో పాల్గొని జైలు ఆతిథ్యం స్వీకరించిన ధైర్యశాలి రామరాజు. ఈయనలో చేపట్టిన పనిని, పిరికిపడకుండా కొనసాగించే ధీరలక్షణాన్ని ఆర్యసమాజం స్థాపించింది. అక్కడ ఉండే క్రమశిక్షణ, నియమయుత జీవనం ఈయనకు చాలా ఇష్టం. దీనికి తోడు చేపట్టిన కార్యాన్ని కొనసాగించడానికి విప్లవాత్మకపంథా అవసరమైనదే అనే అభిప్రాయం లోలోపల ఈయన పెంచుకున్నారు. ఒక విప్లవ వీరుడుగా తన్ను తాను ఊహించుకుని, ఉద్రిక్తకరచర్యల్లో పాల్గొనేవాడు.

గూడ్సు బళ్ళు ఆపడం, రైలుపట్టాల ఫిష్ ప్లేట్లు తీయడం ఇట్లాంటివి. పొంగుతెత్తే యువకరక్తపు ఉరకలు చూచి, దేశానికి మొదటిసారి ఎన్నికలు జరుగుతున్నప్పుడు కాంగ్రెస్ పార్టీ టికెట్ ఇవ్వజూచింది. కాని ఈయన రాజకీయ జీవితంలోకి కప్పగంతులు వేయడానికి శ్రీ సురవరంవారు ఒప్పుకోలేదు. అందువల్ల రాజుగారి రాజకీయప్రవేశం మొ[illegible]సంతానే ఆగిపోయింది. కాని ఈ చర్య పుణ్యమా అని శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు వంటివారితో సన్నిహితత్వం లభించింది. 1950 ప్రాంతాలలో రాజుగారు అఖిల భారత జాతీయ విద్యార్థి సంఘం పక్షాన బొంబాయికి ప్రతినిధిగా వెళ్ళి వచ్చారు. ఆ అనుభవం వారిలో కార్యదక్షతనూ వ్యూహ రచననూ పెంపొందింపజేసింది.

1950 వరకూ హైదరాబాద్‌లో తెలుగుకు ప్రశస్తిలేని రోజులనవచ్చు. తెలుగులో మాట్లాడడం, వ్రాయడం ఎదుటివాడికి అనవగాహన లక్షణాన్నీ, తెలుగువాడికి ఆత్మశూన్యతా లక్షణాన్నీ పెంచిన కాలం అది. కళాశాలల్లో తెలుగు చెప్పేవారు కారు. చెప్పినా మొక్కుబడికోసం అప్రధానాంశంగా చెప్పేవారు.

ప్రభుత్వాన్ని ఎదిరించి తెలుగువాడు తన భాషనూ, సాహిత్యాన్నీ పెంపొందింప చేసుకోవడానికి కంకణం కట్టుకుంటున్న రోజులు. అందుకై శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం, తెలంగాణా రచయితల సంఘం, ఆంధ్రసారస్వతపరిషత్తు ముప్పేటగా, ముమ్మరంగా పనిచేస్తున్న రోజులు. ఈ పవిత్రయజ్ఞంలో రామరాజువంటివారు మడమ తిప్పని వీరయోగ్యమైన కార్యదీక్షతో పాలు పంచుకుంటుండేవారు. నిజాం కళాశాలలో ఆంధ్రాభ్యుదయోత్సవాలను సుశిక్షితపద్ధతిలో నడిపిన చరిత్ర రాజుగారిది కాగా, మనోహరమైన బాణీలో తన వాణిని వినిపించి ఆహూత జనాన్ని ముగ్ధులను కావించిన ఘనత శ్రీ నారాయణరెడ్డి గారిది.

ఎం. ఏ. చదువుకు వచ్చినప్పుడు, శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారి సాన్నిధ్యంలో రామరాజుగారికి ప్రత్యక్షశిష్యత్వం ఒనగూడింది. లక్ష్మీరంజనం గారు గోదావరీ తీరంలో పుట్టి, తియ్యని అంతరంగాన్ని పెంచుకున్న మనీషి. ఆయన, ఆ నీరు తాగి పెంపుగన్న ఆదికవి నన్నయకు వలె, మనసు వెన్న; మాట కొంత వెన్నకంటె గట్టిది. లక్ష్మీరంజనం గారు పట్టుదల

మనిషి. చేపట్టిన కార్యాన్ని సాధించడంలో, ఆయన, అలసట ఎరుగరు. ఎవరికి ఇష్టమో, మరెవరికి అనిష్టమో తాను చేయదలచుకొన్నదాన్ని 'నిర్మొగమాటం'గా వెల్లడించడం ఆయన జీవలక్షణం. లోపల ఒకటి అనుకుని పైకి మరొకరీతిగా ప్రవర్తించే పద్ధతి ఆయనది కాదు. ఆయన, జీవితంలో ఏ కార్యాన్నయినా నిర్వహించడానికి ముఖ్యంగా మూడు అంశాలు ఉండాలనే వారు. అవి ఒకటి, ఏ పని చేయాలనుకున్నామో, దానిమీద ముఖ్యంగా చేసే వాడికి చెసికిపోని ప్రత్యయం ఉండటం. రెండు, అది చేసేవాడికి ఒక్కడికి మాత్రమే ఉపయోగపడేదిగా కాక, చుట్టూ ఉన్నవారికి, సమకాలంవారికి, ఉపయోగించడం. మూడు, ఒక పనిని నిర్వహించడానికి అనువైన కాలాన్ని ఎంచుకోవడం. ఈ త్రిపుటి ఒనగూడిననాడు ఎంత బృహత్తరపథకమైనా సులువుగా నిర్వర్తింపబడుతుందని నమ్మడమే కాక అందుకు దృష్టాంతంగా నిలిచే పనులు చేసినవారు శ్రీ లక్ష్మీరంజనం గారు. ఆటువంటి పనులలో తలమానికమైన ప్రణాళిక మహాభారతానికి వారు తయారుచేసి యిచ్చిన "సంశోధిత ప్రతి." నాలుగైదు వందలతో ఆరంభమైన ఈ పని, కేవలంవారి కార్యదీక్షవలననే కొన్నిలక్షలప్రణాళికగా విస్తరిల్లి, సంపూర్ణమై, ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖకు గర్వకారణమై రూపు దిద్దుకున్నది. ఆటువంటి లక్ష్మీరంజనంగారికి కూర్చు శిష్యుడు రామరాజుగారు. ఆయనకార్యదీక్ష శిష్యుడికి కూడా సంక్రమించిందనడంలో అతిశయోక్తిలేదు.

ఒక గ్రంథానికి పీఠిక వ్రాయవలసి వచ్చినప్పుడు, సాధారణంగా గ్రంథగతవిషయవిశ్లేషణ చేయడం పీఠికాకర్తలు చేసేపని. అక్కడ చెప్పవలసిన విషయం, కవినిగురించి అయిఉంటే బాగుండేదని నేను ఏ గ్రంథపీఠిక చదివినా అనుకుంటుండేదాన్ని. కవిరచన పాఠకుల ఎదుటే ఉంటుంది. కాని కవిజీవనవిశేషాలూ, ఆత్మవ్యక్తి, అభినివేశం, ఇష్టానిష్టాలు వంటివి ఉండవు. కవి జీవించిన దేశకాల నేపథ్య వివరాలుకూడా ఉండవు.

సమకాలికుల విషయంలో ఈ వివరాలు తెలుస్తాయి నిజమే. మరో వంద సంవత్సరాలకు, ఇటువంటి విషయాలు అక్షర బద్ధం చేయకపోతే,

అప్పటి పాఠకుడికి తెలిసే దారి ఉన్నదా ? – గ్రంథస్థ విషయం ముంజేతి కంకణం, అయితే, ఇక దానికి అద్దం ఎందుకని నేనీ పీఠికను కవి పరిచయంతో పూర్తి చేస్తున్నాను.

ఆఖరుగా ఈ పుస్తకం ఈ రూపుకు రావడానికి ముఖ్యకారణం ఆచార్య బి. రామరాజు షష్టి పూర్తి సన్మాన సంఘ కార్యవర్గం. అందులో ప్రత్యేకించి, ఈ కార్యక్రమాన్ని భుజాలమీద వేసుకొని, భారాన్ని పూర్తిగా వహించి, జయప్రదంగా నిర్వహించడంలో శక్తియుక్తుల్ని చూపించినవారు ప్రధాన కార్యదర్శి డా॥ ఆర్. శ్రీహరిగారు. వారికి అండదండగా ఉండి ధనసేకరణలో శ్రమించిన వారు డా. ఆర్ మాధవరావుగారు. హైదరాబాదు అవతల, ఈ విషయమై శ్రమించినవారు డా. పేర్వారం జగన్నాథంగారు, డా. పల్లవురెడ్డి బుచ్చారెడ్డిగారు. వీరు నలుగురనేమిటి, ఈ కార్యక్రమాన్ని తమ యింటి శుభకార్యంగా భావించి, భారాన్ని భుజాలమీదికి ఎత్తుకున్న ప్రతివారూ నిజానికి; పేరు పేరునా ఇక్కడ స్మరింపవలసినవారే—వారందరికీ, ఈ సన్మానసంఘ అధ్యక్షురాలి హోదాలో నా అభినందనల్నీ, కృతజ్ఞతల్నీ అందిస్తున్నాను. 11–4–౮౫ నాడు ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలలో వైభవంగా జరిగిన ఆచార్య బి. రామరాజుగారి షష్టి పూర్తి సన్మాన కార్యక్రమంలో పాల్గొని, సభను విజయవంతం చేసిన శ్రీ యతిరాజారావు, శ్రీ దేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివాకర్ల వెంకటావధాని, ఆచార్య సి. నారాయణరెడ్డి, ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు, ఆచార్య తూమాటి దొణప్ప, శ్రీ కాళోజీ సోదరులు, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి, ఆచార్య కె. గోపాలకృష్ణారావు, ఆచార్య ఎమ్. కులశేఖరరావు గారలకు నా కృతజ్ఞతలు.



11-4-1985 నాడు జరిగిన షష్ట్యబ్దపూర్తి సన్మానసభలో ఆచార్య బి. రామరాజు గారిని, వారి ధర్మపత్ని శ్రీమతి సూర్యదేవిగారిని ఆం. ప్ర. ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులు శ్రీ యతిరాజారావు గారు సన్మానిస్తున్న దృశ్యం

# విషయసూచిక

## తెలుగు విభాగము

## సంస్కృత విభాగము

# రాజాబహిరీ పామనాయక భూపాలుడు

పదునెనిమిదవ శతాబ్దము మధ్యభాగమున సురపుర సంస్థానమును వైభవో పేతముగా పాలించినవాడు రాజాబహిరీ పామనాయక భూపాల బిరుద విభ్రాజితుడైన రాఘవ భూపాలుడు. ఈతడు పీతాంబర నాయక పౌత్రుడు; రమణ భూపాల పుత్రుడు; లక్ష్మమాంబా గర్భవనధి వీచీమతల్లి రాకా సుధా కరుడు. ఈ సురపురమునకే తరువాత షోరాపురమని పేరు కల్గెను. ప్రస్తుత మిది గుల్బర్గా జిల్లాలో మున్నది (లక్ష్మణరాయ వ్యాసావళి పుట ౪౪). సుర పురమును బేదరు (నిర్భయు)లను తెలుగు నాయకులు పరిపాలించిరి. ఈ బేదరులు తొలుత అనాగరికులట. మైసూరునందలి రత్నగిరి దక్షిణ మహా రాష్ట్రము వీరియాదిమ నివాసమట. (శ్రీ కృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవ సంచిక. పుట ౬౬) ఈ రాజన్యులందు కడపటివాడు బాలుడుగా నున్నప్పుడు కల్నల్ మెడోస్ సంస్థానాధికారిగా నుండి రాజకుమారుడు పెద్ద వాడైన తరువాత క్రీ. శ. 1853లో నాతనికి సంస్థానము నప్పగించెనట. ఈ రాజు 1857లో జరిగిన విప్లవమున పాల్గొనుటచే నాతనికి తొలుత మరణ దండనము విధింపబడి హైద్రాబాదులో బంధింపబడెను. పునర్విచారణమున ఐదేండ్ల కారాగారవాసము విధింపబడి రాయవేలూరునకు పంపబడెను. మార్గ మధ్యమున నీ దేశభక్తుడు ఆత్మహత్య గావించుకొనెను. ఈ మహా విప్లవమున బ్రిటిషువారికి ఘన సాహాయ్య మొనర్చిన ఫలితముగా సురపుర సంస్థానము నిజాము సర్కారువారికి దక్కెను. సురపుర సంస్థానాధీశ్వరుల వంశీయు లిప్పటికిని కలరట. ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారి సంపుటము 13 సంచిక 1, 1940 లో డాక్టరు రాఘవన్‌గారు "సురపుర సంస్థానాధీశ్వరులు మరియు సంస్కృత రచయితలు" అను దీర్ఘమగు వ్యాసమును ప్రకటించి నారు. దానిలో నీ సంస్థానమునకు సంబంధించినట్టి యమూల్య విషయము లెన్నియో కలవు.

ఇట్టి వంశమున బుట్టిన పామనాయక భూపాలుడు కూడ శత్రు భయంకరుడు; "పరమ భాగవత భక్తి తాత్పర్య నిర్ణయుడు." ఈతని కాలముననే సుప్రసిద్ధ కవి పండితులగు శ్రీమత్తిరుమల బుక్కపట్టణం అణ్ణయ్య దీక్షితుల వారును, శ్రీమన్నిగమాంత దేశికుల యపరావతారముగా భావింపబడిన శ్రీమత్తిరుమల బుక్కపట్టణం శ్రీనివాస మహాదేశికులవారు సను సోదరులు ధర్మపరమునుండి సురపురమునకు వచ్చి రాజగురువులై యచటనే స్థిరపడిపోయిరి. ఈ అణ్ణయ్య దీక్షితులవారి కుమారులే యావద్భారతమున తమ విజయ దుందుభులు మ్రోగించిన కిరీటి వెంకటాచార్యులవారు. ఈ ముగ్గురి చిత్రములును వీరికి సంబంధించిన వివరములును క్రీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు సంపాదించిన "గోలకొండ కవుల సంచిక"లో కలవు. పామన యకుడు కవి పండిత పోషకుడే కాక స్వయముగా పండిత కవి. ఈతడు భార్గవ పురాణమను వైష్ణవ ప్రబంధమును రచించెను.

భార్గవ పురాణము ఎనిమిది ఆశ్వాసముల గ్రంధము. వాగినగిరిలో వెలసిన వేణుగోపాలస్వామి సురపురాధీశ్వరులకు కులదైవతము. భార్గవ పురాణమీ వేణుగోపాలస్వామి కంకితముగా రచింపబడినది. గద్వాల సంస్థానాధీశ్వరులు తమ తాళపత్ర గ్రంథ భాండాగారమును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికిచ్చినారు. ఈ భాండాగారమున మరుగుపడియున్న మాణిక్యములందొకటి భార్గవ పురాణము. వైష్ణవ ప్రబంధమగుటచే మత ప్రాశస్త్యమును, మహాకవి నిర్మాణమగుటదే సాహిత్య ప్రాశస్త్యమును, రాజకవి రచనమగుటచే చారిత్రక ప్రాశస్త్యమును ఈ విధముగా మూడు విశిష్టగుణములు గలదీ భార్గవ పురాణము.

భార్గవ పురాణమందలి యితివృత్తము పన్నిద్దరాళ్వారుల చరిత్రము. కవికి స్వప్నమున భగవంతుడు సాక్షాత్కరించి ఏతత్కృతి రచనమునకిట్లు పురికొల్పినాడు:

చ॥ పరమ వివేకశీలుడవు బ్రాహ్మణ పోషణ తత్పరుండవై
యరయుట యేను బ్రాహ్మణ ముఖాళివశాప్తి దనర్చుటున్కి నిన్
పరమతి బోవ నిచ్చటికి వచ్చిన వాడను నొక్క సూక్తిత
ప్వరచనజేతు నీ కిపుడు బాలక పామధరాధిపాలకా.

సీ॥ అస్మత్ప్రభావ మౌనట్టి శ్రీవిష్ణు పురాణంబు తెనుగున రసికులెన్న
కృతి రచియింపించి తత్భక్తి పూకంకితంబు చేయించిన ధన్యమతివి.
యరయ తన్నిద్ధరైనట్టి మద్భక్తుల చరితంబు నాంధ్రభాషా ప్రబంధ
మును జేసి మాకిష్టముగ సమర్పణము గావించినచో పృథివీస్థలమున

సకల పుణ్యతరా(ఫలా)వాప్తి సంఘటించు
నీ కనుచు సురపురవాసుడై కడంగు
దేవుడా కృష్ణమూర్తి యదృశ్యుడౌట
మేలుకని మానసోత్సాహలీల దనర.

"అమృత స్వరూపంబులును, నిరంతరంబులునునగు భగవద్దాస్య భాక్కులైన యోగీశ్వరుల చరిత్రంబులు" వినగోరిన శౌనకాదులకు సూతుడీ కథలు చెప్పినట్లుగా నున్నది. బదరికాశ్రమమున నారాయణుడు నరునకు వీనిని వినిపించెనని సూతుడీ కథలు శౌనకాదులకు వినిపించును. ప్రథమాశ్వాన మందలి యితివృత్తము భార్గవ పురాణోత్తర ఖండమందలి పంచమాధ్యాయ మనియు, రెండవ యాశ్వాసము దశమాధ్యాయమనియు, మూడవ యాశ్వాసము పంచదశాధ్యాయమనియు, చతుర్థాశ్వానము వింశతితమాధ్యాయ మనియు, పంచమాశ్వాసము త్రయోవింశతితమాధ్యాయమనియు, షష్ఠా శ్వాసము షట్వింశాఅధ్యాయమనియు, సప్తమాశ్వాసము త్రయస్త్రింశాధ్యాయ మనియు, అష్టమాశ్వానము చతుర్వింశాధ్యాయంబనియు కథలు ముగించు నప్పుడు ప్రతి యాశ్వానము చివరన క్రమముగా చెప్పబడినది. ఆశ్వాసాంత గద్యంబులందాయా ఆశ్వాసములందున్న కథాదికములు వరుసగా పేర్కొన బడినవి. కవి విశిష్టాద్వైత సంప్రదాయమునకు చెందినవాడు గనుక మొదటి రెండు పద్యములందు సురపురమున వాగినగిరియందు వెలసిన వేణుగోపాలుని స్తుతియు, అటుతరువాత అనంత, తార్క్ష్య, విష్వక్సేన, పంచాయుధ, ద్వాదశ సూరుల స్తోత్రములును ఒక్కొక్క పద్యమున వేరు వేరుగా చేసినాడు. తన స్వప్నవృత్తాంతమును ఆస్థానవిద్వాంసులకు వినిపింప వారలు కవిని గొనియాడి అతని వంశావతారమును చెప్పి కృతి రచించి వేణుగోపాలున కంకితమిడుమని ప్రోత్సహింతురు. అటు తరువాత షష్ఠ్యంతములు చెప్పి కథను ప్రారంభించినాడు.

ఆస్థానవిద్వాంసులనోట కవి పల్కించిన వంశావతారమువలన సురపురాధీశ్వరుల పరంపర మనకు దెలియవచ్చు చారిత్రక విశేషములందు ఒకటి, రామభక్తుడగు గుహుని వంశమున బుట్టిన వీరి క్రమ మీ విధముగా నున్నది. 1. నరసింహ మహీపాలుడు. 2. వడియరనాయకుడు. 3. కల్ల మహీవల్లభుడు. 4. చిన హనుమ ధరణీకాంతుడు. 5. హావినాయకుడు. 6. పెదసోమనాయకుడు. 7. ఎరనింగ ధరణీధవుడు. 8. మదిరి ధరాధ్యక్షుడు. 9. వీరజంపి నాయకుడు. 10. బలెసోమనాయకుడు. 11. పెదపామ నాయకుడు. 12. దేశాయి జక్కభూవిభుడు, 13. గడ్డెపిడ్డ భూపాలుడు. 14. పెదపామ ధరణీపాలుడు. 15. పీతాంబరావనీపాలుడు. ఈ పీతాంబరావనీపాలునకు "సంతానతరుపంచకస్వరూపులగు పామమహీధవ, కృష్ణ భూపాల, రమణధరణీరమణ, వాసుదేవాధిప, మహీపతులను సుతులు గల్గిరి". వీరిలో పెద్దవారగు పామభూపాలునకు పిడ్డధాత్రీవర, వెంకట క్ష్మాధిపులను తనయు లిరువురుద్భవించిరి. మూడవవాడుగా పేర్కొనబడిన రమణధరణీ రమణునకు లక్ష్మమాంబయందు "రాఘవ భూపాలకాభిధానంబున గల్గినవాడీ కృతికర్త పామనాయక భూపాలుడు. ఈతడు "దిగంత కీర్తి కాంతామనోహరుడు", "సకలధర్మ ప్రతిపాలకుడు". ఈతని "భుజా ప్రతాప శిఖిశిఖాపరంపరల కహితభూభృన్నికాయంబు శలభనిచయంబు మాడ్కి విలసిల్లె"నట.

ఆశ్వాసాంత గద్యములందు మరికొన్ని చారిత్రక విశేషములు కలవు. చారిత్రక పరిశోధకుల కుపకరించునను తలంపుతో కొంత భాగము నుట్టంకింతును :

"ఇది శ్రీమద్రాజ గోపాలకృష్ణ కరుణాకటాక్షవీక్షాలబ్ధ పాండిత్య ధురీణవరణావనీమండలాఖండసామ్రాజ్యధౌరేయ స్వసమర్థతాకృత పటహ ధణంధణారావ విపరీత పతన క్రియా ఢిల్లికాధీశ దుందుభిధ్వాన కోలాహల హనూమద్ధ్వజాంక కనకదండీకృత హీరకలశీకృత నందీపిత ప్రతాప కీర్తిప్రభావ కోసలవంశపయఃపారావార రాకాసుధాకర పీతాంబర నాయక పౌత్ర రమణ భూపాలకపుత్ర లక్ష్మమాంబా గర్భశుక్తి ముక్తాఫల రాఘన భూనాయకాభిధాన సౌందర్యజిత సుమసాయక బహరీ పామనాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవ పురాణంబునందు..."

ఈ బేదరు నాయకులు బీజపూరు, గోల్కొండ నవాబులకు తోడుగా ఔరంగజేబుతో యుద్ధములు చేసినట్లు చరిత్రలు చెప్పుచున్నవి. సురపురమునకు రాజధానిని మార్చక పూర్వ మీబేదరులకు వాకిన్‌ఖేడా రాజధాని. దీనినే వాగినగిరి యందురు. ఇచటి వేణుగోపాలస్వామి వీరికారాధ్య దైవతము. ఆ దుర్గమును 1704లో ఔరంగజేబు జయించెనట. ఔరంగజేబు మరణానంతరము నాయకులు మరల వాకిన్‌ఖేడాను వశపరచుకొనిరట. చరిత్రములందు కానవగు అంశములకును, పై గద్యమందలి "విపరీత పతన క్రియా ఢిల్లికాధీశ" యను మాటకును గల సంబంధమును పరిశోధింపవలయును. ఈ బిరుద మీతని ముత్తాత పామనాయకునిదై యుండవలయును. అతడు ఔరంగజేబు నొక యుద్ధమున నోడించినట్లాధారములు గలవు. గద్యమందలి మరియొక విశేషము కవి తాను కోసలవంశీయుడనని చెప్పుకొనుట. అవతారికలో కవి వంశావతారమును చెప్పినప్పుడుగూడ కోసల కులమని యున్నది. "భవదన్వయంబునకు ఆదిపురుషుండును శౌర్యవిజితగుహుండునగు గుహుండు రామతారక భక్తిహృదయావహుండగుట తద్వంశం బనేకశాఖా భేదంబుగా వాడుకొన నందలి కోసల కులంబునందు నరసింహ మహీపాలుండు" జన్మించినట్లుగా నున్నది.

పామనాయక భూపాలుని కవిత్వమునకు మచ్చుగా నొక్క పద్యము నుదాహరించి ఈ పరిచయ వ్యాసమును ముగింతుము.

మ॥ పర్వతత్త్వార్థ పరిష్క్రియాభిరతి శుంభత్పాండ్య భూమండలే
శ్వర సద్వైష్ణవతా విధాయి కరుణాంచద్భట్టపాదార్య సో
దరలీలా చిదచిద్విశిష్టమత సిద్ధాంత స్ఫురద్దర్పణాం
తరవిద్యోది(తి)త దివ్యవిగ్రహ నమద్భక్తాదరానుగ్రహా.

ఇట్టి గ్రంథములు మరుగునపడిపోవుట విధి వైపరీత్యము.

(గోలకొండ పత్రిక 28-11-1960)

# బొరిగడ్డుల ధర్మయామాత్యుడు

చరిత్రకెక్కని చరితార్థులందు ధర్మయామాత్యుడొకడు. ఈతని కృతి "నృసింహ పురాణము." ఆరాశ్వాసముల గ్రంథమిది. కవికాలమిదమిత్థముగా దెలియదు. ఈ తాళపత్ర గ్రంథము గద్వాల సంస్థానము వారిచ్చినది. మొదటికమ్మ, చివరికమ్మ రెండును లేకపోవుట విచారకరము. చివరి కమ్మ వలన కనీసము ప్రతి వ్రాయబడిన తేదీయైనను తెలిసియుండును. ఉన్న గ్రంథముకూడ మిక్కిలి శిథిలావస్థలో నున్నది. గ్రంథపరిస్థితిని బట్టియు, లిపినిబట్టియు కనీసము 250 ఏండ్లకు పూర్వపు గ్రంథమని యూహింపవచ్చును. పోయిన మొదటికమ్మలో ఇష్టదేవతా స్తోత్రాదికము లుండియుండును. రెండవకమ్మ ఆంజనేయ స్తోత్రముతో ప్రారంభమైనది. ఆటుతరువాత మూడు పద్యములందు పూర్వ గీర్వాణాంధ్ర భాషా కవుల నుతియున్నది. ఆ పద్యము లిట్లున్నవి.

క॥ మనమునసే భజియింపుదు । ననయము వాల్మీకి వ్యాసు ననిమిషమౌనిన్
ఘనసుర వందితులను స । న్మునిమాన్యుల హారికథాను మోదితమతులన్.

ఉ॥ చారు మనఃప్రమోదమున సంస్కృత కావ్యమునం బ్రవీణులౌ
ధీర మయూరు, బాణు, జయదేవుని జోరుని గాళిదాసునిన్
భారవి మాఘు బిల్హణుని భైరవునిన్ శివభద్రునిన్ హరిన్
గూరిమితో నుతింతు మదిగోరిన కోర్కికను గ్రహింపగన్.

క॥ తగ నంధ్రభాషనేర్పరు । లగు నన్నయ భట్టు, తిక్కనాహ్వయు భీమున్,
సుగుణుని బమ్మెర పోతన । నాగిభాస్కరు రంగనాథు నొనరదలంతున్.

పూర్వకవి సమాదరణమున సాధారణముగా కవిత్రయమును బేర్కొనుట పరిపాటి. కాని ఈ ధర్మయామాత్యుడు తాను నృసింహపురాణమును

రచించువాడైనను ఎఱ్ఱాప్రగడను పేర్కొనక పోవుట వింతగానున్నది. అటు తరువాత కుకవి నిరాకరణంబు రెండు పద్యములందున్నది. వాని తరువాత వచన భాగమిట్లున్నది.

"అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవివందనంబును కుకవినిందనంబునుం గావించి యొక్క ప్రబంధంబు సేయంబూని సువిభూషితుండైన మా యిష్టదైవంబైన బారిగడుపుల నారసింహుని పాదారవిందంబులు నాడెందంబునం బొందుపరచి యొక్క రమ్యస్థలంబున ధ్యానారూఢుండనై యున్న సమయంబున"—

ఈ బారిగడుపుల జటప్రోలు సంస్థానమందలి దివ్యస్థలము. కవి తన కులగోత్రాదులు చెప్పుకొన్నచోట ఇంటిపేరు చెప్పుకొనకున్నను, బారిగడ్పుల గ్రామనివాసి యగుటచేతను, బారిగడుపుల నృసింహస్వామి యిలువేల్పు కనుకను, ఇంటి పేరుకూడ బారిగడుపులవారనియే యుండునని యూహించి నేనే కవి పేరునకుముందు బారిగడుపుల పదము చేర్చినాను. పై వచనము తరువాత తన యెదుట సాక్షాత్కరించిన బారిగడుపుల నృసింహుని వర్ణించు రెండు సీసపద్యములు గలవు. వాని తరువాత మరియొక వచనమిట్లున్నది.

"మరియు నద్దేవదేవుని శ్రీపాద సందర్శనానుభవుండనై మేనం బులకాంకురంబులు నిగుడ నానేర్చు విధంబుల సన్నుతించి మదీప్సితంబు విన్నవించిన నన్నుం గరుణార్ద్రదృష్టి న్నిరీక్షించి దరహసితవదనుండై యిట్లనియె. నీ యిష్టం బెరుంగుదు. మున్ను నీవు ద్విపద రూపంబుగా జేయించి నాకు సమర్పించిన నృసింహపురాణం బంగీకరించితినని మరియు నిట్లనియె."

ఈ ద్విపద నృసింహ పురాణమేమైనచో తెలియరాదు. వాఙ్మయ చరిత్రములందు దీనిపేరు కూడ కానవచ్చుటలేదు. "ద్విపద రూపంబుగా జేయించి" యనుటచే నీ ద్విపద కృతికర్త ధర్మయామాత్యుడో మరి యేకవియో సరిగా చెప్పలేము. పై వచనము తరువాత భగవదాజ్ఞ మరిరెండు పద్యములందీటిరుగా కలదు.

క॥ వినుమెరిగించెద నే నీ, జనకుని గరుణించినాడ సాక్షాత్కారం
బున మిమ్ముబ్రోతునేని, ట్లనుదినముమ సంతసిల్లు మని కడిమి మెయిన్

క॥ ఒగి నరసింహపురాణం, బగణితమది వచనకావ్యమై భువిబరగం
దగ రచియింపుమ ఈకృతి, జగతి బ్రవర్తిల్లుచుండు శాశ్వతముగుచున్.

ఈ రెండవ పద్యమున నీ కృతిని వచనకావ్యమనినాడు. వచనశబ్దమున కీనాటి యర్థము వేరు. పూర్వ మీశబ్దమునకు మరికొంత విశాలమైన పరిధి యుండెడిది.

ధర్మయామాత్యుడు భగవదాజ్ఞను తన తండ్రి కెరిగింప నాతడు కొడుకుతో నిట్లనును.

క॥ పరగ మన భాగ్యమున శ్రీ। ధరుడార్త శరణ్యు డతిముదంబున మనలం
గరుణించి యిచట బ్రబలిన। తెరగే నెరిగింతు వినుము ధీరవిచారా.

గీ॥ ప్రబలముగ తొల్లి కశ్యపబ్రహ్మ మౌని
మహితుడై (శిధిలము) గౌతమీ మధ్యదేశ
మునను తపమతి నిష్ఠతో మొనసి చేయ
వరదుడై చక్రి వేడుము వరములనిన.

ఉ॥ సన్నుతులోలి జేయుచును సంయమిచంద్రుడు విన్నవించె నో
పన్నగతల్ప ఆర్తజనబాంధవ నన్గరుణించితేని నీ
విన్నగభూమి నిల్వుమిది యిష్టము నా కనినం బ్రియంబుతో
వెన్నుడు నిల్చి మౌనికిని వేడ్క జనింప బ్రసన్నచిత్తుడై.

వ॥ అప్పరమాత్ముండిట్లని యానతిచ్చె. మునీంద్రా యీ స్థానంబు చిరకాలంబున నుండియు పుణ్యప్రదేశంబుగావున బూర్వంబున చతణాద్రియు ఈ స్థలంబు కలియుగంబున కాశ్యకల్లు నా బరగునని యానతిచ్చి యీ స్థలంబున వసియించియున్న యద్దేవదేవుని దివ్యమూర్తిః నా చిత్తంబున నిల్పి సుఖశయనుండనైయున్న అప్పుండరీకాక్షుండు నా స్వప్నంబున సాక్షాత్కరించి కశ్యపుడు నన్నిచట నుండగోరెను నీవును కాశ్యపగోత్ర జనితుడవు కనుక నీ గిరిగహ్వరంబున బారిగడుపుల నరసింహమూర్తి పేరుతో వెలసెదము కోవెల గట్టించి పూజింపుమని చెప్పిన ప్రకారంబుగా నాతడు (కృతికర్త తండ్రి) అ చోటును సాధించి కోవెలగట్టించె. ఆకోవెల యందే పన్నిద్దరాళ్వారులును భాష్యకారులును గొలుచుచుండ స్వామివారు వేంచేసి మనల బ్రోచుచున్నారు కనుక నీవా పరమాత్మునకీ ప్రబంధము నంకితము సేయుమని పుత్రునకుపదేశించి పుణ్య తీర్థాటనాభిలాషియై కాశికిం" జనినట్లును తదాజ్ఞననుసరించి ధర్మయామాత్యుడు బారిగడుపుల నృసింహున

ంకితముగా దీనిని రచించినట్లును గలదు. ధర్మయామాత్యుడి పట్టున తన
ురువంశాదికమును జేర్కొనినాడు.

గురువుల వంశక్రమమిట్లున్నది. శ్రీ వత్సగోత్రజులగు నల్లాన్
చక్రవర్తులవారి కోవలో 1. చిట్టాచార్యులు 2. ధర్మాచార్యులు 3. రంగా
చార్యులు నను మూడు తరములవారు రంగాచార్యులకు 1. ధర్మనాచార్యులు
2. చిట్టయాచార్యులు 3. నరసింహాచార్యులు 4. చింతామణి 5. ఘంటా
చార్యులు నను వారు జన్మించిరి. పెద్దవాడైన ధర్మనాచార్యులవారి కుమారుడు
రంగాచార్యులు కృతికర్తకు గురువు. ఈ గురువులవారి గురువు శఠగోప
జియ్యలని పేరు గాంచిన నరసయాచార్యులట. ఈ శఠగోవజియ్యలకు
శ్రీమత్పరాంకుశ జియ్యలు గురువులట. ఇట్టి గురువుల యనుగ్రహంబునకు
పాత్రులైన తమ వంశావతారమును గూడ కవి విపులముగా వర్ణించి
యున్నారు. కాశ్యపగోత్రజులైన తన తాత ముత్తాతలలో 1. అనంతరాజు
2. కృష్ణుడు 3. తిరుమలమంత్రి 4. తిమ్మమంత్రి (కృతికర్త తండ్రి)
మున్నగువారల గూర్చియు వారి సతీమణులగూర్చియు చెప్పినాడు. తన
తండ్రియైన తిమ్మమంత్రి కిరువురు భార్యలు. 1. కొండమాంబ (ఈమె
రంగరాజు తిమ్మప్రధాని పుత్రికయట) 2 నరసమాంబ. కొండమాంబకు
ఐదుగురు కూతుండ్రు మరియు రంగమంత్రి, ధర్మయ (కృతికర్త) యను
నిరువురు కుమారులు. నరసమాంబకు ముగ్గురు కూతుండ్రు మరియు కొండప్ప
యను కుమారుడును కలిగిరి. వంశావతార వర్ణనము తరువాత షష్ఠ్యంతములు
చెప్పి కథాప్రారంభమును నైమిశారణ్యవర్ణనముతో దొరకొనినాడు.

ఇది పేరునకు నృసింహపురాణము గాని ఇందు జయ విజయులెత్తిన
మూడు జన్మంబుల కథలును గలవు. ఆశ్వాసాంతగద్యములం దాయా అశ్వా
సములందున్న విషయములు క్లుప్తముగా చెప్పబడినవి. గ్రంథస్థవిషయ
మంతయు తెలియును గనుక వాని నిట నుట్టంకించుచున్నాను.

ప్రథమాశ్వాసము :-

I "ఇది శ్రీ బారిగడుపుల నృసింహ వరప్రసాద కాశ్యపగోత్ర పవిత్ర
తిమ్మనామాత్య పుత్ర రంగనాహ్వయ సహోదర ధర్మయ నామధేయ
ప్రణీతంబైన శ్రీ నృసింహపురాణంబను మహాప్రబంధంబునందు నైమి

శారణ్య వర్ణనంబును, శౌనకాదిమునుల మహత్త్వంబును, నారదాగమనంబును, శౌనకాదిమునులకు నారదుండు భక్తి విజ్ఞాన ప్రకారం బెరింగించుటయు, చతుర్వ్యూహ ప్రకారంబును, శ్రీహరి మహత్త్వంబును, సనకసనందనాదులగు యోగీశ్వరులు శ్రీహరి ద్వారపాలకులగు జయవిజయుల శపించుటయు, వారల కజనార్దనుండు ప్రత్యక్షం బగుటయు, బ్రాహ్మణ ప్రశంసయు, జయవిజయులు జన్మంబులకుం బాల్పడుటయు, నను కథలుంగల ప్రథమాశ్వాసము.

II ఇది....శ్రీ నరసింహ పురాణంబను మహాపుణ్య కథయందు నారదు జన్మంబును, సువర్ణోపాఖ్యానంబును, సముద్రమథనంబును, అంబరీషోపాఖ్యానంబును, అందుం జక్రభీతి బెడివరచిన దుర్వాసుండు క్రమ్మర నంబరీషు మరుగుసొచ్చి బ్రతుకుటయు, కార్తవీర్యార్జునుని జన్మంబును, శ్రీహరిమూర్తియైన పరశురాము జన్మంబును, కార్తవీర్యార్జునుని వధయును, సుదర్శనోపాఖ్యానంబును, సుదర్శనుండు వేటకు వెళ్లుటయు, నందు మాలినీకన్యం బరిగ్రహించి క్రమ్మరిపురికి విజయం చేయుటయు, నారాజోత్తము......యవ్వరదరాజు నుద్దేశించి తపంబు సేయుటయు, వరలబ్ధుండై తిరుగం బురంబు ప్రవేశం బగుటయు, చంద్రవర్మ జయవిజయుల జన్మంబును, సుదర్శనుడు చంద్రవర్మకు పట్టాభిషేకంబు చేసి తపంబునకుం జనుటయు, జయవిజయులత్యుగ్ర తపంబున శ్రీమన్నారాయణదేవుని మెప్పించి యవ్వరంబు గనుటయు నను కథలుంగల ద్వితీయాశ్వాసము.

I. ఇది...శ్రీ నృసింహపురాణంబునందు కశ్యపదితి సంవాదంబును, హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జననంబును, వారల దిగ్విజయంబును, శ్రీహరి వారాహరూపంబును, హిరణ్యాక్ష వధయును, అయ్యసుర పట్టణంబు ఇంద్రుండు దాడి వెట్టంజనుటయు, కల్యాణదేవిం జెరపట్టుకొని ఇంద్రుడు క్రమ్మరి దివంబునకుం జనుటయు, నమ్మగువను నారదుండు విడిపించి క్రమ్మరి పురంబున కనుపుటయు, హిరణ్యకశిపుని మాహాత్మ్యంబునకు మెచ్చి వారి పితామహులు ప్రత్యక్షం బగుటయు, లబ్ధవరుండై హిరణ్యకశిపుండు తన పురంబునకు గ్రమ్మరి వచ్చుటయు, నయ్యసురేంద్రుని దిగ్విజయంబును, త్రిదివంబాక

మించుటయు, ప్రహ్లాదు జన్మప్రకారంబును, నబ్బాలు విద్యాభ్యాస ప్రకారంబును, ప్రహ్లాదులద్దానవేంద్రు నెదుట విష్ణుప్రశంస చేయుటయు, అద్దానికిం గనలి అబ్బాలుని తెగజూచుటయు, ప్రహ్లాద హిరణ్యకశిపు సంవాదంబును, నను కథలుంగల తృతీయాశ్వాసము.

V. ఇది...శ్రీనృసింహ పురాణంబునందు, ప్రహ్లాద హిరణ్యకశిపు సంవాదంబును, స్తంభోద్భవంబును, నృసింహావతారంబును, హిరణ్యకశిపువధయును, మృత్యుంజయుండు శరభావతారంబున వచ్చి యణంగుటయును, నృసింహుని స్తుతియును, ప్రహ్లాదుని రాజ్యాభిషేకంబును, దానవ చోదితం(బైన) చంద్రరేఖను ప్రహ్లాదుడు వరించుటయు, క్రమంబునం బత్నియుక్తుండై ప్రహ్లాదుం దమరలోకంబునకు దండయాత్ర చని యమరుల నందరం దోలి స్వర్గంబు నాక్రమించి యేలుటయు(......) ప్రబోధితుండై హరిమీద దాడి చనుటయు, శ్రీహరి మాయవలన నద్దానవసైన్యం బంతయు తమలోదారు కెరలి పోరి మృతిం బొందుటయు, ప్రహ్లాదునకు శ్రీహరి ప్రత్యక్షంబగుటయు, అతని యనుగ్రహంబువలన నేలకూలిన సైన్యంబు మరల బ్రతుకుటయు, ఇంద్రదైత్యేంద్రుల స్నేహంబును, ప్రహ్లాదుండు తొల్లింటట్ల నృసింహ భక్తి పరాయణుండై తన పురంబునకేతెంచి రాజ్యంబున వసించుటయు నను కథలుంగలిగి యొప్పు నృసింహ పురాణంబునందు చతుర్థాశ్వాసము.

V ఇది...శ్రీ నృసింహ పురాణంబునందు రావణ కుంభ కర్ణాదుల జన్మ ప్రకారంబును, వారలుసేయు అద్భుత పరాక్రమంబును, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల జన్మప్రకారంబును, విశ్వామిత్ర యజ్ఞ రక్షణంబును, అహల్యా శాపవిమోచనంబును, వైష్ణవ పినాక గాండీవంబుల జన్మంబును, ధనుర్భంగంబును, త్రిపుర విజయాఖ్యానంబును, సీతా వివాహంబును, అయోధ్యా ప్రవేశంబును, పట్టాభిషేక విఘ్నంబును, వనవాస గమనంబును, ఖరదూషణాది రాక్షస విదారణంబును, సీతా హరణంబును, వాలి సుగ్రీవ జన్మప్రకారంబును, వాలి నిగ్రహంబును, సుగ్రీవ రక్షణంబును, దండయాత్రయు, సముద్రబంధనంబును, రావణ కుంభ కర్ణాది రాక్షస సంహారంబును, సీతా సమేతంబుగా పుష్పకారూఢుడై రామచంద్రు డయోధ్యా ప్రవేశంబును, పట్టాభిషేకంబును

రాఘవుండు తన మొదటి సెలవునకు జనుటయు నను కథలుంగల పంచమాశ్వాసము.

VI ఇది...శ్రీనృసింహ పురాణంబునందు దేవకీ వసుదేవుల వివాహంబును, ......కనలి కంసుండు దేవకిని వధియింప గమకింప వసుదేవ ప్రార్థితుండై విడిచి పుచ్చుటయును, బల కృష్ణుల జన్మప్రకారంబును, వారలుచేయు అద్భుత పరాక్రమంబును, కంసవధయును, జరాసంధాది శత్రువుల అలజడికి మథురాపురంబు విసర్జించుటయు, ప్రజాసమేతంబుగా బల కృష్ణులు ద్వారకా ప్రవేశం బగుటయు, రుక్మిణీ కల్యాణంబును, రుద్రుని తపోమాహాత్మ్యంబును, మన్మథుని జన్మప్రకారంబును, జాంబవతీ సత్యభామా కాళిందీ మిత్రవిందా నాగ్నజితీ భద్రా లక్షణల వివాహప్రకారంబును, నరకాసుర వధయును, కృష్ణుడు షోడశ సహస్ర దివ్యకాంతామణులం బరిణయం బగుటయు, స్వర్గ గమనంబును, పారిజాతాపహరణంబును, బాణాసుర యుద్ధంబును, ధర్మరాజ రాజసూయ ప్రారంభంబును, జరాసంధ వధయు, శిశుపాల వధయును, పౌండ్రక సాల్వ దంతవక్త్రాది ఖలవిదారణంబును, కుచేలోపాఖ్యానంబును, హరిహరుల వీర్యవిశేష తారతమ్యంబులును, ధ్రువోపాఖ్యానంబును, భృగుమహాముని త్రయ...తారతమ్యంబులరసి క్రమ్మరి మునుల కేర్పరించిన యమ్మునులందరు శ్రీ వల్లభుండొక్కరుంచే దైవంబని భావించు......"

చివరి కమ్మపోవుటచే నాకమ్మయందున్న భాగముకూడ మసకకుండ పోయినది. ఈ నృసింహ పురాణపు మరియొక ప్రతి లభించినసే శిథిలపూరణము సాధ్యముకాదు.

(గోలకొండ పత్రిక 7-12-1960)

# శేషభట్టరు
# సింగరాచార్యులు

గద్వాల, వనపర్తి మున్నగు సంస్థానాధీశ్వరులవలెనే జటప్రోలు సంస్థానాధిపతులగు సురభివారును పండిత కవిపోషణమునకు ప్రసిద్ధికెక్కినవారు. ఈ సంస్థానము మిక్కిలి ప్రాచీనమైనది. మొదట కాకతి సామ్రాజ్యమునకును, తరువాత విజయనగర సామ్రాజ్యమునకును, అటు తరువాత గోలకొండ సుల్తానులకును నిది సామంత మండలముగా నుండినది. కీ. శే. వెల్లాల సదాశివశాస్త్రిగారు "జటప్రోలు రాజులవంశ చరిత్రము"ను రచించినారు. అందులో 21వ తరమునకు చెందినట్లుగా చెప్పబడిన చిన్న మాధవరావు భూపాలుని యాస్థాన పండిత కవియే ఈ శేషభట్టరు సింగరాచార్యులు. ఈతని కృతి "శూద్ర ధర్మోత్పల ద్యోతిని స్మృతి కౌముది" యను ధర్మశాస్త్ర గ్రంథము. దీనికి సంస్కృతమున మూలము మదనపాల విరచితము. ఈ మదనపాలుడు పదునాల్గవ శతాబ్దముత్తర భాగమున నున్నవాడు. శేషభట్టరు సింగరాచార్యులు చినమాధవ రాయల కాలమునాడు కనుక నీరాజు కాలమిది మిత్థముగా తేల్చుకొన్నచో కవికాలముకూడ తెలిసికొనవచ్చును. చంద్రికా పరిణయమను ప్రౌఢప్రబంధమును రచించిన సురభి మాధవరాయల కనిష్ఠ పుత్రుడగు నరసింగరాయల కుమారుడీ చిన మాధవరాయలు. ఈతడు 1181 ఫసలీలో నిజాము వారిచే సన్నదు పొందినట్లును, ఈతని కుమారుడు బారిగడుపులరావు 1281 ఫసలీలో నిజాముబారిచే సన్నదు పొందినట్లును సురభి వారి వంశచరిత్రమున గలదు. తండ్రి కొడుకుల మధ్యన నూటముప్పది యేండ్ల యంతరముండునా? ఇది యచ్చు పొరపాటనుకొందును. బారిగడుపుల రావు సన్నదు పొందినది 1181 ఫసలీలో కాబోలును. చిన మాధవరావు సన్నదు పొందినది క్రీ. శ. 1742 అగుచున్నది. అనగా తదాస్థాన

విద్వాంసుడగు సింగరాచార్యులుకూడ పదునెనిమిదవ శతాబ్దము పూర్వార్ధమునను ఉత్తరార్ధముననను ఉండినవా డనుకొనవచ్చును.

ఈ తాళపత్ర గ్రంథము గద్వాల సంస్థానాధీశ్వరులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికిచ్చిన కానుక. గ్రంథము మిక్కిలి శిథిలావస్థలో నున్నది. ఈ గ్రంథమునకున్న పీఠిక యమూల్యమైనది. సురభివారి చరిత్రమును దెలిసికొనుటకే కాక సమకాలీన చరిత్రమును దెలిసికొనుటకు గూడ ఈ ధర్మశాస్త్ర గ్రంథపీఠిక మిక్కిలి యుపకరించును. తాను రచింప దొరకొన్నది ధర్మశాస్త్రము గనుకను, అందులోను అనువాదము గనుకను, కవితాకళనుగాని తన శక్తి సామర్థ్యములనుగాని సమగ్రముగా ప్రదర్శించుకొను నవకాశముండదనుకొని కాబోలు సింగరాచార్యుడీ గ్రంథమునకు దీర్ఘమైన పీఠికను కూర్చినాడు. సురభిరాజుల వంశావళిని విపులముగా వర్ణించినాడు. సామాన్యముగా ప్రబంధములందు కాననగు పురవర్ణనము చాతుర్వర్ణ్య వర్ణనము చతురంగ బలముల వర్ణనము మున్నగు వానిని కూడ అవకాశము కల్పించుకొని పీఠికలో చేర్చినాడు.

గ్రంథము సంస్కృత శ్లోకములో నారంభమైనది. ఆ శ్లోకముగూడ కొంత శిథిలమైనది.

శ్లో॥ శ్రీరాజ శేఖరః పాయాద......త్మ భవాన్వితః।
శ్రీ మన్మాధవ రాజేంద్రం పంటవల్లి పురాధిపం॥

శా॥ శ్రీరామా పరిరంభ (జృ)ంభణమునం జెన్నొందు వక్షంబునన్
దారంబూనని తారహారము మహోద్యల్లీలలం దాల్చి భో
గారూఢిం దగు సింగపట్టణ నృసింహస్వామి ప్రోచుం దయం
సూరీంద్రావనశీలునిన్ సురభివంశ్యున్ మాధవోర్వీశ్వరున్.

తరువాత పద్యములందు లక్ష్మి, శివ, పార్వతి, వృషాకపి (శ్లేష) వృషాకపాయి (శ్లేష), బ్రహ్మ, సరస్వతి, విఘ్నేశ్వర, అంజనేయాదులను మాధవరాయలకు సకలసంపద లొసగుటకై క్రమముగా ప్రార్థించినాడు. ఈస్తోత్రములందు పూర్వులైన ప్రౌఢప్రబంధ రచయితల గడుసుపోకలన్నియు కనుపించును. అటు తరువాత పూర్వకవి స్తుతి సుకవి వందనము కుకవి నింద యొనర్చినాడు. ఆపైన నొక వచన మీరీతిగా నున్నది.

"అని ఇవ్విధంబున ఇష్టదేవతాభజనంబును, సుకవి స్తోత్రంబును కుకవినిరాకరణంబును గావించి వివిధ (కవి?) పుంగనానందకంబయిన యొక్క మహాప్రబంధంబు వినిర్మింపబూనియున్న సమయంబున"...... ధర్మశాస్త్రగ్రంథానువాదముకూడ మహాప్రబంధనిర్మాణమనియే చెప్పినాడితడు. ఇచ్చట మాధవరాయల కునికిపట్టగు పంటవెల్లి పురవర్ణనము చాల విపులముగా నున్నది. పూర్వపు పంటవెల్లి ఈనాడు పెంట్లెల్లిగా మారిపోయినది. సురభివారికి ప్రస్తుతము రాజధానిగానున్న కొల్లాపురమున కివల బదు మైళ్ళ దూరమున మన్నదీ గ్రామము. ఈ పురవర్ణనమును సాకుగాగొని సింగరాచార్యులు ప్రబంధములోని వర్ణనములను చాలవర కిట సాధించినాడు ఈ పురాధినేతయగు మాధవరాయలను, అతని గుణగణములను వర్ణించు పట్ల వలుపోకలు పోయినాడు. ఉదా॥

క॥ నరసింగ మాధవేంద్రుని
స్థిరతర సత్కీర్తి చెలగ దిశలన్ మిగులన్
కరిభిద్ధర గిరిభిచ్చర
కరిభిద్వర శైలతుల్య కాంతి స్ఫురణన్.

మాధవరాయల గురువుల ప్రసక్తి ఈ సందర్భమున నిట్లున్నది.

సీ॥ వేదవేదాంతార్థవేత్తయై మిక్కిలి
విశ్రుతబుధజనవినుతి గనుచు
గురు పట్టభద్రుడౌ నర(సి)ంహ యజ్వకు
ఘనత కెక్కిన యగ్రతనయు డగుచు
మహితమై విలసిల్లు మంత్రసారజ్ఞుడై
మహిలోన సతతంబు మాన్యుడగుచు
పావనశీలయౌ భాగిరథీనాము
పద్మగంధికి ప్రాణభర్తయగుచు

నలరుచున్నట్టి యలస్వామి (యార్య ? యప్ప ?) గురుని
పాదనీరేరుహంబులు భక్తితోడ
చెలగి భజియించు నే వేళ చిత్తమునను
సురభి నరసింహ మాధవ ధరణి విభుడు.

మాధవరాయలను వర్ణించు సందర్భమున నొకచో "బిజ్జల నారసింహ పృథివీ పతికిన్ సఖుడై గుణాఢ్యుడై"యని కలదు. అనర్ఘ రాఘవము నాంధ్రీకరించిన బిజ్జల తిమ్మభూపాలుడు తన వంశావతారమును చెప్పిన సందర్భమున ఐదు తరముల పూర్వమువారినేకాక తన పుత్రపౌత్రులను కూడ పేర్కొన్నాడు. అందుల్లో తిమ్మభూపాలుని ద్వితీయ భార్యయగు పౌరమాంబ కగ్రసుతుడు నరసింహ నాముడొకడు మాత్రమే యున్నాడు. ఈ నారసింహ ప్రభువే మాధవరాయలకు స్నేహితుడై యుండునని నే నూహించుచున్నాను.

ఇచట నొక దీర్ఘమైన వచనమున మాధవరాయల బిరుదములు సభా విశేషములు విపులముగా వర్ణించినాడు. సభాసదులైన పండితులు మాధవ రాయలతో పూర్వులగు సురభివంశీయుల సాహిత్య సేవ నిట్లుగడింతురు.

సీ॥ నెరి నిజాంకంబుగా నిర్మింపజేసె సన్మతి భర్తృహరి ముదినల్ల నృపతి
కృష్ణవిజయ నామకృతికర్త తానయ్యె భూరిముమ్మడిమల్ల భూవిభుండు
ప్రౌఢ(మౌ)చంద్రికాపరిణయంబనుకృతి రచియించె మాధవరాయమౌళి
మేలిమౌ నక్షత్ర ఖేలపర్ణియొనర్చె మీతండ్రి నరసింగ మేదినీంద్రు

దనఘ భవదీయ వంశధరాధిపతులు
విశ్వవిఖ్యాతి గనిరిట్లు వేడ్కతోడ
అతుల నీవును శ్రీ మాధవావనీంద్ర
కృతి వినిర్మింప జేయుము కీర్తికెక్క.

అప్పుడు మాధవరాయలీ సింగరాచార్యులను కృతి నిర్మించుమని కోరును. ఈ సందర్భమున కవి తన్నుగూర్చిన వివరములను మాధవరాయల నోట బలికించినాడు. కవి రామభక్తుడనియు, శేషభట్టరు వంశము కౌండిన్య గోత్రము వాడనియు, వెంకటార్య పుత్రుడనియు తెలియజేయు నొక సీస పద్యము గలదు. కవి తాతముత్తాలను చెప్పుకొనలేచెందులకో! అటు తరువాత మరి మూడు నాల్గు పద్యములున్నవి. వానివలన సింగరాచార్యుడు గడియకు నూరు పద్యములను గ్రక్కున చెఱుకుడు లాడునట్లు చెప్పగలవాడనియు, ఏకైకదినప్రబంధనిర్మాణదక్షుడనియు తెలియుచున్నది. ఇటనొక దీర్ఘవచన మింకను కవినిగూర్చిన వివరములును ప్రస్తుత గ్రంథమునుగూర్చిన విశేషము లను చెప్పునట్టిది కలదు.

"మరియును నిదిగాక శ్రీ కేశవ విలాసాది ప్రబంధంబు లనేకంబులు రచియించి విబుధసంస్తుతులు గాంచి విద్యాధనధాన్యపుత్రపౌత్రాది విభవ సమృద్ధుల విశ్రుతి వహించితివి నీవెంత ధన్యుండవని వచియించి యంతట లోకోపకారంబుగా శ్రీ రాయమదనపాల విరచిత శూద్రధర్మోత్పలద్యోతినీ స్మృతికౌముది యను గీర్వాణమహాగ్రంథంబునందు మనుస్మృత్యాది స్మృతి శ్లోకంబుల కాపస్తంబ సూత్రాది (సూ)త్రంబులగు బహుపురాణేతిహాస శ్లోకంబులకు పర్యంబు లదిగాక గ్రంథకార గ్రంథంబున కాక కొన్నిచోట్ల పద్యంబు లొకకొన్ని చోట్ల వచనంబులు మేధాతిథి ప్రభృతులచేత వచియింప బడిన శ్లోక వ్యాఖ్యానంబులకు ప్రయోగంబునకు వచనంబులునై విలసిల్లునట్లుగా తూచా మొదలైన ఏతద్వర్ణంబుల యందొకటైనా విడిచిపెట్టక విద్వజ్జనంబు లౌనని యభినుతించునట్ల సర్వంబును సత్కృ(తి)గా నాంధ్రభాషను నిర్మింపు" మనియు "బారిగడుపుల నృసింహస్వామి కంకితంబు గావింపు" మనియు తాంబూలమిచ్చినట్లు గలదు.

ఇచ్చటినుండి సురభివంశావతార వర్ణనము కలదు. ఇది సుమారరు పది పద్యములందున్నది. సర్వజ్ఞ సింగభూపాలుడు మొదలుకొని సురభివారి వంశచరిత్రము విపులముగా చంద్రికాపరిణయములో నున్నటులే కలదు. ఇందనేక చారిత్రక విషయములును గలవు. ఈ మాధవరాయల తండ్రియగు నరసింగరావునుగూర్చి

"హదుల సామజముల నవరంగ పాచ్చావు
(షా)నగంగ నెవ్వని కొసగె మిగుల" అని

యున్నది. నరసింగరాయలు ఢిల్లిసాదుషాయగు ఔరంగజేబుచే సత్కృతుడైనట్లు దీనివలన దెలియుచున్నది.

"సురభివారి వంశ చరిత్రము"న నీ నరసింగరాయలకు మాధవరాయ డొకడే పుత్రుడున్నట్లు వ్రాయబడినది. కాని ఈ గ్రంథమువలన మాధవ రాయలకన్న పెద్దవాడగు బిరిసింగరాయ డొకడుండినట్లు తెలియుచున్నది. ఒక సీసమాలికలో కాకతీయులనాటినుండి సురభివంశప్రాభవ ముగ్గడింప బడినది. ఆ సీసమాలికలోని కొన్ని పాదము లుదాహరింతును.

"కాకతీయ నృపాల ఘనరాజ్య సంస్థాపనాచార్య వరబిరుదాంకుడగుచు
పద్మనాయకులకు ప్రఖ్యాతిగావించె శ్రీరావు సర్వజ్ఞ సింగనృపతి

రాజిల్లు (స)ద్రాయ రాజ్యపద ప్రౌఢి భూపసమాజైక పూజ్యులగుచు
రమణ సాహసవృత్తి రణములు గుడిపిరి నేటుగా మేటి వెల్గోటివారు
ఇల గోలుకొండలో నిభరాము శహవద్ద విశ్రుత పీరాది పీరుడగుచు
అనమాన చర్యల నారూఢికెక్కుచు రంజిల్లె......ణ రావుఘనుడు
రాజాధిరాజా వరంగ శాహాదత్త గజఘోటక స్తోమకలితుడగుచు
నాంధ్రభూపతులలో నారూఢికెక్కెను జటప్రోలి నరసింగజనవిభుండు

ఈ సీసమాలిక తరువాత మరిమూడు నాల్గు పద్యములందు మాధవ రాయలను నాశీర్వదించుటయు, భగవంతుని మాధవరాయల కష్టైశ్వర్యము లిచ్చుటకు వేడుకొనుటయు కలదు. అటుగరువాత షష్ఠ్యంతములు చెప్పి గ్రంథమారంభించినాడు. ఆశ్వాసాంతగద్యములం దాయా అశ్వాసములందున్న విషయములను సంగ్రహముగా నుట్టంకించినాడు. ప్రథమాశ్వాసాంత గద్య మిట్లున్నది.

"ఇది శ్రీమదుజ్వల సీతారామ చంద్రాంఘ్రి సరోరుహ సేవా మరంద పానమత్త మిళిందాయమాన మానస మహా దివ్య చరవర శరన్నీరద నారదాభ్రధునీ శుభ్ర సరసీరుహ సమానకీర్తి నికరోల్లస త్పంటలవెల్లి శ్రీ సురభి మాధవరాయ భూవరేంద్ర ప్రదత్త ప్రకట సకల సౌభాగ్య సాంద్రాశేష విశేష గుణోల్లస చ్చేషభట్టరు వేంకటార్య తనూభవచంద్ర శ్రీ సింగరార్యకవి ప్రణీతంబైన శూద్ర ధర్మోత్పల ద్యోతినీ స్మృతికౌముదియను మహా సత్కృతి యందు శూద్రునకు గర్భాధానాది సంస్కార విషయాధికారానధికార చింతా నిరూపణంబున సగ్నిక భావచింతా నిరూపణంబును, సంధ్యావందనాధికారాభావ నిరూపణంబును, దీక్షాధికారంబును, బ్రహ్మజ్ఞాన నిరూపణంబును, వివాహ భేద వివరణంబును, వివాహేతి కర్తవ్యతా ప్రతిపాదనంబును, వివాహ నిరూపణంబును, నామసంస్కారాది నిరూపణంబును, ధర్మనిరూపణంబును నన్నది ప్రథమాశ్వాసము"—

దీనిక్రింద "విక్రమ సం॥ అషాఢ శు॥ ౨ భానువారం రెండుఝాముల వేళకు వ్రాశినది" అని కలదు. ఇది క్రీ. శ. 13-7-1760 తో సరిపడును. ఇది స్వయముగా కవి వ్రాసిన తేదియైనను కావచ్చును లేదా యనతి కాలము

నకే వెలువడిన రెండవప్రతి వ్రాయబడిన తేదియైనను కావచ్చును. ద్వితీయాశ్వాసమందున్న విషయములివి.

"శూద్రాశుచి నిరూపణంబును, శూద్రాశుచి పద్ధతియు, నేకోద్దిష్ట విహితావిహిత నిర్ణయంబు నేకోద్దిష్ట శ్రాద్ధ పద్ధతియు, సపిండీకరణ పద్ధతియు, పార్వణ శ్రాద్ధ విధానంబును................................"

తృతీయాశ్వాసమందున్న విషయము లివి.

"బ్రాహ్మముహూర్తాదారభ్య (శౌచ) విధ్యాదిక నిరూపణంబును, దంతధావనవిధియును, దంతధావన పూర్వక ప్రాతస్స్నాన విధినిరూపణంబును, శూద్రమాధ్యాహ్నిక స్నానవిధి ప్రకారంబును, శూద్రబ్రహ్మ యజ్ఞపూర్వక తర్పణాదిక విధానంబును, శ్రాద్ధపద్ధతియును, భోజన పద్ధతియును, శయనాది నియమ ప్రకారంబునన్నది"—

ధర్మశాస్త్ర గ్రంథమందలి వచనము లానాటి వ్యావహారిక భాషకు చక్కని యుదాహరణములు. పీఠిక జనాటి సాంఘిక చారిత్రక విషయములకు దర్పణము.

(గోలకొండ పత్రిక 14-12-1960)

# కొటికెలపూడి
# వీరరాఘవాచార్యుడు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి గద్వాల సంస్థానాధీశ్వరు లిచ్చిన యమూల్య తాళపత్ర గ్రంథములందెన్నియో యముద్రిత గ్రంథములు కలవు. వానిలో "నవీనం ద్రోణపర్వం" ఒకటి. ఇది ౬౮౬ తాళపత్రములం దున్నది. ౬౮౬వ తాళపత్రమొక వైపుననే వ్రాయబడియున్నది. రెండవ ప్రక్కన నేమియును లేదు. మొదటిప్రక్కన గ్రంథము ముగింపుగాక మధ్యలో నాగిపోయినట్లున్నది. అనగా ప్రతి వ్రాసినవారెవరో అంతవరకే వ్రాసి తక్కినది వ్రాయక విడిచినట్లున్నది. ఈ ద్రోణపర్వము ప్రారంభమున అనగా మొదటి కమ్మ ఎడమభాగము చివరన "ధర్మవరం కరణం రామయ్య తాత చెప్పినది నవీనం ద్రోణపర్వం" అని కలదు. అగస్త్యభ్రాతవలె ఈ కరణం రామయ్యతాత యెవరాయని చాలకాలము మధనపడితిని. రామయ్యకు తాత యని భావించినచో నిది యగస్త్య భ్రాతవంటిదేయగును. అట్లుగాక తాతయగు రామయ్య యనుకొన్న, బాగుండుననుకొందును. ఈ రామయ్యగారు ధర్మవరం గ్రామమునందుండు కరణమో లేదా యా గ్రామ కరణమో తెలియదు. మీదు మిక్కిలి ధర్మవరం అనునది యింటిపేరో అంతకన్నను తెలియదు. ఇన్నిటి కన్న ముఖ్యసమస్య మరియొకటి గలదు. ఈ ద్రోణపర్వము రామయ్యతాత చెప్పినదట. చెప్పుటయనగా కవిత్వము చెప్పుటయనియా లేదా పూర్వులు చెప్పినదానిని వినిపించుటయనియా యని కొంత తికమకపడితిని. చివరకు ఈ కరణం రామయ్యతాత కవి గాదనియు కేవలము వాచకుడు అనగా పని పించినవాడు చెప్పినవాడు అనియే నిర్ణయించుకొంటిని. ఈ ప్రతిలో గ్రంథకర్త పేరెచ్చటను లేకున్నను దీని రచయిత గద్వాల సోమభూపాలు నాస్థానమున నుండిన కొటికెలపూడి వీరరాఘవాచార్యుడని నా యభిప్రాయము. నేనిట్లభి ప్రాయపడుటకు కొన్ని కారణములు గలవు.

కొటికెలపూడి వీరరాఘవకవి రచించిన యథాశ్లోకతాత్పర్యభారతోద్యోగ పర్వమును గద్వాల సంస్థానాధీశ్వరులు శా. శ. 1821లో ముద్రింపించినారు. ఈ సంస్థానాధీశ్వరుల కిలువేల్పగు పూడూరి చెన్నకేశవస్వామికీగ్రంథమంకితము. స్వామి కంకితముగా రచింపుమని పెదసోమ భూపాలుడు కోరుటచే నిటులజరిగినది. తిక్కనామాత్యుడు తన భారతమున ప్రతి యాశ్వాస ప్రారంభమునందును హరిహరనాథుని సంబోధించి వ్రాసినటులే వీరరాఘవుడును పూడూరి చెన్నకేశవుని ప్రతియాశ్వాసము ప్రారంభమున సంబోధించినాడు. ఇది ముద్రితమైన యుద్యోగపర్వమును జూచిన వారికి తెలియును. (ఈ నెల "భారతి"లో శ్రీ కేతవరపు వెంకట రామకోటిశాస్త్రిగారీ కవిని గూర్చియు నుద్యోగ పర్వమును గూర్చియు వ్రాసియున్నారు.) ప్రస్తుతము లభించిన ద్రోణపర్వముగూడ పూడూరి చెన్నకేశవదేవుని సంబోధించియే ప్రారంభమైనది. మొదటి పద్య మీరీతిగా నున్నది.

క॥ శ్రీ వరకౌస్తుభరత్న, శ్రీవత్స స్ఫురిత వక్ష శ్రితజనరక్షా
పావన వనమాలాంచద్గ్రీవా పూడూరి చెన్నకేశవదేవా.

కనుకనే కొటికెలపూడి వీరరాఘవ కవియే ఈ ద్రోణపర్వమునకు గూడ కర్తయని భావించితిని. మరియొకకవి యీ ద్రోణపర్వమును పూడూరి చెన్నకేశవునకే యంకితముగా రచియించి యుండరాదా యని సంశయము కలుగవచ్చును. మరియొక కవియైనచో గ్రంథమునకు నవతారికాదులను రచించియుండును. అందులో తన విషయమును కృతి విషయమును, కృతిస్వామి విషయమును చెప్పియుండును. ఇట్టిదేమియును లేక అనుబంధముగా వచ్చు దానికివలె ఒకేపద్యము సంబుద్ధిగా చెప్పియుండుటచేత నీకృతి కొటికెలపూడి వీరరాఘవ కవిదేయని తేలుచున్నది. ఈ పద్యము తరువాత మరియొక పద్యమిట్లున్నది :

క॥ శ్రీ మత్పారాశర్య కృపామహిమ రచింతు ద్రోణపర్వ మభయభా
షామార్మికసూరిజన, స్తోమము లుప్పొంగ నాంధ్రసూక్తి నిపుణతన్.

ఈ రెండు పద్యముల తరువాత ద్రోణపర్వ మారంభమైనది.

గీ॥ భావము చెలంగ సేనాధిపత్యమంది
బలము వ్యూహముగా బన్ని ప్రధన కాంక్ష

బలియుఁడైనట్టి సీతమాధవులతోన
అమ్మహారథి యాచార్యుడపుడు వెడలె"నని

సంజయుడు రణరంగ వార్తలు ధృతరాష్ట్రునకు వినిపించుటతో నిది ప్రారంభమగును. కనుక ద్రోణపర్వమునకు ముందుండు పర్వములలోనంది తన రచనోద్యోగాదులు కవి చెప్పుకొన్నవాడగుటచేతనే ఈ గ్రంథమున వాని ప్రసక్తిలేదు. పూర్వ పర్వములకిది యనుబంధమని భావింపవచ్చును.

ఇక నీ కవి కాలమును గూర్చియు, భారత రచనోద్యోగమును గూర్చియు పరిశీలింతము. కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు సంపాదించిన "గోలకొండ కవుల సంచిక" (పుటలు 409-410)లో నీకవి "150 సంవత్సరముల క్రిందట" అనగా పదునెనిమిదవ శతాబ్దము చివర పాదమున నున్నట్లుగా చెప్పబడినది. ఇది పొరపాటు. ఇంతియకాక "కవి వివరములు తెలియవు; గ్రంథము గద్వాల సంస్థానమునందు లభించును" అని కూడ కలదు రెడ్డిగారీగ్రంథ పీఠికను చూచి యుండినచో కవి కాలమును గూర్చియు కవి విషయమును గూర్చియు సరిగా తెల్పి యుండెడువారే. వారీ గ్రంథమును చూచియుండరు. ఈ భారత రచనమునకు ప్రోత్సహించిన వాడు గద్వాలనేలు సోమభూపాలుడనియు, అతడు బక్కమాంబా పెద్ద విభుల సంతానమనియు, కందనవోలు ప్రాంతముల కేలికయగు వీరారెడ్డి అతనిభార్య తిమ్మాంబల కూతురు బక్కాంబయనియు,ఆమెను పెండ్లియాడిపెద్దారెడ్డి ఇల్లటపల్లుడై రాజ్యాధికారియయ్యెననియు నీ యుద్యోగ పర్వముపలన తెలియుచున్నది. ఈ సోమభూపాలునకే పెద్ద సోమ భూపాలుడనియు సోమనాద్రి, శోభనాద్రియనియు పేరులు కలవు. ఈతడే గద్వాల నిర్మాత మరియు మహాశూరుడు. కర్నూలు నవాబునే కాక నిజాం నవాబును కూడ ఓడించినవాడు. ఈతని గూర్చికథలు గాథలనేకములు తెలంగాణమున ప్రచారమున గలవు. ఈ సోమనాద్రి క్రీ. శ. 1663-1712 సంవత్సరముల మధ్యమండినవాడని శ్రీమారేమండ రామారావుగారు కాకతీయ సంచికలో (పుట 262) వ్రాసియున్నారు. శ్రీనిడుదవోలుసుందరేశ్వరరావుగారు గద్వాల చినసోమ భూపాలవిరచిత రతిరహస్యము పీఠికలో గూడ ఇంచుమించుగా నిదే కాలమును సూచించినారు. కనుక తదాశ్రానకవియగు వీరరాఘవుడు కూడ పదునేడవ శతాబ్దాంతముననుండిన వాడే యగును

ఉద్యోగపర్వమున కవి తన వంశాదికమునిట్లు తెలుపుకొనెను. శాండిల్య గోత్రము కొటికెలపూడి వంశమున సూరకవి జన్మించెను. ఈ సూరకవినుండి వంశావతారమీరీతిగా నున్నది:

సీ॥ పరమొందె నతఁడేడుతరము లాత్మీయ సం
తతి విద్యలు ఫలింప తపసు చేత
నా సూర కవియె రాయలదేవు సభ పూజ
దాల్చె నతఁడు మా తాత తండ్రి
యిభరామ భూవిభు సభ జయశ్రీల జె
లంగె మా తాత శ్రీరంగశాయి
యతనికి ప్రతిబింబమై యట్ల మా తండ్రి
రంగ కవీంద్రుండు ప్రౌఢిఁ జెంచె
భూమి నభినవ తిక్కన సోమయాజు
లనెడు పేరొందినాఁడ రామాంఘ్రియుగ స
మాశ్రయత వీరరాఘవాహ్వయుఁడు ప్రతిభ
నొందె యాజుష సాంప్రదాయుండ నేను.

ఈ పద్యము తరువాత భారత రచనోద్యోగ మొక వచనమం దీరీతిగా చెప్పబడినది:

"ఉద్యోగ పర్వంబు తెనుంగింప నుద్యోగించితిని. ఇమ్మహాభారతంబు మున్ను నన్నయ భట్టారకుండు మూఁడు పర్వంబులు తెనుగించె. అరణ్య పర్వశేషంబు గొంత యఱ్ఱనార్యుండు రచించె. విరాట పర్వంబు మొదలుకొని పదేను పర్వంబులు తిక్కన సోమయాజులు నిర్మించిరి. వీరందరు వేదవ్యాస ప్రోక్తంబులైన మూలశ్లోకంబు లన్నియు దెనిగించిన బహుగ్రంథ విస్తరంబగు; లిఖింప బఠింప వినం దరంబు గాకుండు; లేఖనపఠనాదులు మిగుల గలుగ కుండునను తలంపున సపాదశతసహస్రశ్లోకసంఖ్యాతయైన భారత సంహిత యందలి కథాసారాంశంబులు సంగ్రహించి కబ్బంబును రచియించి రే నీ పర్వంబునం గల మూలశ్లోకంబులం గల యర్థంబంతయు నాకు దెలిసి నంతయుఁ దెనుంగు కబ్బంబునఁ బ్రసంగింప గడంగితి"—

ఆటు తరువాత గద్వాల పురవర్ణనము, సోమభూపాలుని వంశావతారము, ఆతని దినచర్య, కేశవ స్వామికి ప్రతినిధిగా సోమభూపాలుఁడు రాజ్యము

చేయుట, ఆతవి భగవద్భాగవత కైంకర్యము మున్నుగాగల విశేషములు విపులముగా వర్ణింపబడినవి. అటుపై మరల కొన్ని విశేషములు కవిని గూర్చియు, భారత రచనము గూర్చియు తెల్పునట్టివి కలవు. "అమ్మహాను భావుని (సోమభూపాలుని) ప్రభావంబును, శ్రీ కేశవస్వామి ప్రభావంబును విని వినికొంత సంస్థానంబుననుండి నేనుఁ గద్వాల పురంబునకు వచ్చి యద్దేవునిన్ దద్దానుండైన యాసుకృతోల్లాసుం దగు తెరంగునం బొడగాంచి యా జగత్ప్రభువునకుఁ గొన్నికబ్బంబులు రచియించి వినిపించిన విని యా నృపాగ్రణి నా కవిత్వ నైపుణికి మెచ్చి నీకవిత్వంబు తిక్కన సోమయాజుల కవిత్వంబునకు దీటగు శ్రీ కేశవస్వామి యనుమతి నీకు నూతన తిక్కన సోమయాజులనియెడు పద్దొసంగెద. తిక్కన సోమయాజులు భారతంబంతయు సంగ్రహించి రచించినవాడగుట నీవు భీష్మపర్వంబునం దద్రచిత శేష గ్రంథంబునెల్ల దెనుగించి తత్పూర్వ గ్రంథంబునందే పూరింపవలయు నిట్లని శ్రీ కేశవుండానతిచ్చిన వాడనిన నతని కద్దేవుండు భావికార్యంబులెల్ల దెలుపు చుండెడు పొలుపు మునుప విన్నవాడనగుటం జేసి తదాజ్ఞ వ్యతిక్రమింపనోపక భీష్మపర్వంబుగైకొని నాకు దోచినట్ల కొంత పూర్వరచిత శేషగ్రంథంబు తెనుగించి పూర్వోత్తర గ్రంథంబుల నడుమనడుమ సందర్భించి యందే పూరించిన నభినందించి నీ విప్పురంబునందే నిరంతరంబు నివసింపుమనిన నేనుమఁ గ్రమ్మరదేశంబునకున్ జని యా ప్రజనంబులను గని పరిజనంబులం గూర్చు కొని మరల వచ్చెదనన నాకు దగిన సత్కారంబాచరించి శ్రీ కేశవదేవు సమ క్షమున మరల వచ్చెదనని వల్కించి వీడ్కొల్పిన నేనును నిజదేశంబునకేగి కార్యోపాధి వశంబునం గొన్నిమాసంబులు రాకయున్న మున్ను నేనొసర్చిన మితి యతిక్రమించిన నా నృపతి మద్దేశంబునకు మదీయ భాగినేయుం బనిచి పిలిపించిన నేనుఁ దగిన పరిజనంబుతో గతిపయ ప్రయాణంబుల నెందియు గద్వాలపురంబు ప్రవేశించి..." నట్లును సోమభూపాలు డీ కవిని ఆదరించి తనగురువుతో చెప్పి ఆగురువులవారిచే మద్యోగపర్వమాద్యరచనకై యను మతి నిప్పించినట్లును కవి చెప్పుకొనెను.

భగవంతుడు కూడ కవికి స్వప్నమున సాక్షాత్కరించి యందులకై ప్రోత్సహించి.

"ఉ॥ కార్యము యుక్తమేనియు నగమ్యము మిక్కిలి వ్యాసవాక్యతా
త్పర్యమటంటి వేని సతతంబు మదీయసభఁ వసించునా

చార్యులు దెల్పువారది నిజంబుగ సంశయమైనచోట చా
తుర్యము పేర్మి నీకయిన దోచు మదిన్పరికింప మత్కృపన్"

అని యనుగ్రహించెనట.

పైన పేర్కొనబడిన విషయముల నన్నిటిని సాకల్యముగా పరిశీలించినచో నీ కొటికెలపూడి వీరరాఘవాచార్యు లుద్యోగపర్వ మొక్కటియే గాక భారతమం దనేకపర్వములు రచించినట్లు తెలియుచున్నది. కనుకనే ఈ ద్రోణపర్వముగూడ నీతడే రచించినట్లు భావింపనైనది. ప్రకృతము లభించిన ద్రోణపర్వము సంపూర్ణము గాలేదు. సంపూర్ణముగా రచింపబడలేదో కాక ప్రతివ్రాసికొన్నవాడు పూర్తిగా వ్రాసికొనలేదో తెలియదు. రెండు కస్మములలో నున్న విషయము కొలదియే. అభిమన్యునిచే లక్ష్మణకుమారుడు హతుడగుటయు నటుపైన మరికొన్ని పద్యములుగల వృత్తాంతముమాత్ర మిందులో గలదు. తిక్కనగారి భారతమున నభిమన్యువధ మున్నగు విషయములు ద్వితీయాశ్వాసమున గలవు. కాని యీ నవీన ద్రోణపర్వమున నొక్క యాశ్వాసమైనను పూర్తిగాలేదు. సంస్కృత మూలముతో బోల్చినచో నీరహస్యము బయటపడగలదు. ఒక్క యాశ్వాసమైనను పూర్తిగా ఉన్నచో నాశ్వాసాంత గద్యము వలన పెక్కుసమస్యలు విడిపోయియుండును.

ద్రోణపర్వమునందలి కవిత్వ మారయుటకై రెండుమూడు పద్యము లుదాహరింతును. ద్రోణుని మరణవార్తవిని ధృతరాష్ట్రుడు దుఃఖించుచు పలికిన మాటలివి:

క॥ వననిధి యింకిన తెరగున, కనక మహీధరము పాదుగదలిన రీతిన్
దినమణి వ్రాలినకైవడి, ధనురాచార్యుండు పడుట తాళుదు నెటులన్.

గీ॥ గర్వదుర్వారజనలిరస్కారశీలు
దతినిపుణ ధార్మికావన ప్రతతబుద్ధి
శత్రుసంతాపనుండగు చాపగురుడు
విడిచె రారాజుకొరకు జీవితము నకట.

ఆ॥ వె॥ మందభాగ్యులైన మనవారి విజయాశ
యేమహాత్ము నాశ్రయించియుండె
బుద్ధిబలముచేత బుధగురు కవి సము
డతడు సమరనిహతుడౌట యెట్లు?

(గోలకొండ పత్రిక 21-12-1960)

# బోయినిపల్లి కుమార వెంకటరాయలు

కవిరాజుల చరిత్రములేకాదు, రాజకవుల చరిత్రములును కాలగర్భమున మటుమాయమై పోయినవి. కవి పండితులను పోషించుటేకాక సప్త సంతానప్రతిష్ఠ లొనర్చిన రాజకవి బోయినపల్లి కుమార వెంకటరాయలు. ఈతడొక పద్మనాయక ప్రభువు, పానుగల్లు దుర్గాధిపతి. ఈతని తల్లి రామాంబ, తండ్రి వెంకటరాయలు. ఇంటిపేరు బోయినిపల్లివారు, వీరిది పెన్నాలగోత్రము. కుమార వెంకటరాయలు పదునేడవ శతాబ్దము మధ్య భాగమందుండినవాడు. ఈతని కృతి "ద్రౌపదీ కల్యాణ"మను నైదాశ్వాసముల మహాప్రబంధము. ఈ గ్రంథముకూడ గద్వాల సంస్థానాధీశ్వరులు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారికిచ్చినట్టిదే.

ద్రౌపదీకల్యాణము తిరుపతి వేంకటేశ్వరస్వామి కంకితముగా రచింపబడినది కనుక ప్రారంభ పద్యమిట్లున్నది.

శా॥ శ్రీవత్సాంకము భూమి భామయను దృష్టిం జేష్టలం దత్సమీ
క్షావృత్తిన్ దన దివ్యకౌస్తుభమణీ చ్ఛాయన్నిరోధించి లీ
లావైముఖ్యము దోపకుండ నలమేల్మంగం బరీరంభ సౌ
ఖ్యావిర్భూతి నలర్చు వెంకటనగాధ్యక్షుండు మమ్మేలుతన్.

రెండవ పద్యమున నిలువేల్పగు నరసింహస్వామి స్తోత్రము కలదు. ఆటుతరువాత శివ, బ్రహ్మ, లక్ష్మి, పార్వతీ, సరస్వతీ, విష్వక్సేన ద్వాదశాళ్వారులు, రామానుజుల ప్రార్థనము లొక్కొక్క పద్యమున గలవు. పదునొకండవది సీస పద్యము. అందు తమ యాదార్యులను కవి యీ రీతిగా పొగడినాడు.

సీ॥ శ్రీతుల కద్వయవాది మతి నిరూపించియు
ద్వయవాది ధర్మసంధాతయయ్యె
సౌరానుమత కులాచారంబు గాంచియు
శమిత సారకుల ప్రచారుడయ్యె
భాగవత స్నేహభావంబు దాల్చియు
వివిధ భాగవత విద్వేషియయ్యె
పరమతత్త్వ రహస్య పరిశీలుడయ్యు వి
వర్జిత పరమతత్త్వ గతివెలసె

గీ॥ ధరణి నేఘమడా సముద్రాల తిరుమ
లార్య దౌహిత్ర వేంకటాచార్య సూను
కోనపాచార్యవరనామకీనగురుల
ప్రస్తుతించెద ననితరభక్తియుక్తి.

పండ్రెండవ పద్యమున తండ్రిని, 13వ పద్యమున వాల్మీకి వ్యాసులను, 14వ పద్యమున కాళిదాసాది సంస్కృత కవులను, 15వ పద్యమున కవిత్రయమును, 16 వ పద్యమున పోతన, భాస్కర, శ్రీనాథ, పెద్దనాదులగు ప్రాచీన కవులను కీర్తించినాడు. 17 వ పద్యమున కుకవి పరామర్శ గలదు. 18 వ పద్యమున నందరు కవులు సాధారణముగా "అని యిష్టదేవతా వందనంబుమ" అని చెప్పు వచన భాగమందలి విషయమున్నది. అనగా మొదటి 17 పద్యములందలి విషయము సంగ్రహింపనైనది. ఆటుతరువాత "మదీయావాసరాజధానిం జెప్పెద"నని యొక సీసమున పానగంటి దుర్గమును వర్ణించినాడు. (దీనికే పెదపానుగల్లని పేరు) ఈ పానుగల్లు వర్ణనము మరి నాలుగు పద్యములందటులే సాగిపోయినది. ఇట్లుండగా శరదాగమమును, తదవసరంబున దుర్గా, సరస్వతీ, లక్ష్మీపూజలు చేసి హరికథాగోష్ఠినుండి తాను రచింప దొరకొన్న గ్రంథమునకు కృతికి నాయకుడెవరాయని యాలోచించు నొక రాత్రి నాల్గవ జామున

"కలుములీనెడు కేలు గలమేలు నెలమేలు నలమేలుమంగ మంగలను బెనయ"గా వెంకటేశ్వరుడు స్వప్నసాక్షాత్కారమొనర్చి తనకంకితముగా కృతి రచింపుమని యానతిచ్చును. మరునాడు కవి తన స్వప్నమును దలం

చుచు చెలులు, చుట్టములు, సామంతులు, మంత్రులు మున్నగుగాగల వారితో కొలువై యుండును.

చ॥ కొలువయియుండి డెందమునకుం దొలునాటి నిశాంతవేళ నా
కల గననైన వెంకటనగప్రభువాగమ్మృతంబు గ్రొంజివుల్
గొలుపగ నానుచో మయి గగుర్పొదవం బదవాళ్ళ బంపి బో
ర్వెలి నరసింహ నామ సుకవిఁ బిలిపించితి నంచెలంచెలఁ.

చ॥ ఉడుగక నారసింహ కవి యూడిగపుం బుడుతల్ ప్రియోక్తులన్
బడ బడిపోయి పిల్వ మరుపాంతము జేరగ నేగుదెంచె వెం
బడి నడతెంచు లేఖకులు పాఠకు లుక్తపదార్థ గౌరవం
బడుగుచు రాగ నానభను నల్లన నుల్లము పల్లవింపగన్॥—

(ఈ బోరవెల్లి గద్వాలకు నమీపమందున్నది).

ఈ రీతిగా వచ్చిన బోరవెల్లి నరసింహకవి కుమారవెంకటరాయలను దీవించి, యాతని గుణగణములను, నభాసదులను పొగడును. అందులో మొదటి (42) పద్యమిట్లున్నది:

సీ॥ గోప గోపక గోప గోపనత్ నలువొందు
నీ దయోదయ భోగ నియతికలన
రాజ రాజవ రాజ రాజజుల్ జులుకన
నీ నిదాన ధనారి నిధన నిధుల
ధర్మ ధర్మజ ధర్మ ధర్మముల్ ములుసూవ
వరయ నీ శమన నత్య ఋతిగతుల
రామ రామా రామ రామమూర్తులతుల
నీ బల ధర్మార్థ నిశ్చయములు
గీ॥ గండభేరుండ గండర గండ చండ
నమర నిశ్శంక బిరుదాంక నదకలంక
పద విశంకట వెంకట ప్రభుకులాధి
నాయక కుమార వెంకటరాయ ధీర.

ఈరీతిగా స్తోత్రము చేయు బోరవెల్లి నారసింహ కవినిగూర్చి కుమార వెంకటరాయలు,

శా॥ ఆర్వేలాన్వయగేయ రాయసము మల్లామాత్య సూర్యస్వవా
యోర్వీదేవ మత స్వతంత్ర కపిగోత్రోద్భూత దత్తాహ్వయాం
తర్వాణి ప్రియ సూను కృష్ణవిదుషా (బుధా) త్మప్రోద్భవుండైన యా
బోర్వెల్లిపుర నారసింహ కవి నంబోధించి ఇట్లంటొగిన్ (46)

సీ॥ మీ తాత తాతకు భ్రాతృజసూతి గ
దా రాయసము మల్లసూరి చంద్ర
భాను చరిత్ర మొప్పగజెప్పె మీ తాత
దత్తన్న శబ్దశాస్త్ర ప్రవీణు
డతని సుతుండు కృష్ణప యయాతి చరిత్ర
మిశ్రకావ్య మొనర్చె మీ జనకుడు
చేసితివీవు దక్షిణకాళ్యలంపురి
నృహరి దయోదయా మహిత కలిత

గీ॥ కృతి యతనికంకితముగ బండితుల మతుల
నెనయ సౌవర్ణకాఖ్యాన మనగ నొకటి
యుభయభాషా విశేషోక్తియు (...శిధిలము...)
సిద్ధముగ సాంప్రదాయ ప్రసిద్ధి గనుచు॥ (47) స్తుతింపుమ.

పై రెండు పద్యములందు బోరవెల్లి నారసింహ కవి తండ్రి తాతల పేరులుమ వారి వారి రచనములును దెలియుచున్నవి. ఈ గ్రంథములన్నియు నేమైపోయినవో? తరువాత పద్య మిట్లున్నది:

చ॥ అరమరలేక ధీనముదయాతిదయాహృదయాంతరుండనై
యెరుకమతిన్ సుబోధ గురుడే గురుడే వరుడే యటంచు నిన్
గరము ప్రియంబొనర్ప భువి నాక వినాయ వినాకృతిన్ శుభా
కర కవితల్ గడించెదవుగా యవుగా నవుగామ నెప్పెదన్. (48)

దీనివలన కుమార వెంకటరాయలకు బోరవెల్లి నారసింహకవి గురు స్థానీయుదని తెలియుచున్నది.

కవి తన స్వప్నవృత్తాంతముమ నారసింహ కవికి చెప్ప నాతడు సంతోషముతో కుమార వెంకటరాయల వైభవమెన్నుచు కృతి రచనమునకు

ప్రోత్సహించుచు. అంత గురువును సత్కరించి "శ్రుత్సనంగ సంగతానంద భంగి నెనంగ ద్రౌపదీ కల్యాణ కథా కథన వ్యాసంగంబు నంగీకరించి" తన వంశావతార వర్ణనమునకు నుపక్రమించెను.

పెన్సాల గోత్రము గల బోయినిపల్లి పద్మనాయక కులమున "జైత్రయాత్రార్జిత నిజసిత ఛత్ర చిత్ర, గండభేరుండ బిరుదాంక మండనాభిరామ నామాపహృత వైరి రావణుండు" రామక్షమానాయకు డుద్భవించెను. అతని భార్య అబ్బమ్మ. వీరి సంతానము అప్పన. అప్పన భార్య ధర్మాంబ. వీరి సంతానము 1. రామరాయలు (ఈతని రాజధాని కోవెలకొండ) 2. తిమ్మరాయలు 3. కోననాయకుడు. ఈ కోననాయకుని భార్య కృష్ణమ్మ. ఈమె వె(లి)జాల మాధవరాయ నృపతి కూతురు. కోననాయకునకు కృష్ణమ్మయందు 1. అప్ప, 2. మాద, 3. తిమ్మ, 4. వెంకట నృపాలురను నలుగురు పుత్రులు ఉదయించిరి.

"చెలగి రానల్పు రాయువు శ్రీయు నెసగ
జిష్ణుగతి సర్వతోముఖ స్థితి వహించి
కుతుబుషా దత్త బిరుదాంక కుతుకమతులు
మెతుకు గిరి దుర్గమున కధిపతులు నగుచు"

కుతుబ్‌షాహీలచే సత్కృతులైన వీరి తరువాతి తరమువాడగుటచే నేతత్కృతికర్త పదునేడవ శతాబ్దమునకు చెందినవాడని నిశ్చయముగా చెప్పవచ్చును. మెదకు దుర్గము మొదట పద్మనాయకుల వశమునుండి తరువాత రెడ్లకైవసమైనది. కవి కాలమునాటికది వెలమల యధీనమందుండెను.

పై నలువురన్నదమ్ములలో మూడవవాడగు తిమ్మనాయకుడు విభాళ సాళువ బిరుదాంకుడు కొండవీట నుండువాడట. ఈతని కుమారుడు వల్లభరాయుడు. నలువురిలో కనిష్ఠుడగు వెంకట రాయలు పెద పానుగల్లు దుర్గాధిపతి; కృష్ణవేణీ జలక్రీడనా వినోదనా బిరుద విభ్రాజితుడు. ఈ వెంకటరాయల కిరువురు భార్యలు. 1. రామాంబ. 2. నరసాంబ. వెంకటరాయలకు రామాంబ వలన నిరువురు కుమారులు గలిగిరి. జ్యేష్ఠుడు కోననాయకుడు (భార్య యామాంబ). కనిష్ఠుడు ద్రౌపదీ కల్యాణ రచయిత యగు కుమార వెంకట రాయలు. ఈతని భార్య మాధవి. కవి తన పెదతండ్రులు, వారి

భార్యలు, వారి వారి సంతానములను గూర్చి విపులముగా వ్రాసియున్నాడు. అటుతరువాత మరికొన్ని పద్యములందు కృతిపతియగు వెంకటేశ్వరస్వామి స్తోత్రము కలదు. తరువాత షష్ఠ్యంతములు చెప్పి "అభ్యుదయ పరంపరాభి వృద్ధ్యంకుర నవరసాలంకారాంకితంబుగా నా రచియింపంబూనిన ద్రౌపదీ కల్యాణంబను మహాప్రబంధంబునకుం గథా ప్రారంభం బెట్టిదనిన" అని కావ్యమును ప్రారంభించినాడు—

ప్రతి యాశ్వాసము చివరనుండు పద్యముల దు వివిధవృత్తములను గర్భ కవిత్వము, బంధ కవిత్వము మున్నగు చిత్రములను గూడ ప్రదర్శించి నాడు.

ప్రథమాశ్వాసాంత గద్యమీతీరుగా నున్నది:

"ఇది శ్రీ మద్వేంకటేశ్వర ప్రసాదోపలక్షిత లక్ష్మీకళా విరాజమాన సకల సుకవిజన జేగీయమాన పెన్నాలగోత్ర పవిత్ర బోయినిపల్లి కలశ పారావార కైరవమిత్ర రామమాంబా గర్భనిర్భర శుక్తి ముక్తావతార యసవద్య విద్యావిశంకట వెంకటరాయకుమార గండభేరుండ బిరుదాభిధేయ కుమార వెంకటరాయ ప్రణీతంబైన ద్రౌపదీకల్యాణంబను మహా ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము."

ఐదాశ్వాసముల గ్రంథము సంపూర్ణమైన తరువాత అశ్వాసాంత గద్యము ముగిసిన తరువాత సాధారణముగా వ్రాయసకాండ్రు వ్రాసెడు పద్యములు వ్రాయబడియున్నవి. వాని తరువాత మరి రెండు పద్యములు కలవు. వానిలో చివరి పద్య మీ విధముగా గలదు (౨౩౩ వ కస్మ)

సీ॥ కుతల వృత్తిగ్రాహకుండ పీవైయుండ
కుతలవృత్తిగ్రాహకుండనైతి
సర్వాత్మ నలదృష్టశాలి వీవైయుండ
సర్వాత్మనల దృష్టశాలినైతి
అశావదేశ విఖ్యాతివీవైయుండ
అశావదేశ విఖ్యాతినైతి
గణుతింప నాయకాగ్రణివి నీవై యుండ
గణుతింప నాయకాగ్రణినె యైతి

గీ॥ తద్గుణముగాదె నాకు నిదానమైన
కరుణ జేపట్టి తిరిగాక మరి సమర్థు
లర్థినెంతైన దీనికెంతర్థమీయ
వచ్చు వెంకటరాయ భావజ్ఞమూర్తి.

ఈ పద్యము వ్రాయనకానిది గాక స్వయముగా కుమార వెంకటరాయలు కృతిభర్తయగు వెంకటేశ్వరస్వామి నుద్దేశించి చెప్పినదై యుండును. ఇట్టి భక్తులను కవి పండిత పోషకులును నగు ప్రభువుల కావ్యములుగూడ మరుగుపడి పోవుట విచారకరము. ఇప్పుడీ వంశీయులెవరైన కలరో లేరో, ఉన్నచో వారైనను దీనిని ప్రకటించిన బాగుండును.

పంచమాశ్వాసాంతమున గల ఒక పద్యములో ముగింతును.

మ॥ "అతులంబై యకలంకమై ప్రభు సమాజాకర్ణ్యమై వర్ణ్యమై
యతిపాపాపహమై శుభావహమునై యాచంద్రతారార్క ను
స్థితమై యుండెడుగాక వెంకట నగాధిస్వామి యుష్మద్గుణాం
కిత మేతత్కృతి యూక్షితిన్ కవిజనాంగీకార సారోన్నతిన్."

(గోలకొండపత్రిక 28-12-1960)

# తురుమిళ్ళ రామన

ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున సువర్ణ యుగముగా పరిగణింపబడు ప్రబంధ యుగమునకు చెందియు మరుగుపడిన మాణిక్యములందీ తురుమిళ్ళ రామన యొకడు. శేషధర్మములను ప్రబంధములుగా కూర్చినవారియందీత దగ్రగణ్యుడు. శేషధర్మములను తామరపల్లి తిమ్మయ్య పధాని, వెణుతురుపల్లి విశ్వనాధకవి, కొడిచెర్ల శ్రీనివాసకవి, కానాల నరసింహకవి మున్నగు ప్రాచీన కవులును, చెదలువాడ సుందర రామశాస్త్రి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి, నోరి గురులింగశాస్త్రి, యస్. శఠకోపాచారి వంటి అర్వాచీన కవులును చేపట్టిరి. ఈ కవులందరకన్న తురుమిళ్ళ రామన ప్రాచీనుడని తోచుచున్నది. చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమందు కూడ తురుమిళ్ళ రామన రచించిన శేషధర్మము ప్రతి యున్నట్లు ఆంధ్ర వాఙ్మయ సూచివలన తెలియనగును. కొడిచెర్ల శ్రీనివాసకవి మరియు కానాల నరసింహకవి విరచిత శేషధర్మములు ముద్రితములో యముద్రితములో తెలియదు కాని తక్కిన పైవారి గ్రంథములు మాత్రము ముద్రింపబడినటుల ఆంధ్ర వాఙ్మయసూచియందు గలదు. తురుమిళ్ళ రామనకవి శేషధర్మము కూడ అముద్రితమే. ఈ కవి కాలము గూర్చి ఇతమిత్థముగా తెలియకున్నను గ్రంథపీఠికలోని విషయములనుబట్టి ఈతడు పదునారవ శతాబ్దము వాడని యూహించుచున్నాను. వనపర్తి సంస్థానాధీశ్వరు లాంధ్రసారస్వతపరిషత్తు వారికిచ్చిన తాళపత్ర గ్రంథ భాండాగారమందీ గ్రంథము కలదు. పీఠికాదులందున్న విషయములను క్లుప్తముగా తెలియజేయుటే నాయుద్దేశము.

ప్రారంభ పద్య మిట్లున్నది.

"శ్రీ మించన్ నరసోదయుండయి మహాసింహాసనారూఢుడై
ధామస్ఫూర్తి నెసంగి తమ్ములకు సత్యానంద సంధాయియై
ప్రేమన్ జక్రమునేలు శార్వరహరున్ శ్రీరామ ధాత్రీశభా
వామేయప్రథసూనుడై యలరు పద్మాధీశ్వరున్ గొల్చెదన్"—

ఆశ్వాసాంత గద్యమిట్లున్నది.

"ఇది శ్రీరామభద్రనిర్నిద్రకృపాకటాక్షవీక్షాలబ్ధ సరస కవిత్వాభిరామ నందవరవంశ సుధాంభోనిధానసుధాధామ, మనీషానిర్జితభోగిరాజ నాగరాజా మాత్యతనూజ, సకలవిద్వజ్జనజేగీయమాన సద్గుణసాంద్ర, తురుమిళ్ళ రామన కవీంద్ర ప్రణీతంబైన హరివంశోక్త శేషధర్మంబునందు సర్వంబును అష్టమాశ్వాసము."

ఈ శేషధర్మ ప్రబంధము శ్రీరామచంద్రున కంకితంబుగా రచింపబడినది. మొదటి పద్యముమ పైన నుట్టంకించినాను. రెండవ పద్యమున శ్రీరాము నర్ధాంగియగు సీతాదేవి ప్రార్థనమున్నది. అటు తరువాత భరత, లక్ష్మణ, శత్రుఘ్న, అంజనేయాదుల స్తోత్రము లున్నవి. అటు తరువాత గురుస్తుతి కలదు. ఈ గురుస్తుతి పద్యము కవికాల నిర్ణయమునకు తోడ్పడునను నభిప్రాయముతో దాని నుదాహరించుచున్నాను.

సీ॥ ప్రతి దినానేక హిరణ్యదానోత్సాహమున బొల్చు ననఘవర్ధనకరుండు
సకలపుణ్యజనేష్టసంధాయకాధిక ప్రౌఢిమించిన యదర్పకగుదుండు
కర్ణ నంహ్యర్జున ఘనయశస్కరచర్య దనరు ననుగ్ర నుదర్శనుండు
గురుతరానంజన గోత్రోదయస్ఫూర్తి యెనగ గాంచిన యనంభృతధదుండు

ధరణి నేదేశికశిఖావతంస మట్టి
దాన నివహాతి శీఘ్రసత్ఫల విధాన
కుశలు భట్టరు రఘునాథ గురువరాళి
ధాన నతవిష్ణుమూర్తి గీర్తన మొనర్తు.

ఈ పద్యమువలన తురుమిళ్ళ రామనకవి రఘునాథ భట్టరాచార్యుల శిష్యుడని తెలియుచున్నది. కంచెర్ల గోపన్నకూడ దాశరధి శతకమున ఒకానొక రఘునాథ భట్టరాచార్యుల కంజలించినాడు.

గురుస్తుతి తరువాత సంస్కృత కవులగు ప్రాచేతస, బాణ, కాళిదాస భవభూతి, శివభద్ర, మాఘ, దండి, హర్ష, మల్హణ, బిల్హణ, భారవి, మయూరాదులను, తెలుగు కవులగు కవిత్రయము వారిని, తెలుగు లాక్షణికులగు వెల్లంకి తాతమనీషి, భీము, ననంతు, చిత్రకవి పెద్దనలను తలపోసినాడు. పద్యములో కుదిరికకై కవులను ముందువారిని వెనుకను వెనుకవారిని ముందు ను పేర్కొనినను వెల్లంకి తాతంభట్టు, చిత్రకవి పెద్దనలను ఈ కవి పేర్కొనుటదే వారికి నీతడు తరువాతివాడని మనము తేల్చుకొనుటకు వీలగు

చున్నది. ఈ కవి తనకు కవితారచనమున తోడ్పడిన కవిమిత్రునకు కృతజ్ఞత లీపద్యమున దెల్పుకొనినాడు.

ఉ॥ చిత్తమునం దలంచి మతిచేసెద మత్కృతికిన్ సహాయము
దృత్తరమైత్రి జేసిన మహామహు సత్కవులెంచ పిణ్ణధ
ర్మోత్తర ముఖ్య సత్కృతు లనూనచమత్కృతి మీఱజేయు న
త్యుత్తము భద్రిరాజు కులధుర్యుని తమ్మనసూరి ఏర్యునివ్.

తురుమిళ్ళ రామనకవితోపాటు ఈతని మిత్రుడు భద్రిరాజు తమ్మన సూరి గూడ మరుగుపడిన మాణిక్యమే.

ఇష్టదైవమగు శ్రీరామచంద్రుడు స్వప్నమున సాక్షాత్కరించి కృతి రచింప ప్రేరేపించినట్లుగా నీకవి చెప్పుచున్నాడు.

సీ॥ వెడద కన్నులవాడు వేల్పురా రతనంబు నిద్దంపుమై నిగనిగలవాడు
మందహాసమువాడు మందారశాఖిశాఖోపమాయత భుజాయుగమువాడు
మెరుగు చెక్కులవాడు మేలిపున్నమ చందమామగేరెడు ముద్దుమోమువాడు
మణి కిరీటమువాడు మహనీయ ముక్తాసరంబులుగల పేరురంబువాడు
తళుకు బంగరు వ్రాత దువ్వలువవాడు
జనకనందన చెంగట దనరువాడు
రమ్యభక్తానువర్తి శ్రీరామమూర్తి
యలర సాక్షాత్కరించి యిట్లనుచు బల్కె.

క॥ తురుమిళ్ళ కులాంబుధి పూ
ర్ణ రజన్యధినాథ రామన సుధీంద్ర భళీ
హరివంశ శేషధర్మము
లురుమతి తెనుగించు భాగ్య మొదవెన్నీకున్.

చ॥ వినవిన నింపునించు కృతి విశ్రుతనిర్మలధర్మమర్మముల్
కనబడజేయు ఘోరతర కల్మషజాతలతాలవిత్రమై
తనరు నభీప్సితార్థ ఫలదాయకమై తగు శేషధర్మ పా
వన చరితంబు తన్మహిమ వాక్పతికైన గణింపశక్యమే.

ఉ॥ భారతముఖ్యసంహితలు భాగవతాదిపురాణముల్ వచ
శ్రీ రహిమీరగా తెనుగుజేసిన పూర్వకవీశ్వరుల్ దయో

దారకటాక్షవీక్ష నను ధన్యునిగా నొనరింపజూచియో
దారు రచింపరైరి వసుధాస్థలి తెన్గుగ శేషధర్మముల్.

పోతనగారివలెనే తురుమిళ్ల రామనకవి తనకన్న పూర్వులీ గ్రంథమును తెనుగు చేయకపోవుట తనను ధన్యుని చేయుటకే యని తలంచినాడు. మీదు మిక్కిలి ఈపద్యమువలన శేషధర్మములు రచించిన తామరపల్లి తమ్మయ ప్రధాని మరియు వెణుతురుపల్లి విశ్వనాథకవి వంటి ప్రాచీనులుకూడ తురుమిళ్ళ రామన కవికి తరువాతివారేయని తెలియుచున్నది. శేషధర్మమును రచించుటకు తానే మొదటివాడనని కంఠోక్తిగా చెప్పుకొనినాడు గదా!

తన స్వప్నవృత్తాంతమును కవి విద్వత్కవి బంధు సందోహమునకు వినిపించును. వారాతని ప్రోత్సహించి ఆతనిపూర్వుల నభివర్ణింతురు. కవి వంశావతార మాబుధసందోహము నోట వినుపించి యౌచిత్యమును పాటించినాడు. కవివంశవృక్ష మీతీరుగా నున్నది.

గౌతముడు (గోత్రకర్త)
- తిమ్మసచివుడు (భార్యయెల్లమ)
  - రామనమంత్రి (భార్య బుక్కాంబిక-లింగరాజు తనయ)
    - 1. పెద్దయెల్లయ 2. చినయెల్లయ ౩. చిట్టన 4. తమ్మరాజు ౫. పెదయక్కలయ్య ౬. చినయక్కలయ్య 7. నాగమంత్రి ౮. బోదయ 9. అప్పన్న 10. తిమ్మతాత 11. లింగన 12. లోకన్న (భార్యగోపమ్మ-వోబుళంపల్లె తిమ్మనపుత్రి)
      - 1. చిట్టనమంత్రి (భార్య ఎఱ్ఱమ్మగొట్టిపాటి మల్లనబిడ్డ)
        - శేషాద్రి
      - 2. పాపన్న (భార్య లక్షమ్మ మద్దిరాల గంగార్యునిబిడ్డ)
      - ౩. రామనమంత్రి (కృతికర్త) (భార్య వెంగమాంబ అనంతపురపు ఎల్లమంత్రిబిడ్డ)

కవినిగూర్చిన వివరములు తెలియజేయునట్టి మరిమూడు సీసపద్యము లున్నవి. వీనిలో నాతని ప్రభువును గూర్చియు, ఆతని యుద్యోగమును గూర్చియు, ఆతడు చేసిన పుణ్యకార్యములను గూర్చియు వివరము లనేకము లున్నవి.

సీ॥ కూర్చినాడవు చాల కుంభినీజనులెంచ ధర్మసామగ్రియే ధనముగాగ
పేర్చినాడవ జాండపేటికాంతరమున పటుకీర్తి కర్పూరఫలకరాశి
చేర్చినాడవు స్వాంతసింహాసనంబున గట్టిగా రఘుకుల పట్టభద్రు
నేర్చినాడవు బంధునికరార్థిపాథోరుహాళిమిత్రుండవై యలరజేయ
ధన్యుడవు నీవు వర్ణింపదరమె నిన్ను
రామభద్రదయాలబ్ధి రామభద్ర
అనఘనుత పుణ్య నందవరాగ్రగణ్య
మహిత గుణసాంద్ర రామయామాత్య చంద్ర.

సీ॥ తన జగత్పరిపూర్ణఘనకీర్తిలతకు దిగ్దంతిదంతము లుపఘ్నములుగాగ
తన దీవ్యమానప్రతాపంబు పరిపంథిబలవనాలికి దవానలముగాగ
తన సమున్నతతీవ్రతరవారి జయరమాతరుణికి కేళిసౌధంబుగాగ
తన నిరంతరదానధౌరేయహస్తంబు సకలార్థులకు కల్పశాఖగాగ
దనరు వేముల పురవరాధ్యక్షదక్ష
కూనపులి చిన్ననాయక క్షోణిపతికి
కార్యనిర్వాహకర్తవై గౌరవమున
ప్రబలి తౌరౌర తురమిళ్ళ రామధీర.

ఈపద్యమువలన తురుమిళ్ళ రామకవి వేములపురపాలకుడగు కూనపులి చిన్ననాయకునకు కార్యనిర్వాహకర్త యని తెలియుచున్నది. వేముల కడప మండలము పులివెందుల తాలుకాలో నున్నది. కూనపులివారి వంశవృక్షము, జంపల్లి కొండపార్యుని ద్విపద భాగవతమున నున్నట్లు విద్వాన్ శ్రీ పిళ్ళా వేంకటరామిరెడ్డిగారనుచున్నారు. ఇదియు నముద్రితమే. చిన్ననాయకుని కాల మిదమిత్థముగా తేల్చుకొన్నచో తురుమిళ్ళ రామన కాలము గూడ సరిగా తెలియగలదు. ద్విపద భాగవతము శ్రీ రెడ్డిగారిచెంత గలదట. దీనిలో ననేక చారిత్రకాంశములున్నవట. మరియొక సీసపద్యమున రామకవి చేసిన పుణ్యకార్యము లిట్లభివర్ణింపబడినవి.

సీ॥ గరిమ మీరకుమాళ్ళకాల్వ దీపాచలాధీశ్వర శ్రీ వేంకటేశ్వరునకు
సేయించినాడవు చెలువమై కమపట్ట వల్లకి యొక్కటి భక్తిమీర
నిలిపి నాడవు స్వర్ణనిర్మిద్రకలశంబు తద్భవనోపరి స్థలమునందు
చెన్నొంద నేల్పుల చెన్ననాయనికి గోవాళి సేయించి సద్వజ్ర కవచ
భవ్యపీతాంబరాదికాభరణములు స
మర్పణము సేసితివి పీటికన్నిటికిని
శేఖరంబుగ కృతిచేసి శ్రీరఘూద్వ
హునకు రామయామాత్య నీవౌనగు మనిరి.

పైపద్యమునగల కుమాళ్ళ కాల్వకడపమండలము రాయచోటి తాలూకాలో నున్నది. వేల్పుల పులివెందుల తాలూకాలో నున్నది. ప్రాచీన గ్రంథములందును శాసనములందును ఈనాటి కాల్వ, కాలువ శబ్దములు "కాల్వ"గా నుండునని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగా రనుచున్నారు. రాయచోటి తాలూకాలోనున్న కుమాళ్ళకాల్వయే తురిమిళ్ళ రామన పేర్కొన్న కుమాళ్ళ కాల్వ.

పై సీసపద్యము తరువాత "అనినసేను సంతోష శ్రీ సమాశ్రిత హృదయాబ్జుండనై మత్కృతికి ముఖాలంకృతియగు శ్రీ రఘుపతి చరితం బభి వర్ణించెద" నని చెప్పి శ్రీ రామచంద్రచరిత్రము నభివర్ణించి షష్ఠ్యంతములు చెప్పి "సమర్పితంబుగా నా యొనర్పంబూనిన శేషధర్మంబను మహా ప్రబంధమునకు కథాక్రమం బెట్టిదనిన" అని కథాప్రారంభ మొనర్చినాడు. గ్రంథమంతయు 208 కమ్మలలో చక్కనివ్రాతతో ఏమాత్రమును శిథిలము గాక భద్రముగానున్నది.

తురిమిళ్ళ రామన చిత్రబంధ కవిత్వములందుగూడ దిట్టవలె నున్నాడు. ఆశ్వాసాంతములందిట్టి పద్యములు కాననగును. నాలుగవయాశ్వాసము చివరస భుజంగప్రయాతవృత్తగర్భితస్రగ్విణివృత్త మిట్లున్నది.

"రాజమానోదయా రమ్యతేజోహరీ
యాజిభూనిర్భయా యాత్మనానాహరీ
భ్రాజితార్యాశయా మ్రద్రువాటీ హరీ
రాజితార్కాన్వయా రావణారిహరీ"

దీనితర్వాత

"ఈ వృత్తములో తుదనున్న హరిశబ్దము మొదలనుంచి చదివితే భుజంగప్రయాతవృత్తమవునూ" అనియు కలదు. పైవృత్తమునగల ఆప్రాంతుదు రాటి మామిళ్ళపల్లెకు సంస్కృతీకరణమై యుండును. మామిళ్ళపల్లె కడప రైల్వేస్టేషను సమీపమున గలదు.

పంచమాశ్వాసాంతమునగల ఖడ్గబంధముతో నీ కవి పరిచయము ముగింతును.

సుగంధివృత్తము.

"ధీరవార సారసార్క దివ్యసేవ్య భవ్యదా
దారితోగ్ర పంక్తి కంఠ దక్షజాభివర్ణితా
తారహార తారకావదాత సద్గుణాస్పదా
దారుణాఘమేఘ మారుతా గతావనవ్రతా"

(గోలకొండ పత్రిక 4-1-196·)

# ఇనుగంట్ల కృష్ణప్రధాని

తెలుగు వాఙ్మయ మధికముగా ప్రభువుల దోహదమున వర్ధిల్లినది. కవులకు జీవనోపాధియు, ఇహసౌఖ్యములును, పోషకులకు శాశ్వతకీర్తులును, పుణ్యమును ఈ విధముగా ఉభయతారకమునైనది రాజాశ్రయము. ఆంధ్ర వాఙ్మయమున నెవ్వరిని ఆశ్రయింపకయే వర్ధిల్లిన భాగముగూడ కొంతగలదు. వరిని ఆశ్రయింపని కవులు తమ్ముగూర్చి విపులముగా చెప్పుకొన్నవా రరుదు. అందులో భగవంతున కంకితముగా గ్రంథములు రచించినవారు తమ్ముగూర్చి చాలా తక్కువగా చెప్పుకొన్నారు. వీరిలో కొందరి కాలముమగూర్చి కాని, యూరు పేరులగూర్చిగాని, పుట్టుపూర్వములగూర్చి కాని సరిగా తెలియదు. ఇట్టి కోవకు చెందిన వారిలో మన ఇనుగంట్ల కృష్ణప్రధాని యొకడు. ఈతడే కాలమువాడో తెలియదు. ఈతడు "ధర్మరాజాశ్వమేధ"మను నైదాశ్వాసముల ద్విపద కావ్యమును వ్రాసినాడు. గ్రంథమున చివరకమ్మలు కొన్నిపోయినవి. ౨౦౧ కమ్మలలో మిగిలిన గ్రంథముకూడ మిక్కిలి జీర్ణదశలో నున్నది. ఇది శ్రీరంగపతి కర్పితము.

ఆశ్వాసాంతభాగము వలన కవి కులగోత్రములు, తండ్రిపేరు, గురువుపేరు గ్రామనామములు మాత్రము తెలియవచ్చుచున్నవి.

"అని రమాభర్తకు సఖిలకర్తకుమ, ఘన నగోద్ధర్తకు కలుషహర్తకును
హతకబంధున కాహృతాకబంధునకు, నతిదయాసింధునకార్తబంధునకు
శతకోటి కందర్ప సన్నిభాకృతికి, జితదైత్య వితతికి శ్రీరంగపతికి
అంకితంబుగ నాశ్వలాయనసూత్ర, సంకలిత క్రమ సహజ వర్తనుడు
అనఘనందపు(రా)గ్రహారనిధాను, డినుగంట్లసోమమంత్రీంద్రనందనుడు
తిరుమల వెంకటదేశిక దివ్య, చరణ సేవనుడు కృష్ణ ప్రధానుండు
అర్మిలి రచియించి యర్పించినట్టి, ధర్మరాజాశ్వమేధవిధాన మనెడు
సుందరమగు కథాసూత్రమందెన్న, నందంబుగా ప్రథమాశ్వాసమయ్యె"

పై ద్విపద పంక్తులవలన కవి ఆశ్వలాయన సూత్రుదనియు, నంద పురాగ్రహారనివాసియనియు, ఇనుగంట్ల సోమమంత్రికుమారుడనియు, తిరుమల వెంకట దేశికుని శిష్యుడనియు తెలియుచున్నది. కవిని గూర్చి యీ గ్రంథమువలన తెలియనగు విశేషము లింతకెక్కుడు లేవు. ఈ నంద పురాగ్రహార మెచ్చటగలదో తెలియదు. ఇనుగంటి వెంకన్న అగ్రహారము, నంద పురి వలన అను గ్రామములు గజపతి నగరం తాలూకా విశాఖపట్టణము జిల్లాలో నున్నట్లు మద్రాసు ప్రెసిడెన్సీ గ్రామనామముల పట్టికవలన తెలియు చున్నది. మన కృష్ణప్రధానికి వీనితో సంబంధమున్నదో లేదో। ఈ గ్రంథము గద్వాల సంస్థానాధీశ్వరు లాంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికిచ్చినది. కనుక మహబూబునగరం మండల మందీ గ్రామములున్నవో తెలియదు. కవికి గురువులైన తిరుమల వంశీయులు మాత్రము గద్వాల యందుండినట్లు తెలియును. (గద్వాల నేలిన చిన సోమభూపాలుని కాలమున నార్గురు కవులు కలిసి యథాశ్లోక తాత్పర్య రామాయణము నాంధ్రమున వ్రాసిరి. ఆ యార్గురిలో తిరుమల కృష్ణాచార్యులొకరు.)

గ్రంథప్రారంభము శ్రీ రంగనాయకస్వామిస్తోత్రముతో ప్రారంభమైనది.

"శ్రీలక్ష్మియనుమించు చెలువువహించు, నీలమేఘస్ఫూర్తినెఱమించుమూర్తి
కావేరి నడుమ భక్తజనావళిబ్రోవ, తావేరి కొనియున్న ధర్మానువర్తి
అనుపమ శంఖచక్రాదిసమస్త, ఘనసాధనంబుల గనుపట్టు ధీరు
ప్రణవ మంత్రాన్వద ప్రాభవోన్నతుల, ప్రణుతికెక్కిన పరా(త్ప)రు
మహోదారు.........

పరమాత్మునచ్యుతు పద్మాక్షుసర్వ, పరిపూర్ణు నక్షరు భవరోగవైద్యు
వేయి శిరంబుల వేయి నేత్రముల, వేయిపాదంబుల వెలయు సత్పురుషు
శతధృతి నంధాయి సకల సంస్థాయి, ప్రశితపుణ్య ఫలదాయి శ్రీరంగశాయి
పాదసరోజముల్ భక్తిసేవించి, అదేవదేవుని నాత్మలో నుంచి"

శ్రీ రంగనాయక స్తోత్రము తరువాత లక్ష్మీ సరస్వతులను, విఘ్నేశ్వరుని స్తుతించినాడు. అటుతరువాత "గురునుతుడగు కంతుగురు గురుభక్తి, గురుతైన వెంకటగురుని కీర్తించి" కావ్యమును గూర్చి యిట్లు తెలిపి యున్నాడు.

"శ్రీహరి చర్యల సృష్టిలో సుజన, మోహనమైన జైమిని భారతము
ధర్మ మర్మములకు దాపలమైన, ధర్మరాజాశ్వమేధ విధానమేను
దేవకీ సుతుకృప ద్విపద కావ్యంబు, గావింతు తత్కథాక్రమ మెట్టిదనిన"
అని కథా ప్రారంభ మొనరించినాడు.

"జనమేజయుడుమున్ను సర్పయాగంబు, ఘనతెన్న నొనరించి సమదిరగోష్ఠి
అంత భారతకథ నతిభక్తి వినుచు, సంతోషచిత్తుడై జైమిని జూచి
ఓముని పుంగవ ఉత్తమమహిమ, చే మహీస్థలి సర్వసిద్ధియై యొప్పు
ధర్మజు నశ్వమేధ విధానమెల్ల, నిర్మలోక్తుల నాకు నెమ్మితో నిపు
వినుపింపు వీనుల విందుగాననిన, మనుజవల్లభుని సమ్మతి నిరీక్షించి
నైమిశారణ్యంబునను తొల్లిసూతు, డామోదమున శౌనకాదిమౌనులకు
విమలవాక్యంబుల వివరించినట్టి, క్రమమాత్మనూహించి కథకు చట్టనియె"
అని యశ్వమేధకథను వినుపించును.

కృష్ణ ప్రధాని కవిత్వమంతయు సరళముగా నిటులే యున్నది.
వ్యాసుడు ధర్మరాజునకు హయమేధ క్రమము నీరీతిగా తెల్పును.

"అసిధారయైన యీహయమేధ విధము, వసుధేశ తెల్పెద వరుసతో వినుము
ఆది దీక్ష వహించి అతివతో కర్త, వేదశాస్త్రపురాణవిద్యానుభవులు
పరమవివేకసంపన్నులాచార, వరులు శ్రీహరిపాదభక్తి భావనులు
ప్రవిమలమతులైన బ్రాహ్మణోత్తముల, వివరింప నిరువదివేల ఋత్విజుల
ఒప్పుగా రావించి యొక్కరొక్కరికి, తప్పక కనకరత్న సమేతమైన
ఒక రథ మొకగజ మొకజవనాశ్వ, మొకబారువు సువర్ణమొక సహస్రంబు
ధేనువుల్ వేడ్క నందిల్ల నేమమున, దానంబులర్పించి తదనంతరమున
ఒక్క కర్ణమునల్పు ఒడలెల్ల తెలుపు, మిక్కిలి నొఱపుగా మెడకడు పెరుపు
వలు గుత్తమగు తోక బంగారు రేక, గలిగి కల్యాణలక్షణముల చాల
వర్ణనకెక్కు నశ్వము చైత్రశుద్ధ, పౌర్ణమినాడు సద్భక్తి పూజించి
సలలితమణిగణోజ్వల భూషణములు, చెలువుమీరగ ధరించి మనోహరముగ
తన పేరి బిరుద పద్యము దానినురుట, కనక పత్రిక వ్రాసి కైకొనికట్టి
ఒకయేడు చరియింప నుర్విపై విడిచి, అకలంక మతి దాని నరసి రక్షింప
తన సహోదరునైన తనుజన్మునైన, ననుపగావలయు నందరిగిన యుత.సు

పుడమిఁజొచ్చెట విఖ్యాత్రముల్ హయము, విడుచునచ్చో చెల్లవెనశుద్ధిపరచి
అంతలోపల హోమ మందు సేయించి, వింతగా నర్పించి వేదోక్తసరణి
భూసుపర్వులకును భూరిదానములు, గోసహస్రంబు గ్రక్కుననొసంగుచును
ప్రోవిగా నాత్రోవ భూవరుల్ గినిసి. చేవచేబట్టిన చెకొని హయము
విడిపించగావలె విడిపించ కున్న, తడయక పుణ్యమంతయు వారిజేడ
గాన ప్రయాస మీ క్రతువు జేయంగ, ఓనరపాల యిట్లుచితమార్గమున
గావించు మును శతక్రతువు లింద్రుండు, గావించె నీగతి గానలేదయ్యె
నని నవిస్తరముగా నానతి యిచ్చి, తన యోగశక్తి నంతర్హితుండయ్యె"

(గోలకొండ పత్రిక 11-1-1931)

# పూడూరి కృష్ణయామాత్యుడు

మన ప్రస్థానత్రయమున బహుళ ప్రచారముగలది భగవద్గీత. భారత దేశమంచేకాక విదేశములందుగూడ భగవద్గీతల కధికాదరము గలదు. భగవద్గీతలయందు సర్వమతముల సారమున్నది. ప్రాచీన కాలము నుండియు నేటివరకును అనంతములగు వ్యాఖ్యానములు భగవద్గీతపై బయలుదేరుచున్నవి. తద్వారా ఒక్కొక్కరొక్కొక పరమార్థమేదియో సాధించుచునే యున్నారు. వ్యాఖ్యానములేకాక భగవద్గీతల నన్నిభాషలవారును తమ తమ భాషలలోని కనువదించుకొన్నారు. ఒక భాషలో నొక్కరి యనువాదముతో నిది యాగిపోలేదు. తెలుగులో రామాయణమునకు వలెనే భగవద్గీతకును పెక్కు లనువాదములు వెలసినవి. పద్యములుగా పాటలుగా ద్విపదలుగా వచనములుగా భగవద్గీతలు తెనుగులో ఎందరో వ్రాసినారు. అట్టివారిలో పూడూరి కృష్ణయామాత్యుడొకడు. ఈతని కృతి భగవద్గీతార్థదర్పణము. ఇది ౬౨ కమ్మలందున్నది.

భగవద్గీతార్థ దర్పణము పదునేడధ్యాయముల గ్రంథము. భగవద్గీత ప్రథమాధ్యాయము విడిచి తక్కిన వానికాంధ్రమున సరళ సుందరముగా నున్న యనువాదమిది. ఈ తాళపత్ర గ్రంథము కొంత శిథిలమైనది. చిట్ట చివర గద్యమిట్లున్నది.

"ఇది శ్రీమద్యోగానందగురువర కరుణాపాత్ర వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజ విద్యానుష్ఠానపవిత్ర కౌండిన్యసగోత్ర పూడూరి కొండయామాత్యపుత్ర కృష్ణయ నామధేయ ప్రణీతంబైన శ్రీ భగవద్గీతార్థ దర్పణంబు నందు పరమార్థ నిర్ణయంబను అష్టాదశాధ్యాయము" —

అటు తరువాత భగవద్గీత పఠనము వలన గలుగు ఫలమొక పద్యమున జెప్పబడినది. ఆ పద్యము చాల భాగము శిథిలమైనది. ఆ పద్యము తరువాత

"శ్రీ శా(లివాహన) శకాబ్దంబులు ౧౬౬౪ అగు దుందుభినామ సంవత్సర భాద్రపద శుద్ధ ౧౦ వరకు గ్రంథ సమాప్తం. వాసుదేవార్పణమస్తు" అని కలరు. ఈతేది ప్రతి వ్రాసిన తేదియో లేక న్వయముగా గ్రంథకర్త గ్రంథమును ముగించిన తేదియో తెలియదు. గ్రంథకర్తయే వ్రాసిన తేదియనుకొన్నచో నీ పూడూరి కృష్ణయామాత్యుడు పదునెనిమిదవ శతాబ్దము పూర్వార్ధమున నుండినట్లు మనము భావింపవచ్చును. గ్రంథకర్త ఇంతకన్న మిక్కిలి తన్నుగూర్చి యీ గ్రంథమున వ్రాసికొనలేదు.

పూడూరి కృష్ణయామాత్యుడు తాను యోగానందగురువర శిష్యుడనని చెప్పుకొన్నాడు. ఈ యోగానంద గురువును మరియు యోగానంద అవధూతయు నొకరగుదురో కారో తెలియదు. యోగానంద అవధూత "గురుశిష్య సంవాదము" మరియు "ఆత్మైక్య బోధము" అను ద్విపద గ్రంథములకు కర్త. ఇవియును అముద్రితములే. వీని ప్రతులు తెలంగాణమున నన్ని మండలములందును లభించుచున్నవి. లక్ష్మణరాయ పరిశోధకమండలి వారి కడను, గద్వాలవారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికిచ్చిన గ్రంథములందును, నా చెంతను గల తాళపత్ర గ్రంథములందును ఒక్కొక్క దానికి రెండు మూడు ప్రతులున్నవి. యోగానంద గురుడును యోగానంద అవధూతయు నొకరేయని నేనూహించుచున్నాను. అట్లైనచో పూడూరి కృష్ణయామాత్యుని కాలము నురికొంత వెనుకకు పోవును. ఏలన కీ. శే. చాగంటి శేషయ్యగారు తమ కవి తరంగిణి (సంపుటము 10 పుట 201)లో యోగానందావధూత 16వ శతాబ్ద ముత్తరార్ధమునందుండినట్లు నిర్ణయించినారు. కనుక పూడూరి కృష్ణయామాత్యుడు 16వ శతాబ్దము త్తరార్ధమునందును 17వ శతాబ్దము పూర్వార్ధమునందును ఉండి యుండవలెను. అప్పుడు పైన పేర్కొనబడిన తాళపత్ర గ్రంథాంతమునందున్న తేది ప్రతి వ్రాసిన తేదియై యుండవలెను. పూడూరు గద్వాలకు సమీపమునందున్న చారిత్రక ప్రదేశము. తొలుత జైనమునకును తరువాత శైవ వైష్ణవములకును ఆకరమైన చోటిది. ప్రాచీన జైనశిల్పము లిప్పటికిని పూడూరి దిబ్బలందు కాననగును. కృష్ణయామాత్యుడు పూడూరు వాసియైనచో నాతని గురువగు యోగానందుడు గూడ

తెలంగాణమువాడై యుండవలెను. కనుకనే యోగానందావధూత రచితములగు ద్విపద వేదాంతగ్రంథము ప్రతులు తెలంగాణ మందిప్పటికిని అధికముగా లభించుచున్నవి. ఇతరములగు సాధారములు లభించువరకు పూడూరి కృష్ణయామాత్యునిగూర్చి యింతకన్న నెక్కుడుగా చెప్పుటకు వీలులేదు.

గ్రంథమిట్లు ప్రారంభమైనది.

శా॥ (.......శిథిలము....)ంద మహిమన్ జిన్మాత్రమై నిత్య శో
భాసంపన్నతచే త్రిమూర్తి కలనన్ భాసిల్లు బ్రహ్మంబు నెం
తే సమ్మోదమునం భజించి గురుభక్తిన్ నేకృతార్థుండనై
వ్యాసుంగొల్చి సరస్వతిన్ దలచెదన్ భవ్యార్థ సంసిద్ధికిన్"

ఈ పద్యము తరువాత వెంటనే

వ॥ "అని యిష్టదేవతాభివందనంబు గావించి శ్రీభగవద్గీతాశాస్త్రం బంధ్ర భాష రచియింపంబూని రెండవ అధ్యాయంబు మొదలుగా భగవంతుండర్జునునకు తత్త్వోపదేశంబొసంగె గావున సాంఖ్యయోగంబు ప్రారంభింపబడియె నది యెట్లనిన"– అను మాటలతో సాంఖ్యయోగము ప్రారంభించినాడు.

సాధారణముగా కవులందరును తమ తమ గ్రంథములకేవో పీఠికలు కూర్చెదరు. కాని యీ కృష్ణయామాత్యుడొకే యొక పద్యమును, పైన పేర్కొనబడిన వచన భాగముమ రచించి పీఠికను ముగించినాడు. ఇది చాల చిత్రముగా నున్నది. వేదాంత మీతని మ్రింగి వేసినట్లున్నది. ఇంతటి విరాగి చరిత్రము మనకు లభించుట కష్టమే. మొదటి యధ్యాయమేల తెనిగింపలేదో పై గద్యభాగమున చెప్పినాడు. రెండవ అధ్యాయము మొదలుగా తత్త్వోపదేశము కనుక అటనుండియే గ్రంథము ప్రారంభమైనది. విషాదయోగము విడిచిపెట్టబడినది.

క॥ ఉదితాశ్రు పూర్ణనేత్రుడు
సదయహృదయుడై గిరీటి సమ్మదమెదలో
వదలుచు శోకం బందగ
వదిలంబుగ శౌరి పల్కె భాసురఫణితిన్

పై పద్యము సాంఖ్యయోగమునందలి "తం తథా కృపయా ఽవిష్టమ్" అను శ్లోకమునకు సరళానువాదము. అటు తరువాతి మూఁడు శ్లోకముల భావ మొక సీస పద్యమున బొదువబడినది.

సీ॥ ఏమి కారణమున నీ సంకటంబంది
మోహచిత్తంబున మునిఁగె దీవు
ఆర్యసేవితము ధర్మావహము(ం) గాని
వృత్తి సత్కీర్తి నుద్వృత్తి సడచు
నట్టి భయంబు నీ వందఁగ యుక్తంబె
హృదయదౌర్బల్యంబు వదలుమింక
లెమ్ము వేవేగ బట్టుమ్ము గైకొనుమన్న
యర్జునుం డను కృష్ణ యుడలు నాకు

గీ॥ బొడమె అన్యాయకార్య మీయెడ ప్రసక్త
మగుటగాని కాతర్యమేనంది కాదు
యుపరతుడనైతి నింక నీ యుద్ధమందు
వినుము దేవ నీ కిప్పుడు విన్నవింతు.

"కథం భీష్మ" మను శ్లోకములు మొదలగు వానినిట్లాంధ్రీకరించినాఁడు.

క॥ పూజాపాత్రుల సుతపో
వ్యాజచరిత్రుల గురువుల భవ్యాత్ములనే
నోఁజన్ భీష్మ ద్రోణుల
నాజిన్ బాణహతి నొంప నలరుదు నెటులన్.

క॥ పరలోక విరుద్ధంబగు
గురువధ మొనరించుకంటె గురియగు శ్రేయ
స్కర మీ జగమున భైక్షా
చరణంబున సంచరింప నస్మత మనఘా.

ఉ॥ భోగము లర్థకామములు బొల్పగు రక్తవిలేపనంబు లౌ
నా గురుమిత్ర హంతనయి యట్టివినే భుజియింపనేర సు
ద్వేగమతిన్ విధర్మగతి విశ్రుతమౌ సమరప్రకాశితో
ద్యోగము బూనగా జయము నోట బరాజయ మెట్టులుండునో.

సీ॥ ధార్తరాష్ట్రులు నన్ను దగ జయించిన వారి
నే జయించిన నాదు నిపుణబుద్ధి
అధికంబటంచు నే నది దలపోయనే
హేతువుచే నన్న నెలమి వారి
హింసించి బ్రతుకుట కిచ్ఛయింపను కుల
క్షయదోషపరిభూతకలన మత్స్వ
భావమీ గతినుండు బరమశిష్యుని బ్రపన
న్నుని నన్ను శిక్షించి యనఘ నిశ్చ

గీ॥ యంబు దెలియంగ (జెప్ప) మహానుభావ
నేనది యొనర్తు నింద్రియ నికర శోష
ణంబు శోకంబు నేరీతి నలిననేత్ర
యపనయించు టుపాయమ్ము నానతిమ్ము. (౧వ కమ్మ)

స్థితప్రజ్ఞుని లక్షణములు భగవంతు దర్జునునకు చెప్పు సందర్భమున గల పద్యము లీతీరుగా మన్నవి. (౪వ కమ్మ రెండవ ప్రక్క)

తరువోజ॥ వినుము చిత్తస్థిత వివిధ కామంబులెపుడు నమ్రగంబు నెడలంగజేయు
తన పరమానంద ధన్యరూపమున తాన సంతృప్తుడైదగ విషయముల
జనియించు నభిలాష నడలంగనోపు నెప్పుడేనియు
ప్రాజ్ఞాది లక్షణమున
దనరియాత్మ ( ) మతాస్థితి దాల్చునపుడే స్థితప్రజ్ఞుడని చెప్పబడును..

క॥ శోకము జెందిన చిత్తప
మాకులతన్ దొలగి మఖము లందిన స్పృహయున్
లేక భయ ప్రియ కోపో
ద్రేకముడిగి నతడె మునియు స్థిరబుద్ధియగున్

గీ॥ పుత్ర మిత్రాదికం బందు బొనగ స్నేహ
రహితుడై (యను)కూల సంగ్రహ (సుఖ)ంబు
నొందునపుడు సంతుష్టియు జెంది యుంద
కశుభమొందిన ద్వేషిగా కలరు నెవడు.

వ॥ ఉదాసీనుడై భాషింపుచుండు నతనికి బ్రజ్ఞ బ్రతిష్ఠితంబగు.

ఆ॥వె॥ ఎప్పుడేని యోగి యింద్రియంబుల విష
యముల వలన దిగిచి యణచు నశ్ర
మమున కూర్మ మంగకములు ముడుచుచు నుం)డు
నట్లు నవుడె యాతని క(మ)రు దృఢత.

(౫వ కన్ను) వ॥ విను మింద్రియములకు విషయంబులందు నప్ర వృత్తి స్థితప్రజ్ఞునకు లక్షణం బయ్యెననిన జడులకు నాతురుల కుపవాస పరులకు విషయాప్రవృత్తియు సమంబగునంటేని యదినిజంబ రాగవిరహితంబు గానేర దదెట్లనిన

తరువోజ॥ తగు నింద్రియములచేతను విషయాళి నాహరించుట
(సిరా)హారి యనంగ
నగునట్టి దేహికి నల విషయానుభవము నివర్తించు పడి నింతెకాని
ఇగురొత్తునభిలాషయెడల దయ్యాత్మ జూచి దృఢ ప్రజ్ఞశోభితుండైన
నిపుజ్ఞునకునదనెరినివర్తించు నింద్రియనియమంబు నెనయకయున్న

క॥ స్థిరమగు ప్రజ్ఞాకలనం
బిరవొందదు సాధనేచ్ఛ నెనయునపుడ త
ద్గురుతరయత్నము జేయుట
పరమావశ్యకము నుమ్మ పాండవ వర్యా.

చ॥ వినుము వివేకియైన దగ విశ్రుతయత్నము మోక్షమందగా
వనువడ జేయుచో మనము బాయక నింద్రియసంఘ ముద్ధతిన్
ఎనసి బలంబు పేర్మి హరియించును క్షోభమొనర్చు గాన వా
ని నియమనంబునన్ బరమనిష్ఠయు మత్పరతానుభిత్యమ్మున్

వ॥ అట్టి యోగికి గల్గుంగావున.

గీ॥ ఎవ్వని కధీనములగు నీ యింద్రియంబు
లతని కల ప్రజ్ఞయందు సుస్థితి నిజంబు
మనము నియమింపకుండిన మలయు విషయ
సంగమము దానివలన నంజనితమగును.

క॥ కామము తజ్జన్యంబగు
వేమారుం గ్రోధమందు వెలయున్ మోహం

బా మోహము స్మృతి విభ్రమ
మై మెలగున్ బుద్ధినాశమగుబో దానన్.

వ॥ అని సెప్పి విషయాభిముఖ స్వభావంబులగు నింద్రియంబులు నిరోధింప నశక్యంబగుట నిది దుష్పరిహార్యంబు గావున స్థిత ప్రజ్ఞత్వం బెట్లగు నంటేని.

ఉ॥ రాగము ద్వేషముంబొరసిరాక నణంచి (  ) దర్పహీనతన్
బాగగు నింద్రియంబులమ బన్పరగా విషయవ్రజంబులన్
భోగముజెంది యైనను మనోవశవర్తులు గాన శాంతి ని
ద్భాగలి నొందుచుండు స్వ(వ)శాత్ముడు భారతవంశవర్ధనా

వ॥ ఇట్టి చిత్తప్రసాదంబున నేమి ఫలం బంటేని

ఆ॥వె॥ చిత్త శాంతిగల్గు సిద్ధయోగికి సర్వ
దుఃఖహాని ఫలము దొరకొనంగ
జాలియుండునా ప్రసన్న చిత్తుని బుద్ధి
వేగ సుస్థిరత్వ వృత్తిజెందు.

వ॥ స్థిర ప్రజ్ఞత్వంబునకు సాధనంబు గల్గుట వ్యతిరేక ముఖంబుగా దెల్పెడి యభిప్రాయంబున నిట్లనియె.

సీ॥ అవశీకృతేంద్రియుండగు వానికా గురు
శాస్త్రోపదేశ సంజనిత యాత్మ
విషయయౌ ప్రజ్ఞయు వివరింప నుదయింప
దట్టివానికి ధ్యానమది నిలువరు
ఆత్మయందా ధ్యాన మలవడదేని యె
ట్టింగి శాంతియుగల్గు బరమశాంతి
నందక మోక్షసదానందసుఖమెట్లు
సిద్ధించు పార్థ వశీకృతములు

గీ॥ గానివై యింద్రియంబులు గరిమ విషయ
ముల యథేచ్ఛ జరింప నందుల నొకటిన
గూర్చి మనమేగు నది(యెపో కుటిల వృత్తి
బురుషు) ప్రజ్ఞ వారించు విస్ఫూర్తి ననఘ.

వ॥ ఇంద్రియం బొక్కటియె విషయ ( ) క్షిప్తంబై యీ రీతిం జేయు నింద్రియ గణంబువలననేమి జెప్ప నదెట్లంటేని కర్ణధారుండు ప్రమత్తుండైన వాయువుచే సముద్రంబున వాద యెందేని భ్రమించు చందంబగునని ఉక్తార్థ.........యిట్లనియె.

గీ॥ ఎవని యింద్రియంబు లీ విషయంబుల
వలన నిగ్రహించు వలసు గాంచు
నతని కట్ట ప్రజ్ఞ యలవడు వైరిని
గ్రహుద విట్టిదెంత కార్యమనఘ.

వ॥ ఈ స్థితి నొందుమని మరియు లోకంబున నొక్కడు బ్రసుప్తుండునుం బోలె దర్శనాదివ్యాపారశూన్యుండై నిరంతరంబు నిగృహీతేంద్రియుండై చూడంబడు గావున ఈలక్షణంబసంభావితంబంటేని సెప్పెద

తరువోజ॥ అమరు నీ సర్వభూతావళులకుమ నిశబోలు నయ్యాత్మనిష్ఠయజ్ఞాన
తమముచే దగనావృతములైనచిత్తములుగల జనులకింపుగదర్శనాది
కములైన వ్యవహార గతులు లేవగుట యాత్మనిష్ఠారూపమందు
నమ్ముని యు
నుమతి జితేంద్రియస్ఫూర్తి మేల్కనుచునుండు భూతముల
కెట్లుండునంటేని

ఆ॥ వె॥ ఎట్టి విషయజాత మెనసిన నిష్ఠయం
దెల్ల భూతములు నమిద్ధజాగ
రమున దెలిసియుండు రహి పార్థ వినుమిట్టి
విషయనిష్ఠ మునికి వెలయు నిశయు.

వ॥ అట్టి నిశయందాత్మతత్త్వంబు గను మునికి దర్శనాది వ్యాపారంబు లేదు. బ్రహ్మజ్ఞుండున్మీలితాక్షుండైన అతనికి బ్రహ్మంబంద దృష్టి యుండు. విషయదృష్టి లేకుండు గావున తల్లక్షణంబు నంభవించు నట్లయినను విషయ దృష్ట్యభావంబున (నిత)ండెట్లు విషయంబులను అమభవించు నంటేని జెప్పెద.

చ॥ సకలనదిజలంబులను సాగర మెప్పుడు బూర్ణమయ్యు దా
ప్రకటముగాని యామ్యగతి బాయకయుండగ నంబువుల్ మరిన్

సుకరముగాగ నందఁగు చొవ్వున నీ విషయంబు లప్పుడినిన్
వికలమనస్కు జేయవు విన్ద్రదత భోగములందె నేనియున్.

వ॥ మరియు భోగంబులదే నవిక్రియమాణుండై యంతర్దృష్టిగల్గు యోగినిం గురించి విషయంబులు ప్రారబ్ధకర్మాక్షిప్తంబులగుచుం బ్రవేశించు నతండు కైవల్యం బందుచుండుగాన భోగకామనశీలుండు కాడు గావున.

క॥ కామంబులెల్ల దొలగియు
ధీమహితా నిస్పృహుండు ధృతి నిర్మమతా
స్థేముడు నిరహంకారుం
డై మహితసుఖంబు శాంతినంది జెలంగున్.

తరువోజ॥ ఇదియె బ్రహ్మజ్ఞానసహిత నిష్ఠనుస్మ భగవదారాధన
ప్రకటిత వృత్తి
మది నిర్మలంబగు మహిపార్థ పురుషుడెవడేని యీస్థితి నెనసిన మోహ
మది బాయు క్షణమాత్రమంత కాలమున నీ జ్ఞాన నిష్ఠ
దా నిరవుకొల్పినను
వదలక పరమనిర్వాణంబునొందు సాంఖ్యయోగంబిది
జరవు మీనసమ.

ఉపేంద్రవజ్ర॥ ఈ సాంఖ్యయోగంబున నింద్రసూనున్
ధీసంస్తుతిన్ బూన్చిన దేవదేవున్
శ్రీ సక్త పాదాబ్జుని చిత్స్వరూపున్
నే సంస్తుతిన్ జేసెద నిర్మలాత్మున్.

గద్య: ఇది శ్రీమద్యోగానందగురువర కరుణాపాత్ర వాసుదేవద్వాదశాక్షరీ మంత్రరాజ విద్యానుష్ఠానపవిత్ర కౌండిన్యసగోత్ర పూదూరి కోదండ యామాత్యపుత్ర కృష్ణయనామధేయ ప్రణీతంబైన శ్రీ భగవద్గీతార్థ దర్పణంబునందు సాంఖ్యయోగంబను ద్వితీయాధ్యాయంబు. శ్రీమద్యోగానంద గురవేనమః- శ్రీ వేదవ్యాసాయినమః:-

పై పద్యములవలన నిది కేవల మనువాదముకాక, టీకాప్రాయమైన యనువాదమని తెలియనగును.

(గోలకొండ పత్రిక 26-1-1961)

# లయగ్రాహి గరుడాచలకవి

రామాయణేతివృత్త మాధారముగా నాంధ్రవాఙ్మయమున వెలువడిన రచనము లత్యధికములు. తెలుగులో మరియే యితివృత్తమునకును నింతటి ప్రచారము కలుగలేదు. అది శ్రీరామచంద్రమహిమయో లేదా వాల్మీకిముని కలము బలమో, మరి తెలుగువారి భక్తి కలిమియో కాని రామాయణ కథ సంపూర్ణముగనో లేదా అందలి ఘట్టములో ఇతివృత్తముగా గొని పందలకొలది కవులు ప్రాచీనకాలమునుండి నేటివరకును వివిధసాహిత్యప్రక్రియలందు వెలయించుచున్నారు. ఈ విధముగా వెలువడిన గ్రంథములందు సగముకన్న నెక్కుడముద్రితములు. ఇట్టివానిలో కౌసలేయచరిత్రమను మహాప్రబంధ మొకటి.

ఇది యైదాశ్వాసముల కావ్యము. దీనికి కర్త లయగ్రాహి గరుడాచల (గరుడాద్రి) కవియను చరిత్రకెక్కని చరితార్థుడు.

గరుడాచలకవి బోర్వెల్లి సంస్థానమందుండినవాడు. బోరవెల్లి సంస్థానాధీశ్వరులు పాకనాటి రెడ్లు. వీరిది మిదమిళ్ళగోత్రము. ఇంటిపేరు ముష్టిపల్లి వారు. గద్వాల సంస్థానాధిపతులకును వీరికిని సన్నిహితమైన బాంధవ్య మున్నది. ఈ రెండు సంస్థానములవారి ఇంటిపేరును, గోత్రములును సమానము. ఒకప్పుడు స్వతంత్రముగా నుండిన బోరవెల్లి సంస్థానము ఎప్పుడో గద్వాల సంస్థానమున లీనమైపోయినది. కౌసలేయచరిత్రము బోరవెల్లి యాస్థానాధీశ్వరుల ఇలువేల్పగు శ్రీకేశవస్వామి కంకితముగా రచింపబడినను కవి పోషకులు సంస్థానాధీశ్వరులు కనుక వారి చరిత్రము గూడ ఇందు విపులముగా వర్ణింపబడినది. ఈ చరిత్రము కవి కాలమును నిర్ణయించును. గ్రంథస్థాధారములనుబట్టి లయగ్రాహి గరుడాద్రికవి యించుమించుగా గద్వాల పెదసోమ భూపాలునకు సమకాలీనుడు.

గ్రంథ ప్రారంభమున నున్న పద్యము.

ఉ॥ శ్రీ విలసిల్లు బోర్వెలి పురిన్ తెలిదీవిని నిల్పువైఖరిన్
భావము రంజిలన్ నిలిచి భాసిలు కేశవదేవుడాత్మవ
క్షోవితతాలయంబునను కూర్మిన నిల్పిన రీతి నిల్పుతన్
శ్రీవనితాశిరోమణిని శ్రీగిరియమ్మ గృహాంతరంబునన్.

రెండవ పద్యమున లక్ష్మీదేవియు, మూడవ పద్యమున పోల్గంటి సోమే శ్వరుడును (ఈతడు కూడ బోరువెల్లిరెడ్డి రాజులకు ఇలువేలుపు), నాలుగవ పద్యమున పార్వతియు. ఐదవ పద్యమున బ్రహ్మయు, ఆరవ పద్యమున సర స్వతియు ఏడవ పద్యమున విఘ్నేశ్వరుడును స్తుతింపబడినారు. ఎనిమిదవ పద్యమున "భారత రామాయణముల్ రచించిన మునీంద్రశ్రేష్ఠులన్, పుణ్యులన్" నుతించినాడు. తొమ్మిదవ పద్యమున గీర్వాణభాషాకవుల స్తోత్రమున్నది ఈ సీస పద్యమున నాలుగవ పెద్దపాదమున మురారిని గూర్చి యిట్లున్నది "కవి సన్నుతేతజ్జగన్నాటకోద్వృత్తి పేరెన్నలరు మురారిగొలుతు" మురారి విరచిత నాటకములందు మనకు లభించినదొక్క యనర్ఘరాఘవమే. జగన్నా టకమను రూపకమును గూడ మురారి రచించి యుండనోపును. శేషాచలుడను కవి జగన్నాటకమును ప్రబంధముగా రచించెను. ఇది ప్రబోధచంద్రోదయము వలె వేదాంతపరమైనది. ఇది యముద్రితము. మన పూర్వకవులు సంస్కృత నాటకములను ప్రబంధములుగా సంతరించుట మనమెరుగుదుము శేషాచలకవి విరచిత జగన్నాటక ప్రబంధమిట్టి తెగకు చెందినదేమో! ఇది నాయూహ మాత్రము గరుడాచలకవి యుద్దేశమింతకు మురారి "జగన్నాటక" కర్తయనియో కాదో! పదియవ పద్యమున తెలుగు కవులను స్తుతించినాడు. అందులో కవిత్రయమువారు, పోతన, భాస్కర, రంగనాథ, సూరన, పెద్దన, తిమ్మ నార్యులున్నారు.

అటు తరువాత 11 నుండి 16 వరకుగల పద్యములలో కవి తన పూర్వు లను గూర్చి చెప్పుకొనినాడు. వారిలో మొదటివాడు మాధవకవి. అతడు కృష్ణదేవరాయలవారిచే సత్కారము లందినవాడట. అతని గూర్చిన పద్య మిట్లున్నది.

ఉ॥ మాధవభక్తియుక్తు డసమానకవిత్వగురుండు కృష్ణరా
యాధిపదత్త సద్గజవరాదిమహాబహుమానశాలి గం

గాధరకీర్తిసాంద్రుడు జగత్కవిచంద్రుడు మత్కులేంద్రుడౌ
మాధవు డస్మదాదులకు మాన్యుడుగారె తలంచి చూచినన్

శ్రీకృష్ణదేవరాయలంతవానిచే నిట్లు సత్కరింపబడిన మాధవకవి
రచనలేమైపోయినవో। ఈ మాధవకవికి ముగ్గురు పుత్రులు 1. భైరవుడు
2. రామభద్రుడు 3. చందప్ప. ఈ సోదరత్రితయమున మధ్యముడగు రామ
భద్రుని కుమారుడు రామన్న. కనిష్ఠుడగు చందప్ప కుమారులు 1. తిమ్మయ్య
2. కృష్ణయ్య 3. రామన్నలు. ఆటు తరువాత నొక పద్యమిట్లున్నది.

క॥ ఆతతగుణి రామన్నకు
భూతలమున గలిగినట్టి పుత్రుల దలతున్
మాతాతల నారాయణ
సీతాపతులన్ నృసింహ సేవామతులన్.

పై పద్యమున చెప్పబడిన కృతికర్త తాతలగు నారాయణ సీతా
పతులు రామన్న కుమారులట. పైన రామభద్రుని కుమారుడు రామన్న యొక
డును చందప్ప కుమారులందు కనిష్ఠుడగు రామన్న యొకడును గలరు. ఈ
యిరువురు రామన్నలును అన్నదమ్ముల కుమారులు. వీరిలో కవిగారి ముత్తాత
ఏ రామన్నయో స్పష్టముగా లేదు. సీతాపతి (కవితాత) కుమారులు మువ్వురు:
1. సంజీవి 2. వెంకటయ్య 3. నృసింహకవి. వీరిలో కనిష్ఠుడగు నృసింహ
కవియే కౌసలేయచరిత్ర కృతికర్తయగు లయగ్రాహి గరుడాద్రి కవి జనకుడు.
ఈ విధముగా కవి యారు పద్యములందు ఆరుతరముల తన పూర్వులను
స్మరించినాడు. వీరిలో దాదాపుగా అందరును కవులే; అందరును చరిత్ర
కెక్కనివారే. పదునేడవ పద్యమున గురువును స్తుతించినాడు.

శా॥ శ్రీగంధద్రవ శీతలాత్మకుని కాశీసేతు మధ్యావనీ
భాగఖ్యాతివిరాజమానుని మహాభాష్యాదిషట్ఛాస్త్ర వి
ద్యాగారున్ నరసింహ సత్కవి కుమారాగ్రేసరున్ బో ర్వెలీ
యోగానంద కవీంద్రు మద్గురువరేణ్యున్ భక్తి సేవించెదన్"

కృతికర్తకు గురువైన ఈ యోగానంద కవీంద్రుడెవరు? కృతి
కర్తకు అగ్రజుడగునేమో? ఇరువురి తండ్రి పేరులును సమానములు. దీనిపై
పద్యమున తండ్రుల గూర్చి,

క॥ సీతాపతి తన్నయుల వి
ఖ్యాతుల సంజీవి వెంకటాఖ్యుల సుకవి
వ్రాతస్తుత కవితాఘను
మాతండ్రి నృసింహకవిని మాటికి దలతున్"

అని చెప్పినాడు. కనుక నృసింహకవి కుమారాగ్రేసరుడు యోగానంద కవీంద్రుడు గరుడాద్రికవి కన్నయగునని యూహించుచున్నాను. ఈ సంబంధమటు విడిచి యోగానందుని గూర్చి కొంత విచారింతము. ఈ వ్యాసమునకు పూర్వము వ్యాసము పూడూరి కృష్ణయామాత్యుని గూర్చి. పూడూరు బోరవెల్లికి సమీప మందున్నది. పూడూరు కృష్ణయామాత్యుడు తన "భగవద్గీతార్థ దర్పణము" చివర గద్యములందు తాను "శ్రీమద్యోగానందగురువరకరుణాపాత్రు" డనని తెలిపెను. ఈ యోగానంద గురుడే "గురుశిష్యసంవాదము" "ఆత్మైకత్వ బోధము" వంటి ద్విపద వేదాంతగ్రంథములకు కర్తయగు యోగానంద అవధూతయై యుండునని ఊహచేసితిని. అది యెట్లున్నను పూడూరి కృష్ణయామాత్యుని గురువగు యోగానందుడును లయగ్రాహి గరుడాచలకవి గురువగు యోగానంద కవీంద్రుడును ఒకరేయని నిశ్చయముగా భావింపవచ్చును. ఏలన పూడూరి కృష్ణయామాత్యుడును లయగ్రాహి గరుడాచల కవియును సమకాలీనులు. మీదు మిక్కిలి ఏక ప్రదేశమునకు చెందినవారు. ఇక యోగానందావధూతయు యోగానంద గురుడును ఒకరగుదురో కాదో! ఒకరే కానచ్చునని యింతకు పూర్వపు వ్యాసమున నూహించితిని. కాని యిప్పుడు కొంత సంశయము కలుగుచున్నది. కారణమేమన నీ యోగానంద గురుడు కాశీసేతు మధ్యావనీ భాగఖ్యాతి విరాజమానుడట, మహాభాష్యాదిషట్చాస్త్ర విద్యాగారుండట; కవీంద్రుడట. యోగానందావధూత విరచితమగు "గురుశిష్య సంవాదము" "ఆత్మైకత్వ బోధము"లందు వేదాంత మున్నదే కాని ప్రౌఢిమ, పాండిత్యము లంతగా కానరావు. కనుకనే యిప్పుడీ సందేహము బాధించుచున్నది. ఇది భావిపరిశోధనలవలన తేలనగు విషయము. ఇంతటితో ఇష్టదేవతాప్రార్థనమును పూర్వకవిస్తుతియు, కవివంశావతారమును, గురుస్తుతియు ముగిసినవి. ఇక మిగిలినది సంప్రదాయ ప్రకారముగా కుకవినింద, అది యిట్లున్నది.

చ॥ ఘనవరత్న సంఘములు గల్గిన దొంతులు ద్రోయ కుక్కకె
ట్లనువగు సత్కవీశ్వర సుహారచనా వచన ప్రచారతల్

మొనయు మహాప్రబంధములు ముష్కరదుష్కవి కేమి సేయ దీ
రును మరివాని సుద్ది కదరో బెదరో వివరించి చూడగన్.

అటుతరువాత నొక పుణ్యదినమున కవికి బోర్వెల్లి కేశవస్వామి స్వప్నమున సాక్షాత్కరించి.

"బాలక నా గృహంబెపుడు బాయక విద్యలు నేర్చినావు భూ
పాలసభాంతరాళముల పండితు లౌనన సత్కవిత్వ ము
ద్వేలవచోవిజృంభణల వేగముగా రచియింప నేర్తువౌ
మేలు భళీ భవద్గుణము మెచ్చి వరం బొసగంగ వచ్చితిన్" అని

కౌసలేయ చరిత్రమును తనకు అంకితముగా నొసంగుమని యాదేశించును. వలన తనకు మందిరము గట్టించిన గిరియమ్మ తనపై కృతి విరచింపజేయ సంకల్పించినదట.

క॥ గిరియమ్మ నాకు మెచ్చుగ
శరణము గట్టించి యొక్క సత్కృతి నాపై
విరచింప జేయవలెనని
కరమురుదుగ దలచినది జగద్ధిత మిదియున్. ౨౪.

ఉ॥ ఈ కృతియే మదంకిత మహీనమతిన్ రచియింపజేయు మం
చా కమలాక్షియౌ గిరియమాంబకు నే కలలో వచించెదన్
జోకగ నీ కభీష్టములు జొప్పుడు శ్రీ నరసింహమూర్తినై
నీకిలు వేలుపై తగిన నీరజనాభుద నేనె బాలకా"—

స్వప్నమునుండి మేల్కాంచి గరుడాద్రికవి కృష్ణవేణికిం జని కాల్యంబులు దీర్చుకొని పెద్దలకు తన స్వప్నమును విన్నవించి యున్నయెడ గిరియమాంబారాణి యాజ్ఞవచ్చును. కవి యాస్థానమునకేగును. భగవదాజ్ఞ ప్రకారమే గిరియమ్మ కృతి నిర్మింపి భగవంతున కంకితమిడుమని కవిని సత్కరించును. కవి వల్లెయని గిరియమ్మ వంశావతారమును వర్ణించును. దీనిలో బోరవెల్లి గద్వాల సంస్థానముల చరిత్రములు, సీమలు ఆయా పాలకులొనర్చిన ఘనకార్యములు సప్తసంతానప్రతిష్ఠలు మున్నగునవి విపులముగా వర్ణింపబడినవి. ఈ చరిత్రమంతయును ౩౩ మండి ౭౦ వరకు గల ౩౮ పద్యములందు విపులముగానున్నది.

బోరవెల్లివారి చరిత్రమిట్లున్నది. శ్రీమన్నారాయణుని పాదపద్మమున గంగ జనించెను. ఆ గంగకు పదజవంశము కలిగెను, అట్టి ప్రసిద్ధాన్వయమున శ్రీ కేశవస్వామి సేవాపరాధీనుడును, కీర్తిశాలియు, రిపుభయంకరుడును మిడిమిళ్ళ గోత్రజుండును నగు నల్లభూవల్లభుడు జన్మించెను. ఆతడు మల్లాంబను, తిమ్మాంబను వివాహమాడెను. మల్లాంబ వలన నల్లారెడ్డికి పెద సోమవిభుడు చిన సోమవిభుడునను కుమారు లిరువురు జన్మించిరి. పెద సోమభూపాలుని భార్యలచ్చమ్మ. రణార్జున బిరుదాంకుడగు చిన సోమవిభుడు గిరియమ్మను పెండ్లియాడెను. ఈ గిరియమ్మ గద్వాల ప్రభువును, బక్కమాంబా పుత్రుండును, దరూరైజ కందనూల్పుర బనగానిపల్లె భండాత్మకూ రఘోబలము చాగలమఱ్ఱి శిరువళ్ళ నంచేల సీమల సాధించినవాడును నగు సోమనాద్రికి లింగాంబయందు జన్మించినది. అనగా గిరియమ్మ గద్వాల సంస్థానమునకు మూలపురుషుడగు పెద సోమనాద్రి కూతురు. ఈ పట్టున సోమనాద్రి గుణగణములును, అతని భార్య లింగాంబ యొనర్చిన పుణ్యకార్యములును విపులముగా చెప్పబడినవి. ఆటు తరువాత వారి సంతానమగు గిరియమ్మ గుణగణములును ఆమె యొనర్చిన పుణ్యకార్యములును వర్ణింపబడినవి. ఈ గిరియమ్మయే మన గరుడాద్రికవిని సత్కరించి ఏతత్కృతి కేశవాంకితము చేయుటకు పురికొల్పినది.

గద్వాల పెద సోమభూపాలుడు క్రీ: శ. 1663-1712 ప్రాంతము లందుండినవాడని చారిత్రికుల నిర్ణయము. కనుక లయగ్రాహి గరుడాద్రి కవి గూడ ఇంచుమించుగా నిదేకాలమందున్నవాడని మనము భావింపవలెను.

గిరియమ్మ గద్వాల పెద సోమభూపాలుని కూతురనియు బోరవెల్లి చిన సోమభూపాలుని భార్యయనియు తెలిసికొంటిమి. గద్వాల మరియు బోరవెల్లి వారి దొకే గోత్రము. ఇంటిపేరుకూడ ఒకటియే. ఈ సగోత్ర వివాహమెట్లు తటస్థించినదో!

గిరియమ్మ యొనర్చిన పుణ్య కార్యములను వర్ణించు పద్యములందు రెండింటి నుట్టంకింతును.

సీ॥ కట్టించె కేశవాగారంబు భూమిపై బరగు కుబేర పుష్పకమనంగ
సేవించె నారామ సేతుకాశీమధ్య దివ్యస్థలంబులు తెగువ మీర

వేయించె వనములుర్విని చైత్రరథనందనోద్యానములరీతి హృద్యముగను
చదివించె విద్యార్థిజనుల కన్నముబెట్టి వేదశాస్త్ర పురాణవిద్యలెల్ల

జన్నము లొనర్పజేసె నిర్జరగణంబు
గంఖతి యొనరింవ విప్రసంఘముల చేత
ననుచు ప్రజలెన్న వర్ధిల్లె ననుదినంబు
పరమసద్గుణనికురుంబ గిరియమాంబ (౬౬)

ఇక గిరియమ్మ నెలకొల్పిన యన్న సత్రములగూర్చి గమనింపుడు.

ఉ॥ పుత్రక యెందుబోయితివి? బోర్వెలిలో గిరియమ్మ బెట్టు బ
ల్సత్రములో భుజించుటకు; సత్రవిశేషము లేమి? దూడు నా
గాత్రము; త్రావితో సుధ? జగజ్జనులందరు ద్రా(వ)త్రావు టే
చిత్రము నేనటంచును వచించును బ్రహ్మకు నారదుండటన్ (౬౭)

దీని తరువాత మరి మూడు పద్యములుగూడ గిరియమ్మను వర్ణించునవి కలవు. అటుతరువాత రెండు పద్యములందు కేశవస్వామిని స్తుతించి షష్ఠ్యంతములు చెప్పినాడు. అటుపైన.

"అంకితంబుగా నాయొనర్పం బూనిన కౌసలేయ చరిత్రంబను మహా ప్రబంధంబునకు కథా ప్రారంభం బెట్టదనిన"యని

ఉ॥ శ్రీనిలయాగ్రజస్థితి ధరించి గురూన్నత రీఠిచే సుధ
ర్మానఘ భోగభాగ్యము లహర్నిశ మీయగనోపి సౌధశో
భానిరవద్యనిర్జరశుభక్రియ లూని యసాధ్యమై యయో
ధ్యానగరంబు పొల్చు వసుధన్ వసుధామ నియుక్తి స్వర్గమై.

యని యాయోధ్యానగర వర్ణనముతో ప్రారంభించినాడు. ఆశ్వాసాంత గద్యమిట్లున్నది.

"ఇతి శ్రీమదహోబల నృసింహ కరుణా కటాక్ష లబ్ధో భయ భాషా నిరంకుశ లయగ్రాహి సీతావతి పౌత్ర నృసింహకవి పుత్ర హరితసగోత్ర పవిత్ర గరుడాచల కవీంద్ర ప్రణీతంబైన కౌసలేయచరిత్రంబను మహా ప్రబంధంబునందు పంచమాశ్వాసము"—

గ్రంథము వ్రాయబడిన లిపి యొక తీరుగను ఆశ్వాసాంత గద్యము లన్నియు వ్రాయబడిన లిపి మరియొక తీరుగను ఉన్నవి; కొన్ని ఆశ్వాసముల చివరన గద్యము వ్రాయబడక స్థలము విడువబడియున్నది. ఒక గద్యమున "అష్టవిధభాషాకవిత్వసంపన్న సారస్వతాభినందిత"యను విశేషణ మధికముగా నున్నది. గ్రంథముకూడ మూలమునకు ప్రతియేకాని అసలు గ్రంథకర్త వ్రాసిన ప్రతిగాదని భావించుట కవకాశమున్నది. అచ్చటచ్చట మిక్కిలి శిథిలమై పోయినది.

బోర్వెల్లి యాస్థానమున గిరియమ్మ కాలమున గరుడాద్రికవి కౌసలేయ చరిత్రమును, ఆమె దత్తపుత్రుడు వెంకటపతి కాలమున చింతలపల్లి ఛాయాపతి యను కవి రాఘవాభ్యుదయమను మహాప్రబంధమును శేషాచలస్వామి కంకితముగా రచించిరి. రాఘవాభ్యుదయమున గల బోర్వెల్లి సంస్థానవిశేషములు చింతపల్లి ఛాయాపతినిగూర్చి వ్రాసినప్పుడు 30-11-1960 నాటి గోలకొండ పత్రికలో తెలిపియుంటిని. జిజ్ఞాసువులు గమనింతురుగాక.

(గోలకొండ పత్రిక 8-2-1961)

# నాడగౌడు ముష్టిపల్లి వెంకట భూపాలుడు

గద్వాల సంస్థానమునందలి ముఖ్యగ్రామములలో రాజవోలొకటి. ప్రస్తుత మది "రాజోళి"యని పిలువబడుచున్నది. ఇది తుంగభద్రాతీరమున గలదు. తుంగభద్ర యిట రెండు పాయలుగా ప్రవహించును. రెండుపాయల మధ్యన నొక లంక యేర్పడినది. శిథిలములగు కోటలు, రాజ ప్రాసాదములు రాజవోలు పూర్వవైభవమును మూగనోము పట్టియైనను చెప్పక చెప్పుచున్నవి. దుర్గమధ్యమున వీరనారాయణస్వామి యాలయమును, గ్రామమునకు రెండు మైళ్ళ దూరమున నదియొద్దున రామేశ్వరాలయమును, ఆ యాలయము ముంగిట చాళుక్య భూబోకమల్లుని శాసనమును ఉన్నట్లు శ్రీ మారేమంద రామారావుగారు తెలుపుచున్నారు (కాకతీయ సంచిక పుట 271)

పాకనాటివారును, మిడిమిళ్ళ గోత్రజులును, ముష్టిపల్లి యింటిపేరుగా గలవారును నగు రెడ్లు, రాజవోలు రాజధానిగా ఈ ప్రాంతములను పాలించిరి, వీరికి నాడగౌడు, దేశాయి బిరుదములున్నవి. గద్వాల రెడ్డి ప్రభువులును వీరును జ్ఞాతులు. ఈ పాలకులు మొదట గద్వాలవారికి లోబడి యుండిరో లేక స్వతంత్రముగా నుండిరో తెలియరాదు కాని తదువాత తరువాత మాత్ర మీ ప్రాంతములన్నియు గద్వాల సంస్థానములో చేరి పోయినవి. ఈ రాజవోలు పాలకులలో నాడగౌడు వెంకట భూపాలుడొకడు ఈతడు గొప్ప భక్తుడు. మరియు ననేక గ్రంథములకు కర్త. దివ్యదేశమహాత్మ్యదీపిక యను ద్విపదకావ్యమొకటి ౨౩ తాళపత్రములపై గలదు. ఇది నూట యెనిమిది దివ్య స్థలములను తన్మాహాత్మ్యములను తెలుపు ద్విపద గ్రంథము. గ్రంథాంతమున గల ద్విపదలవలన కృతికర్తయు, కృతిభర్తయు, వారి వివరములును కృతికి సంబంధించిన విశేషములును తెలియనగును.

"అని చెప్పి శ్రీ వెంకటాధిపు పేర - వనజ నేత్రుని పేర వరదుని పేర
రాజించు తుంగభద్రాతీరమందు - నాణెమౌ రాజవోల్పగరావతంన

రమణ వైకుంఠ నారాయణు పేర - మమతతో నన్నేలు మాధవు పేర
నయముగాను జనార్దనస్వామి పేర - జయమిచ్చినట్టి కేశవదేవు పేర
ప్రేమనంకిత మొనరించి ప్రోల్కంటి- సోమేశకరుణారసోదయావాప్త
భోగభాగ్యోదయుల్ ముష్టిపల్వంశ - సాగరచంద్రులు సద్గుణసాంద్రు
లుదయించి రందులో సుర్వీశ షౌశి-సదయుడిమ్మడియెల్లజనపాలుడలరు
కులము తప్పులు దీర్చుకొను పాక నాటి - కులములో మిడిగా(మి?)శ్య
గోత్రుడై నాథ
గౌడుదేశాయన గణుతికినెక్కి - ప్రోడయై సకలభూములకీర్తి గాంచె
ఆ విభు ననుజన్ముడౌ చినరెడ్డి - దేవి లక్ష్మాంబ ప్రథిత గుణాలంబ
ధర (వెలసె) సకల ధర్మస్వరూప - గరిమచే నాసాధ్వగనియె లక్ష్మి కు
మారానుగుణరూపసహితు కుమారు - ధీరు చిన్న విభు నుద్దీపితో దారు
నాఘనుండు వివాహమయ్యె ముదమున -శ్లాఘనీయ కృపావలంబనులింగ
మాంబ నాదంపతు లర్థి నన్ గాంచి - రంబుజోదరపదధ్యానపారీణు
శ్రీ, వెంకటేశభూరికటాక్షలబ్ధ - పావనకవితానుభావుని గాద
నామ వెంకటదాసు నయము దీపింప - ధీమంతులెల్లనెంతే సంతసింప
ఘున్న నే చేసిన పుణ్యఫలమున - చెన్నున కిచ్చితి ద్విపద గావించి
దివ్యదేశమహాత్మ్యదీపికాకావ్య - మవ్యయసౌఖ్యదమై రాజసభల
స్థాచిన నంపెంగపోడిమిదాల్చి - యాచంద్రతారార్కమై యొప్పగాత"

పై ద్విపదలవలన నీ కృతి రాజవోలి కేశవస్వామి కంకితముగా రచింపబడినదని తెలియును గద్వాల, పూడూరు మున్నగు సంస్థానాధీశ్వరులకు వలె రాజవోలిపాలకులకుగూడ ప్రోల్గంటి సోమేశ్వరుదాక ఇలు వేలుపనియు తెలియుచున్నది. గ్రంథకర్త వంశావతార మిట్లున్నది.

ముష్టిపల్లి ఇమ్మడి యెల్లారెడ్డి సోదరుడు
చినరెడ్డి
(భార్య లక్ష్మాంబ)
|
పిన విభుడు
(భార్య లింగాంబ)
|
వెంకట భూపాలుడు
(కృతికర్త)

ఈ కృతికర్త కాల మిదమిత్థముగా చెప్పుట కెట్టి యాధారములును గానరావు. కృతికర్త తాను అంబుజోదరపదధ్యానపారీణు దననియు, శ్రీ వేంకటేశభూరికటాక్షలబ్ధపావనకవితానుభావుడ ననియు, నాదగౌడననియు చెప్పుకొన్నాడు. గ్రంథమంతయు సరళమైన భాషలో భగవన్మహిమలు, ఆయా దివ్యప్రదేశముల మాహాత్మ్యము లుట్టంకించుచు నడచినది. అడుగడుగు నను కృతికర్తకుగల భగవద్భక్తి మనకు గోచరించుచుండును. కర్త తనను చివరకు వెంకటదాసుగా చెప్పుకొన్నాడు.

పై కృతియేకాక వెంకటభూపాలుడు మరికొన్ని కృతులు రచించెను. ఆ కృతులలో నింత విపులముగా వంశావతారము మున్నగు వివరములు లేకున్నను పేరునుబట్టియే ఆ గ్రంథములుకూడ వెంకటభూపాల రచితములని భావించుచున్నాను. అట్టివానిలో మొదటిది రాజవోలి వేంకటేశ్వర శతకము. ఇది శిథిలావస్థలోనున్నది. ఇందులో మొత్తము ౧౦౯ పద్యము లున్నవి. అన్నియు కందపద్యములు. ఇది శ్రీ రాజవోలి వేంకటేశ్వరస్వామికంకితము.

క॥ శ్రీ రమణీ ప్రాణేశ్వర
వారిజ లోచన మురారి......నమ
స్కారమిదె రాజవోలి వి
హారునివలె కరుణ వెంకటాచలరమణా.

చివర పద్యమిట్లున్నది.

క॥ నరహరి యెప్పుడు చాలా
నిరతము మదినమ్మినాడ నీ దాసుని నన్
మరువకుము రాజవోలి
హరి లీలను కరుణ వెంకటాచలరమణా.

ఈ శతకమందలి మొదటి ౩౬ పద్యములు "ర" ప్రాసముతో నున్నవి. ౩౭ నుండి ౬౬ వరకు "న" ప్రాసములో నున్నవి. ౬౭ నుండి ౮౬ వరకు "ల" ప్రాసము. ౮౭ నుండి ౧౦౬ వరకు బిందుపూర్వక దకార ప్రాసము. చివర మూడు పద్యములు మరల "ర" ప్రాసముతో గలవు. వీనిలో కవి పేరు ఎచ్చటను లేదు.

ఈ శతకము ముగియుటతోడనే ఈతాళపత్ర గ్రంథమందే ఎనిమిదవ కమ్మనుండి "రాజవోలి వెంకటేశ్వరకీర్తనము" లారంభమైనవి. ఈ కీర్తనము లందు వేంకటరాయగౌర భూపాలుడనియు, గౌడేంద్రుడనియు, గౌడ భూపాలు డనియు, గౌడ భూపతియనియు, వేంకటదాసనియు పేరుండుటనుబట్టి రాజవోలి వేంకటేశ్వర శతకకర్తయు, రాజవోలి వేంకటేశ్వర కీర్తనలకర్తయు ఒక్కరగుదురని భావించుచున్నాను. ఈ కీర్తనలు రెండు సంపుటము లందున్నవి. మొదటి సంపుటములో రాజవోలి శతకము తరువాత ౧ నుండి ౧౫౫౨ వరకున్న కీర్తనలు గలవు. పత్రసంఖ్య ౭౩తో నాగిపోయినది. అటుపై కమ్మలకు సంఖ్యలేదు. కాని ప్రతి కీర్తన ప్రారంభమున రాగతాళము లును, కీర్తన తరువాత దాని సంఖ్యయు గలవు. రెండవ సంపుటమున నీ రాజవోలి వేంకటేశ్వర కీర్తనలు ౧౫౫౧ నుండి ౩౪౭౬ వరకు గలవు. మొదటి సంపుటమందు ౧౫౫౨ వరకు కీర్తనలున్న వంటిని. మొదటి సంపుట మందలి ౧౫౫౧, మరియు ౧౫౫౨ కీర్తనలును రెండవ సంపుటమందలి ఈ సంఖ్యలుగల కీర్తనలును ఒకటిగావు. వేర్వేరుగా నున్నవి. ఇది యొక చిక్కు సమస్య. సంఖ్య వేయుటలో వ్రాయసకాని పొరపాటు దొరలినదో లేక రెండవ సంపుటము కీర్తనలు వానిపూర్వపు క్రమసంఖ్యయు వేరో తెలియదు. ఏది యెటులైనను ఈ మూడు వేల నాలుగువందల డెబ్బదియారు కీర్తనలు రచించినది మాత్రము వెంకటరెడ్డియనియే నా మతము. పేరునకివి వెంక టేశ్వర కీర్తనలుగాని వీనిలో నంతయు వైష్ణవమే లేదు. ఈ కీర్తనలందు కొన్ని శివపరముగా కూడ కలవు. ముష్టిపల్లి రెడ్లు మొదట ప్రోల్గంటి సోమే శ్వరుని భక్తులు, తరువాత వైష్ణవమును స్వీకరించినారు. ఐనను శివకేశవులను సమానముగా నారాధించినవారీ రెడ్లు.

మొదటి కీర్తన మిట్లున్నది.

మారువరాగం – ఆదితాళం

రామరామ మిము నమ్మిన దాసుల రక్షించగ ఇక యెవరున్నారు
స్వామి వరాకు............ పై నేమి నేరములు గల్గినసైనా।

ప॥ నే చేసిన పాపంబులన్నియును నీపై పరిహారములు కాయుగనూ
వాచకముల మీ దివ్యనామములు వర్ణన చేసెద కావుకావుమని ౧

నేమముతో మీ పాదధ్యానము నిరతము నా హృదయమునందు
ప్రేమనిల్వగా సేయుము వేడుక పామజవరదా శ్రీనివాసహరి ౨

రాజవోలి కేశవుడగు వేంకటరాయ గౌడ భూపాలకుని
తేజము మీరగ సేవ పరునిగా పూజితముగ దయచేసి యేలితివి ౩

ఈ భూపాలునికి శాత్రవులవలన నెట్టి యాపదలు కలిగినవో కాని యొక కీర్తనములో "రణజయమిచ్చి శాత్రవుల మర్దించి" తన్ను గాపాడ వలసినదని పరాత్పరుని వేడుకొన్నాడు. ఆ కీర్తనమిది.

తోడిరాగం-అటతాళం

భారంపు సంసార వలల (దగిలి?) మిమ్ము చేరనేరనైతిగా ఓరంగా
ఏ రీతినను దయజూచి రక్షించెదో కారుణ్యము మీరగా ఓరంగా
కాయము నిత్యముగాదని మీపాదకమలాములర్థితోను ఓరంగా
ధీయుక్తి పూజాలు సేయుచు మదిలోన తెలివినొందనేరకా ఓరంగా
పాయాని కామాదిశత్రువర్గములచే బద్ధుడనైయున్నాను ఓరంగా
యేయెడ కాపాడు భారమే మీది నన్నేలుము మరువకమ ఓరంగా ౧

నారాయణయను నాలుగక్షరములు నాలుక నుంచలేనూ ఓరంగా
కారాణగురువులు ఆనతిచ్చు యోగచారము: లెంచలేనూ ఓరంగా
ద్వారాకావాసాములైన మీపాదములపైన చిత్తముంచనూ ఓరంగా
క్షీరాబ్ధిశయనా నామనవాలకించి నీసేవపరుని జేయవే ఓరంగా ౨

ప్రణుతింపగా నెల్లచోట నిండియుండు బ్రహ్మము నీ రూపమూ ఓరంగా
రణజయమిచ్చి శాత్రవుల మర్దించినన్ రక్షించుమని వేడితే ఓరంగా
గణనోన్నత నాదగౌడ గౌడ భూకాంతుని నెల్లప్పుడు ఓరంగా
అణిమాదులొసగు వెంకట రాజవోలి విహార శ్రీ చెన్నరాయా ఓరంగా ౩

ఈ కీర్తనల మధ్యన కొన్ని ద్విపదలు కూడ కలవు. ౨౧౮ కీర్తనల తరువాత "ద్విపదలు" అను శీర్షికనుంచి.
"శ్రీ రామచంద్ర యాశ్రిత సన్మునీంద్ర, కారుణ్య సాంద్ర భాస్కరవంశచంద్ర" యని మూడు కమ్మల నిండుగా ద్విపద పంక్తులున్నవి. పదేసి ఇరువదేసి

ద్విపద పంక్తులకు కలిపి కీర్తనల క్రమము ననుసరించి సంఖ్యలుగూడ వేయబడినవి. ౨౧౯, ౨౨౦, ౨౨౧ సంఖ్యలలో నున్నవి ద్విపదలే.

౮౯౨వ సంఖ్యగల కీర్తనము శవపరముగా నున్నది.

తోడిరాగం-త్రిపుటతాళం

మరచేవేలర నన్నూ, కోరిచేరితిర నిన్నూ
మరచేవేలర నమ్న, మరువవద్దుర నన్ను పరవతాల మల్లేశ్వరా॥

చ॥ రజతాచలనివాసా యెపుడు నిన్ను భజియింతు సద్విలాసా
భుజగేంద్రహార సకల భువనాధార భక్తవరదా ౧
గజచర్మాంబరధారా సకలముని స్తోత్ర
నిజముగ వరము——ద్విజరాజశేఖరా యేరా దిగ్విజయమియరా ౨
ఆనందకరమైన రాజవోలి హరి
వానిక వెంకటేశుని మానుగ సఖుడైన మల్లేశ్వరా దానునిననేలరా ౩

ఇన్నివేల కీర్తనములు రచించిన పరమభక్తాగ్రేసరుడైన ఈ ప్రభువు ఆంధ్ర వాగ్గేయకారుల శ్రేణిలో జేరదగినవాడని నామనవి.

కీర్తనములున్న ఈ రెండు తాళపత్ర సంపుటములు గూడ మిక్కిలి శిధిలావస్థలో నున్నవి. అక్కడక్కడ ఇప్పటికే చాల భాగము క్రిమిదష్టము. కొలది దినములలో గ్రంథములు నుసియైపోవునను భయముగలదు. ఇంత గేయ సంపదను సంతరించియు ఊరుపేరులు లేక మరుగువడిపోవుచున్నదీ ప్రభువు చరిత్రము. గ్రంథముల పరిస్థితినిబట్టి ఈ రచయిత పదునేడవ శతాబ్దపు చివరనో లేదా పదునెనిమిదవ శతాబ్దము పూర్వార్థముననో ఉండి యుండునని ఊహించుచున్నాను.

(గోలకొండపత్రిక 1–3–1961)

# ఆత్తాన రామానుజార్యుడు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి గద్వాల వారిచ్చిన తాళపత్ర గ్రంథములం దొకగ్రంథము మిక్కిలి శిథిలావస్థలో నున్నది. అది బాగుగా క్రిమిదష్టమైనది. దానిలో మొత్తము మూడు కృతులున్నవి. 1. శ్రీ రుక్మిణి కురవంజి, 2. సారంగధర చరిత్ర - యక్షగానము, 3. కృష్ణార్జున సంవాదము – ద్విపద. ఈ మూడింటిలో చివరికృతి నాదిండ్ల గోపమంత్రి కృతము మరియు ముద్రితము. తక్కిన రెండు కృతులును నముద్రితములు.

శ్రీ రుక్మిణి కురవంజిని రచించినది ఆత్తాను రామానుజార్యుడు. ఈ కృతికర్త దేశకాలములు దెలిసికొనుటకెట్టి యాధారములును గానరావు. ఈ కృతి మొత్తము 24 తాళపత్రములం దున్నది. మొదటి కమ్మ సగమునకు విరిగిపోవుటేగాక బాగా చిల్లులు పడినది. మిగిలిన మొదటి భాగము సగము కమ్మ ఇట్లారంభమైనది.

మాళవి॥ శ్రీ కరంబై (ఆది)లక్ష్మి జీవితేశ్వరు ఉరమునా......

ఇట్టి ప్రారంభమునుబట్టి ఈ రచనము ప్రాచీన యక్షగానములకును ప్రాచీన కొరవంజి రచనముల తెగకును చెందినదని భావింపవచ్చును. విరిగి పోయిన మొదటి కమ్మలో ఇష్టదేవతాప్రార్థనము పూర్వకవిస్తుతి మున్నగునవి ఉండియుండును. రెండవ కమ్మలో కవి తన్నుగూర్చి చెప్పుకొనినాడు. రెండవ కమ్మ ఇట్లారంభమైనది.

"...మ్రొక్కి మునిగ్రామ వానుడగు మూర్తిగలయట్టి
వనధియగు పెంద్రాజు వంశపావనుడ
ఆత్తాను సంబంధమైనట్టివాడ
ఆత్తాను రామానుజార్య పాహ్వయుడ
కరమొప్ప రుక్మిణీ కల్యాణ (న) రశ
కరమర్థిలో యక్షగానంబురీతి

కొరవంజి జేసెద కూర్మితో ననుచు
ధరణిపై మదిలోన దలచిన యంత
శ్రీరంగనాథుండు శ్రీపారిజాత
వారిధిగంభీరు వైభవాకారు
నా మదిలో నిల్పి నన్ను కరుణించి
కామితార్థము లొసగు ఘనత పెంపొంది
వరకావ్య శుభవాక్కు వాణి నాయందు
వరుసతో అమృతప్రవాహమై (వేడ్క) నేడు!
ఇచ్చిన సంతోష మింపుతో సొంపు
అచ్చతెలుగున కృతి ఆరంభమగుచు
ఆనందభరితుడై అమృతాబ్ధిగురియు
గురుతుగా శ్రీ మదనగోపాలునకును
కొరవంజి జేసెద కుంభిని వెలయ
దివ్యాంశ రుక్మిణి దేవి తా.........
.................................
నరణి తేటగ విమడి సంతోష మొదవ
కరమర్థి కొరవంజి క్రమ మెట్టిదనిన.

పై ద్విపదలవలన కృతికర్త మునిగ్రామ వాసుడనియు, పొంగ్రాజు వంశపావనుడనియు, అత్తాను (శ్రీ వైష్ణవాచార్యపీఠమువారు) వారితో సంబంధము గలవాడనియు, పేరు అత్తాను రామానుజార్యుడనియు, మదన గోపాలస్వామి కీకృతి అంకితముగా రచింపబడినదనియు మాత్రము తెలియు చున్నది. ఇంతకన్న వెక్కుడు విషయము లీగ్రంథమువలన తెలియరావు. ఈ ముని గ్రామ మెచ్చటిదో! మనదేశమున నెన్నియో మునిపల్లెలున్నవి. ఓరుగల్లు మండలమున, మహబూబునగరం మండలమున, గుంటూరు మండలమున మునిపల్లెలున్నట్లు నేనెరుగుదుము. పొంగ్రాజు ఇంటిపేరా లేక కులము పేరా? ఇంటి పేరైనచో మరల అత్తాను అను ఉపనామ మెందులకు? పొంగ్రాజు కృతికర్త తండ్రి పేరో తాత పేరో కావలెను.

గ్రంథాంతమున కృతి భర్తయగు భగవంతుని స్తోత్రము కలదు. అటుపై ఫలశ్రుతి మున్నగునవి చెప్పి ముగించినాడు.

(అళవ కమ్మ)
అని యిట్లు కొరవంజి హరుషాబ్ధి...., అనిశంబు శుభమంది అభివృద్ధిగాను
(పరమ) పావని రా(మ) పతిపేరగాంచి, వరదరాజుల పేర వనజాక్షుపేర
నరహరి శ్రీ జగన్నాయకుల పేర, పురణింపగా అష్టభుజస్వామి పేర
గురుతుగా శ్రీ మదన గోపాలునికి, విరివిగా కొరవంజి విన్నవించితిని
కరమర్థి లక్ష్మీకాంతు(ని) కృపను, గరిమతో నావాక్య ఘన పుష్పమాల
చేసితి నానేర్పు చేతనైనట్లు, వాసిగా నీ కృతివైభవంబునను
భూచక్రమందు సంపూర్ణ కళలందు, ఆ చంద్రతారార్కమగుచు వర్ధిల్లు
విశదంబుగా చదువు విన్నవారలకు, ఆయురారోగ్యంబు ఐశ్వర్యపదము
శ్రీ జయలక్ష్మి సిరులిచ్చునింట, పాయక వసియింపుభాగ్యముల్ ( )దాము
ఎన్నాళ్ళు మేరువు ఎన్నాళ్ళు జలధి, ఎన్నాళ్ళు తారలు ఎన్నాళ్ళు...
ఎన్నాళ్ళు దినమణి ఎన్నాళ్ళు...., ఎన్నాళ్ళు బ్రహ్మాండమెన్నాళ్లనిలుచు
అన్నాళ్ళు ఈ కృతి యభివృద్ధి బొందు—

ఈ కురవంజిలో జంపె, సువ్వాలలు, మంగళారతులు, ద్విపదలు, ధవళములు మున్నగు తీరుతీరుల గేయములు గలవు. ఇందున్న ధవళములో "మెత్తసముగ తలబాలునూ, మత్తూగ బోసిరి మునులూ" అని కలదు. మెత్తసము, మట్టసముగా మారినది. ఈమాటలు తెలంగాణాపున మహబూబు నగరం మండలమున నధిక ప్రచారమందున్నవి. (రాయలసీమలో వాడుక యందుండుట అందరెరిగిన విషయమే) కనుక ఈ కవి మహబూబునగరం మండలమువా డనుకొందును.

ఈతని వచనశైలి దెలియుటకై యొక యుదాహరణము. ప్రారంభమున నుదాహరించిన ద్విపద తరువాత వచన మిది.

"ఇట్లు——— బైన భూలోకమందు, జంబూద్వీపంబున విదర్భ దేశంబున, కుండినా పురిపట్టణంబు గలదు, అందునగల సకలసౌభాగ్య బల సంపన్నుండగు భీష్మకుండను రాజేంద్ర పట్టభద్రుండు సకలగుణసంపన్నుండై రాజ్యంబేలు సమయంబున అతండు సంతానంబు వడసె"—

రుక్మిణీ శ్రీకృష్ణుల వివాహసందర్భమున కొల్నములు దంచినప్పుడీ "సువ్వాల" గలదు.

కూరిమితో బంగారు కుందెనాలో కొలుచు వించి
గారవించి సతులు రోకండ్లు దంపుచూ
సువ్విరంగనాథ సువ్వి సువ్వి వెంకటేశ సువ్వి.

నువ్వి కృష్ణరాయ నువ్వి నువ్విలాలె
రామ రావె చంద్రవదన రమణి రావె చంద్రవదన
కోమలాంగు లెల్ల రారె కొట్నమందుకూ
ఆముచు పేరటాండ్ల బిలిచి హర్షములన పసుపులిచ్చి
వినుతి నొసల కుంకుమలను ఘనత బెట్టిరీ
కొలది దంస్తు(?) పట్టులమర కొంగు బంగారు మెరయ
జిలుగువన్నె చంద్రకావి చీరలిచ్చిరీ
కుసుమవువ్వ చాయరంగు కుందనంపు పూతమెరయ
పసుపుపట్టు రవికెలెల్ల పంచియిచ్చిరీ
అంత ముత్తయిదువలును హర్షమున నుప్పొంగుకొనుచు
కాంతుపీది పాటబాడ రంతుతోడనూ
వేదవేదాంత కృష్ణ ఆదివాసుదేవ కృష్ణ
నాదావినోది కృష్ణ నాథ కృష్ణా
వన్నె సన్నసూది వచ్చ గన్నెరాలు కృష్ణభోగి
సన్న రాజనాలు జీలసర్లు దంపుచూ
ఉబ్బి నిక్కి జంగజాచి ఉవిదలెల్ల చెమట జార
గబ్బిగుబ్బ లదరగాను కలయదంచిరీ
యెంచి పెండ్లి మోపు యింట______
పంచగతుల జేరి వాయించ దొణగిరీ॥___

గ్రంథమంతటను వ్రాయసకాని తప్పు లధికముగా గలవు. అవి వ్రాయసకాని తప్పులో లేదా ఆనాటి వ్యావహారికపు శైలియో తెలియరాదు. సకల అనుచోట సకళ అనియు, "ఉ" చోట "వు" వాడుటయు, చంద్రుడు లోని "చ" కారము ఎత్వముతో నుండుటయు, చేయగా అనుటకు శాయగా అనుటయు, సిరులకు శిరులును, ఉకారాంతముల తరువాత యడాగమములును కలవు.

ఒకే సంపుటమందుగల మూడు వివిధగ్రంథముల కాలమును బట్టియు, గ్రంధపరిస్థితిని, ప్రక్రియనుబట్టియు నీ ఆత్రాను రామానుజార్యుడు పదునారవ శతాబ్ది కిటీవలివాడు కాడని భావించుచున్నాను.

(గోలకొండ పత్రిక ౧-౮-1961)

# సర్వజ్ఞ పద్మనాయకభూపాలుడు

ఆత్రాను రామానుజార్యుని "శ్రీరుక్మిణి కురవంజి" తరువాత ఆదే తాళపత్ర సంపుటమున "సారంగధర చరిత్ర-యక్షగానము" గలదు. ఇది 25వ కమ్మ నుండి 54వ కమ్మవరకు మొత్తము 30 కమ్మలలో నున్నది. దీనికి కర్తసర్వజ్ఞ బిరుదాంకితుడగు ఒకానొక పద్మనాయకకుల భూపాలుడు. అతని పేరీ గ్రంథమున లేదు. కేవలము బిరుదు, కులము మరియు పదవులు మాత్రమున్నవి. తల్లిపేరు స్పష్టముగాను, తండ్రిపేరు అస్పష్టముగాను, రాజధానిపేరు స్పష్టాస్పష్టముగను నున్నవి. గురువు పేరన్నిటికన్నను కష్టముగా నున్నది.

రాచకొండ నేలిన రేచెర్లపద్మనాయకులందు రెండవ సింగభూపాలునకును మరియు మూడవ సింగభూపాలునకును సర్వజ్ఞబిరుదము లున్నట్లు మన మెరుగుదుము. ఈ వంశములో తక్కినవారికి బిరుదమున్నదో లేదో తెలియదు. సారంగధర యక్షగానకర్త ఈ యిరువురు సింగభూపాలురందొకరు కావచ్చును కాకపోవచ్చును, లేదా వీరికన్న పూర్వుడైనను కావచ్చును. ఈ తాళపత్ర గ్రంథము మిక్కిలి జీర్ణావస్థలో నున్నది. కొన్ని కొన్ని పంక్తులసలే చదువ రాకున్నవి. వ్రాత తప్పులు కూడ కుప్పలు తెప్పలుగా నున్నవి. కంటవత్తిడి కొని కొన్ని వారములీ గ్రంథమును పరిశీలించుట జరిగినది. ప్రత్యక్షరమును జాగ్రత్తగా చదివితిని. ప్రాచీనతర యక్షగానములందిది యొకటి యనుటకు సందేహ మినుమంతయును లేదు.

దీని ప్రారంభమిట్లున్నది.

అటతాళపు రేకులు

శ్రీ విభుని బూజించి వాక్పతి......। యెపుడు। నవని...పార్వతీ
శ్వరు ప్రస్తుతింతున్ 1

విఘ్నరా(జుకు) మ్రొక్కి....వాగ్వతతి నిర్విఘ్నముగ శ్రీయక్ష...(?)
వేడుకొందున్ ౨

వ్యాస(భ)ట్టార్య(ని) వాల్మీకి గొలిచి ।(మది)లో। శుగ బ్రహ్మాది
మునులకు నాంజనేయు.... ౩
పూని దత్తిల చరణకోహల శృంగవాజి ।...ల। గానశాస్త్ర ప్రబంధ
కర్తల కరుణ వడసి ౪
తివిరి బాణమయూరులను చిత్తమున నిలిపి తక్కిన కవివరేణ్యులెల్ల
ద(.). యు. మొనంగి॥

పై యటతాళపు రేకులందు మొదటి చరణమున త్రిమూర్తులను, రెండవ చరణమున విఘ్నేశ్వరుని మరియు నెవరినో వేడికొన్నాడు. మూడవ చరణమున వ్యాసవాల్మీకులను గొలిచినాడు. ఆ చరణముననే శుగబ్రహ్మాదులను(?) స్మరించినాడు. ఈతడు శుకుడో మరియెవడో? అటు తరువాత ఆంజనేయుని స్మరించినాడు. ఆంజనేయుడు పూర్వభరతాచార్యులందొకడు కదా? అంజనేయుడిచట భరతాచార్యుడుగ స్మరింపబడినాడో కాక దైవతముగా స్మరింపబడినాడో తెలియదు. నాల్గవ చరణమున దత్తిలాది భరతాచార్యులు స్మరింపబడినారు. "దత్తిల" తరువాత "చరణ"యని కలదు. తరువాత "కోహల"యో కోమలయో సరిగా తెలియరాకున్నది. కోహలుడని భావించుచున్నాను. కోహలుడొక భరతాచార్యుడని ప్రసిద్ధమే కదా। ఐదవ చరణమున కేవలము బాణమయూరుల నామములు మాత్రము పేర్కొనబడినవి. కాళిదాసాది మహాకవుల యూసేలేదు. రెండవ సర్వజ్ఞ సింగభూపాలుడు రసార్ణవ సుధాకర, సంగీత సుధాకరములకు కర్త. ఒకవేళ ఆ సర్వజ్ఞుడే ఈతడగునో యేమో। కానిచో దత్తిల, కోహల, ఆంజనేయాది గానశాస్త్ర ప్రబంధకర్తల స్మరణమెందులకుండును?

ఇష్టదేవతాస్తోత్రాదికములున్నట్టి ఈ యటతాళపు రేకుల తరువాత ॥ద్విపద॥ అని వ్రాసి "రాదిబెగుంట్ల వీరభద్రా" యని యున్నది. నిజమునకిది ద్విపదగా చేరినదికాదు. దీని తరువాతనే ద్విపద అని వ్రాయవలసియుండెను. ఈ రాదిబెగుంట్ల యెచ్చటిదో తెలియదు. ద్విపదపంక్తులందలి తప్పులు దిద్దక ఉన్నదున్నట్లుగా పేర్కొనుచున్నాను.

అంద్దర సీభంగి అభినుతిచేసి-ఋంద్దిరావరుచేత యింద్దరు మెచ్చ
కవి(.) మహాలక్ష్మీకరు భక్తి(చే)శ్రీ-భువి కావ్యలను మెచ్చె పూజ్యుడై సభల

మించి(న)కవి మహామేటి నం(సా)రి-అంచితగమపురాణతిక సహసా
వీణాదినంగీతవి (ద్యావి)నోది-వాణి వివేకది వరచక్రవర్తి
సహజ విక్రమకీర్తి సర్వజ్ఞమూర్తి-బహుమాన పురుషుండు పద్మనాయకుడు
కడునొప్పసౌరంగ్గికతదిగంతముల-పుదమీశ్వరులు మెచ్చబుధులు చెరియింప
సరసులుగొనియాడ జాణలౌననగ-సరసపదోత్కళిత (క?) చౌపదద్విపద
వి (ప్ర)త్రపద (భా)షా........దవాగ్వి (గ్వి)త్ర-వృత్తి బంధంబుల
వినిపింపుగాగ
చెప్పెను ధరలోన చిరకీర్తి వెలయ-అప్పుణ్య చరిత తానది యెట్టిదనిన"

ఈ ద్విపదపంక్తుల తరువాత రాజమహేంద్రవర పట్టణము-అచటి రాజరాజనరేంద్రుని వర్ణనములో వచనము ప్రారంభమైనది. ఇచటినుండి 54వ కమ్మ మొదటివైపువరకును సారంగధర చరిత్రము (సారంగధరునకు సిద్ధుని మహిమచే నరుకబడిన కాలు సేతులు మరలవచ్చుదనుకనున్న శుభాంతమైన కథ యంతయు) కలదు. రెండవవైపున గ్రంథాంతమందుండు ద్విపద పంక్తులును ఫలశ్రుతియును గలవు.

"....................—శ్రీకరంబుగ (..)నృపచెంద్రునకుమ
కాచటుదేవికి గారాబునుతుడు-ఆచారమణి భట్టరయ్య శ్రీపాద
వంకజభ్రమరా................................న్న వాచు
మానగుణాఢ్యు డుమాచటేశ్వరుడు-నానార్థశబ్ద (...)యక్రియ లమర
రచియించె చిరకీర్తి...రుచులు వెలయ...చెరితమది విన్నజనులకెల్ల"
...

॥వచనము॥ — "ధనకనకవస్తువాహనసమృద్ధి వడశి। (..) మోజ్యల గుణసంతానమున వరలు నిత్యమై విజయలక్ష్మి గలిగి।.......లక్ష్మి పరిపూర్ణమై సంపదల మిన్నంద్ది।సంతోషము యల్లకాలము గలిగి। దంపతులు (...) తురు దుర్దశలు లేక శతహరమై సఫలమై। ఆస్థానజయమై। మన్నన ప్రతాపమై। నుతికెక్కుదురు। భూపతులు సభలందు। ఆయురారోగ్యములు అందందు శుభములు పాయక అనిశంబు చెందుగాన పా....... (శిథిలము)
............."

కథా ప్రారంభమునకు పూర్వమును, కథాంతము తరువాతనుగల ద్విపద పంక్తులను పైన నుదాహరించితిని. సారంగధరచరిత్ర యక్షగానమును రచించిన ఈ కృతికర్త చరిత్రమంతయు నీ ద్విపదల సాహాయ్యముననే తెలిసికొనవలయును. ఇంతకన్న మిక్కిలి మనకు ఉపకరించు వస్తువు ఈ గ్రంథమున కానరాదు.

కథాప్రారంభమునకు పూర్వమున్న ద్విపదపంక్తు లాధారముగా నీ కృతికర్త అగనుపురాణేతిహాసములందేకాక వీణాదిసంగీత విద్యావినోది, వాణీవివేకాదివరచక్రవర్తి, సహజవిక్రమకీర్తి, సర్వజ్ఞమూర్తి, పద్మనాయకుడు. రేచెర్ల ద్వితీయ తృతీయ సింగను నాయకులకు సర్వజ్ఞ బిరుదము లున్నవి. ఈ కృతికర్తకూడ సర్వజ్ఞుడు. పై యిరువురు సింగమనాయకులం దీతడొకడగు ననుకొందమన్న కథాంతమున నున్న ద్విపదపంక్తులందున్న తలిదండ్రుల పేర్లు కుదురకున్నవి.. సర్వజ్ఞ బిరుదాంచితుడైన మూడవ సింగభూపాలుడు భోగినీదండకము నమసరించి పోచమాంబాలసద్గర్భసంజాతుడు మరియు కుమారాన్నపోతావనీనాథసూనుడు. రెండవ సింగభూపాలకుడన్ననో ఎఱదాచానేనికిని పోచమదేవులకుమ ప్రథమ పుత్రుడని వెలుగోటివారి వంశావళి సాక్ష్యమిచ్చుచున్నది. ఇక మన కృతికర్త తలిదండ్రులనుగూర్చి విచారింతము. ఈతడు "కాచమదేవికి గారాబుసుతుడు" పైన పేర్కొనబడిన ఇరువురు సింగభూపాలుర తల్లుల పేర్లు పోచమలు. పోచమ యనుటకు మారుగా కాచమ యన్నాడేమో యనుకొందమన్న కాచమ - గారాబు అని యతిస్థానమున ప్రయోగమున్నది. తండ్రి పేరైనను మన దురదృష్టమున సరిగా లభింపదాయెను. "శ్రీకరంబుగ (...) నృపచెంద్రునకును" అని కలదు. కొన్ని శాసనములందువలె మనకెచ్చట యవసరమో అచ్చటనే ఈ గ్రంథము శిథిలముగా నున్నది. క్రిమిదష్టములైన ఈ రెండక్షరములను "దెస" యనిగాని "బిన్న" యనిగాని చదువుటకు వీలున్నది. దాచానాయుడనియు దేచానాయుడనియు ఎఱ్ఱదాచానాయనికి మారుపేరులు. "దేచ" శబ్దము మన గ్రంథమున శిథిలమై "దెస"గా నగుపడుచున్నదేమో యనుకొందమన్న పోచమ - కాచమలకు పోటీ పడుచున్నది. కనుక తల్లిదండ్రులపేర్ల సాయమున నీకృతికర్త చరిత్రమును సింగభూపాలద్వితయమునకు ముడిపెట్టజాలకున్నాము. మొదటి సింగభూపాలునకుగూడ సర్వజ్ఞబిరుదముండెనో లేదో? ఉన్నట్లింత

వరకేమియు సాక్ష్యము గానరాదు. అసలు మన చారిత్రకు లీ బిరుదమును ద్వితీయతృతీయసింగమనాయకు లందొకరికే ఈయవలయు ననుచున్నారు. మనకిష్టము వచ్చిన వారికెల్ల బిరుదులిచ్చుటకు వీరాధునికులు కారు గదా।

కాచమదేవికి గారాబు సుతుడనని చెప్పుకొనిన కృతికర్త తన గురువును స్మరించి మనకు కొంత మేలుచేసినాడు. "ఆచారమణి భట్టరయ్య శ్రీపాద పంకజ"ము లితడారాధించినాడట. ఆచార్యమణి యనుటకు మారుగా ఆచారమణియని వ్రాయసకాడు వ్రాసియుండును. ఈ భట్టరుల వారెవరు? కోదుకొండకు వేంచేసిన పరాశరభట్టరులే ఈ భట్టరయ్య యని నేనూహించుచున్నాను. కథాంతమందలి యీ ద్విపదలలో కవి తనను గూర్చి మరియొక విషయమును చెప్పినాడు. కృతికర్త "మానగుణాఢ్యుడుమాచలేశ్వరుడు". ఈ యుమాచల మెచ్చటిది? ఇది యాతని రాజధాని కావలెనుగదా। రాచకొండ నేలిన పద్మనాయకులకు మొదటిరాజధాని అనుమనగల్లు, దీనినే "అమ్మవగల్లు" అందురు. ఉమాచలమనునది అమ్మనగల్లుకు సంస్కృతీకరణమా? అటులైనచో నీ యక్షగానము పుట్టుక రాచకొండదుర్గము పుట్టుకకన్న ముందునకు బోవును ఉమాచలమునుగూర్చి మరియొక యూహ. శ్రీశైలమున కుత్తర ద్వారమగు ఉమామహేశ్వరమే ఉమాచలము కావచ్చును. అచటి కొండను ఉమాగిరి యందురట. కొండపైనను క్రిందను శివాలయము లున్నవట. కొండ క్రిందనున్న దేవాలయమే ఉమామహేశ్వరదేవాలయము. అచట కాకతి రుద్రమదేవికాలపు శాసనమున్నట్లును, రేచెర్ల మాధవేంద్రుడు వేయించిన (శకవర్షములు 1298 ఫాల్గుణము క్రీ శ. 1376) శాసనమున్నట్లును పూజ్యులు శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు తెలుపుచున్నారు. (సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము 2వ సంపుటము పుట 245) ఈ శాసనము కీ. శే. వెల్లాల సదాశివ శాస్త్రి మరియు అవధానము శేషశాస్త్రి గారలు రచించిన వెలుగోటివారి వంశ చరిత్రము అనుబంధమున (పుటలు 31-38) ప్రకటింపబడినది. ఈ మాధవ నృపాలుడే రేచెర్లవంశమున నారవతరమువాడగు మాదానేడు. ఈతడు మొదటి సింగమనాయనికి పుత్రుడు మరియు అనపోతానేనికి తమ్ముడు. ఈ యిరువురు సోదరుల పరాక్రమాతిశయములు విజయములు వెలుగోటివారి వంశావళిలో విపులముగా వర్ణింపబడినవి. "దాచయ సింగభూపతి సుతుండైన మేదినీరూపనారాయణ సింగమాంబాగర్భపుణ్యోదయ రేచెర్లవంశ దుగ్ధాబ్ధి

సుధాకరుండైన శ్రీ మాధవేంద్రుండు దేవనగదక్షిణప్రాంతమందుల స్వనామాంకితమైన మాధవపురమందు ప్రాజ్యరాజ్యోపవిష్టుండై" శాసనము వేయించినట్లు తెలియుచున్నది. వెలమరాజ్యము ప్రారంభమున మాధవనృపతికి ఉమాచలము సమీపమున గల మాధవపురము రాజధాని. రాజ్యము పెరిగిన తరువాత అన్నయగు అనపోతానాయునికి రాచకొండయును, తమ్ముడగు మాధవనృపతికి దేవరకొండయును రాజధానులైనవి. మాధవనృపతి మాధవపురమును తానే పొందించి తన రాజధానిగా నిర్ణయించుకొనెను. ఈతని పూర్వులకు బహుశః ఉమాచలమే అనగా ఉమామహేశ్వరమే రాజధాని కావలయునుగదా। పైన నుదాహరించిన ప్రబలకారణము లాధారముగా నుమామహేశ్వరమునే యుమాచలముగా భావించుట సమంజసమని నా యభిప్రాయము. ఏతీరుగా జూచినను మన కృతికర్త మాధవనృపాలునికి పూర్వుడే కావలయును. మాధవనృపాలుని తండ్రి మొదటి సింగమనీడని మనవిచేసితిని. ఈతడే మన యక్షగాన రచయిత కావలెను. ఈతనికి కూడ సర్వజ్ఞబిరుదముండవలయును. ఈవిధముగా రేచర్లవంశమున ముగ్గురు సింగ భూపాలురకును నీ సర్వజ్ఞబిరుదమున్నట్లు భావింపవలెను. ఈవిధముగా నీ యక్షగానము పుట్టుక పదునాల్గవ శతాబ్దము మధ్యభాగమునకు పోవుచున్నది. ఈ యూహయంతయు నిదివరకుదాహరించిన ద్విపదపంక్తు లాధారముగా చేసినది. నిజానిజములు చారిత్రకపరిశోధకులు తేల్చవలెను.

ఇక సారంగధరకథనుగూర్చి విచారింతము. ఆంధ్రభారతమును వ్రాయించిన కీర్తితోపాటు రాజరాజనరేంద్రునకు కొడుకు కాలుసేతులు నరికించిన యపకీర్తియు తెలుగువా రంటగట్టినారు. చంద్రవంశమున జన్మించుటచే గాబోలు రాజరాజునకి యశస్సుతోపాటు కళంకమును తప్ప దయ్యెను. చారిత్రకులిది యసత్యమన్నను సారంగధరుని దిబ్బలు, చిత్రాంగి మేతలు రాజమహేంద్రవరమున శాశ్వతత్వమును గడించుకొన్నవి. గౌరన మంత్రి చిత్రాంగి సారంగధరుల వృత్తాంతము మాళవదేశమున జరిగినట్లు వ్రాసెను. రాజమహేంద్రుడు మాళవదేశమునకు రాజని గౌరన మంత్రి స్పష్టముగా వ్రాసెను. చేమకూర వెంకటరాజు పొరపడి రాజమహేంద్రుడును రాజరాజనరేంద్రుడును ఒకరేయని తోచునట్లు వ్రాసెను. ఇక కాకునూరి యప్పకవిమాత్ర మీకథయంతయు రాజమహేంద్రవరమున

రాజనరేంద్రుని యంతఃపురమున జరిగినట్లే బాహాటముగా వ్రాసెను. మనము ప్రాచీనుడనుకొనుచున్న ఈ యక్షగానకర్తయగు "సర్వజ్ఞుడు" కూడ రాజమహేంద్రవరపురమున జరిగినట్లే ఈ కథను చిత్రించినాడు. నేనూహించినట్లు గౌరనకు పూర్వుడో లేదా సమకాలికుడో కావలసిన ఈ సర్వజ్ఞుడు గౌరనవలెగాక అప్పకవివలె వ్రాయుట నా యూహకు మిక్కిలి బాధకముగా నున్నది.

కథాప్రారంభమునకు పూర్వమున మన్న ద్విపదపంక్తుల నిదివర కుట్టంకించితిని. వాని తరువాత వచన మిట్లున్నది.

"॥వచనం॥ భూలోకమందు పట్టణశ్రేష్ఠమైన రాజమహేంద్రవరము। ఆ రాజమహేంద్రవర పురమేలు రాజు రాజనరేంద్రుడు। ఆ రాజనరేంద్రునకు పట్టపుదేవులు పెద్ద పెండ్లాము రత్నాంగి చిన్న పెండ్లాము మోహపుదేవి చిత్రాంగిన్ని అయివుండగాను అ పెద్దపెండ్లాము రత్నాంగికి బిడ్డలు లేక పెద్దకాలము పెక్కు నోములు నోచి (కన్న) కుమారుండు సర్వలక్షణ సంపన్నుండైన సారంగధరుండు ఆతని గుణకతనాలు విన నౌధరింపుడా"—

సారంగధరుని రూపగుణసంపదలు తరువాత వచ్చు ఆటతాళపు రేకులందు బాగుగా వర్ణింపబడినవి.

సారంగధరుడు విడిచిన పావురము చిత్రాంగి మేడలోనికి పోయినపు డచటికి పోవచ్చునో లేదో యని సారంగధరు డాలోచించు సందర్భమున నిట్లున్నది:

జంపె రేకులు:—

"ప్రేమతో పక్షి మాపినతల్లినగరా। (అ) మేడపైవాలె (అ)ట బోయి
పిన్నమా యనిపోయి ప్రియమునమ గొంత్తా। మన్నింపు...గోరుత....మనో!
అటుగాక సవతి కొడుకని నమ్మ గి.నుక। కుటిలాత్రియై పలుకకుండునో
ఇట్టియెడ పావురము నిడి(చి)తియు నేని। తిట్టునో మదికరుణ బుట్టునో
యిట్లు వెరవక యిల్లు చొచ్చిననంచు। (.)ట్టుగా పతికేమి సెప్పునో
వలనెరిగి యీ పావురము దేమపాయంబు। ఘమలని చెప్పరే...లారా॥"

సారంగధరుని నేరమును విచారించి శిక్షవిధించినప్పటి వచనమిట్లున్నది

"అంతట ధర్మాసనమువారి అనుసులానచేశి। కోదుపలీనని మోహ (భీరర?) కి తాత్పర్యంబులు విడిచి। వీడు పాపఖర్ముండు। చిత్రాంగి యింటికి నడిచిన కాళ్లున్ను పట్టుకొన్న చేతులున్ను అర్ధరాత్రి సమయమపుడు అడివిలోకి కొంపోయి నరికిరందసిన తల(వ)రులవారు వచ్చి సారంగధరునితో యేమను చున్నారు వినవొధరించుడా"—

తలవరులమాట ఉత్కళికలందు చెప్పబడినవి.

"వుభయకులపావమడగా వుద్భవించి। పరగిన। సుభగుణోజ్వల సజ్జనుడ
రాసుతుడ నిన్నూ
చంపుమని మీ తండ్రి ముద్రిక నత్వరమునా। యిచ్చియు। పంపినాడిది
చూదుమా భూపాలతనయా
పమ్నగా తలిదండ్రులెయెడ భక్తిచేసి। వుండెడి। అన్న నీకిపావ మిటువలె
నబ్బె తండ్రీ
భక్తితో భరుచయ్యన కలిభక్తిచేసి। కొలువగ। భోక్తలేదే మాకు నీకును వో
పుణ్యపురుషా
యిట్టి యినుకడెహ మిటవలె బుట్టియిపుడు। బలిమిని। కట్టుమన నెట్లాడెనో
ఘనుడ నిన్నూ
గాన రాజనరేంద్రునానతి గడువరాదు। నిర్దయు। పూని చంపగ వలెనో
వో ఘనుడ నిన్నూ
అయ్య యిదిగో రాజు మనసు లరళిచూచి। పోయిరి। దయ్యనను పయనంబు
గావలె సజ్జమందా"—

సర్వజ్ఞుని శైలియు నీ యక్షగాన సరణియు తెలిసికొనుటకు నింతవర కుద్ధరించి యుదాహరింపబడిన భాగములు చాలుననుకొందును.

నేనూహించినట్లిది ప్రాచీనతమయక్షగానమగునో కాదో ఈ సర్వజ్ఞుడు రేచెర్ల వంశజుడగునో కాదో పెద్దలు మరియు పరిశోధకులు నిర్ణయించవలెను.

(గోలకొండ పత్రిక 17–3–1961)

# ఏదుట్ల శేషాచలుడు

గద్వాల సంస్థానాధీశ్వరు లాంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారికిచ్చిన యమూల్య గ్రంథములందు జగన్నాటక మొకటి. ఈ మహాకావ్యమునకు కర్త యేదుట్ల శేషాచలుడు. లయగ్రాహి గరుడాచల కవిని గూర్చి వ్రాసినప్పు డాతడు పూర్వకవిస్తుతిలో మురారిని స్మరించిన సందర్భమున జగన్నాటక మను మాట ప్రసక్తి వచ్చియుండెను. జగన్నాటకమనునది మనకు లభింపని మురారి రచనములందొకటియై యుండునని యూహించితిని.కాని నాయూహ నిజమైనది కాదు. శేషాచలుడు రచించినది అంధ్రీకరణము గాదు. ఇది యీతని స్వతంత్రకావ్యమే. అనువాదమైనచో నీతడు తానమవాదము చేసినట్లు చెప్పు కొనవలెనుగదా। అట్టి ప్రసక్తి యేమియు నీ గ్రంథమున కానరాదు.

శేషాచలుడు సంగీతసాహిత్యభరతశాస్త్రాదిసకలకళాప్రవీణుడు. కౌండిన్యసగోత్రుడు, చెన్నయ పండితుని పౌత్రుడు మరియు నాగేశ్వర (నాగభూషణ) పండితుని పుత్రుడు. వనపర్తి సంస్థానములో, వనపర్తి చెంత గల ఖిల్లా గణపుర నివాసి. ఈతని పూర్వికులు ఏదుట్లనుండి ఖిల్లాగణపురము నకు వచ్చియుందురు. కనుకనే వీరి యింటి పేరు ఏదుట్ల వారైనది. ఏదుట్ల గ్రామము ఝటప్రోలు సంస్థానములోనిది. పూర్వకవి సంస్తుతిలో నీతడు పింగళి సూరనార్యునికూడ స్మరించుటచే నీతడు సూరనార్యుని తరువాత నున్న వాడనుట నిశ్చయము.

ఈ తాళపత్రగ్రంథమున రెండు కృతులున్నవి. మొదటిది జగ న్నాటకమను నైదాశ్వాసముల కావ్యము ౧౫౦ కమ్మలందున్నది. అటు తరువాత బారిగడ్పుల నృసింహశతకమను మరియొకకృతి యున్నది. బారిగడ్పుల నృసింహస్వామి సింగపట్టణమున నున్న ఝటప్రోలు సంస్థానా ధీశ్వరుల యిలువేలుపు. ఈ దైవతమును గూర్చి యిదివరకు బారిగడుపుల

ధర్మయామాత్యునిగూర్చి వ్రాసిన వ్యాసమందును, శేషభట్టరు సింగరాచార్యులగూర్చి వ్రాసిన వ్యాసమందును, కొలదిగ ప్రస్తావించి యుంటిని. శేషాచలుని పైరెండు కృతులును నొకే తాళపత్ర గ్రంథమందుండుటచే నిది మూలప్రతి గాబోలునని నాయూహ. ఈ గ్రంథము మిక్కలి జీర్ణావస్థలో నున్నది. చాల భాగము శిథిలమై పోయినది.

జగన్నాటకము ప్రారంభమున గల పద్యము

శా॥ శ్రీ సీతాస్తనమండలంబున వర శ్రీగంధమున్ బూసి (సా)
భ్యానంబౌ తన విశ్వరూపము కడున్ భద్రంబుగా వ్రాసి యో
హో సాధ్వీ (బ్ర)హ్మ భాతమయ్యెనని నర్మోక్తుల్ వచారింపుచున్
హాసక్రీడలు నల్పు రాఘవుడు కృత్యాదిన్ కృపన్ బ్రోవుతన్.

రెండవ పద్యమున సీతాదేవిని, మూడు నాల్గు పద్యములందు శివపార్వతులను, ఐదు ఆరు పద్యములందు బ్రహ్మ సరస్వతులను, ఏడు ఎనిమిది పద్యములందు విఘ్నేశ్వరుని, తొమ్మిదవ పద్యమున నాంజనేయుని, పదియవ పద్యమున ననంతుని, పదునొకొండవ పద్యమున నవగ్రహములను, పండ్రెండవ పద్యమున నష్టదిక్పాలురను, పదమూడవ పద్యమున గురుదేవుని, పదునాల్గవ పద్యమున మునిజనమును, పదునేనవ పద్యమున ధ్రువుని స్తుతించినాడు. ఈ దేవతాధికస్తోత్రపద్ధతియం దీతడొక క్రొత్త విధానము నవలంబించినట్లు తెలియుచున్నది. నవగ్రహములను, అష్టదిక్పాలురను, 45గురు మునులను, ధ్రువుని పూర్వాంధ్రకవులు స్తుతించి యుండలేదు. ఈ స్తోత్రాధిక మీతని కావ్యార్థమునకు సూచికగా భావింపవలెను. ఆంజనేయ స్తోత్రమిట్లున్నది.

సీ॥ ఏ మహాసత్త్వుండు రామకార్యంబున గిరులెల్ల నచ్చనగిల్లలాడె
ఏ బలప్రఖ్యాతు దేడువారాసులు కాల్వలరీతి లంఘనము జేసె
ఏ సింహవిక్రముం డెలమి రక్షఃకుంజరాలి సీగలరీతి నణచిపుచ్చె
ఏ మహాసమకాయు డింద్రారి ఖండించు వేళ తారలు కటి వేల బెరగె

దారగిరి చాలనక్రియాదక్షశక్తి
పాత సౌమిత్రి జీవమే ప్రభుడొనంగె
నట్టి గుణవంతు ధీమంతు నధికకాంతు
ప్రకట జయవంతు హనుమంతు బ్రస్తుతింతు. (౯)

దేవతాస్తోత్రము తరువాత పూర్వకవు లందరివలె నీతడుగూడ సుకవి ప్రశంసయు, కుకవి నిందయు చేసినాడు ఆటుపైన తన వంశావతారమును చెప్పుకొనినాడు. గురుస్తోత్ర సందర్భమున తన గురువు పేరు సూచింపలేదు. కేవలము గురుదేవుడనినాడు.

గీ॥ అమర మంత్రోపదేశంబు విమలతయును
పుణ్యజనవర్ధనంబును బుధసమీవ
వర్తనపు కావ్యచింత యవ్యయనివాస
మదరు శ్రీ గురుదేవు నే నభినుతింతు.

గురువుపేరు కంఠోక్తిగా చెప్పబడకుండుటగూడ ఈ కవి యాధ్యాత్మిక దృష్టిని మరియు నీ జగన్నాటక కావ్య ప్రత్యేకతను చాటుచున్నది. పదునైదు పద్యములందీ కవి వంశావతారమున్నది. దాని ననుసరించి శేషాచల కవి వంశ మిట్లున్నది.



తాత ముత్తాతలను చెప్పినచోట వారి గ్రామనామము ప్రసక్తి లేదు. కాని తండ్రుల తరమును చెప్పునప్పుడు వారు "ఖిల్లాగణపురమందిరు" లని చెప్పినాడు. కనుకనే వీరిపూర్వులు మొదట ఏదుట్లలో నుండియుందురనియు తరువాత గణపురమునకు వచ్చియుందురనియు నూహించితిని. వంశావతార వర్ణనమందు చివరన తనసుగూర్చి కవి చెప్పుకొన్న పద్యమీరీతిగా నున్నది.

మ॥ వర కౌండిన్యకులోద్భవుండ గుదుసేవా ప్రీతుడన్ చెన్నయ
స్థిర నత్పౌత్రుడ నాగశాస్త్రిసుతుడన్ శేషాచలాఖ్యాతిచే
నరయన్ భూమి సురాశిషంబులను మేలైయుందు నేదుట్ల స
ద్వర వంశార్భకుడన్ సమస్తజననాథశ్రేణి సంపూజ్యుడన్.

ఈ పద్యము తరువాతగల వచనముమబట్టి మనమీతని గ్రంథప్రణాళిక నవగతము చేసికొనవచ్చును. ఆ వచన మచ్చటచ్చట శిథిలముగానున్నను దాని నుదాహరించుచున్నాము.

"వ॥ ఇట్టియే నాబాల్య ప్రభృతి శ్రీరామచంద్ర చరణారవింద మకరందబిందు కందళిత రసాస్వాదన కౌతూహల శుంభద్భృమద్భృమిర డింభాయమాన మాననుండనై యొక్కనాడు మఖశయ్యాతలంబున నిద్దుర జెందియున్న నరుణోదయ సమయంబున న్స్వప్నంబునందు నర్ధ (నారీశ్వ?) రుండును తద్దక్షిణ భాగంబున నొక్క శ్రీ వైష్ణవుండును తత్పురో భాగంబున సకలభూషా విశేషాలంకారిణియై విభూతి సిందూర రేఖాంచిత ఫాలఫలకయునై శిరంబున కిరీటంబు బెట్టి (చేత) వేణువునూని, వైశాఖ స్థా(న) కంబున నిలిచి(...)టంబు సలుపుచున్నొక దివ్యశక్తియు నన్నిట శివుడున్నాడని (.) తంబుగ్గడించిన నర్ధనారీశ్వరుండు హారేరామ గోవిందాయని యంచ నుడువులు నుడువుచున్న యవసరంబున నపూర్వ వర్తనంబిది యేమొకోయని స్వప్న జాగ్ర (.) కుండనై తద్దక్షిణ భాగ నివా(సి) శ్రీవైష్ణవ చక్రవర్తి నడిగిన నతదు జగన్నాటకం బిటువంటి దే యని యానతిచ్చిన దిగ్గున మేల్కానిన యనంతరంబు(న) నీ గ్రంథ సరణికి (.........) గలిగె నా శ్రీవైష్ణవసార్వభౌము(డు)ను శ్రీరామస్వామి యని పెద్దలానతిచ్చిరి గావున నస్మద్వంశ పరంపరా నుష్ఠానాధిదేవత యతండే కావున తదంకితంబుగా ప్రబంధంబు సేయం

బూనిన నతండు హృత్పద్మ కర్ణికాస్థాన నివాసుండై యిట్లు పలికింప దొడంగె" —

దీని తరువాత షష్ఠ్యంతములున్నవి అటు తరువాత భాగమిట్లున్నది.

"వ॥ సాష్టాంగ దండ ప్రణామం బాచరించి

ఉ॥ ఈ మ(హి) గద్య పద్యముల నింపె (సలా)రు కృతుల్ జెలంగ నే
నామహనీయ కావ్యము(న) కంజలి జేసి నుతించి మ్రొక్కి శ్రీ
రామపదారవింద మకరందముతో (తుల)దూ(గునీ...)
........ ముల గూర్చితి భక్తిర (సై)క (ని)ష్ఠచే" —

పై పద్యమున శేషాచలుని కృతికి మూలమేదైన సూచింపబడినదో లేదో తెలియదు. అటుపై కథారంభమైనది.

"వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన భరత శాస్త్రాధ్యాత్మ విద్యానుసారంబైన జగన్నాటకంబునకు కథా సూత్రంబెట్టిదనిన

ఉ॥ శ్రీమ దనంతుడాద్య(డును) నే(వి)తు దచ్యుతు డాద్య దద్వయుం
డై మహనీయతేజమున నాదియునంతము లేక స్వప్రకా
శామిత (మై)న యిచ్ఛమ మహత్వము సేయుటకై నిరంకుశ
ప్రేమను ప్రొద్దు బుచ్చుటకు బేర్కొని కల్పన (గా?) నొనర్చె దాన్.

ఉ॥ మేట(గ విశ్వ?)రూపుడు నమేయగుణుండగునట్టి బ్రహ్మజం
జాటము (మీ) ర (నొ) ప్పగ నజస్రము (....)టకై బనర్చె నీ
నాటక మాటకుందగిన (నా) ణెములైనటువంటి వస్తువుల్
దీటు కొనంగజేసె నతిధీరత నా (- -) దంబు నొందగన్.

క॥ వడిగల తాండవ మనగా
కడువడి లాస్యంబనంగ ఘనమగునీ రెం
డడరించిపీ ( . . ) దగి ( . )
నదలక (సామాజి)కంబు నంపాదించెన్.

క॥ వరతాండవ నటనమునకు
పురుషుడువలె లాస్యనృత్యమునకు చతురయై

నరసికయగు సతిగావతె
నిర (పుగ) నీ యిచ్ఛ (....) ములు జూచెన్"—

ఇట్లు చూచినంత నొక సువ్యక్త మిధునం బావిర్భవించుటయు వారి వలన సకలసామాజికోత్పత్తి గలుగుటయు సమస్తసృష్టియు క్రమముగా చెప్పబడినవి. ఆశ్వాసము ముగియుననగా నొక వచనమిట్లున్నది.

"వ॥ అని పలికి విదూషకుండు విశ్వేశ్వరునకు దండప్రణామంబు లాచరించి పతాకతల సంశ్లిష్టంబైన అంజలి(హారంబు) నిటలతటంబున ఘటియించి సామాజిక స్తవంబు సేయందలంచి"—

ఈ సామాజిక స్తవము స్రగ్విణి, పంచచారము, వనమయూరము భుజంగప్రయాతము, దోదకము, మత్తకోకిల, వృత్తములందున్నది. వాని తరువాత

"వ॥ ఇట్లు సమస్తదేవతా స్తవంబులు సేయుచున్న యవసరంబున సూత్రధారుండు సమయోచితంబైన జగన్నాటకం(బునకు) నాదికారణంబైన పాత్రము వచ్చుట యోగ్యంబైన గీతంబుగ్గడించుమనిన మహాప్రసాదంబని విదూషకుండిట్లని తలంచె"—అని కలదు.

ఆటుపైనొకచూర్ణికయు, ఆశ్వాసాంతపద్యములునుగలవు. ఆశ్వాసాంత గద్యములం దాయా ఆశ్వాసములందున్న కథాంశము లన్నియు క్లుప్తముగా చెప్పబడినవి.

I ఇతి శ్రీమద్రామచంద్ర కరుణాకటాక్షవీక్షణలబ్ధ కవితాపాత్ర, అనన్తంబసూత్ర కౌండిన్యసగోత్ర పవిత్ర యేదుట్ల చెన్నయాభిధాన పౌత్ర, నాగేశ్వరాంతర్వాణి పుత్ర, సంగీతసాహిత్యభరతశాస్త్రాది సకలకళాప్రవీణ, విద్వజ్జనవిధేయ, శేషాచల నామధేయ ప్రణీతంబైన జగన్నాటకంబను మహాకావ్యంబునందు అనుక్రమణికయు సత్స్వరూపుడైన పరబ్రహ్మయందు జీవప్రకృత్యాది జననంబును, నతండు వినోదార్థంబుగా భరతశాస్త్రానురూపాధ్యాత్మవిద్యానుసారంబుగా ప్రపంచనాటకంబారంభించుటయు తద్భరతంబునందుత్రివిధాండంబులు బుట్టి వికసించిన తద్భూతత్రిశక్తి త్రిమూర్తు లన్యోన్య పరిగ్రహ సామర్థ్యంబున నాట్య సామాజిక సంపత్తి నా పరబ్రహ్మనిదేశంబున

నిరూపితులై నిలుచుటయు తత్పరమేశ్వరుండు సభాసదనంబు గల్పించి పేరోగలంబు (న్న) సమయంబున మార్దంగికాది సామాజిక జనంబు నతనిం బ్రశంసించుటయు బుద్ధి విదూషకుండు మునసూత్ర ధారి యనుమతంబున విప్రమాతృకాగమన సూచనంబు సేయుటయు నను కథలు గల ప్రథమాశ్వాసము"—

II "......విప్రమాతృకాగమనంబును, ఆయ(.........)ంబు వాచికాభి నయంబున జెప్పు (.......) దను గమ్యమానులైన విప్రులు వేద శ్రౌతజ్యౌతిషసాముద్రికశకునస్వప్నసాహిత్యవైద్యాదివిద్యలు ప్రసం గించుటయు, క. (.......) దాల్చి ఆంగికాభినయంబు (........) యించుటయు, తత్పురోభాగంబున చతురంగబలసమేతులై రాజ మంత్రులు చనుదెంచి తమ తమ .... టయు .... నాట్యాభినయంబులు నలుపుటయు, మాగధులు స్తోత్రంబులు చేయుటయు, వైశ్యమాతృక యేతెంచి యాహార్యంబున నభినయించుటయుతద్వ్యవహారగోత్రమాతుల కన్యకావివాహనిర్ణయంబులును,శూద్రమాతృకచనుదెంచి సాత్వికంబున నభినయించి....వర్ణభేదంబులు దెలుపుటయు, (స)కల శక్తిప్రకారంబు సేయుటయు నను కథలుంగల ద్వితీయాశ్వాసము.

II "..........మహాకావ్యంబునందు నహంకారుండు మమకారియను భార్యతో సమేతుండైవచ్చి తన ప్రభావంబు వక్కాణించుటయు, మోహుం డేతెంచి తన స్థితి జెప్పుటయు, (కా)మాగమనంబును (ర)తి వర్ణనంబును, లోభుండు తృష్ణయను పత్నితోడం గూడి చనుదెంచి తన నడక చెప్పుటయు క్రోధుండు హింసయను మహిషీసహితంబుగా మద మత్సరులం గూడివచ్చి తన ప్రభావంబు రూపించుటయు గాణాపత్య బౌద్ధ జైన చార్వాక శాక్తేయు లేతెంచి తమ స్థితులు నచించుటయు, శైవ వైష్ణవ సంవాదంబుచే యుద్ధంబగుటయు, సుమతియను సాధ్వి సమేతంబుగా వివేకుం డరుదెంచి తత్కలహంబు మాన్పుటయు నను కథలుం గల తృతీయాశ్వాసము"—

V "........... ద్వైతవిశిష్టాద్వైతాద్వైతులేతెంచి భేద, భేదా భేదా భేదంబులచేత బ్రహ్మస్వరూపంబు నిరూపించుటయు నను కథలుంగల చతుర్థాశ్వాసము"—

V "..........జగన్నాటకంబను మహాకావ్యంబునందు విరాడ్వి గ్రహుం డహంకార భార్యయైన మమ..........శాంతిని వానికిచ్చి పెండ్లిచేసి నిరహంకారుండని పేరు పెట్టుటయు, శాంతి పరిణయంబును,...... నొందుటయు, చంద్రవాయు మన్మథాద్యుపాలంభనంబును, (..) పూజా విధానంబును, శాంతి గర్భంబును, జ్ఞానదేవుండు జ(నియించి) జగ న్నాటకంబునకు వచ్చుటయు, జ్ఞానోపదేశంబును (..)ద భూమీశు నితిహాసంబు దెలుపుటయు, ఉదయాస్తమయవర్ణనంబును, శాంతినిరహం కార జ్ఞానదేవులు జనులకు సంశయపరిచ్ఛేదంబుగా పలుకుటయు సకలజనులు నప్పరమపురుషుని నుతి సలుపుటయు నను కథలుంగల పంచమాశ్వాసము"—

పైనుదాహరించిన ఆశ్వాసాంతగద్యములవలన జగన్నాటక ప్రబంధ కథా ప్రణాళిక మనకు స్పష్టముగా గోచరించును. ప్రబోధ చంద్రోదయము వంటివానిలో మనకి జగన్నాటకము చివరి మూడాశ్వాసములలోని కథ కొంత కానుపించునుగాని మొదటి రెండాశ్వాసములలోని వృత్తాంతము మాత్ర మీ గ్రంథము వైశిష్ట్యముగా భావింపవలెను.

శేషాచలుని రెండవకృతి టారిగడుపుల నృసింహ శతకము. ఈ శతక మంతయు సీసపద్యములం దున్నది. నృసింహస్వామి నాపాదమస్తకము వర్ణించు పద్యములును, స్వామి వైభవమును వర్ణించు పద్యములును షోడశోప చారపూజాపద్యములు (కాబోలు)ను, దశవతార పద్యములును ఈవిధముగా నృసింహస్వామి పరముగా నున్నదీ శతకము. అన్ని పద్యములకును ఎత్తుగీతి చివర రెండు పాదములు మకుటమొకే విధముగా నున్నది.

"ప్రీతి నను బ్రోవు దయతోను యాతుధాన
గణ కరటిసింహ సింగపట్టణ నృసింహ" యనునదీ మకుటము. ఈ శతకము కూడ మిక్కిలి శిథిలముగా నుండుటచే పద్యము లెక్కువగా నెత్తి వ్రాయజాలనైతిని. మచ్చునకై యొకపద్య ముదాహరింతును. ఇది షోడశోప చార పద్యములందొకటి కాబోలును. దీని సంఖ్య ౩౭.

సీ॥ ప్రాగ్గిరి మీదను బాలాతపచ్ఛద సాంద్రదీధితినెల్ల నమయజేసి
కమలకైరవషండకర్ణికాంతస్థమా పుష్పాది కాంతుల గప్పిపుచ్చి

వదియారు వన్నెల బరగి సువర్ణమౌ బంగారు చాయల పాటినొంచి
దినినాథుడస్తమించిన వేళల నెలంగు సాంధ్య రాగంబుల నవురు సవిరి

యలరి పీతాభమై చెలు వమరుచున్న
వస్త్రయుగ్మంబు నొనగెద వసుమతీశ
ప్రీతి నను బ్రోవు దయతోను యాతుధాన
గణకరటిసింహ సింగపట్టణ నృసింహ"—

ఈ రెండు కృతుల తరువాత రెండు మూడు తాటియాకులు వ్రాయనివి కలవు. వానిలో నొకదానిపై మూడు పద్యములున్నవి. ఇవి పై కృతులకు సంబంధించినవి కాకపోయినను వాని నిట నుదాహరింతును.

"ముదంబుమీర నీవు నేను ముందె చెల్మి చేసినా
మిదేలపాటి మీరు వాదమిందు వేములందు తీ
పు దా(...)జెలంగెరా(...)లు బెట్టినట్లనే
అదేమి వింతలయ్య నమ్మినట్టి వారి చెంగటన్"—

క॥ కాయలు గూరలువలె నా
రాయణపుర సతుల గోర రాగా పైపై
టీయెద దెలిసెనుగద నీ
మాయలుగల ధర్మవరన మందిది కృష్ణా.

గీ॥ వెలదిబోలు వెల్లివిరియంగ నిన్ను దా
నమర వాదిదేల యందె పొమ్ము
యెత్తుకోలు దిన్నెలిట్టి పల్లూరకె
యేల సీకు దాని నేలు కృష్ణా"—

పైకంద పద్యమున నున్న నారాయణపుర మెచ్చటిదో? నారాయణపురములు మన దేశమున ప్రతి మండలమునను గలవు, కాని కృష్ణుడెచ్చటెచ్చట గలదో తెలియదు.

ఏదుట్ల శేషాచలుడు పింగళి సూరన తరువాతి వాడనుట నిశ్చయమైనను ఏ కాలమువాడో ఇదమిత్థముగా తెలియుటలేదు. ఐనను జగన్నాటక వస్తువునుబట్టి ఈ మహాకవి త్రికాలములకును చెందినవాడని మనవి చేయు చున్నాను.

(గోలకొండ పత్రిక 25-8-1961)

# పొత్తపి వెంకటామాత్యుడు

ఈతడొక శతకకవి. కృతిపేరు "నూటయెనిమిది దివ్యతిరుపతుల సుబ్బరాయ శతకము". కవిత్వమంత గొప్పది కాకపోయినను పరిశోధకులకు, చారిత్రకులకు తెలియుటకై దీనిని వ్రాయుచున్నాను. ఈ కవి కాలము శతక మాధారముగా తెలిసికొనుటకు వీలులేదు. ఈతడు రాయలసీమవాడై యుండునని నాయూహ. అందు కాధారము శతకప్రారంభమున నున్న మొదటి పద్యము. పద్యములన్నియు సీసములు. మకుటము ఎత్తుగీతిలోని చివర రెండు పాదములు.

"మహిత రోపాయ ధూర్జటి మతవిధేయ
సూర్యశతకోటినిభకాయ సుబ్బరాయ"

ప్రారంభపద్యమిట్లున్నది.

సీ॥ శ్రీరామచంద్రుల సేవించి యశ్వత్థ నారాయణుని వేడ్కమీర దలచి
పెన్నజూటురి పురి చెన్నరాయలనెంచి ఆంజనేయుల భక్తి నభినుతించి
వజ్రగిరి నృసింహు వర్ణించి యాలురికోన రంగేశుని గొలిచి విఘ్న
రాజునే ప్రౌద్ధమ రమణతో పూజించి వలుకులబోడని ప్రస్తుతించి
వేడ్క హొన్నూరి రాయని వినుతిచేసి
నిన్ను మదిలోన నుతిజేతు నన్నుబ్రోవు
మహిత రోపాయ ధూర్జటి మతవిధేయ
సూర్యశతకోటినిభకాయ సుబ్బరాయ.

పై పద్యములోని ప్రదేశము లన్నియు అనంతపురము మండలములోనివి. కనుక నీకవి యనంతపుర మండలవాసియై యుండును.

2 నుండి 108 వరకున్న పద్యములందు నూట యెనిమిది దివ్యతిరుపతులును అచటి దేవతలును వర్ణింపబడినారు. 109 వ పద్యములో కవి తన్ను గూర్చి యీ విధముగా చెప్పుకొన్నాడు :

సీ॥ ముదితాత్ముడగు పెదముల్కి వెంగనకేను పౌత్రుండ హరితసగోత్రజుండ
అనఘ పొత్తపి చెన్నయామాత్య సూనుండ మహితచారిత్రుడ మానధనుడ
కామాక్షమాంబను ఘనసాధ్వివరగర్భ జలధిచంద్రుడ మహానరన గుణుడ
సిరిమించు రాయలచెర్వు యబ్బారుడ(?) ఘనుడ వెంకటనామకవివరుండ

ధర్మచరితుండ నిరతాన్నదాతవనుచు
నీకు మ్రొక్కెద నన్ బ్రోవు లోకవంద్య
సుహిత రోపాయ ధూర్జటి మతవిధేయ
సూర్య శతకోటి నిభకాయ సుబ్బరాయ

ఈ పద్యమువలన నీ కవి తాతపేరు వెంగనయనియు తండ్రిపేరు చెన్నయ యనియు తల్లిపేరు కామాక్షమ్మ యనియు తెలియుచున్నది. పొత్తపి కడప మండలములోనిది. ఈ కవి పూర్వులు పొత్తపినుండి యనంతపుర మండలమునకు పోయి స్థిరపడి యుండుటచే వీరికి పొత్తపి యనునది ఇంటి పేరుగా వాడుకలోకి వచ్చియుండును. తాతగారి పేరునకు ముందున్న పెదముల్కి యనునది పొత్తపికి సమీపమందున్న గ్రామమట. కవి పేరునకు ముందున్న "రాయల చెర్వు యబ్బారుడ" అనగా నేమో నాకు తెలియరాదయ్యెను. తాతపేరునకు ముందున్నది పెదముల్కి యను గ్రామము, తండ్రిపేరునకు ముందున్నది పొత్తపి యను గ్రామము, తన పేరునకు ముందున్నది రాయలచెర్వు అను గ్రామము; ఈ విధముగా నీ ముగ్గురి పేరులకు ముందు మూడూళ్ళ పేర్లున్నవి. మూడుతరములవారు మూడు చెరువుల నీళ్ళు త్రాగినట్లున్నారు. చిట్టచివరకు రాయలచెర్వులో స్థిరపడి పోయినారో లేదో।

చిట్టచివరనున్న (110) వద్యమున కృతిరచనమునకై తన్ను ప్రోత్సహించినవారినిగూర్చి యీ విధముగా చెప్పినాడు.

సీ॥ శ్రీమించు చినరెడ్డి సింధుపణాంకుండువిమలాత్ముడగురంగవిభుతనయుడు
ఘనుడు చిన్నాగమ్మ గర్భోదయుండగు చినసుంకిరెడ్డి నన్ జేర జీరి

మేదిని నూటయెన్మిది దివ్యతిరుపతుల్ వరుసలో వర్ణించి వాంఛమీర
సుబ్బరాయని పేర నురుచిరంబుగ శతకము రచించుమటంచు ఘనత మెరయ

పలికినను నేను మీ పేర భక్తి నంకి
తముగ జేసితి నను చాల దయతో బ్రోవు
మహిత రోపాయ ధూర్జటి మత విధేయ
సూర్య శతకోటినిభకాయ సుబ్బరాయ

ఈ కవి శైలి దెలియుటకై రెండు పద్యముల నుదాహరింతును.

సీ॥ వినయ భక్తిస్థానమున భుక్తినొసగెడు దేవుని నెదనుంచి దిగులుమాని
సారంగముల రెంటి సారంగమున గూర్చి సారంగధరు జూచి సరసుడగుచు
పండు వెన్నెలలోని పండు వెన్నెలగాంచి పండువెన్నెలగల బయలుబట్టి
పరితాపమందక పరితాపమును దీర్చి పరితాపహరు గురు బ్రస్తుతించి

జ్ఞానమార్గంబు దెలిసిన సూనవుండు
అధికుడన మించి సత్పథమందకున్నె
మహితరోషాయ ధూర్జటి మతవిధేయ
సూర్యశతకోటివిభకాయ సుబ్బరాయ. (88)

ఈ క్రింది పద్యము తత్వావతార దశకమని యున్నది.

సీ॥ శ్రీమద్వరంబున చెన్నొందు గుణనాథు నేవేళ నాత్మలో నెన్నికొనుచు
అలమచ్చెమై నీటి కెదురెక్కవలెగాని మూపున పెనుగొండ మోవరాదు
ఘోణియై ముస్తెను గోరాడవలె గాని దిగులొందగా నోరు దెరువరాదు
దీనత నొక్కరి తిరియగావలె గాని తెంపున నృపతుల ద్రుంపరాదు

కట్టవలెగాని రోకట గొట్టరాదు
ఉండవలెగాని కత్తి మెండొడ్డరాదు
మహిత రోపాయ ధూర్జటి మతవిధేయ
సూర్య శతకోటి నిభకాయ సుబ్బరాయ (89)

ఈ భక్తకవిపరిచయ మింతటితో ముగింతును.

(గోలకొండ పత్రిక 29-3-1961)

# త్రిలోకభేది

విధివిలాసమెట్టిదోకాని కాలగర్భమున కనుమరుగైన కృతులును తత్కవి జీవితములును ఎన్నియోగలవు. కాలప్రవాహమున కెదురీది నిల్చిన కృతులు కొన్నియే. కతమ గ్రంథము లుత్తమములైనను నామరూపారులు తెలియరానివి కొన్ని; నామమాత్రావశిష్టములు కొన్ని, జీర్ణావస్థలోనున్నవి మరికొన్నియు గలవు ఇట్లున్నవానిలోగూడ చరిత్రమున కెక్కనివి వేనవేలు. ఆయా గ్రంథములతోపాటు వాని కర్తలకుగూడనదియే గతిపట్టినదని వేరుగా చెప్పనక్కరలేదు. ఇట్టి చరిత్ర కెక్కని చరితార్థులం దొకరు త్రిలోకభేది యను కవి. త్రిలోకభేది యనునది నామకరణమునాడు తలిదండ్రులు పెట్టిన పేరోలేదా నీత డాఢ్యుడైన పిమ్మట ఆతుకుకొన్న బిరుదనామమో తెలియదు. మరియును నీత డే యూరివాడో, ఎప్పటివాడో సరిగా తెలియదు. ఈతని రచనము 'సకలధర్మసారము'. ఇది హరివంశాంతర్గతము సకలధర్మ సారమని యొకచోటను నకలధర్మసారాయమని మరియొకచోటను ఈ గ్రంథమందే రెండు విధములుగా పేర్కొనబడిన దీకృతి. ఇది వాలుగాశ్వాస ముల గ్రంథము. ఈ తాళపత్ర గ్రంథము ఉస్మానియా విశ్వవిద్యాలయము సంస్కృత అకాడమీ గ్రంథాలయమున శిథిలావస్థలో నున్నది. ఈ కవి దేశకాలాదులు కనుగొందమన్న దీనికి పీఠిక లేదు. లేదనగా కవి వ్రాయ లేదని కాదు. ప్రతి వ్రాసికొన్న మహానుభావు దద్దానిని వ్రాయలేదు. బహుశః ఆతనికి లభించిన మాతృకలోగూడ పీఠిక మాయమైయుండును.

మొదటి కమ్మ ప్రారంభమున "శ్రీ వెంకటరమణా" యని వ్రాయక కాదు శ్రీకారము చుట్టినాడు. ఆటుతరువాత "అంకితంబుగా నా యొనర్పం బూనిన సకల ధర్మసారాయంబునకు కథాక్రమం బెట్టిదనిన" అను వచన ములో గ్రంథమారంభమైనది. అందుచేత అంకితము గొన్నవాని చరిత్ర మంతయును నీ పీఠికకు తోడుపోయినది. కవి యచ్చపు శైవనియోగి కాగా ప్రతిని వ్రాసికొన్నవారు శుద్ధ వైష్ణవనియోగి. కనుక నీగ్రంథ మొకకాల

మెందరి చేతులలో నలిగినదో ఏయేదశల ననుభవించినదో తెలియదు. అందుకే పీఠిక లేకుండబోయినది. ఇక మిగిలిన గ్రంథమూ ధారముగా నీ కవి దేశకాలాదుల నూహించుటకు ప్రయత్నింతును.

పీఠిక లుప్తమైనందులకు, ఆశ్వాసాంతపద్యములును గద్యములును మాత్ర మదృష్టవశమున కొంత శిథిలముగానైనను కొనయూపిరితో నిల్చినవి. కీడులో మేలననది యిట్టిదకాబోలు. కవి తన తాతతండ్రులను గూర్చియు తన్ను గూర్చియు వ్రాసికొన్న ఆశ్వాసాంతగద్య మీతీరుగా నున్నది.

"ఇది శ్రీమద్భ్రమరాంబావరప్రసాద నవరసానుబంధబంధుర ప్రబంధ నిబంధచాతురీధురీణ సకలవిద్యాప్రవీణ గౌతమగోత్ర పవిత్రచారిత్ర గౌరనామాత్యపౌత్ర రామయమంత్రిపుత్ర సకలజనస్తోత్ర సంభావిత త్రిలోకభేది *ప్రణీతంబైన హరివంశంబునందు సకలధర్మసారాయంబునందు"—అటుపై నాయా ఆశ్వాసములందలి విషయముల అనుక్రమణిక గలదు.

శ్రీనాథునకు సమకాలీనుడును, హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్రము, లక్షణదీపికాద్యనేకకృతినిర్మాతయునగు గౌరనమంత్రి ఆంధ్రలోకమున కీపం కే పరిచితుడు. మన త్రిలోకభేది ఈ గౌరనామాత్యునకు మనుమడై యుండునని నే నూహించుచున్నాను. గౌరనామాత్యుని కాలము క్రీ. శ. 1385-1445 అని ఆంధ్రకవితరంగిణీకారుల నిర్ణయము. గౌరనకు మనుమడు గనుక త్రిలోకభేది క్రీ. శ. 1465 ప్రాంతములం దుండియుండును. త్రిలోకభేది తాత ఈ గౌరనయే యేల కావలయును? వేరొకడు కాగూడదా యను ప్రశ్న యుదయించును. ఇరువురి గోత్రము లొకటే యగుటయును, ఇరువురును శైవసంప్రదాయమునకు చెందినవారగుటయును, ఇరువురును తెలంగాణమున వర్ధిల్లియుండుటయును వారు తాతమనుమలను నా యూహకు కారణములు. ప్రసిద్ధుడగు నీ గౌరనామాత్యునకు రామయమంత్రి యను కుమారుడుండిన ట్లితరాధారములతో ధ్రువపడినచో నా యూహ నిజమగును. పల్నాటివీరుల కథలందు "కోళ్ళపోట్లాట-గోపుయుద్ధము" మున్నగువానిని రచించిన మల్లనగూడ గౌరయామాత్యపౌత్రుడు మరియు రామయమంత్రి పుత్రుడు. ఈ మల్లనయు మన త్రిలోకభేదియు నన్నదమ్ము లనుకొందు

*సంపాదిత యని మరియొక ఆశ్వాసాంతగద్యము.

మన్నచో వీరి గోత్రములు వేరువేరుగా నున్నవి. మల్లనది కౌండిన్యగోత్రము. త్రిలోకభేదిది గౌతమగోత్రము. కనుక హరిశ్చంద్రోపాఖ్యానాద్యనేకగ్రంథ కర్తయగు గౌరనామాత్యుడే త్రిలోకభేదికి తాతయని భావించుట యిప్పటికి తెన్ను.

శ్రీరంగమహత్త్వమును రచించిన భైరవకవి గూడ గౌతమగోత్రుడు మరియు గౌరనామాత్యపుత్రుడు. కీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారీ భైరవుడు ప్రసిద్ధుడగు గౌరన(హరిశ్చంద్రోపాఖ్యానాది గ్రంథకర్త) పుత్రుడే యనిరి. అట్లయినచో నీ భైరవుడు మన త్రిలోకభేదికి పితృవ్యుడగును. భైరవకవి గద్యమిట్లున్నది.

"ఇది శ్రీమద్భ్రమరాంబా వరప్రసాదలబ్ధసిద్ధసారస్వతవిలాసగౌరవ గౌరనామాత్యపుత్ర సుధీవిధేయ భైరవ నామధేయ ప్రణీతంబైన శ్రీరంగ మహత్త్వంబను పురాణకథయందు ప్రథమాశ్వాసము" —

గౌరన, భైరవుడు, త్రిలోకభేది వీరల గద్యములందు కొన్ని పోలికలు గానవచ్చుచున్నవి. వీరందరును "భ్రమరాంబావరప్రసాదలబ్ధ" కవితా సంపన్నులు. కనుక వీరొకే కుటుంబమువారని యూహించుట కిడియును తోచుచున్నది.

ఈ గ్రంథపు పీఠిక పోయినదని తొలుతనే మనవిచేసితిని. దానిలో కృతిపతి మరియు కృతికర్తలనుగూర్చిన విపులమైన చరిత్రముండియుండును. ఈ గ్రంథమునకు వేరొకప్రతి పీఠికతో లభించిననేగాని యాలోటు తీరదు. ఆశ్వాసారంభపద్యములును, ఆశ్వాసాంతపద్యములును కొన్ని దక్కి యుండుటవలన నీ కృతిపతి పేరుమాత్రము తెలిసికొనవచ్చును. ప్రథమాశ్వాసాంతమున కృతిపతినిగూర్చిన పద్యము లెత్తివ్రాయుచు వ్రాయసకాడొక పద్యము వ్రాయదగిన స్థలములో కొంతభాగ మూరక విడిచిపెట్టి చివర భాగమిట్లు వ్రాసినాడు: "భోగసంస్థిత, త్పరమ పవిత్ర జనపాలనశీలన శివ్వధీమణీ!" కనుక నీ "సకల ధర్మసారము"నకు కృతిపతి శివ్వమంత్రియని తెలియుచున్నది. ఈ లుప్తశేషము తరువాత నొక కందపద్యము మరియొక పంచచామరమును గలవు. వానిలో నీ శివ్వమంత్రి శివపూజాధౌరంధర్యమును, జంగమారాధనయు, కీర్తిప్రాభవములును ఈ రీతిగా వర్ణింపబడినవి.

"శివపూజా పరిపూర్ణా
స్తవ జంగమపాదపద్మసంసేవక స
ద్వివర విహార మహామహ
కవిజనసన్మిత్ర తాపఘనసత్పుత్రా."

"సదా సదాశివార్చనాది సారసాప్తతేజ దు
ర్మదా మదాది నాగసింహ మామతస్థురస్థిరా
స్వదాన్వదాను దానకర్ణ సారిజాత జాత సం
పదా పదాభిరానలోక పావనాంగా సంహృదా."

ద్వితీయాశ్వాసారంభమున కృతిపతిని సంబోధించు పద్యమిట్లున్నది:

శ్రీ మల్లికార్జునార్పిత
ప్రేమాతిశయానురాగ పృథ్వీజన సు
త్రామ కరుణాపయోనిధి
సీమాంతర జయవిహార శివ్వగ ధీరా.

తృతీయాశ్వాసారంభమందలి పద్య మీ తీరుగా సున్నది:

శ్రీ పార్వతీ కళత్ర
శ్రీ పాదయుగప్రప త్తిసేవా సప్త
ద్వీపయశోన్నతచతురా
క్షేపగుణానంద ధీర శివ్వగధీరా.

ఈ పద్యములవలన నీ శివ్వనుంత్రి యసాధారణుడని తెలియుచున్నది. తృతీయాశ్వాసాంతమున నొక మత్తేభము, ఒక కందము, మరియొక మాలినిలో నీ శివ్వగధీరుని గుణకీర్తన మున్నది. మాలినిలో తృతీయ పాదమున్ను, చతుర్థ పాదమున మొదటి సగమును లుప్తములు. మిగిలిన రెండవ సగమున కృతిపతి తల్లిపే రున్నది.

"వర వితర హారా వార్ధిగంభీర ధీరా
పరమశుభ విచారా బంధుమందారసారా
..................................
..............మల్లమాంబా కుమారా,

దీనివలన నీ శివ్వమంత్రి తల్లిపేరు మల్లమాంబ యని తెలియనగును. తక్కిన ఆశ్వాసారంభపద్యములవలన తెలియనగు చారిత్రకాంశములు లేవు. కనుక వానిని విడువనైనది.

'నకలధర్మసారము'నకు కృతిపతియగు నీ శివ్వధీమణి యెవరు? ఆత డెవరోకాని కనీసమొక రాజునొద్ద మంత్రిపదవియందైన నుండియుండును. ప్రసిద్ధుడగు గౌరనామాత్యుని పెదతండ్రి మున్నగువారు రాచకొండ రాజ్యమున మంత్రులుగా నుండుట తెలిసినవిషయమే. ఈ శివ్వధీమణికూడ రాచకొండ సంస్థానమునకు చెందినవాడై యుండును. అతనికి త్రిలోకభేది తనకృతి నంకితమిచ్చియుండును. పీఠిక దక్కకుండుటచే నీ శివ్వధీమణి చరిత్రము ప్రకృత మింతకన్న నెక్కుడు తెలియరాదు.

గ్రంథమందలి యితివృత్త మాశ్వాసాంతగద్యము లందలి యనుక్రమణిక వలన దెలిసికొనవచ్చును. ఈ "నకలధర్మసార" మనునది హరివంశాంతర్గతము.

ప్రథమాశ్వాసమున "శౌనకాదిముష్తులు సూతుం జూచి ధర్మప్రశ్న వేయుటయు, ఆతడు సకలధర్మసారంబులు జనమేజయుండు వైశంపాయను నడిగెనని చెప్పుటయు, శ్రీకృష్ణుండు పాండవులున్న కామ్యకవనంబునకు భీష్మునితోగూడి వచ్చుటయును, విష్ణుభక్తిప్రభావంబు ధర్మరాజునకు గాంగేయుండు దెలుపుటయును, భగవంతుడు ధర్మనందనునకు భూదానమహత్వంబును, గోదానమహత్వంబును, అన్నదానమహత్వంబును జెప్పుటయు నను కథలు" గలవు.

ద్వితీయాశ్వాసమున, "నం(ఋ?)దాన మహత్వంబును, కన్యాదాన ఫలంబును, సత్యవ్రతమహత్వంబును, విదియ (?) దానప్రభావంబును, త(టా)క దేవాలయవనప్రతిష్ఠాఫలంబును, భగవత్ప్రశంసయు, భగవత్పూజా ఫలంబును"నను కథలు గలవు.

తృతీయాశ్వాసమున, "నానావిధవస్త్రద్రవ్యకుసుమగంధదానఫలంబులును, ధాన్యరత్నదానఫలంబులు" గలవు.

చతుర్థాశ్వాసమున, "పాండవులకు సకల ధర్మంబులు దెలుపుటయు, హరి సన్నిధికి దూత యేతెంచుటయు కృష్ణుండు ద్వారక కేగుటయు నను కథలు" గలవు.

గ్రంథప్రతి వ్రాసికొన్న వ్రాయసకాడు చిట్ట చివరన తన యూరు పేగులను, వ్రాసికొన్న తేదియు ఇచ్చియున్నాడు. ఆ వివరములీ విధముగా నున్నవి.

"పార్థివనామ సంవత్సర పుష్య బ. ౧౨ స్థిరవారం వరకు మార్మ రాజు వెంకటేశం సకలధర్మసారాయం ప్రతిలో వున్న క్రమాన వ్రాసినాడు. తప్పులు వుంటే పెద్దలయినవారు చూచి కోపం చాయక సమకూర్చవలెను. శ్రీమతే రామానుజాయ నమః. శ్రీ పరాశరభట్టరు తిరువడిఘళే శరణం.

పెద్దలయ్నివారు ప్రేమతో జూచియు
దిద్దరయ్య మీరు తిట్టబోక
సద్దు సేయకురయ్య జాగేలరా మొగిలి
గిద్దె రంగధామ కీర్తిధామా"

వ్రాయసకాడగు వెంకటేశం వైష్ణవ నియోగియని రామానుజులను పరాశర భట్టరు (గురువు) ను తలచుట చెప్పక చెప్పుచున్నది. ఈతని గ్రామము బహుశః మొగిలిగిద్దె కానోపు. ఈ గ్రామము మహబూబ్‌నగరం మండలము షాద్‌నగరం తాలూకాలో నున్నది. ప్రతి వ్రాసిన తేది క్రీ. శ. 8-1-1846 తేదికి సరిపడుచున్నది. అనగా గ్రంథము పుట్టిన తరువాత దాదాపు ఇమ్మారేండ్లకు వ్రాయబడిన దీ ప్రతి.

(ఉదయభాను, డిసెంబరు 1961)

# గోపతి లింగకవి

తెలుగు వీరశైవవాఙ్మయమునకు తెలంగాణము పుట్టినిల్లు. పాల్కురికి సోమనాథుని నాటినుండి నేటివరకును వీరశైవవాఙ్మయసృష్టి యిచట జరుగుచునే యున్నది. తెలంగాణమున వర్ధిల్లిన వీరశైవకవులందు గోపతి లింగకవి యొకడు. ఈతని కాల మిదమిత్థముగా తెలియకున్నను నీతడు స్మరించిన కవులను బట్టి గోపతి లింగకవి మధ్యయుగమునకు చెందినవాడని యూహింపవచ్చును. ఈతని కృతిభర్త మెదకు మండలమువాడు. కనుక నీతడుగూడ మెదకు మండలమువాడై యుండునని భావింపవచ్చును

గోపతి లింగకవి బహుగ్రంథనిర్మాత. కాని ప్రకృతము రెండు కృతులు మాత్ర ముపలబ్ధములు. ఈ రెంటిలో "చెన్నబసవ పురాణము" సమగ్రముగను, "అఖండజ్ఞాన మనఃప్రబోధ వచనకావ్య ప్రబంధ" మసగ్రముగను ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి సంస్కృత అకాడమీ తాళపత్ర గ్రంథములం దున్నవి.

గోపతి లింగకవి అంగడిమఠము వీరశైవాచార్యులకు శిష్యుడు. ఈతని యింటి పేరు తుమ్మావారు. తాత పేరు శివరామలింగము. మల్లమాంబా శివరామలింగదంపతుల సంతానపంచకమున పాపయలింగ మొకడు. లింగమాంబా పాపయలింగము దంపతుల వరపుత్రుడు మన గోపతిలింగకవి.

"శివదేవియు మజ్జననియు
శివదేవుడు తండ్రి సుప్రసిద్ధముగాగన్
శివభక్తులు బంధువులును
శివకుల జనితుండ నిరతశివగోత్రుండన్."

అని చెప్పుకొనునంత వీరమాహేశ్వరాచారసంపన్నుఁ డీ గోపతిలింగకవి. కవి చెన్న బసవపురాణమునకు విపులతరమైన పీఠికను వెలయించినాడు. మొదటి యెనిమిది పద్యములందు శివస్తుతియు, తరువాత గురుస్తుతియు, నూతన

పురాతన ప్రమథగణముల స్తుతియును గలవు. ఆటుతరువాత పూర్వకవి సంస్మరణమున నొక పద్యములో పాల్కురికి సోమనాథుని స్తుతియున్నది. రెండవ పద్య మీ తీరుగా నున్నది.—

ఉ. ధామితపుణ్యమూర్తి పిడువర్తి ఘనున్ బసవేశు తత్సుతున్
సోమయలింగమాదియగు, శూలికవీంద్రుల గార్లపాటి వీ(?)
ధీమణి లక్ష్మణాహ్వయుని దివ్యపదాంబుజముల్ మదిన్ సదా.
నేమ మెలర్పగొల్తు నుతిజేయుచు మ్రొక్కెద సార్వకాలమున్."

దీనిలో పిడుపర్తి బసవన్న, అతని కుమారుడు సోమయలింగము (పిడుపర్తి సోమనాథుడు—పద్య బసవపురాణకర్త), గార్లపాటి లక్ష్మయ్య (ఏగంటవారి వచనముల కర్త) మున్నగువారు స్మరింపబడుటచే గోపతిలింగకవి పదునారవ శతాబ్దాంతముననో లేదా పదునేడవ శతాబ్దారంభముననో ఉండి యుండునని యూహింపవచ్చును.

కవి తన గురుపరంపరను గూర్చి చెప్పిన పద్యము లనన్వితములుగా నున్నవి.

సీ. సర్వేశు డంగడీశ్వర గురుస్వామి శ్రీకరసుతుడు చినమల్లి కార్జునుండు
నమ్మహాగురుపుత్రు లభివాననంబులోయన నంగడీశుండు ఘనుడు మీన
నాథుండు మల్లయ్య ప్రీతి చినమల్లన్నయును వీరదేశికుండనగ భువిని
సకలరాజన్యమస్తకకిరీటన్యస్త వికచపదాంభోజయుగళు దగుచు
దనరు వద్దేశికుల నూనులనగ మీన
నాథుడును విశ్వనాథు డౌననగ భక్త
జనుల శివరాజయోగీంద్రు డనగ నాగ
(లి)ంగమన బ్రోచి వెలమి నెన్నంగ భువిని.

ఆ. వె. అట్టి దేశికేంద్రు దమిత కృపాసాంద్రు
లరని మమ్ము బ్రోచు గురులు వారి
శ్రీకరాంఘ్రి శిష్యశిష్య ప్రశిష్యుండ
శిష్టలింగమూంఘ్రి సేవకుండ.

గురుపరంపర తరువాత తన తాతతండ్రులను గూర్చి చెప్పి ప్రబంధ రచనోద్యోగమును చెప్పినాడు. సత్ప్రబంధము రచింప నుద్దేశించిన సమయమున శ్రీగిరీశ్వరుడు జంగమాకృతి నేతెంచి యిట్లనును.

క. సురుచిర గ్రంథము లాదను
వరుసు స్తవ మొకటి తెక్కు వచనంబులు సు
స్థిర శతకము లైదును శ్రీ
కర కేదారీశు నోము కథయును మరియున్.

వ. మంగళాష్టకంబులును విఘ్నేశ్వర వీరేశ్వర మల్లేశ్వర రామేశ్వరాష్టకంబులును, శారద పదంబులును, జాజరపదంబులును నివి మొదలుగాగల కృతులును మత్కృతంబుగా భక్తమాహేశ్వరానందకరంబుగా జెప్పినాడ వప్పుడు,

క. నీకు ప్రియంబుగ నీకృతి
మా కంకితముగ నొనర్ప మది దలచితివా
మాకు ప్రియంబగు భక్తుని
కాకాంక్ష రచింపు మాకు నగును కుమారా.

సీ. బసవలింగంబు శ్రీ పదపద్మమకరంద రససుధావార్ధి మరాళ మనగ
బసవపదధ్యానభవితాంతరంగుండు బసవాంశజనితప్రభావు డనగ
అనమలింగమచరణబిసరుహార్చితభక్తి రసపరిపూర్ణవారాశి యనగ
బసవాదిప్రమథగణ విసరాంచితధ్యాన వశమానసద్వ్రతవర్తి యనగ
వెలయు కాపాల పగబణ్ణ విమలభక్తి
పరుడు గావున తద్భక్తవరుని గురుని
కరసరోజాతజనితశ్రీకరుని సతత
పరహితౌదార్యమతుని సద్భక్త హితుని.

ఆ. వె. కలర జెప్పవలయు నమలాత్మ దతని హృ
త్కమల కర్ణికాంతరమున బాయ
కెలమినుందు మతని కి ప్రబంధము జెప్ప
వలయు నంకితముగ వరకుమార!

ఈశ్వరుని సందేశము ననుసరించి గోపతిలింగకవి యటులే చేయదలచెను. కవికి తన తండ్రియు స్వప్నమున సాక్షాత్కరించి యటులే చేయుమనెను. కవి

కృతనిశ్చయుడై యుండగా తమ్మడిపల్లె సిద్దయ్య యను నొక మాహేశ్వరుడు వచ్చి కృతిభర్తయగు కాసాల పరబణ్ణ వీరమాహేశ్వరాచార సంపదను, గుణగణములను వంశావళిని పేర్కొనును. వానిలో మొదటి పద్య మిట్లున్నది.

సీ. మహి నభవుమూర్తి తమ్మడిపల్లె సిద్దయ్య చేపరాదిగ జంగమావలియును
కరుణారసము జిల్కగ మమ్ము వీక్షించి వినుము గోపతి లింగ విప్రకులాంగ
శరణోపకారుండు శరణుండు కాసాల పరబణ్ణ భక్తిప్రభావు దతని
కనమానమగు చెన్నబసవ పౌరాణ మావుశిరోశిగ శివలింగమూర్తికర్తి(?)

నర్పితంబుగాగ నగ్గురుమూర్తికి
వెలయ చాంగిలేరు వీరునకును
శివుని దేవణాను సిద్దేశ్వరున కంకి
తముగ జెప్పవలయు నమలహృదయ.

కాసాల పరబణ్ణ చిరుతొండన కులజాడట. అతని తమ్ముడు గట్టెపల్లి బసవ లింగము. అతడుకూడ తనయన్నగారిని కొనియాడి చెన్నబసవపురాణమునకు కృతిపతినిగా జేయవలయునని కవిని కోరును. దీని తరువాత మాహేశ్వర పీఠిక యను శీర్షికతో వీరమాహేశ్వరప్రభూతప్రభావ మభివర్ణింపబడినది. శివపారమ్యమును స్థాపించు నీ పీఠికలో పూర్వకవుల యొక్కయు శ్రుతిస్మృతీ పురాణాదుల యొక్కయు వాక్యము లుట్టంకింపబడినవి. అధర్వణవేదము, జాబాలోపనిషత్, ముండోపనిషత్, బ్రహ్మాండపురాణము, స్కాందపురాణము, విష్ణుపురాణము, వీరాగమము, విశ్వాగమము, రహస్యము, ప్రభులింగలీల (తెలుగు పద్యము మరియు ద్విపదలు) చివరకు వేమన పద్యములనుండిగూడ ఉదాహరణము లున్నవి. వేమన పద్య మిది:

క. మేకలు కదుపులు జనగా
ప్రాకటముగ నొక్కకోతి పర్గంబెక్కెన్
ఆ కోతు లగణితము జన
కోకో యని యొక్క నక్క గూసెర వేమా.

పైపద్యము వేమన శతకకారుడగు రెడ్డివేమనదేయైనచో మన గోపతి లింగకవి వేమనకు తరువాతివా డగును.

ఈ వర్ణనములందే పుశిరోశిగ పట్టణాధీశ్వరుడగు శివలింగ దేశికుడును, పౌరవశిగె భగిగురుడును వారి శిష్యపరంపరయు వర్ణింపబడినారు. అట్టిపైన

కల్పగూరు (మెదకుమండలము) సీమయు, నందు సంగారెడ్డిపేటయు వర్ణింపబడినవి. కృతిభర్తయగు కాసాల వరబణ్ణ సంగారెడ్డిపేట నివాసి.

అతని వంశావతార మిట్లున్నది:

దేవణ్ణ (భార్య రామాయమ్మ)
|
వీరణ్ణ (భార్య నాగమాంబ)
|
వరబణ్ణ (భార్యలు పెదవీరమ్మ చినవీరమ్మలు)

ఈ వరబణ్ణయే చెన్న బసవపురాణమునకు కృతిభర్త. అతడును, అతని భార్యలును చాంగిలేరు వీరేశ్వరస్వామి భక్తులట. ఈ చాంగిలేరు సిద్ధక్షేత్ర వర్ణనముగూడ ఇందులో గలదు. అటు తరువాత తన ప్రబంధమహిమను వర్ణింపబోవుచు చెప్పిన గద్యభాగ మిట్లున్నది:

"అని శ్రద్ధానుపూర్వకముగా, అభ్యుదయపరంపరాభివృద్ధిగా, ననంత జన్మభవహరంబుగా, మదీయవాక్పావనంబుగా, నగణితసుకృత ఫలదాయకంబుగా, భోగమోక్ష వరప్రదంబుగా, వుశిరోశిగ శివలింగ ప్రాచార్య మాహేశ్వరాంకితంబుగా, నా యొనర్పం బూనిన సమస్త వేదాగమ పౌరాణేతిహాససారంబగు, సకల భక్తమాహేశ్వర ముఖముకురంబగు శ్రీ చెన్న బసవ పురాణంబను మహాప్రబంధ ప్రారంభం బెయ్యది యనిన" —

అటుపై చెన్న బసవని మహిమలు వర్ణింపబడినవి. ఆ వర్ణనములు, మహిమలు, ఉత్సాహము, మత్తకోకిలము, తరల, మున్నగు వృత్తములందును గలవు. వీనికి పూర్వము కవి చెన్నబసవపురాణరచనమునకు తానసమర్థుడననియు అది మహాసాహసకార్యమనియు తన వినయమును చాటుకొన్నాడు. తాను కన్నడభాషలో నున్న చెన్నబసవపురాణము ననుసరించి దీనిని రచించినట్లు చెప్పుకొనుటచే తెలుగులో నీతడే మొదటిసారిగా చెన్నబసవపురాణమును పద్యకృతిగా రచించినట్లు మనము భావింపవలయును. అత్తలూరి పాపకవి చెన్నబసవపురాణ మీత డెరుగడన్నమాట.

తరల. అలర శివకవివరులు మును కర్ణాట భాషల నేర్పడన్
బలికి రీశ్వరభక్తివదనంపాదనీయముగా మదిన్

దలవ నందుల సూక్తులొనర నిదానముగ బొందించి నే
ర్పులును బిక్కటిలంగ శివకవి పుంగవుల్ ముదమందగాన్.

గీ. కలయ ఛప్పన్నభాషల గన్నతల్లి
తెలివి తేటతెనుంగున తెల్లమిగను
శివకవీంద్రులు నిది సుప్రసిద్ధమనగ
నవరసజ్ఞులు నిది నాణెమొనన రచింతు.

చెన్నబసవని మహిమలు వర్ణించి అటుపై రజతాద్రి వర్ణనములో కథాప్రారంభ మునకు గడంగినాడు.

గోపతిలింగకవి విరచిత చెన్నబసవపురాణాశ్వాసాంతగద్యములిట్లున్నవి:

"ఇతి శ్రీగిరి మల్లికార్జునదేవర దివ్యశ్రీకరుణాకలిత వరప్రసాద లబ్ధ కవితావిచిత్ర పాపయలింగనామాత్యపుత్ర గోపతిలింగనామధేయప్రణీతంబగు, సకలభక్తమాహేశ్వరనికరముఖముకురంబగు, సుకరశైవసిద్ధాంతరహస్య ప్రకరంబగు, వికసితభక్తి సుధారసపూరపారావారంబగు, ప్రకటిత శ్రీ చెన్న బసవపౌరాణంబను మహాప్రబంధమునందు ప్రథమాశ్వాసము."—

ఈ చెన్నబసవపురాణము బదాశ్వాసముల ప్రబంధము. ౧౮౮ తాటి యాకులపై నున్నది.

పంచమాశ్వాసాంతమునకు పూర్వము, పురాతన నూతన శివశరణుల స్తోత్రములున్నవి. వానికి పూర్వమొక పద్య మిట్లున్నది :

క. ప్రసరించె సోమనాథుడు
బసవారుల మహిమ చెన్నబసవపురాణం
బసలార ద్విపదకావ్యము
వసుమతి రచియించె భక్తవరులు నుతింపన్."

ఈ సోమనాథుని ద్విపద చెన్నబసవపురాణ మేమైనదో తెలియరాదు.

ఈ తాళపత్ర గ్రంథప్రతిని వ్రాసినవాడు గోపతి లింగకవి కుమారుడే. చిట్టచివరన "తుమ్మ గోపతిలింగం కొమారుడు మల్లయ్య వ్రాశిన చంన్న బసవపురాణం" అని యున్నది.

వ్రాయసకాడు ఆవన కమ్మమీద ప్రథమాశ్వాసాంత గద్యము ముగించిన తరువాత నిట్లు వ్రాసికొన్నాడు.

"నురాభాండేశ్వరం పుస్తకం పని వున్నాది యింట్లో పెద్దగూట్లె పౌదవు చంచ్చికె (సంచిక?) వున్నాదిబక్కాంణి (బక్కవానిని) తోలించినాం అగత్యంగ పంపించేది" —

తోలించినామనునది తెలంగాణ ప్రయోగము. ఇది ప్రాచీనకాలమందును వ్యవహారమున నున్నట్లు దీనివలన తెలియుచున్నది.

ఇక గోపతిలింగకవి రెండవకృతి "అఖండజ్ఞానసునః ప్రబోధవచన కావ్యప్రబంధము" కేవల మారుకమ్మలపై వ్రాయబడి యసమగ్రముగా నున్నది. పీఠికగూడ పూర్తిగాలేదు. ఆదిలో శివస్తోత్రము, అంగడీశ్వరుడగు తన గురుస్తుతియు, తలిదండ్రుల స్తుతియు పురాతనాధునాతనభక్తగణముల స్తుతియు జేసి "సకలవేదాగమశాస్త్రపౌరాణ రహస్యసారంబైన, షణ్మతాతీతంబైన, అవాఙ్మానసగోచరంబైన, సమస్తతత్త్వాంతరంబైన, వీరమాహేశ్వర ప్రభావ ప్రసిద్ధసిద్ధాంతంబైన పరమశివతత్వసుధారససారావారంబైన నిష్ప్రపంచనీరవ యనిర్గుణ నిరాశ నిత్య నిరంజాంన్య (?) మహాలింగ సంగావధానంబగు, ఖండ నద్వీద్వీరహితంబగు, నఖండజ్ఞానసునః ప్రబోధ ప్రబంధ విరచితోద్యోగ సంరంభియై" యుండగా, నొక మాహేశ్వరుడు వచ్చి దీనిని తన గురువున కంకితంబుగా నిమ్మని కోరును. కవి అందుల కీయకొని యా గురుస్తుతి చేయును. ఆ గురువు తోటమఠమున కధిపతియట. అతని గూర్చిన పద్యమిట్లున్నది :

గీ. తోట మఠమున నమిత సంతోషమునను
సంతతానందమయ పచ్చకాంత భగిని
మన గురుస్వామి భువి భక్తగణము నేలు
కొనుచు దిగ్దేశముల పూజ గొనుచునుండె.

అటుతరువాత కొలనుపాక సోమేశ్వరస్వామి వర్ణనము గలదు. కొలనుపాక వర్ణనముగల పద్యములతో నీ గ్రంథ మసమగ్రముగా ముగిసినది. ఆ పద్యములందొకటి రెండు—

మ. అమరుల్ పాదపముల్ ఖగంబులును నిత్యానందసింధుల్ పురిన్
అమరున్ గోవులు కామధేనువులు పుణ్యక్షేత్ర సద్వర్ణనం
బమరేంద్రాబ్జ భవాచ్యుతాదుల కశక్యం బన్నపూర్ణాంబకున్
భ్రమరాధీశునకున్ సుఖావహము సామ్రాజ్యైక తత్పీఠమున్,"

చ. కమలహితుండు తారలును గాలి సుధాకరుడున్ గ్రహంబులున్
అమరులు తాపసేంద్రులు మహాభయమంద పురంబు చుట్టునన్
గమిగొని భైరవుల్ ప్రహరి గాచుచు దా విహరింపుచుందు ర
క్క.మల.విరోధిమౌళి పదకంజములున్ మదిలో దలంపుచున్."

ఈ శివకవి విరచితములగు తక్కిన కృతు లేమైపోయినవో తెలియదు.

(ఉదయభాను, జనవరి 1962)

# నేబతి కృష్ణయామాత్యుడు

గోలుకొండగనిలో పుట్టి సుమారు నాలుగువందలేండ్లుగా మరుగున పడియుండి ఇన్నాళ్ళకు కన్నులు జిగేలు మనిపించిన కవివరహీరము నేబతి కృష్ణయామాత్యుడు. అతడు కేవలము కవికరుడే కాదు, అమాత్యశబ్దమాతని యెడ సార్థకము. కవియై, కవిపోషకుడై, మంత్రియై, మహమ్మదీయ సుల్తానుల సభాలంకారమై, భగవద్భాగవతకైంకర్యధురీణుడై విరాజిల్లిన నేబతి కృష్ణమంత్రి చరిత్ర మిన్నాళ్ళు మరుగున పడియుండుట విధివిలాసము. కృష్ణమంత్రి తండ్రి కమలయామాత్యుడు, తల్లి కొండాంబ. వీరిది కౌండిన్యస గోత్రము. గోలుకొండకు సమీపమున గల సిద్ధలూరు జన్మస్థలము. సిద్ధలూరునకు సమీపమున గల అనంతగిరిలో వెలసిన శ్రీ నరసింహస్వామి యిలువేలుపు. మహమ్మదుషాహి అని తెలుగు కవులు పేర్కొను మహమ్మదు ఖులీ ఖుతుబ్షా (1580-16.2) ప్రధానమండలిలో నొకడై, అతని యాస్థాన కవులందుగూడ నొకడై, మిత్రుడై "రాజనీతి రత్నాకర" మనునాశ్వాసముల కావ్యమును వ్రాసినవాడీ కృష్ణయామాత్యుడు[1]

'రాజనీతి రత్నాకరము' ౧౪౩ తాటాకుల గ్రంథము. ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయము సంస్కృత అకాడమీ లిఖితపుస్తకభాండాగారమందున్నది. దీనిని తొలుత కనుగొన్నవారు క్రీ. శే. కురుగంటి సీతారామయ్యగారు.[2] పరిష్కరించు తలంపుతో నెత్తి వ్రాసికొన్నవారు శ్రీ కౌతా రామకృష్ణశాస్త్రిగారు. నేబతి కృష్ణయామాత్యుడు పంచతంత్రము నాంధ్రత్వ ముద్రతో వైష్ణవప్రబంధముగా దిద్ది తీర్చి 'రాజనీతి రత్నాకరము'ను వెలయించినాడు.

రాజనీతిరత్నాకరము పీఠిక మిక్కిలి విలువైనది. సమకాలీన రాజకీయ చరిత్రముతోపాటు సమకాలీన సాహిత్యచరిత్రమును గూడ రాజనీతిరత్నాకర పీఠిక మన మన కందించుచున్నది. గురుస్తుతి సందర్భమున గల పద్యమువలన

---

1. వివరములకై చూడుడు. "ఖుతుబ్షాహీ సుల్తానులు-ఆంధ్రసంస్కృతి" పుటలు 97-112 ప్రచురణ : ఇదార-అద్బియాతె—ఉర్దూ. 1962.

2. చూడుడు. ఆంధ్రభాగవతోపన్యాసములు. పుటలు 21-22. ఆంధ్ర సారస్వత పరిషత్తు. 1957.

కృష్ణమంత్రి గురువు కందాళ రంగాచార్యులని తెలియుచున్నది. అటు తరువాతి పద్యములో కందాళ అప్పగారు స్మరింపబడినారు. ఈ కందాళ అప్పగారును వైజయంతీ విలాసకర్తయగు సారంగు తమ్మయగురువగు కందాళ అప్పగారును ఒక్కరై యుందురు. సమకాలీనులగు ఆచారపురుషులను స్మరించుపట్ల కృష్ణయామాత్యుడు అష్టభాషాకవిత్వవిద్యాధురీణుడును, పరాశరభట్టరాన్వయకులాబ్ధిచంద్రుడును, ముడుంబ శింగరాచార్యతనయుడునగు, శ్రీ సాధుభట్టరార్యులను స్మరించినాడు. ఇంతవరకు చరిత్రమున కెక్కని మరియొక మహాకవిని గూడ కృష్ణమంత్రి పరిచయము చేసియున్నాడు. ఆ మహాకవి మరింగంటి వెంకట జగన్నాథాచార్యుడు. ఆతడు గురుమూర్ధన్యుడట. శతవదాన బిరుదాంకుడట. ద్రావిడామ్నాయ తత్త్వరవజ్ఞుడట. సంస్కృతాంధ్ర రచనాదక్షుడట. హయాధీశకంధరసంలబ్ధనువర్ణవృష్టి యుతుడట, కర్ణాటక్షమాభృత్సభాంతరపూజ్యుడట. ఇంతటి మహాకవి కృతులేమైపోయినవో తెలియదు. మరింగంటి వెంకట జగన్నాథార్యుల తరువాత ఆంధ్రభాషానిరోష్ఠ్య మహాప్రబంధరాజిరచనాధురీణుడును, కర్ణాటరాయలబ్ధ కవిసార్వభౌమ కల్యాణబిరుదశాలియునగు మరింగంటి సింగరాచార్యులను స్మరించినాడు. ఈ మరింగంటి సింగరాచార్యులు చరిత్రమున కెక్కిన మహాకవి. వింశతి ప్రబంధనిర్మాత. దశరథరాజనందన చరిత్రము. నిరోష్ఠ్య సీతాకల్యాణము మున్నగు నీతని రచనము లాంధ్రసారస్వతలోకమున కీవరకే పరిచితములు. కృష్ణమంత్రి కూడ సామాన్యకవి కాడు. తన కవితావైభవాదుల నీతడు తన గురుపుకోట నీ విధముగా పలికించియున్నాడు.—

సీ. స్వర్ధునీవీచికాసంఘాతఘుమఘుమ న్నిర్ఘోషముల మించి నీటు గెలిచి
వామాభిమినీపాదవనజాత కాంచనాంగద ఝుళంఝుళరావగతుల దెగడి
నిర్జరద్రుమజాలనిస్సరన్మకరంద ధమధమన్నాద సంతతుల గేరి
కాంచీనితంబినీకాంచీలతాఘంటికా ఘణఘణరవక్రమము మించి
గీ. వెలసె భవదీయనరసోక్తి విరచితానవద్యగద్య సుపద్య కావ్యప్రబంధ
దండకోదాహరణక వితానిగుంభనములు కృష్ణప్రధానీంద్రనవరతీంద్ర. 1-33

చ. పరువపు బొండుమల్లియల బంతులొకోయన జాజులోయనన్
విరిసిరవాదిపువ్వులన వెన్నెలలో కుముదంబులోయనన్
సరసిజకర్ణికాకృతుల చల్లనితావుల పిక్కటిల్లుచున్
నెరసె భవత్కవిత్వములు నేబతి కృష్ణకళాధురంధరా! 1-34

క. కోనమదేవీవల్లభ గానకళాలోల సకలకవిబాంధవ ర
క్షానిధి వైష్ణవకల్పక ధీనిధి కమలేంద్రు నేబతిప్రభు కృష్ణా! 1-35

గీ. సరస చౌరాసిదుర్గరక్షాధురీణుడైన మహమదుశాహుసుల్తాను కీవు
గలప్రధానివిహితుడవుకవివరుడవుభళిరశ్రీకృష్ణకొండమాంబాసుపుత్ర! 1-36

పైవానిలో 83, 84 పద్యములవలన కృష్ణమంత్రి కవిత్వపటుత్వమును, 35వ పద్యమువలన కృష్ణమంత్రి భార్యపేరు కోనమ యనియు, అతడు గానకళాలోలుడనియు, సకలకవిబాంధవ రక్షానిధియనియు, వైష్ణవకల్పకమనియు, ధీనిధియనియు, తండ్రి కమలేంద్రుడనియు తెలియుచున్నది. 36వ పద్యము రాజకీయ, సాహిత్య చరిత్రములకు మిక్కిలి ముఖ్యమైనది. చతుర్థపాదమున కృష్ణమంత్రి జనని కొండమాంబ పేర్కొనబడినది.

కష్ణమంత్రి 84 దుర్గముల కేలికయగు మహమదుశాహు సుల్తానునకు ప్రధాని, హితుడు, మరియు కవివరుడట. మహమ్మదుశాహుసుల్తా నాంధ్రవాఙ్మయమున కీవరకే పరిచితుడు. సారంగు తమ్మయ తన వైజయంతీ విలాసమున నీ మహమ్మదు శాహినే 'ఎనుబదినాల్గు దుర్గముల నేలిన యేలిక'గా వర్ణించియున్నాడు. కీ. శే. కందుకూరి వీరేశలింగంపంతులుగారును మరియు కీ. శే. చాగంటి శేషయ్య గారును సారంగు తమ్మయ కాలమును గూర్చియు, మహమ్మదు శాహును గూర్చియు భిన్నాభిప్రాయములను ప్రకటించియున్నారు. ఇన్నాళ్ళీ సమస్య సుపరిష్కృతము గాకయుండెను. నేబతి కృష్ణమంత్రివలన ఇన్నాళ్ళకీ చిక్కుసమస్య శాశ్వతముగా పరిష్కరింబడినది. మహమ్మదుషా అనునది ఖుతుబ్షాహీ సుల్తానులందైదవవాడైన మహమ్మదు ఖులీఖుతుబ్షాకు (1580-1612) తెలుగువారు పెట్టిన పేరని తెలియుచున్నది. ఏలన నేబతి కృష్ణమంత్రి కొలిచినది మహమ్మదు శాహిసుల్తానును. కృష్ణమంత్రి తండ్రి కొలిచినది ఇబ్రాహీం ఖులీఖుతుబ్షాను. తండ్రి కొడుకులు కొలిచినది మరల తండ్రికొడుకులగు సుల్తానులే కావలయును గదా. ఇంబ్రాహీం ఖులీఖుతుబ్షాను ఆంధ్రవాఙ్మయమున మలికిభరాముడనియు ఇభరాముడనియు అందురు.

తనతండ్రియగు కమలప్రధానిని వర్ణించుచు నేబతి కృష్ణమంత్రి చెప్పిన పద్యమిట్లున్నది.

సీ. మలకిభరామక్షమానాథ చంద్రుండు మెచ్చగా సత్కీర్తి హెచ్చినాడు
పానుగంటీవర పట్టణాధ్యక్షుడై మించుగా ప్రజల పోషించినాడు

వసుధ నేకాదశీ వల్లభుడై ద్వాదశీ చూరకారుడై చెలగినాడు
కలనైన బొంకెరుంగక సత్యవాక్య ప్రతిష్ఠచే సిరుల వర్ధిల్లినాడు
నరస సంగీత మహిమల వరకవిత్వ లీల నాదిమసుకవుల బోలినాడు
తెలియ నచివేంద్ర మాత్రుడే యలఘు విభవధారి నేబది కమల ప్రధానశౌరి.

కనుక కమలమంత్రి కొలిచిన మలికిభరామ క్షమానాథ చంద్రుని కుమారుడును, కృష్ణమంత్రిచే కొలువబడిన మహమ్మదుశాహు సుల్తానును, మహమ్మదు ఖులీ ఖుతుబ్షాయే కావలెను. మరియు సారంగు తమ్మయవలెనే కృష్ణమంత్రియు మహమ్మదు శాహిని 84 దుర్గముల కధిపతిగా వర్ణించినాడు. ఈ 84 దుర్గము లెవ్వియో చారిత్రకులు తేల్పవలెను. పై పద్యములో కమలమంత్రికున్న ఏకాదశీవల్లభ, ద్వాదశీచూరకా యను రెండు బిరుదముల కర్థము నాకు తెలియరాలేదు. ఇవి యాతని విశిష్టాద్వైతమతసంప్రదాయమునకు చెందినవో యేమో తెలియదు. కృష్ణమంత్రి సప్తపురుషాంతరములనుండి తన వంశావతార మును దానిలోని శాఖోపశాఖలను విపులముగా వర్ణించియున్నాడు. ఇతర శాఖలను విడిచి కేవలము కృష్ణమంత్రి పూర్వుల క్రమ మిట్లుండును.

కౌండిన్యమౌని

- 1. అన్నమరాజు
  - 2. నాగరాజు
    - 3. అనంతప్రధాని
      - నాగేంద్రమంత్రి
      - 4. రామమంత్రి
        - 5. సిరియసంతుడు
          - 6. కమలనామాత్యుడు
            - 7. కృష్ణయామాత్యుడు (కృతికర్త)
            - నరసమంత్రి
        - తిరుమలేంద్రుడు
      - లక్ష్మణార్యుడు
      - సూరనామాత్యుడు
  - బసవరాజు
  - అనంతరాజు

పై వంశావతారమున రెండవ తరమునకు చెందిన నాగరాజు బెరంద కోట సులుతానుశహా సముఖమున నేబతిపని యుద్ధరించినవారట. అప్పటి నుండియు తమ ఇంటిపేరు నేబతివారైనట్లు కవి చెప్పియున్నాడు. నాగరాజు అశ్వపతి సులుతాని దక్షిణభుజాదండమై విలసిల్లెనట. నేబతి యనునది నియాబత్ అను పదమునకు తెలుగు రూపము. నియాబత్ పదమునకు రాయబారి యనియు స్థానాపతి యనియు రెండర్థములు కలవు. నాగరాజు బహ్మనీ సుల్తానుల స్థానాపతియై యుండునని నా యూహ. ఈ విధముగా కృష్ణయామాత్యుని యమాత్యపదవి నరుమంత్రపు సిరి కాదనియు, ఆరేడు పురుషాంతరములనుండి యాతని పూర్వులు రాజకీయముగా గొప్ప పదవు లలంకరించిన వారనియు తెలియుచున్నది. తండ్రియగు కమలమంత్రి పానుగంటి పట్టణాధ్యక్షుడట. అనగా పానుగల్లు దుర్గాధిపతి యని యర్థము కాబోలు. తన తండ్రి సిద్ధలూరులో సప్తసంతానప్రతిష్ఠ యొనర్చినట్లు వర్ణించియున్నాడు. తమ్ముడగు నరస మంత్రియు "చెలిమి మహమ్మదు శాహు సుల్తాను సమ్ముఖమున జనులెన్న బొదలినాడు" బమ్మెర పోతనార్యుడు మత్కులవరేణ్యుడనియును స్మరించినాడు. పీఠికాగతములగు నితరవిషయము లన్నియు విస్తరభీతిచే విడిచి, కేవలము ముఖ్యమైన వానినే పేర్కొంటిని.

నేబతి కృష్ణయామాత్యుడు విశిష్టాద్వైత సంప్రదాయమునకు చెందిన నియోగి. కనుక రాజనీతిరత్నాకరమును గూడ ఆ సంప్రదాయము ప్రకారముగనే దిద్ది తీర్చినాడు. మొదటి పద్యమున శ్రీ మహావిష్ణువును, రెండవ పద్యమున శ్రీ మహాలక్ష్మిని, మూడు నాలుగు పద్యములందు అనంత గరుడ విష్వక్సేనాదులను మరియు పూర్వాచార్యులను స్మరించినాడు. రాజనీతి రత్నాకరము కృష్ణమంత్రి తన ఇలువేలుపగు అనంతగిరి శ్రీ నరసింహున కంకితముగా రచించెను. పీఠికలో నీ యనంతగిరి నరసింహస్వామి సన్నిధిని మోహనాంగులు నెరపు సేవావిధానంబు శృంగార తరంగ సంగీత విద్యావధానంబుల పెక్కురీతులను వర్ణించియున్నాడు. చివరన షష్ఠ్యంతములు చెప్పి కథాప్రారంభమునకు గడిగినారు.

కృష్ణ మంత్రికి తనకన్న సుమారు మూరేండ్లు ముందుగా దూబగుంట నారాయణ కవి రచించిన పంచతంత్రము తెలియనట్లున్నది. ఏలన పీఠికలో కవి,

గీ. ఫళిరె తొల్లిటి కవులు ప్రబంధ కర్తలయ్యు నీ రాజనీతి రత్నాకరంబు
సేయకుందురె(రు?)మున్ను నేజేయుసుకృతికలననీకృతిరచింపగలిగెగాక"

యని చెప్పియున్నాడు. ఈ పద్యమునకు ముందున్న పద్య మిట్లున్నది.

క. వరరాజనీతి రత్నాకర మీకృతి, చరిత విష్ణుకథ, నాథుడు శ్రీ
నరసింహుడట ఫళి బంగరువునకున్ బరిమళంబు గలుగుటగాదే.

దీనివలన కృష్ణమంత్రి దీనిని వైష్ణవప్రబంధముగా రచించినాడని తెలియును. కనుకనే శ్రీరంగము వర్ణనముతో కావ్య మారంభమైనది.

కథాప్రారంభమునగల పద్యమిది.

గీ. ఇందిరాసుందరీ కేళిమందిరంబు, నిజవనీ సౌరభాగతేందిందిరంబు
ధరణి కాంతావదాబ్జనూపురముదనరు, రమ్యవిభవాకరంబు శ్రీరంగపురము.

శ్రీరంగపుర మీ విధముగా నిరువది గద్యపద్యములందు ప్రబంధోచితముగా వర్ణింపబడినది. పురవర్ణనము, చాతుర్వర్ణ్య వర్ణనము, చతురంగబలముల వర్ణనము, వారవిలాసినుల వర్ణనము లన్నియు ప్రౌఢముగా శబ్దాలంకారమయములుగా నున్నవి. శ్రీరంగనగరము చుట్టునున్న యగడ్తను వర్ణించు పద్యమిది:

సీ. ఉబ్బు సొక్కులనొంద నొద్దతో రాపాడు జడచిత్తుడెప్పుడు ఉడుకుబోతు
తమ్ములపగవాని తండ్రి రక్కసిమూక కడుపులో నిడుకొన్న కలకదారి
త్రుళ్ళుచునుండు కోతుల కెట్టుబట్టువా డతివిసపాది కొండాటకాడు
వచ్చినవారిచే వడుసుళ్ళబడి మొరపెట్టు నూరక చుట్టిచుట్టి తిరుగు
నలసముద్రుండు నాకునీడగునెయనుచు, తన తరంగఘుమంఘుమికార వాట్ట
హాసములచే గయాళించునట్ల తనకు, నగణితస్ఫూర్తి నమ్మహానగరిపరిఖ.

ఈ సందర్భముననే శ్రీరంగమందలి వారకాంతలను వర్ణించిన సీసపద్యము తరువాత నచటి యౌవనాంగుల బొంగరములాట నీ విధముగా వర్ణించినాడు.

కం. బంగరు బొంగరముల నృపపుంగవు నతులదర నఖులు బుచ్చుకొని వడిన్
ఖింగురని మోయ సౌధప్రాంగణముల యౌవ్వనాంగు లాడుదు రెపుడున్.

శ్రీరంగపురవర్ణనమైన పిమ్మట తదధీశుడగు సుదర్శన చక్రవర్తి వర్ణనము నాల్గు పద్యములందున్నది. సుదర్శనుడు వైష్ణవుడుగా చిత్రింపబడినాడు..

అతని యాస్థాన వర్ణనము కడుదీర్ఘముగా సాగినది. అదియు పదునారవ శతాబ్దపు దర్బారుల వర్ణనము వలె నున్నది. విష్ణుశర్మ సభాప్రవేశ మొనర్చిన సమయమున సుదర్శన చక్రవర్తి "తనదండ శ్రీమద్రామాయణ మహాకావ్యంబు నకు ననేకార్థంబు పుట్టి కర్ణపర్వంబుగా శ్రీ వైష్ణవస్వాములు వినుపింప సంతోషించు" చుండెను. సుదర్శనుడు విష్ణుశర్మకు తన కుమారుల నప్పగింప నాతడు "రాకుమారులారా వినుండు! మిత్రభేదంబన, సుహృల్లాభంబన, సంధి విగ్రహంబన, లబ్ధనాశంబన, అసంప్రేక్ష్య కారిత్వంబన బరగునివి పంచ తంత్రంబులు. అందు ప్రథమతంత్రంబను మిత్రభేదం బన్నది యెరింగించెద" అని కథలు చెప్పుట ప్రారంభించును.

మిత్రభేద మెరింగించుపట్ల ప్రారంభమున కాంచీపురము వర్ణనమును శ్రీ వరదరాజస్వామి వర్ణనమును గలవు. అచ్చటి బేహారి విష్ణువర్ధనుడు వరద రాజస్వామికి గోపురప్రాకారమంటపంబు లనేకంబులు గట్టి పరమభాగవత కైంకర్యధురీణుడైనవాడుగా వర్ణింపబడినాడు. అతడు నందనసంజీవకాహ్వయములు గల వృషభములను బూన్చిన బండిపై బేహారమునకు బయలు దేరును. అతడు కొన్నాళ్ళు ప్రయాణముచేసి వెంకటనామశైల ప్రాంతమునకు వచ్చెను. అప్పుడు విష్ణువర్ధనుడు

గీ. కాంచిమాకాంచికాపురి కంటెజూడ, కన్నులకుపండువై యున్న దెన్నసనుచు
దిగువతిరుపతి యందు మాళిఘలవిడిని, నచటకొందరసునిచితానతులభక్తి.

ఆళ్వారుతీర్థమున స్నానమాడి తిరుమణి తిరుచూర్ణములు ధరించి పన్నిద్ద రాళ్వారుల బ్రస్తుతించి గోవిందరాజుల గొలిచి చూడుకొడుత్తనాచ్చియారుకు వందనము చేసి, అలిపిరి గోపురము కడచి, ఆయా విగ్రహముల సటనతించి స్వామి పుష్కరిణిలో స్నానమాడి నీడదిరుగని చింతను వర్ణించి గరుడస్తంభమునకు ప్రదక్షిణ మొనర్చి అటుపై వెంకటేశ్వరస్వామిని దర్శించి లక్షద్రవ్య మర్పించును. వెంకటేశ్వరస్వామి విష్ణువర్ధనుని భక్తికి మెచ్చి కమ్మల పొదకట్టి "నీవు దెచ్చిన సంజీవక వృషభంబుల నాకు సమర్పించరా" యని కోరును. విష్ణువర్ధనుడు సంజీవకమును స్వామికి సమర్పించి దిగువతిరుపతిలో బేరము చేయుచుండును. ఇది ఇట్లుండ సంజీవకుని వర్ణనము.

క. దినదినము నరవపిళ్ళలు, పనుపడగా నానవాల పాసెపుముద్దల్
దినుపింప వృషభ మెచ్చెన్, మినమినమని మేనిచాయ మించులు జూపఁ

సీ. కోనేరు తీర్థంబు గ్రోలి వచ్చుటలచే వెంకటేశముఖాబ్జ వీక్షణమున
సతతవైష్ణవదివ్యసల్లాపకథలచే ద్రవిడప్రబంధార్థతతులచేత
శ్రీ భాగవతభుక్తశేషంబు గొనుటచే సజ్జనోత్తమ వికస్పర్శనమున
కల్పకారామసంగతి జరించుటచే వివిధమున్యాశ్రమ విహరణముల
గాంచెసుజ్ఞానవిభవంబుగాంచెయుక్తి, గాంచెరామాయణాదిభాగవతపురాణ
వేదవేదాంతశాస్త్రార్థవిశదబుద్ధి, భీర సంజీవకుడు కళాప్రౌఢిమమున.

ఈ విధముగా పంచతంత్రముపై వైష్ణవముద్రయు మరియు నాంధ్రత్వ ముద్రయు సన్పొత్తి రాజనీతిరత్నాకరమును వెలయించినా డీ గోలకొండ నియోగి మంత్రి.

నేబతి కృష్ణమంత్రి తన యాశ్వాసాంతగద్యములం దాయా యాశ్వాసములందలి విషయమును క్లుప్తముగా నిచ్చియున్నాడు. ఆ శ్వాసాంతగద్యము లీ తీరుగా నున్నవి :

I ఇది శ్రీ మదనంతసంతత కృపాకటాక్షసంప్రాప్త సరసవిద్యానిధాన రామానుజాచార్య కథానుసంధానమానస కౌండిన్యగోత్రపవిత్ర నేబతి కమలేంద్రు పుత్ర పరమభాగవతకైంకర్యధుర్య కృష్ణయామాత్య ప్రణీతంబైన రాజనీతిరత్నాకరంబున మిత్రభేదంబునందు పురవర్ణనయును, రాజవర్ణనయును, రాజాస్థాన శృంగార వర్ణనయు, కాంచికా వెంకటప్రభావంబును, కరటక దమనక సంహారంబును, స్తంభవివరంబున మర్కటంబు చిక్కు పడుటయు, జంబుకంబు వెరవు దీరుటయును, పింగళకసంజీవకమైత్రి గలుగుటయు నన్నది ప్రథమాశ్వాసము.

II ఇది శ్రీ......రాజనీతిరత్నాకరంబునందు మిత్రభేదంబున సంజీవకుం డొనర్చు పౌరుషత్వంబునకు దమనకుండు విరోధించుటయును, మేష యుద్ధంబుచే జంబుకంబు గెడయుటయును, ఆషాఢభూతిగాదనువాడు పొరిపుడుక విశ్వాసంబు చూపి కుదువసొమ్మపహరించుటయు, వాయస కాకోదరోపాఖ్యానంబును, శశకం బుపాయాంతరంబుచే కంఠీరవంబును బడగొట్టుటయును, దమనకుండు పింగళకు నొద్దకు కొండెంబు జెప్ప వచ్చుటయు నన్నది ద్వితీయాశ్వాసము.

III ఇది శ్రీ......రాజనీతిరత్నాకరంబను మహాప్రబంధంబునందు మిత్రభేదంబను ప్రథమతంత్రంబున దమనక పింగళక నీతివిచారంబును, డిండిభుండు వచ్చుటచే మందవిసర్పిణి గెడయుటయును, దమనక సంజీవక నయవివాదంబును, సింహంబు లోటిపెటను నమ్మించి ద్రోహంబు సేయుటయు, టిట్టిభటిట్టిభీ సంవాదంబును, కూర్మంబు యష్టి విడిచి పెట్టుటయు, అనాగత విధాతయు నుత్పన్నమతియును భవిష్యండును, మత్స్యత్రయవిచారంబును, గోపికాంగన జారద్వయంబు మోసపుచ్చుటయు, క్షీరాబ్ధివర్ణనయు, శ్వేత ద్వీపవర్ణనంబును, శ్రీమన్నారాయణుండు గరుడవాహనారూఢుండై టిట్టిభకి ప్రసన్నుండై సముద్రుని చేత గ్రుడ్లనిప్పించుటయు, దమనకుండు సంజీవకునితో యుద్ధక్రమంబు జెప్పుటయు, మర్కటంబునకు (సూ)చి ముఖుడను పక్షి బుద్ధిచెప్పబోయి గెడయుటయు, సుబుద్ధి దుర్బుద్ధి సం(వాదం)బును, బకడింభకుల నొకముంగిన రక్షించుటయును, లోహార్థంబు ఇద్దరు శెట్లు పోరి తగపున దె(గుట)యును, సంజీవక పింగళకులు పోర శ్రీ వెంకటేశ్వరుండు ప్రసన్నుండై సంజీవకుని రక్షించుటయు నన్నది తృతీయాశ్వాసము.

IV ఇది శ్రీ......రాజనీతిరత్నాకరంబను మహాప్రబంధంబునందు సుహృల్లాభంబను ద్వితీయతంత్రంబున లఘుపతనకుండు రాగా గని శాల్మలి...పై నిల్చుటయును, జాలరివాడు వచ్చి క్రింద వలయొడ్డిన చిత్రగ్రీవాది కపోతంబులు వచ్చి చిక్కుబడుటయును, అవి భీతిల్లి వాని నెత్తుకొని యెగసి చని హిరణ్యకునిచే బంధనంబులు విడిపించుకొనుటయు, వాయస మూషక స్నేహంబును, మందరంబు మూషకంబుతో నిష్టమైత్రి గావించుటయును, మూషకంబు తన పూర్వ వృత్తాంతంబు జెప్పుటయును, సారంగంబు వచ్చి మందరాదులతోలడ సఖిత్వంబొనర్చుటయును, వేటకాని యురుల హరిణంబు దగులుపడుటయు, నెమక వచ్చిన యెలుకకు తొల్లిటి నిర్బంధంబు చెప్పుటయు, చెంచువాడు చనుదెంచుచో నవియు దొరకకుండిన కూర్మంబును బట్టుకొనుటయు, నా ముప్పురు నుపాయంబున కనుతంబును సాధించుటయు, నలుపురు గూడి సంతోషచిత్తులై శ్రీరంగ దివ్యభూషుల స్థ(లం) బొనర్చుకొని యుండుటయు నన్నది చతుర్థాశ్వాసము.

V ఇది శ్రీ......రాజనీతిరత్నాకరంబను మహా ప్రబంధంబునందు మేఘ
వర్ణుం డరిందమునిచేత తరుముడుబడి పోవుటయు, సకలపక్షులు గూబ
యొకగూబను పట్టంబు గట్టగా నొక వృద్ధవాయసంబు వచ్చి విఘ్నంబు
సేయుటయు, వ్యపదేశంబుచేత శశకంబు గజంబులం బోగొట్టుటయు,
శశక పింజలుల యన్యోన్య వాదంబులచే మార్జాలంబు గెడయుటయు,
బ్రాహ్మణుండు ధూర్తులచేత వంచింపంబడి అయ్యజంబు విడిచిపెట్టు
టయు, యజ్ఞపశు పదార్థంబు భక్షించి విఘ్నంబు సేయుటయు, రథకారుని
భార్య యన్యపురుషుని గూడి ప్రియుని సంతోషపెట్టుటయు, గౌతము
ప్రభావంబున మూషికి కన్యయై మునుపటి రూపంబు గైకొనుటయు,
కపటోపాయమైత్రిచే చిరంజీవి గద్గదస్వరంబున శరణొందిన నా యరిందు
ముందు తన ప్రధానులతో విచారంబు గావించుటయు, సార్థవాహుండను
వైశ్యుండు చోరున కుపకారంబు సేయుటయు, ఒక్క బ్రాహ్మణునకు
చోరరాక్షసులు హితవు చెప్పుటయు, రథకారుండు తన భార్య విటునిం
గలయంజూచి క్రోధంబు మాని ఆయువతి వాక్యంబులకు సంతసించుటయు,
అరిందమాదుల గిరిప్రదేశంబుల నుంచి చిరంజీవి మేఘవర్ణునింగూడి
అరిందమ మునీంద్ర తత్ప్రధానిపంచకంబుల నిర్జించుటయు, కృష్ణ
సర్పంబు జాలపాతాదిమండూకంబుల భక్షించుటయు, తత్ప్రధానివలన
వాయసాధీశ్వరుండు నిశ్చింతుండై పుత్రమిత్రకళత్రసూత్యులతో గూడి
రాజ్యంబు సేయుచు సుఖం బనుభవించుటన్నది సంధివిగ్రహంబను
తృతీయతంత్రంబు పంచమాశ్వాసము.

VI ఇది శ్రీ...—రాజనీతిరత్నాకరంబను మహాప్రబంధమునందు చతుర్థ
తంత్రంబను లబ్ధనాశనంబున బలివదనుండు శింశుమారునితో సఖ్యంబు
గావించుటయు, అతండు కపటోపాయంబు దలంచికొని ఉదుంబరవృక్షంబు
కపీంద్రుండెక్కుటయు. దానికి జంబుకంబు (           ) మృగేంద్రునకు
లోనయ్యెనను వృత్తాంతంబు జెప్పుటయు, నన్న చతుర్థతంత్రంబున లబ్ధ
నాశంబయ్యె, నటమీద నసంప్రేక్ష్యకారిత్వంబుగల పంచమతంత్రంబున
నొక బ్రాహ్మణుండు దన కులాంగనకు మంచి కుమారునిం బుట్టించెద
ననుటయు, అసాధ్వి అనాగతచింత వలవదని విద్యాభ్యాసియను భూసురుని
కథచెప్పుటయు, అతండు భార్యవలన కుమారునిం గనుటయు, కులాంగన

పెనిమిటివద్ద కుమారుని నుంచి జలంబులకుం బోవుటయు, తిరుగవచ్చు
లోన వాడు సాహసంబున నకులంబును గెడపుటయు, అతండుభార్యవలన
నాపితుండు నిక్షేపార్థంబుజేసిన విధంబెరింగించుటయు నన్నది ఉభయ
తంత్రంబులు సర్వంబును షష్ఠమాఖ్యానము"—

ప్రచివర కమ్మపై (౧౪౬) ఈ తాళపత్రప్రతి వ్రాసిన తిథివారాదులున్నవి.
ంబి సంవత్సర మార్గశిర బహుళపంచమి గురువారమునాడు టోనాల అప్పన్న
మారుడు వెంకటాద్రి యీ ప్రతిని వ్రాసికొన్నట్లు గలదు. ఇది 6-12-1838
దికి సరిపోవుచున్నది.

అడిగెదు దిక్కులేక తెలంగాణమందు పుట్టిన కృతు లిట్టి వెన్నినశించి
యినవో మరి యెన్ని మూలమూలల నణగియున్నవో తెలియరాదు నేటి
లమున నీ తాటియాకుల గొడవ యేరికిని పట్టిరాక వెట్టికి పుట్టిన బిడ్డవలె
న్నది.

(ఉదయభాను, ఫిబ్రవరి 1962)

# పరశురామపంతుల లింగమూర్తి

## రెండు వేదాంత శతకములు

తెలుగు వాఙ్మయమున శతకములకున్న ప్రాముఖ్యమును వాని వైవిధ్యమును సాహిత్యజ్ఞు లెరుగుదురు. శతకవాఙ్మయమున వేదాంతశతకముల దొక యుపశాఖ. ఇటీవల రెండు అముద్రిత వేదాంతశతకములు నా కంటబడినవి. ఇవి యిన్నాళ్ళిట్లు మూలబడియుండుటకు కారణ మేమో నాకు తెలియరాదయ్యెను. రచయిత ఏ యనామకుడో యనుకొందమన్న నటులగాదు. తెలుగు వేదాంతవాఙ్మయము ప్రసక్తి వచ్చినంతనే చేతులెత్తి మ్రొక్కవలసిన మహానుభావుడా రచయిత. మరి యీ శతకములకీ దుర్గతి యెట్లు పట్టెనో నా వంటి యల్పజ్ఞున కూహకందని విషయము. పరశురామపంతుల లింగమూర్తి గారి పేరు విననివారుండరు కదా! ఆయన రచించిన సీతారామాంజనేయమును గూర్చి తెలియని సాహిత్యజ్ఞులుండరు కదా! అంతటి మహాయోగి-కారణజన్ముడు-రచించిన ఈ శతకములు మూలబడి యుండుటే కాదు. వాని పేరులు కూడ సాహిత్యచరిత్రమున కెక్కలేదు. సీతారామాంజనేయమునకు పీఠికను సంతరించిన కీ. శే. శేషాద్రిరమణకవులు పరశురామ పంతుల లింగమూర్తి గారి కృతులారింటిని పేర్కొన్నారు. ఆ యారింటిలో నీ శతకములు లేవు. ఈ ఆరింటిలో నొకటియగు మానసశతకమే కీ. శే. వంగూరి సుబ్బారావుగారు పేర్కొన్న మనశ్శతకము. నా కంటబడిన ఈ రెండు శతకములు ఆత్మారామ, గోవింద శతకములు. నాకు జూడ ఈ శతకములు లింగమూర్తి యోగి కడపటి రచనములని తోచుచున్నది.

పరశురామపంతుల, శ్యామపంతుల మున్నగు నియోగులు తొలుత మహారాష్ట్రులనియు, ఓరుగల్లు మండలమునకు వలస వచ్చి యట స్థిరపడి పోయిరనియు ప్రాతతరములవారు చెప్పగా వింటిని. పరశురామపంతుల

వారు అంబాల, ఈదులవాయ, నుట్టెవాడ మున్నగు ప్రాంతము లందున్నారు.
లింగమూర్తి పదునెనిమిదవ శతాబ్దమున నున్నవారు. అతని సీతారామాంజ
నేయము క్రీ. శ. 1760 ప్రాంతములందు రచింపబడియుండునని కీ. శే.
శేషాద్రిరమణకవు లూహించియున్నారు. వారు లింగమూర్తి రచనములని
పేర్కొన్న 1. రతిమన్మథ విలాసము 2. జీవన్ముక్తి ప్రకరణము 3. బ్రహ్మ
నారద సంవాదము 4. తారకయోగము 5. మానస శతకము (కందములు)
6. సీతారామాంజనేయము కాక తరువాత కాలమున బయలుపడి అచ్చైనది
'సీతపాట'యను నద్భుతగేయ కావ్యమొకటి కలదు.[1] లింగమూర్తి గొప్ప
వేదాంతవేత్త మరియు మహాభక్తుడు. పోతన్న గోపన్నలవంటి మహానుభావుల
వెన్నుదన్ని పుట్టిన లింగమూర్తి భక్తివైరాగ్యముల కూడలి. అతని జన్మ
చేతను, నివాసముచేతను పావనమైనది నుట్టెవాడ (ఓరుగల్లులో నొక
భాగము). లింగమూర్తిగారి యిల్లు తద్వంశీయుల కిప్పటికిని వాసయోగ్యమై
తద్భక్తులచే గౌరవింపబడుచున్నది. ఈ పావనగృహమును ప్రభుత్వమువారును
ప్రజలును మనదేశపు పుణ్యతీర్థములందొకటిగా భద్రపరుపవలసిన యుగత్య
మెంతేని కలదు. పరశురామపంతులవారి వంగడము లింగమూర్తి ఆదిగా
ఆధ్యాత్మికవిద్యల కాలవాలమైనది. ఎన్నియో భక్తివేదాంతగ్రంథముల
వంశీయులచే వ్రాయబడినవి.[2] లింగమూర్తి రానుమంత్రితిమ్మమాంబల
కుమారుడు. అతని జీవితవిశేషములు కవిచరిత్రముల కెక్కియుండుటచే వాని
గూర్చి వ్రాయనక్కరలేదు. ప్రస్తుతను ఆత్మారామ గోవిందశతకములను
పరిచయము చేయుటే నా కర్తవ్యము.

ఈరెండు శతకములును, మరికొన్ని పంచరత్నములును రెండు బెత్తెల
పొడవుగల ౩౪ తాటియాకులపై వ్రాయబడి ఉస్మానియావిశ్వవిద్యాలయము
సంస్కృత అకాడమీలో (నెం. 431) భద్రముగా నున్నవి.

---

1. చూడుడు: తెలుగు జానపదగేయ సాహిత్యము. 1958, పుటలు
384-392

2. చూడుడు: "సాహితి" మాసపత్రిక, ఏలూరు, సంపుటము 1సంచిక
3 జనవరి 1962 ఆంధ్రుల సంస్కృత సాహిత్యసేవ. పుటలు 13-17

ఆత్మారామశతకము ౧-౧౩ కమ్మలమీదను, గోవిందశతకము ౧౩-౨౯ కమ్మలపైనను, పంచరత్నములు వేరుగా ౫ కమ్మలమీదను వ్రాయబడి యున్నవి.

ఆత్మారామశతకమున మొత్తము ౧౦౬ కందపద్యములున్నవి. 100 పద్యముల తరువాత "శ్రీరామార్పణమస్తు" అని ముగించి తక్కిన ఆరు పద్యములలో గురుస్తుతి, కృతి ప్రశంస, ఫలశ్రుతి మున్నగునవి చెప్పబడినవి. ఈ శతకమున ప్రతిపాద్యమైన వేదాంతవిషయములును, శైలియు దెలియుటకునై స్థాలీపులాకన్యాయముగా అట నట కొన్ని పద్యము లుదాహరింతును.

క॥ నరనారాయణు(ల)ము మన
మిరువురము నవిద్యవలన నేకాత్ముల మ
క్షరపురుషవరమపురుషుల
మరయంగా విద్యవలన నాత్మారామా (2)

క॥ నిను గనియెదనను వాంఛన్
ఘనదేహేంద్రియమనముల కడ ద్రోచిన యం
తన నీవే నేనైతిని
యనుభవమిది యతివిచిత్ర మాత్మారామా. (8)

క॥ నిమ్నోన్నతములు గాని సు
షుమ్నామార్గమున నిన్ను జూచి జితప్ర
ద్యుమ్నులగు యోగిపుంగవు
లామ్నాయవిధిం భజింతు రాత్మారామా. (46)

క॥ శ్రద్ధాభక్తులు మొదలగు
బుద్ధివికారములు నన్ను బొందునె నేనా
బుద్ధ విశుద్ధ సమిద్ధమ
హద్భాసకుడనగుట నాత్మారామా. (61)

క॥ జపములు తపములు వ్రతములు
చపలమనోనియమములు విచారింపగ నె
ల్లపు డమునస్కుడవగు నా
కవరారోపణము లేల ఆత్మారామా. (84)

క॥ నానా దేశములందును
నానాకాలములయందు నానాజగముల్
నేనై వెలుగుదుగాన స
దానందాత్మకుడ కేవలాత్మారామా. (100)

క॥ గురుడనగా నీశ్వరుడగు
స్థిరమతి శిష్యుండనంగ జీవాత్ముం డ
య్యిరువుర కైక్యస్థానం
బరయంగా పరమపదము నాత్మారామా. (101)

క॥ అని యివ్విధమున నామది
ననిశము విలసిల్లు శ్రీమహాదేవగురుం
డనవగు (?) నీకిప్పుడు నా
యనుభవ మెరిగించితిన్ మహాత్మారామా. (108)

క॥ ఇల పరశురామపంతుల
కులజ శ్రీ లింగమూర్తి గురుడవు నీవై
పలికితివి గాక నితరుల
కలవడునే యిట్లు బలుక నాత్మారామా. (106)

ఈ శతకాంతమున వ్రాయసకాడు తన్నుగూర్చియు తిథివారాదులగూర్చియు నీ విధముగా వ్రాసియున్నాడు.

"కాళయుక్తి నామ సంవత్సర వైశాఖ శు॥ ౧౨ శుక్రవారం అయిదు గడియల ప్రొద్దు యేక్కేవరకు రాపాకచంద్రయ, మామిళ్ళపల్లి వెంకట రాముడు, మా యింట్లో దక్షిణపు అరుగుమీద కూచ్చుండగాను బ్రహ్మానంద స్వరూపులైన పరశురామపంతుల లింగమూర్తి అయ్యవార్లగారి పుస్తకంలో చూశి నక్కా నరసంభట్లు వ్రాశినాడు."

వ్రాయసకాడు కోర్టులో ప్లీడసువలె దేశకాలములను సాక్షులను రుజువు పరచినట్లుగా నింత వివరముగా వ్రాయుట కొంత వింతగానే యున్నది. వ్రాయసకాడిచ్చిన తిథివారములు క్రీ. శ. 27-4-1798 నాటికి సరిపోవు చున్నవి.

పదునైదవ కమ్మ రెండవవైపున 'గోవిందశతకము' ప్రారంభమైనది. ఈ శతకమున మొత్తము 111 పద్యములున్నవి. ఇందులో కూడ 100 పద్య

ముల తరువాత 'శ్రీరామా' అని ముగించి తక్కిన 11 పద్యములు వ్రాయబడినవి. ఆత్మారాము శతకమంతయు వేదాంతవిషయములతో నిండియున్నది. కాని గోవిందశతకమున భక్తివేదాంతములు రెండును ప్రతిపాద్యములు. గుణకీర్తనము గల పద్యముల సంఖ్య గోవిందశతకమున నధికము. దీనినుండి కూడ మచ్చుకుగా కొన్ని పద్యము లుట్టంకింతును.

క॥ శ్రీ లక్ష్మినారాయణ
నీలాంబుదనిభశరీర నిగమాధారా
లీలావిహార నిర్మల
శీల చిదానందకంద శ్రీగోవిందా. (౧)

క॥ యోగకర యోగవిద్వర
యోగాభ్యాసప్రవీణ యోగాధారా
యోగైశ్వర్యపరాయణ
యోగానందానుభూతియుత గోవిందా (౧౩)

క॥ క్షరతత్త్వము నంటక న
క్షరపురుషుని మించి సర్వసాక్షి యనంగా
పురుషోత్తముడని వెలసిన
పరమాత్ముని నిను భజింతు పరగోవిందా. (౪౪)

క॥ జ్ఞానికి మిక్కిలి ప్రియుడను
నే నతడును నాకు ప్రియుడు నిక్కముగా నా
జ్ఞానియె నేనని మును మీ
రానతి యిచ్చితిరి కాదె హరి గోవిందా. (౫౧)

ఈ శతకమున ౮౪ వ పద్యమునుండి వివిధావతారముల స్తోత్ర మున్నది. పరశురామావతార స్తోత్ర మిట్లున్నది.

క॥ ధరణీసురవరద మహా
పరశుధర నృపాలజలధిబడబానల భా
సురసుతపోధన ఘనసుం
దర భార్గవరామ రూపధర గోవిందా (౮౮).

లింగమూర్తి తనకృతిని గూర్చి చెప్పిన పద్యమిట్లున్నది.

క॥ ఈ స్తోత్ర రత్నరాజము
కౌస్తుభమణితుల్యముగను గని కానుకగా
హస్తాబ్జంబుల గైకొని
విస్తరముగ మై ధరింపవే గోవిందా. (10౮)

కవి తనను గూర్చి ఈ విధముగా వ్రాసికొన్నాడు.

క॥ ఇల పరశురామ పంతుల
కులజ శ్రీ లింగమూర్తి గురుమూర్తి నము
జ్జ్వల గోవింద స్తోత్రము
నలలితమతి జేసె నిద్ధ శతకము చేతన్. (111)

ఈ పద్యము తరువాత "శ్రీ సీతారామ పరబ్రహ్మణే నమః, శ్రీ లింగమూర్తి పరబ్రహ్మణే నమః" అని ముగించి వ్రాయనకాడు తానొక పద్యమును వ్రాసివట్లున్నాడు.

క॥ దయ నాదరింపు భక్తహృ
దయ నాఫణిశయన వికసితాంబుజనయనా
నయనామయ నామయ నా
భయనాశము చేసి మమ్ము పాలింపు హరీ.

దీని తరువాత వ్రాయనకాడు నక్కా నరసంభట్లు తిథివారాదుల గూర్చి యిచ్చిన సాక్ష్య మీతీరుగా మన్నది.

"కాలయుక్తి సంవత్సర వైశాఖ శు॥ ౧౩ నృసింహజయంతినాడు నక్కానరసంభట్లు జాపాకకు జానకిరాముడు భోజనానికి పిలిస్తే ఆ వూరికి పొయి గంపావారింట కూర్చుండి తూర్పు ముఖానను కూర్చుండి నక్కా నరసంభట్లు వ్రాసినాను" ఇందు పేర్కొనబడిన తిథి మున్నగునవి క్రీ. శ. 28–4–17౮౮ నాటికి సరిపోవుచున్నవి. జాపాక ఓరుగల్లుకు సమీపమందున్న యొక గ్రామము. గంపావారు కోమటులై యుందురు. ఆ యింటి పేరుగల కోమట్లు మాయూర నున్నారు.

ఇంతటితో నీ రెండు శతకములు ముగిసినవి. ఈ తాళపత్రగ్రంథము రెండవ వైపునుండి పంచరత్నము లారంభమైనవి. ఇవి అరుకమ్మలపై నున్నవి. మొదటి పంచరత్నములు సీసపద్యములు. పంచరత్నములని

వ్రాయబడియున్నను ఈ సీసపద్యము లారున్నవి. ఈ యారు సీసపద్యముల కును మకుటముగానున్న ఎత్తుగీతి యొకటే. సీసపద్యములందు మొదటిది

సీ॥ మొదలు ప్రాణాపానములను తద్రేచకపూరకకుంభకంబులను నవి మె
లంగు నిడాపింగళాసుషుమ్నల హంసతత్వంబునే సాక్షి తానె తెలియు
వికచహృత్కమలకర్ణికయందు ఘోషించు ప్రణవనాదంబున్నే ప్రభువుడెరుగు
భ్రూమధ్యమమున చూపులను నానావిధకళలను మనము నేఘనుడుగాంచు

నతడె ప్రత్యగాత్మ దతడెపో పరమాత్మ
దతడె వాసుదేవు డతడె శివుడు
అతడె స్వప్రకాశుడైన శ్రీ మన్మహా
దేవ లింగమూర్తి దివ్యకీర్తి.

ఇట్టి నాలుగు సీసపద్యముల తరువాత ఐదవ సీసపద్యమునకు సాంఖ్య మనియు, ఆరవ సీసపద్యమునకు అమనస్కమనియు శీర్షకములున్నవి.

ఈ పద్యముల తరువాత "శ్రీరామ రామ రామేతి రమే రామే మనో రమే" ఇత్యాదిగా గల్గు పంచరత్న శ్లోకములున్నవి. అటు తరువాత నీ శ్లోక ముల కాంధ్రానువాదములగు పంచరత్నములు గీత పద్యములున్నవి. వానిలో మొదటి పద్యము.

"శ్రీ మనోరమ శ్రీ రామ రామ రామ
యనుచు రమియించు రాముని యందు రామ
నాముము వరానన సహస్రనామ తుల్య
మట్లుగావున దీని నీ వవధరింపు".

ఈ సీస పద్యములును, గీతపద్యానువాదములును పరశురామపంతుల లింగ మూర్తిగారి రచనములై యుండును. వ్రాయసకా డీ పద్యముల తరువాతకూడ తిథివారాదుల నిచ్చియున్నాడు.

"కాలయుక్తి నామసంవత్సర వైశాఖ శు॥ ౧౩ అదివారం నాడు బ్రహ్మా నందస్వరూపులైన పరశురామపంతుల లింగన్న అయ్యవార్లగారి ప్రతిలో వున్న క్రమాన నక్కా నరసంభట్లు వ్రాసినాడు. క్షమ అపరాధం, రెండు ఝాముల అప్పుడు మల్లెసాలలో మొగరానికివొరిగి ఉత్తరముఖానను కూర్చుండి వ్రాసినాను." ఈ తిథివారాదులు. క్రీ. శ. 29-4-1798 నాటికి సరిపోయినవి.

మరచిపోయిన "మల్లెసాల," "మొగరము" వంటి పల్లెటూరి మాటలు పట్టణవాసపు డ్రాయింగు రూముటో పిల్లరకు దేరువగా కూర్చుండి వ్రాయుట కలవాటుపడిన నాకు మనస్సు కలుక్కు మనిపించినవి. వ్రాయన కాడిచ్చిన తిథివారాదుల ననుసరించి ఈ తాళపత్రగ్రంథము మన 'స్రవంతి' పుట్టిన ఏప్రిల్ మాసములోనే నూటయరువది నాలుగేండ్లకు పూర్వము వరుసగా మూడు దినములలో వ్రాయబడినట్లు తేలుచున్నది.

ఈ నక్కానరసంభట్లు సాక్షాత్తుగా లింగమూర్తిగారు వ్రాసిన మాతృక నుండి ఎత్తి వ్రాసినాడు. ఈతడు లింగమూర్తిగారి శిష్యకోటిలోని వాడై యుండును. క్రీ. శ. 1798 నాటికా మహాయోగి సజీవుడై యుండును. లింగమూర్తిగారిని సేవించి తాను ధన్యుడై లింగమూర్తిగారి ఈ శతకములకు ప్రతిని వ్రాసి ఈ నాటికి మనకు దక్కించి మన కృతజ్ఞతలకు పాత్రుడైన ఈ నక్కానరసంభట్లు కుటుంబమువారిపు డెచ్చటనైన కలరో లేరో తెలియదు..

(స్రవంతి, ఏప్రిల్ 1962)

# పాల్కురికి సోమనాథుని పండితారాధ్యోదాహరణము

మహాపండితుఁడును మహాకవియునునగు పాల్కురికి సోమనాథుడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, సోమనాథభాష్యము, రుద్రభాష్యము మున్నగు బృహద్గ్రంథములేకాక పెక్కు లఘుకృతులు రచించినాడు. ఆలఘు కృతులలోఁ గొన్నింటిని శ్రీ బండారు తమ్మయ్య గారొక సంపుటమున నిటీవల ప్రకటించియున్నారు. పిడువర్తి సోమనాథుఁడు, పాల్కురికి సోమనాథుఁడు "ఉదాహరణ యుగ్మము" రచించినట్లు పేర్కొన్నాఁడు. సోమనాథుని బసవోదాహరణము తెలుగులోను సంస్కృతములోను లభించుటవలన ఇన్నాళ్ళు పండితలోకము ఉదాహరణయుగ్మ మనగా బసవోదాహరణయుగ్మమనియే భావించినది. కరీమునగరము మండలమున నా కొక తాళపత్రగ్రంథము లభించినది. దానిలో సోమనాథభాష్యముతోపాటు పాల్కురికి సోమనాథుడు రచించిన పెక్కులఘుకృతులున్నవి. వానిలో నీ పండితారాధ్యోదాహరణ మొకటి. ఈకృతి యున్నట్లు ఇంతవరకు ఆంధ్రసాహిత్య ప్రపంచమునకు దెలియదు. తమ్మయ్యగారి సంపుటములో నిది చేరలేదు. మొదటిసారిగా దీనిని ప్రకటించుభాగ్యము కలిగినందుకు మిక్కిలి సంతోషించుచున్నాను. వ్రాయసకాఁడు తాళపత్రగ్రంథము వ్రాసికొన్నది నందన సంవత్సర వైశాఖ బహుళ త్రయోదశి శుక్రవారము. ఇది క్రీ శ. ౪-౯-౧౫౩౨ తేదికి సరిపోవుచున్నది. ఇతరాంధ్ర ప్రాంతములందువలెఁ దెలంగాణమునఁ దాళపత్రగ్రంథములను సేకరించుట శ్రద్ధపరచుట జరుగలేదు ప్రభుత్వమువారేమాత్ర మీవిషయమున శ్రద్ధగైకొనలేదు. చిన్నచిన్న సంస్థలవద్ద కొందఱు వ్యక్తులవద్ద కొన్ని తాళపత్రగ్రంథము లున్నవి. ఏయే మూరుమూలలం దింకనెట్టి యనర్ఘరత్నములు మాటుమణఁగి యున్నవో తెలియదు. ఇరుగు పొరుగు రాష్ట్రములందు ప్రాచ్యపరిశోధనాలయములున్నవి. వేలకొలది తాళపత్రము లిప్పటికిని తెలంగాణ

మున లభించును. వాని నన్నింటిని ప్రోగుచేసి ఆంధ్రదేశ ప్రభుత్వము వారును మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము వంటిదాని నొకటి స్థాపించి పరిశోధనలు చేయించినఁ దెలుఁగు సంస్కృతికిని తెలుఁగు సాహిత్యమునకును మేలుచేసినవా రగుదురు-ఆలస్యము చేసినచో అతాళపత్ర గ్రంథము లెక్కడివక్కడ జీర్ణించిపోవును. అప్పుడు "నదీనాం సాగరో గతిః" ఇకనీ యుదాహరణమును జిత్తగింపుఁడు.

శ్రీ మల్లికార్జున పండితోదాహరణము :

శ్లో. అద్వైతోద్ధత కుంభికుంభదళనోద్యద్వీర్యపంచాననో
గర్వోదంచితపాంచరాత్ర నిబిడప్రాలేయ చండద్యుతిః,
పాషండాబ్జమహాగజో విజయతే బౌద్ధాద్రిఘోరాశనిః ౧
శ్రీమత్పండిత మల్లికార్జునగురుర్విద్వత్సభాపూజితః.

శ్లో. పండితారాధ్యనామేతి పంచాక్షరసముద్భవమ్ ౨
సకృ[త్] స్మరంతి యే భక్తా స్తేజనాః పుణ్యకారిణః.

మాలిని. శివకర శివసౌఖ్యా శిష్టభక్త్యైకముఖ్యా!
వివిధపరమశీలా వేదశాస్త్రానుపాలా!
ప్రవిమలపరభావా పండితారాధ్య దేవా! ౩
తవిలి మిము భజింతున్ దద్దయుం బ్రస్తుతింతున్.

శా. శ్రీనుశ్చైవరమావరున్ [1]వినమిత శ్రీ చెన్నమల్లేశ్వరున్
ధీమంతున్ నిగమాగమ శ్రుతిమతోద్గీతార్థవేత్తన్ బుధ
స్తోమస్థున్ బ్రభు నూర్ధ్వనేత్రుఁడగు నారాధ్యున్ బండితారాధ్యులన్ ౪
గామింతున్ నుతియింతుఁగొల్తుఁ దలఁతున్ గామ్యార్థసంసిద్ధికిన్,

—: ప్రథమా విభక్తి :—

శా. శ్రీమత్పండితమల్లికార్జునుడు వైశిష్ట్యోల్లసచ్చర్యుఁడు
ద్దామప్రోద్ధతవీరభక్తినిధి నిత్యశ్లోకుఁ డుద్యన్మని
స్తోమస్తోత్రుఁ డగణ్యపుణ్యుఁ డతితేజోరాశి సమ్యగ్దయా
ధాముం డీవుత మాకు భక్తియుఁ బ్రసాదార్థక్రియాసక్తియున్. ౫

1. నియమిత.

మధురగతిరగడ

కళిక :— [2]మఱి శుద్ధ శైవమార్గమందనుఁడు
తుఱవణించు భవ • దుర్గఖండనుఁడు
చిరతరప్రణవ • సిద్ధమాంత్రికుఁడు
పరమభక్తి[3]విని • బద్ధతాంత్రికుఁడు
మునిగణ ప్రచయ • ముఖ్యవందితుఁడు
జనితచిన్మయసు • సౌఖ్యవందితుఁడు
అలఘుసంచితశి • వైక్యభావనుఁడు
ఎలమి సర్వజగ • దేకపావనుఁడు

ఉత్కళిక :—తన విభుత్వమును
ఘనమహత్త్వమును
ధరణి నింపుమవి
హరుఁడు పంపఁబని
[4]వరని చెప్పమర
నొరలు గొన్న పర
మముదయాతనుఁడు
దమితయాతముఁడు.

—: ద్వితీయా విభక్తి :—

శా. ఆర్యుం డై ప్రమథానుసారకలితుం డై వీరమాహేశ్వరా
చార్యుం డై వరభక్తిముక్తిసుమహత్త్వాఖ్యప్రదుం డై మహై
శ్వర్యుం డై శివరోగ వైద్యుఁడయి భాన్వన్మూర్తియై సద్గుణ
స్థైర్యుం డై చను మల్లికార్జును యథాశక్తిన్ ప్రశంసించెదన్.

మధురగతిరగడ

కళిక :—మఱియును భువవన • మాజనుత్త్యుని
నెఱసిన మహిమా • వ్విత పాండిత్యుని
అతిశయసుతజా • హ్యాంతరశుద్ధుని

2. మఱియు 3. వినీత 4. పరసెఁ

హితశివగణవిర • హితజనబొద్ధని
శివయోగసుఖ • శ్రీసాన్నిధ్యని
సవిశేషాఖిల • జగదారాధ్యని
సంచిత విమల • జ్ఞానసముద్రుని
సంచితనరచ • ర్మామృతరుద్రుని. ౯

ఉత్కళిక :— హరు నుపకరణము
లొరసిన చరణము
లలగక పెటికిన
యలుగుల నటికిన
మన మహదేవయ
కును కాళ్ళన్ దయఁ
బరసిన వీరుని ౧౦
జరతా దూరుని.

—: తృ తీ యా వి భ క్తి :—

శా. ఆజ్ఞారాధనపాత్రుచే విధినిషేధాదిక్రియానీతుచే
సజ్ఞానాబ్ధివహిత్రుచేఁ బరమయోగానందుచే భక్తిస
మ్యజ్ఞానాశ్రయణీయుచే ననఘుచే మా పండితారాధ్యుచే
నాజ్ఞాసిద్ధియుఁ జిత్తశుద్ధియు నముద్యత్ప్రీతిమైఁ బొందెదన్. ౧౧

ద్విరదగతి రగడ

కళిక:- మఱియు భవిజనరహిత • మహితైకశీలుచే
నుదుపురాతనగణో • ద్యుక్తవాగ్జాలుచే
ప్రకటితాష్టాదశపు • రాణనిర్ణేతచే
సకలశాస్త్రార్థవి • జ్ఞాన సంధాతచే
వేదాంతసిద్ధాంత • విషయప్రవర్తిచే
నాదిమార్గప్రతిష్ఠా • చార్యమూర్తిచే
శివతత్త్వభావనం • చితయోగమతనుచే ౧
శివతత్త్వసారనం • చితపుణ్యకథనుచే.

---

౯. జిన.

ఉత్కళిక :- గురునాజ్ఞఁ దలమోచి
యరసి శ్రుతులను జూచి
శివప్రసాదము గొనిన
భవము మఱిలేదనిన
దని జగంబులఁ జాటి
మును ప్రసాదము సాటి
చేసిన ప్రసిద్ధుచే
నా శుభసముద్రుచే. ౧।

—: చతుర్థీ విభక్తి :—

గ. భక్తుం డీశ్వరుఁ డగ్రగణ్యుఁడు మహాభాగుండు తత్త్వార్థసం
యుక్తస్వాంతుఁడు దేశికోత్తముఁడు విత్తోల్లాసవంతుండు ప్ర
వ్యక్తుండంచు గుఱించి జంగమసముద్యత్పాదపద్మార్చనా
సక్తిన్ బేర్కొను మల్లికార్జునునకై సద్భక్తి నాఁటించెదన్। ౧

ద్విరదగతి రగడ

కళిక :- మఱియును బునర్జనన ♦ మరణదూరునకునై
పఱలు నవగతభయా ♦ వరణ కరణునకునై
గహనాంగసంగతవి ♦ కారదూరునకునై
సహజైకయోగప్ర ♦ చారధీరునకునై
కమనీయభక్తిశృం ♦ గార పాత్రునకునై
సముదితాంచితశివా ♦ చారపూర్ణునకునై
అతులసంవిత్సుఖా ♦ యత్తచిత్తునకునై
అఱివినిర్మలమహో ♦ దాత్తవృత్తునకునై ౧:

ఉత్కళిక:- లింగార్చనావేళ
జంగమము సల్లిలఁ
(గడువడిని దనకడకు)
నెదతేర శివపూజ
గొనిభక్తుఁడే లింగ

మని భజించిన జంగ
మ్ప్రాణపదునకై ౧౬
విప్రసమ్మదునకై

—: పంచమీ విభక్తి :—

శా. ఆఖ్యాతప్రమథానుకీర్తి వలనన్ స్వాత్మావబోధోల్లస
త్ప్రా(ఖ్యాపా)యజనప్రకాశువలనన్ శంభుప్రసాదాగమ
[6]వ్యాఖ్యాతాచరణప్రవీణమతి భాస్వత్పండితారాధ్యనా
మాఖ్యాతాచితపుణ్యమూర్తివలనన్ మా కిష్టముల్ చేకురున్. ౧౭

ద్విరదగతి రగడ

కళిక:— మఱియు నసదృశశివస • మయసముచితునివలన
గుదుఁ బొనరుచున్ దనరు • గుణగణాయతువలన
శరణగణవరచరణ • సరసిరుహవశువలన
సరస [7] వరమునినికర • సతతనుతయశువలన
వరమపరవిమలతర • పరమసుఖకరువలన
నిరతిశయదురితచయ • నిఖిలభయహరువలన
శ్రుతినియతమతసహిత • సురచిరసహితువలన
వితతయమనియమనమ • విలసచ్చరితువలన ౧౮

ఉత్కళిక:— శివుని పంపున వచ్చి
దవిలి కనుగవ నిచ్చి
ముమ్మాటికిని బడయ
నమ్మకున్నమ దడయ
కెద నిడుదలగు కన్ను
లదరఁ బడసిన చెన్ను
నివుడు ధన్యునివలన ౧౯
భువనమాన్యునివలన

6. వ్యాఖ్యాయా 7. శుక

—: షష్ఠీ విభక్తి :—

శా. సాహాత్మ్యన్ వెలనాటిచోడనృపతిన్ భ్రామ్యత్పతంగాధమున్
శాపోద్రేకవిజృంభితాగ్ని శిఖలన్ (జయ్యన్ వినాశంబుగాఁ
బాపోద్వేగఫలంబు నప్పుడె గనన్) భస్మంబుగా నుగ్రుఁడై
యాపాదించిన మల్లికార్జునునకి ట్లర్పింతు నా చిత్తమున్. ౨౧

తురగవల్గన రగడ

కళిక :- మఱియు మెఱయఁ జెప్పనొప్పు • మహితనిహితవర్తనునకు
నెఱవు నిరవుఁ జూపనోపు • నిత్యసత్యకీర్తనునకు
బ్రాపుదాపు దానయైన • భక్తియుక్తి కారణునకు
పాపకోపరాగరోగ • భవనిచయనివారణునకు
సతతవితతకర్మమర్మ • జాలమూలకృంతనునకు
సతివిహితవిచారసార • సాంగలింగచింతనునకు
ఆద్యహృద్యరచితనిచిత • యజనభజనమండితునకు
గద్యపద్యనవ్యకావ్య • కథనసుధన పండితునకు ౨౨

ఉత్కళిక :- ఇల సమస్తవాదవేద
ములఁ బ్రమాణజాలమూల
మున శివుండ మేటి ఫోటి
యని గుఱించి జ్ఞానహీన
సమయసమితిఁ ద్రుంచిమించి
యమితవిమలభక్తియుక్తిఁ
బరుగు తత్త్వచేతనునకు
భరితభక్తిబీజమునకు ౨౩

—: సప్తమీ విభక్తి :—

శా. లింగాత్మన్ భవశేఖునామయను బల్మిన్ జీరి మార్కొన్న గ
ర్వాంగద్రోహిని బానుగంటి యుదయత్మాధీశుఁ దత్సంతతిన్
భ్రుంగంగా శపియించి మించి జగదుత్తుంగప్రతాపోదయా
[8]నంగధ్వంసకు మల్లికార్జునునియం దాసక్తిమైఁ గొల్చెదన్ ౨౪

8. దాంగి కాఁడు

## మధురగతి రగడ

కళిక :— మఱియును సజ్జన • మండలునందుఁ
గొఱలు శ్రుతిస్మృతి • కుండలునందుఁ
దురితసముత్కర • దూరగునందుఁ
పరమపరాత్పర • పారగునందుఁ
సరసజగజ్జన • సన్నుతునందుఁ
ఉదుతరకీర్తిన • మున్నతునందుఁ
పరిమితసూనృత • భాషణునందుఁ
స్ఫురితదయారస • భూషణునందుఁ ౨౪

ఉత్కళిక :— హాదు కృపయూటల
కిరవగు చోటుల
కనువగు మాటల
వినుతుల తేటల
పదముల పాటల
ముదమగు నాటల
గల గుదునందు(న్) ౨౫
మలహదునందు(న్)

—: సంబోధన :—

శా. శాంతస్ఫూర్జితనందినాథ భవపాశచ్ఛేదనోగ్రాక్ష సి
ద్ధాంతప్రోద్ధతవాదగీతమయవిద్యాతీత భృంగీశదు
ర్వాంతోద్యద్భుజ వీరభద్ర నినునేఁ బ్రార్థింతు విజ్ఞాతవే
దాంతా! పండితమల్లికార్జున! త్రిలోకారాధ్య! రక్షిం[పుమా] ౨౬

## తురగవల్గన రగడ

కళిక :— మఱియు సంయమీశ్వరోక్త • మార్గసంతతప్రచార
మెఱయు హృదయకమలమధ్య • మిళితశుద్ధతత్వపూర
దురితచరితజననమరణ • దుఃఖసంకటాళిదూర
హరసమయసుఖార్థవర్ధ • నాళికల్పితప్రకార

ప్రకటతరభవాంధకార • పటలవిఘటనప్రదీప
సుకృతజనహితోపదేశ • సులభసద్గురుస్వరూప
విస్మయాభి జననహేతు • వీరభక్తియోగసార
అస్మదీయ చెన్నమల్లి • కార్జునాపరావతార ౨౬

ఉత్కళిక :— అమర తమవు సత్క్రియాద
రము ధనము గాని వేద
నము మనము భక్తిభావ
నమున నమయలింగసావ
ధానలీన పరమయోగ
మానితానురాగభోగ
జనితనిర్వికల్పసౌఖ్య
వినుతనిఖిలశరణముఖ్య ౨౭

—: సార్వవిభక్తికము :—

శా. నీవార్యుండవు నిన్నుజించుజగముల్ నీచే భవంబెండు నీ
కై పట్రిల్లు యశంబు నీవలన సౌఖ్యావాప్తి నీకుం బ్రసా
దావిస్ఫార నభోత్సవంబదరు నీయందావహింతున్ మదిన్
దేవా! పండితమల్లికార్జున! జగద్దీవప్రభావోదయా! ౨౮

శా. ఆరూఢాంచితలింగజంగమ కృపాయత్త ప్రసాదోదయా
పారోక్తిఙ జను నీయుదాహరణముఙ బాల్కుర్కి సోముండు లో
కారాధ్యుండగు మల్లికార్జునునకి ట్లర్పించె నద్భక్తి నిం
డారంగా బఠియించినఙ వినినఁ గామ్యార్థం బిలఙ జేకుఱున్. ౨౯

(ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, డిసెంబరు 1964)

# వేముల రామభట్టు - గౌరీ విలాసము

మహబూబునగరము మండలమున మానాజీపేట (మానవతీపురము) అను చిన్నజమీందారీ పట్టణము కలదు. దానికి "తూము" ఇంటిపేరుగల రెడ్లు అధిపతులు. ఆ జమీందారు లెందరో కవిపండితుల కాశ్రయమిచ్చి సంస్కృతాంధ్ర వాఙ్మయములకు చక్కని దోహద మొనర్చిరి. కవి పండితులను పోషించుటేకాక తూము వంశపురెడ్లు తాము స్వయముగా కవులై పండితులై వాసికెక్కినారు. అట్టివారిలో తూము రామచంద్రావనిపాలు డొకడు. ఈతడు "అలమేలుమంగాపరిణయ" మను[1] కావ్యమును రచించెను. ఈ రామచంద్రావనీపాలుడు (రాజా చందూలాల్ సమకాలీనుడను ఆధారమును బట్టి) పందొమ్మిదవ శతాబ్దము ప్రథమపాదమున నుండినట్లు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు నిశ్చయించినారు. రాజా చందూలాల్ (క్రీ. శ. 1766-1845) అసఫ్జాహీ వంశపు సుల్తానులలో మూడవవాడైన సికిందర్ జా కాలమునను, నాల్గవవాడైన ఆసిపుద్దౌలా కాలమునను ముఖ్యమంత్రిగా నుండినవాడు[2] తూము రామచంద్రావనీపాలుని కాలమును కనుగొనుట కితరాధారములు నాకు వేరేమియు లభించలేదు. ఈ రామచంద్రారెడ్డి కుమారుడు పరశురామరెడ్డి. పరశురామరెడ్డి ప్రాపునుండి "గౌరీవిలాస" మను నారాశ్వాసముల మహాప్రబంధమును రచించినవాడు మన వేముల రామభట్టు. కనుక తూము రామచంద్రావనీపాలుని కుమారుడగు పరశురామరెడ్డియును, అతని ప్రాపకమును గాంచిన నీ కవివతంసుడగు వేముల రామభట్టును (రామాభట్టని వ్రాతప్రతి) ౧౯వ శతాబ్దము మధ్యభాగము—అనగా నిప్పటికి నూరేండ్లకు పూర్వ ముండినవారని యూహింపవచ్చును.

---

1. ఈ కావ్యమును గ్రంథకర్తకు మునిమనుమడగు శ్రీ తూము రామకృష్ణారెడ్డిగారు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారిచే పరిష్కరింపించి ప్రకటించినారు. 1949.

2. Journal of Andhra Historical Reaserch Society 1961-62. Pages 90–100.

గౌరీవిలాసకావ్యము పూర్వకాలపు దళసరి కాగితములపై వ్రాయబడి హైద్రాబాదు ఆంధ్ర సారస్వతపరిషత్తువారికడ నున్నది. ఇందులో మొదటి రెండు కాగితములు పోయినవి. వీనిలో ఇష్టదేవతా ప్రార్థనాదికములు, పూర్వ కవి సంస్మరణము మున్నగు విషయములకు సంబంధించిన పద్యము లుండి యుండును. పోయిన కమ్మలు పోగా మూడవకమ్మ ఇట్లారంభమైనది.

'... ...దగిన మహదేవ చారిత్రంబెయ్యది యవి విచారించుచున్న సమయంబున'—

దీనితరువాత కృతికై ప్రోత్సహించిన పరశురామరెడ్డి వర్ణనము, అతని వంశావతారవర్ణనము మొదలైనవి కలవు. ఇందులో కొన్ని పద్యములు.

సీ॥ తననిశితాసి (...) పం బరాతికాంతాబృందములకును హృత్తాపమిడగ
తనదానమహిమ చింతారత్నసంతాన సురధేనువులతోడ సరసమాడ
తనయశోగరిమ సుధాధామహిమకుభృత్ క్షీరవారాసుల సిగ్గుబరప
తన రూపలావణ్యత వసంతరతికాంత నలరాజులమ జూచి నగవుచుండ
బరగుతూము కులాబ్ధి శంబరధదుండు
భూరిమేధాకరుడు శివాచారపరుడు
సత్యసంకల్పు డఖిధర్మ శాస్త్రములను
కోవిదుండు పరశురామ భూవిభుండు.

ఉ॥ సామజభిత్పరాక్రముడు సంగర రంగధరాతిరాజగో
త్రామర రాజధర్మ సదృశాయుధహస్తుడు దిక్సతీగళో
ద్దామ సుమల్లికాకుసుమదామ యశఃప్రకటోజ్జ్వలుండు శ్రీ
రామజవజ్ఞాదైపరశురామధరారమణీశు డొప్పెడిన్.

శా॥ శ్రీ లక్ష్మీనరసింహ మంత్రఫల సంసిద్ధి ప్రకాశుండు స
చ్ఛీలుండాశ్రిత చందనుండు విలసత్ క్షేపాల గోత్రాంబుధి
ప్రాలేయాంశు డు(రు)(వ)తాపరిపుజిత్ప్రౌఢుండు సత్కీర్తి ( . )
( . )లాయుక్తుడు రామచంద్రధరణీపాలాత్మజుం డొక్కెడన్.

సీ॥ ఒకచెంత (సకల) కళాప్రవఘటికు లొకదిక్కు నిఖిలశాస్త్రికచయంబు
నొకశేవ సకలంక సుకవీంద్రనికరంబు లొ(కట) సిద్ధాంతజాతకవిధిజ్ఞ

లోకవంక మకరాంకసుకుమారధరణీశు లోకచేరువను పురాణకసమూహ
మొకపొంత ప్రకటగాయకజనప్రకరంబు నొకచోట సకలసైనికగణంబు

ప్రకటషడ్గుణ చాతురోపాయ విషయ
శక్తులమ యుక్తులమ మించు సప్రధాన
వర్యులుమగొల్వ కొల్వుండి వసుమతీశు
డాదికావ్య ప్రసంగంబులాడుచుండి.

శా॥ శ్రీకౌండిన్యసగోత్రసంభవుని ధీశాలున్ బుధారాధ్య సు
శ్లోకున్ లక్ష్మినృసింహయార్యునకు సంశుద్ధాత్మ వెంకాంబకున్
జోకాపుత్రుని రామయాఖ్యుని ననున్ సొంపొప్ప బిల్పించి యా
భూకాంతధిపు డిట్టులం బలికె సంభోత్ఫుద్గభీరంబుగన్.

క॥ క్షేపాలగోత్రజలధి ని
శాపతి మాతంగ్రి రామచంద్ర కవీంద్ర
క్ష్మాపాలుం దలమేల్మం
గాపరిణయ మనగ విష్ణుకథ రచియించెన్.

క॥ ఆ వైష్ణవ కథవలెనే
నీవొక శైవప్రబంధ నిర్మాణంబున్
గావించి కీర్తి గనుమని
యావెంటన్ భూధవుడు రయమ్మున బల్కెన్.

క॥ తేనియలు జిలుక నమృతపు
సోనలు గురియంగ బుధులు జు(...)త్వం
బౌ నౌరా రుచి యని గా
ధానంద(...)గదల్చి యాశ్చర్యవదన్.

అటు తరువాతగల దీర్ఘ వచనమున నేతత్కావ్యగుణములు వర్ణింపబడినవి. ఆపై పరశురామరెడ్డి వంశావతార వర్ణనము కలదు. ఈ వర్ణనమున రామభట్టు వసుచరిత్రాది పూర్వప్రబంధము లందలి పలుపోకల నమకరించి చక్కని పద్యములు కూర్చినారు. వీనిలో మొదటిపద్య మిట్లున్నది.

సీ॥ అచలేశ్వరులుగాని యచలేశ్వరులుగారు భూరిదర్పోద్యద్విభూతిగతుల
గోపసింహులుగాని గోపసింహులుగారు చటులబాహాబల శౌర్యగతుల
నరబిడౌజులుగాని నరబిడౌజులుగారు వినతారిజయదశావిభవగతుల
రాజాంగజులుగాని రాజాంగజులుగారు తగ కళారూపసౌందర్యగతుల

నను చు జనులెన్నగను మిన్నయగు యశస్థి
తిని వహింప నవద్వయద్వీపభూప
మాన్యులగురరుగాక సామాన్యనృపులె
తూమువంశంబునను బుట్టు భూమిపతులు.

రామభట్టివిధముగా తూమువంశమువారి నందరిని వర్ణించినాడు. ఈ వర్ణనము ననుసరించి తూమువారి వంశక్రమ మీ విధముగానున్నది.




ఈ వంశావతారమునకును అలవేలుమంగాపరిణయమం దీయబడిన వంశావతారమునకును కొలది వ్యత్యాసములున్నవి. అలవేలుమంగా పరిణయమున అయ్యపురెడ్డి కొడుకులందు జ్యేష్ఠుడుగా చెప్పబడిన వెంకటధాత్రీశ్వరు

డింరు కనిష్ఠుడుగాను మరియు చినరామిరెడ్డి నంజమ్మల సంతానముగా చెప్పబడిన రామచంద్రావనీపాలు డింరు (పెద) రామిరెడ్డి నంజమ్మల సంతానముగను చెప్పబడినారు. గౌరీవిలాసకృతి రచనమునకు ప్రోత్సహించిన పరశురామరెడ్డి రామచంద్రావనీపాలుని జౌరసపుత్రుడు కాదనియు దత్తపుత్రుడనియు గౌరీవిలాసము వలన దెలియనగుచున్నది.

కృతికర్త పరశురామరెడ్డిచే ననుజ్ఞాతుడై గృహమునకుబోయి ఆరాత్రి నిదురింపగా స్వప్నమున పరమేశ్వరుడు సాక్షాత్కరించి కావ్యము తన శంకితముగా రచింపుమని యాదేశించును. ఆ పట్టున పరమశివుని వర్ణన మీ తీరుగా నున్నది.

సీ॥ వలనొప్పవెమ్మేన నలదిన పలుబూది గనుగొన చలువ చందనముగాగ
కుడిదెస జారంగవిడిచిన పల్ పావగమి పైదీవె జందెములుగాగ
జిముక వాల్నాగబెత్తెము డమరుకము ముమ్మెనవాలు కైయాయుధములుగాగ
చలిమిరికొండ ముద్దులకూతు రెల్లపు దరమేన పదలని యతుకుగాగ

నొక్క తెలియాలబోతు బల్ జక్కినెక్కి
కమలపందువుగా నొద్ద గానబడుచు
తొలిమెయిళ్ళ రొదోయన దోచ బిలిచి
గట్టువిలుకాడు కలలోన నిట్టులనియె.

శివుని స్తోత్రముచేయు పద్యములును ఒక దండకమును గలవు. అటుపై కవి వంశావతారమిట్లుగలదు.



కృతికర్త తనతల్లి తాతతండ్రులను గూడ వర్ణించియున్నాడు. అటుపై షష్ఠ్యంతములు చెప్పి కథాప్రారంభము చేసినాడు.

గౌరీవిలాసము ఆరాశ్వాసముల ప్రౌఢప్రబంధము. మొదటిఐదాశ్వాసములందు శివపార్వతుల ప్రణయకలహము, శివు డలుకతో కైలాసమును విడిచి వచ్చి తూము రామచంద్రావనీపాలుడు కట్టించిన శివాలయమున నెలకొని యుండుట, పార్వతీవిరహము, ఆమె సఖులతో గూడి శివుని వెదకుచు మానవతీపుర (తూము వారి రాజధాని) ప్రాంతారణ్యములకు వచ్చుట, శివుని విరహము, చిలుక రాయబారము, పార్వతీ శివుల పునస్సమాగమము, పరివార దేవతలతో వారు మానవతీపుర దేవాలయమున నెలకొనియుండుట ఆదిగాగల కథలు ప్రవచింపబడినవి. షష్ఠాశ్వాసమున రామచంద్రావనీపాలుడు రాజ్య భారమును పరశురామరెడ్డి కప్పగించి, యోగమార్గమున బ్రహ్మపదమలంక రించుట, పరశురామరెడ్డి పరిపాలనము, చెంచులమొర, మృగయావిహారము, పరిపాలనావ్యవస్థ, తండ్రికట్టించిన శివకేశవాలయముల పునఃప్రతిష్ఠ మున్నగు విషయములు విపులముగా వర్ణింపబడినవి. మొదటి ఐదాశ్వాసముల కథా భాగమునగూడ విష్ణ్వాలయ శివాలయ నిర్మాణ సందర్భములందు ఈ రెడ్డి ప్రభువులకు ప్రవేశము కల్పించి ఈ గ్రంథకర్త యొక విలక్షణ మార్గము ననుసరించినాడు.

పోయిన కమ్మలందలి పద్యములు పోగా మిగిలిన గ్రంథమున మొత్తము ౮౮౫ గద్యపద్యములున్నవి. ఈతని యాశ్వాసాంత గద్యమిట్లున్నది.

"ఇతి శ్రీమన్ మహాలక్ష్మీనృసింహదత్తవరప్రసాదకవిత్వరచిత సహజ పాండిత్య వేములవంశపయఃపారావారరాకాసుధాకర కౌండిన్యగోత్ర పవిత్ర లక్ష్మీనృసింహయార్యపుత్ర సకల కవిమిత్ర రామాభట్టాహ్వయ ప్రణీతంబైన శ్రీమద్గౌరీవిలాసంబను మహాకావ్యంబునందు షష్ఠాశ్వాసము".

గౌరీవిలాసమున పూర్వప్రబంధములలోని చక్కని పద్యములకు భావములకు అనుకరణము లధికముగా గనబడును. మీదుమిక్కిలి కవి తన సమకాలీన విషయములెన్నింటినో ఈ వర్ణనములందు చొప్పించియున్నాడు. ఈతని కవిత్వాదికములు దెలియుటకై అటనట గల కొన్ని పద్యము లుట్టంకింతును.

మానవతీపుర హర్మ్యగోపురములందున్న హంసల వర్ణనము.

గీ॥ ఒంటిపాదమూని యొక్క చిత్తము నిల్పి
యూపి రదిమివట్టి చూపు దాచి
గోపురములమీద కొన్నిరాయంచలు
తపముసేయు మునుల తాల్మిబూని (1-78)

తెలంగాణమున 'చకిలం మొకిలం' అనుమాట ప్రచారమందున్నది. ఇది (భోజనాదులకు) కూర్చుండు విధమునకు పేరు.
వీణ వాయించు స్త్రీని వర్ణించుచు కవి యీ పదమును ప్రయోగించినాడు.

చ॥ కనులర మోడ్పు చేసియు చకల్ మొకులంబున గూరుచుండి తా
కనకవిపంచి బెండొడ దగన్ నిడి నాదము గాంచి తర్జనీ
య నఖములోటి మీటి నవహాసము మోమున జిల్కరాజు కాం
తిని గని పాటబాడె నొకరిన్ ప్రతివాణియనంగ మేడలోన్. (1-80)

పురస్త్రీలను వర్ణించు సందర్భమున దశావతారములు వారియందారోపించిన విధము.

ఆ॥ ఝషకనేత్ర కమఠచరణాబ్జ గోల హ
ర్యక్షమధ్యబాల రామ రాజ
వదన కృష్ణవేణి వరబుద్ధి కల్కి నా
తరుణు లలరిరి వది యవతారగతుల. (II-30)

శ్రీనాథుని శృంగార నైషధమునందలి "శేషపుచ్ఛాయ చెలువారు బిసములు" (I-98) అను పద్యమును దలపించునట్టి దీ తటాకవర్ణన పద్యము.

సీ॥ అహిరాజపుచ్ఛ ప్రభానల్పిసపాళి యంతరస్థాభ్రము వదంతములుగ
నంపుల్లసితపద్మ నక్షత్రభత్ యామినీ హస్తిరాగ్గమన రేఖాంకురములుగ(?)
ప్రతిఫలితోపాంతవితతభూజాతముల్ కుక్షినిక్షిప్తనత్కుధరములుగ
కమలినీమకరందకాంక్షాచలద్భృంగ జాలముల్ గరళాతికీలలునుగ

లలితశైవాలజాలికాలతిక లరయ
భీమబడబానలోద్భవధూమములుగ
క్షీరకలశధి బోలె గంభీరమైన
యతటాకంబు గాంచె దైవోత్తముండు. (II-94)

నఖులతో బయలుదేరి పార్వతి వనములందు శివుని వెదకు సందర్భమున చెలికత్తెల మాటలు.

సీ॥ ఘనసారమా శరద్ఘనసారపర్ణుని ఘనసారగంధితో గల్పు మనవె
మదనభూజాతమా మదనాపకారు నీ మదనాగగతి వెతల్ మాన్పు మనవె
కాంచనద్రుమమా కాంచనాచలధన్వు కాంచనసాన రక్షించుమనవె
కాదంబమా భూతకాదంబపతి నీలి కాదంబికాదేవి గల్పుమనవె

కల్పభూజమ భక్తసంకల్ప దువిద
గల్పగదె మోహవారధి గల్పకయను
ఏలకీభూజమా సద్దయాలవాలు
నీ లతాంగిని దయతోడ నేలుమనవె. (III-28)

చంద్రోపాలంభనము సేయునప్పటి పద్యము.

చ॥ అరుగగ కుంభభూతుడు మహార్ణవన ప్తకమూర్మి నీరమున్
గరమునగూర్చి వుచ్చక రయమ్మున గ్రుంన దేల్ప పొట్టలో (ప్రేస్ప?)
నరుగక ముద్దబోలె గళమంద వసించి కృశించి యూర్పునన్
మరలెగదమ్మ పీనినతి మంగళమాత్రబలమ్ము నేమనన్. (IV-32)

మదనుడు పార్వతిమీదికి సన్నద్ధుడై బయలుదేరి వెడలునప్పటి వర్ణనము నమకాలీన యోద్ధల వర్ణనము కాబోలు.

సీ॥ విరజాజిమొగ్గ జల్తర రుమాల్ వడిజుట్టి గేదంగిరేకు నీమా దొడంగి
మంకెనపువ్వు తుమాన్ శిస్తుగా దూర్చి కడిమి కురువేర్ల దుశట్టుగట్టి
మేలైనచిగురాకు పాలుప పైగప్పి పాటలీదామంబు దాటజుట్టి

పచ్చికస్తురి బొట్టిడి పచ్చవింటి
పూలకోలలు సంధించి భుజమునుంచి
టేకు బూడాల్ మొగిల్ రేకు బాకుకత్తి
హత్తి మదనుండు కదన ప్రయాణమయ్యె. (IV-54)

మలయానిలుడు మన్మథున కాయత్తపరచిన రథ మీ తీరుగా వర్ణింపబడినది.

సీ॥ కలువరేకులు లండికండ్లుగా నవరించి మెరుగైన బిసకాండ మిరుసొనర్చి
మొగిలిరేకులు రెండునొగలుగా నొనగూర్చి మల్లెమొగ్గయు కాడి ప్రూకుజేసి

మొల్లమొగ్గలుతరుల్ మెల్లగా సమకూర్చి తేటిగంటలు వేడ్కతోటి గట్టి
నిండు సంపెగ పూలదండ జెండాల్చేచి గొజ్జంగివిరి గొల్క కుశిర దీర్చి

మీను మొసలి నిడంబులు మీదికెత్తి
కమ్మపూదేనె కన్నుల కందెనలిడి
శీతగంధవహుండను సూతుడొకడు
మదన కదలుమటని తేరు ఎదుటనిడియె. (IV-57)

మన్మథుని జైత్రయాత్రావర్ణన మిట్లున్నది.

సీ॥ పచ్చపిట్ట పఠాన్‌సిపాయిల్ సవారి భేషాబాషు వహవా వసందనంగ
మొకము లెత్తుకొని శారికవంది మాగధుల్ బహుపరాగ్పొర ఛళాఛళియనంగ
రథసంపు నెమ్మి పీరభటాళి ఝళిపించు ఉక్కుకత్తులును తళుక్కనంగ
శీతుపుపిట్ట బంత్రౌతు తుపాకి చప్పుళ్ళుఝెమిల్లు ఢెమిల్లు మనగ

అంచ లిరువంక చోపుదార్లై గడంగి
జదుగకుడు ఖబర్దార్బరాబరి యనంగ
మారుదవ్వేళ సనికై సవారివెడల
తనబలంబులో శృంగారవనము జేరె. (IV-64)

వసుచరిత్రము పద్యముల కిందెన్నియో అనుకరణములున్నవి. అట్టివానిలో నొకటి. ఇది "మోహాపదేశత మోముద్రితములైన" అను వసుచరిత్ర పద్యమును (III-180) దలపించును.

సీ॥ ధవుమీది వ్యామోహ తమనంబు పైగప్ప ముదితకందమ్ములు మోడ్పెనేమొ
మదనానలంబులోఁ బొదవ గామిని తమాకలధౌత మీచక్కిగ్రాగెనేమొ
తచ్ఛమాంథఃకణ తారకల్గని లేమ కుచచక్రవాకముల్ గుందెనేమొ
విభుని పైగలకూర్మి వృంతంబుదురమాగి యనులతాంతమమాంత మాగెనేమొ

గాన హిమజలముల గనుల్ గడుగరాదు
వనితపై పల్లవపుటంబు లిడగరాదు (?)
చెలికనుల చంద్రఖండముల్ నిలుపరాదు
ఈ చెలువసోక పీవసల్ వినంరాదు (?) (IV-84)

షష్ఠాశ్వాసమున తూమువారి పరిపాలనాదులు సత్కార్యములు వర్ణింపఁబడినవి. పరశురామరెడ్డి నుద్దేశించి అతని పూర్వులిచ్చిన యగ్రహారాదుల ప్రసక్తి గావించు పద్యమిది.

చ॥ తమ పెదతండ్రి రామవసుధాపతి భక్తిని సల్పినట్టి శ్రీ
రమణుని యుత్సవాదులకు రానిరులీనెడు శాపురాగ్రహా
రము సమకూర్చె దా నితరరాజులు మెచ్చగ ఛత్రచామరో
త్తమతురగంబు లందలము దా గొనె దీకుశలార్హ చిహ్నముల్. (VI-81)

రామరాజభూషణుడు అర్థద్వయమువ కభేదాధ్యవసాయము చేసి శివపార్వతుల వర్ణించిన పద్యమును (I-6) మనమునందుంచుకొని గౌరీవిలాసకర్త పరశురామరెడ్డికి స్వప్నమున దాక్షాయణి సాక్షాత్కారమైన విధమును వర్ణించియున్నాడు.

సీ॥ పరనీలకంధరస్ఫురదాభ లిరుప్రక్క నిరుప్రక్క కమలభాసుర కరంబు
ఘనపుండరీక శోభనచేల మిరుపంక నిరువంక ననలబంధురదృశంబు
నవమధాధరబింబవిభవం బిరుతేప నిరుతేవ సితపయోధర విభాతి
తారకాస్థిరసత్ప్రదామంబు లిరుదెస నిరుదెస నాహీనకాభరణకాంతి (?)

పలుకుభేదంబుగా బల్క వలపకయును
పలచియిచ్చిన నరమేన గలసి శౌరి
చెలువుడును దాను గలియుట దెలుపవచ్చి
కలను భూపాలకునిమ్రోల నిలువబడియె. (VI-111)

పరశురామరెడ్డి స్వప్న వృత్తాంతమును వర్ణించుపట్ల నాతని మంత్రి యగు వల్లి పురుషోత్తమరాయడు కూడ వర్ణింపబడినాడు. పరశురామరెడ్డి తన స్వప్నమును వినిపించుటకై రంగాచార్యులను బిలిపించెను. ఆ యాచార్యుల వర్ణనమిది.

క॥ ఆర్యమతేజుల నమరా
చార్యులసత్ప్రచురవాక్ప్రనంగీకృత ధీ
ధుర్యుల మక్కలరంగా
చార్యముఖార్యాళి బిల్వ చయ్యన బంచెన్. (VI-136)

ఇటులే సమకాలీన విషయములెన్నియో గౌరీవిలాస ప్రబంధమున గలవు. కొన్నిపద్యములందు ఫారసీ ఉర్దూ భాషాపదములు కూడ ప్రయోగింపబడినవి. విస్తరభీతిచే వానిని విడుచుచున్నాను. షష్ఠాశ్వాసాంతమునగల శివస్తోత్రముతో నీ పరిచయవ్యాసమును పరిసమాప్తము చేయదును.

అమితాహికులేశ్వరహారధరా
హిమభానుజితాభరణకరా
కమలాంబకచేతనగర్వహరా
విమలాభ్రధునీధృతవిష్ణుకరా (VI-171)

(సాహితీ వాఙ్మయము 1968)

# కుందావజ్ఝల గోపాలసూరి

## సంవరణ చరిత్రము

గోలకొండ కవుల సంచికలో (1934), పూర్వకవి పరిచయములందు (పుట 398) కుందావజ్ఝల గోపాలకృష్ణకవిని గూర్చి కొంత పరిచయమున్నది. ఈ కవి ములకనూరు (కరీంనగరం జిల్లా) వాస్తవ్యుడనియు, నూట యిరువదియేండ్లకు పూర్వముండినవాడనియు, బ్రహ్మవైవర్తమునందలి శ్రీకృష్ణజన్మ ఖండము (అముద్రితము) రచించెననియు, దాని ప్రతులు ఒకటి లక్ష్మణరాయ పరిశోధక మండలిలోను, మరొకటి మడిగొండ గ్రామమందలి మోతుకూరు రామారావుగారి కడను ఉన్నట్లు అందలి సమాచారము. ఆ కవిని గూర్చి ఇంత కంటె మిక్కిలి లిఖితాధారములు మరెచ్చటను కానరావు.

ములకనూరు కరీంనగరం మండలములోనిదే యైనను హనుమకొండకు చేరువ. మడికొండ హనుమకొండకు మూడు పరువులు. అచట మోతుకూరివారింట నున్న శ్రీకృష్ణజన్మఖండమును నేను రెండు దశాబ్దముల క్రింద చూచితిని. మోతుకూరు కోదండరామారావుగారి జ్యేష్ఠపుత్రులు శ్రీ వెంకటేశ్వరరావుగారు (80 ఏండ్లు) తమ ప్రపితామహులు పండరినాథరావుగారు రచించిన పండరినాథ రామాయణముతోపాటు కుందావజ్ఝల గోపాలసూరి రచించిన శ్రీకృష్ణజన్మ ఖండమును నాకు చూపించిరి. గోపాలసూరి పండరినాథరావుగారి సమకాలీను లగుట (19 శతాబ్ది ప్రారంభము) వారిరువురికి పరిచయముండి యుండును. అందువలననే శ్రీకృష్ణజన్మఖండము ప్రతి యొకటి మోతుకూరి వారి యింట చేరి యుండును. ఈ రెండును ప్రశస్తమైన కృతులగుటచేత వానిని పరిష్కరించి Ph.D. సిద్ధాంతవ్యాసములు వ్రాయుటకై మోతుకూరు హనుమంతరావు గోపాలకృష్ణరావులను ప్రోత్సహించితిని. హనుమంతరావు పండరినాథ రామాయణమును పరిష్కరించి (1975) ఇటీవల కీర్తిశేషుడైనాడు.

సిద్ధాంత వ్యాసము పూర్తికాకుండగనే అతడు కన్నుమూసెను. శ్రీకృష్ణజన్మఖండమును గూర్చిన పరిశోధనము ఏమయ్యెనో తెలియరాదు.

వారము దినములక్రింద నాకడ నున్న అముద్రితగ్రంథముల దుమ్ము దులుపుచుండగా కుందావఝ్ఝల గోపాలసూరి రచించిన మరొక కృతిరత్నము నా కంట బడినది. దానిపేరు "సంవరణ చరిత్రము." తపతీ సంవరణులగాథను వర్ణించు కావ్యమది. అద్దంకి గంగాధర కవి తపతీసంవరణోపాఖ్యానము ప్రబంధయుగపు ప్రసిద్ధకృతి. గోపాలసూరి తపతీసంవరణుల గాథను సంపూర్ణముగా రచించెనో లేదో తెలియదు. నా వద్ద నున్నది ప్రథమాశ్వాసము మాత్రమే. ప్రథమాశ్వాసములో 238 గద్యపద్యము లున్నవి. ఆశ్వాసాంతగద్యమీ తీరుగా నున్నది.

"ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాదలబ్ధోభయభాషకవితాధార కౌండిన్యగోత్రాలంకార శ్రీ కుందోఝ్ఝలాన్వయపారావారకైరవమిత్ర నాగశాస్త్రి పౌత్ర వెంకటశాస్త్రిపుత్ర నిఖిలవిద్వజ్జనకృపానుసారి గోపాలసూరి ప్రణీతంబైన సంవరణచరిత్రంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము"-

పైగద్యమున మహాప్రబంధమని యుండుటనుబట్టియు, లభించుచున్న ప్రథమాశ్వాసమున కథ కొంతవరకే సాగుటనుబట్టియు, గోపాలసూరి దీనినొక పెద్ద కావ్యముగా రచింపబూనె ననుట స్పష్టము. సమగ్రకృతి మఱొకమారు ప్రాంతములం దెచటనైన లభించునో లేదో! నా వద్దనున్న అసమగ్రగ్రంథము పాతకాలపు దళసరి కోరుట్ల కాగితములపై (16), రెండువైపుల మషీవంతముతో వ్రాయబడినది. పుటకొక్కంటికి సగటున ఇరువది పంక్తులున్నవి.

ఈ ప్రథమాశ్వాసములో ఇష్టదేవతాప్రార్థనము, పూర్వకవిస్తుతి, సుకవిప్రార్థనము, కుకవినిరాకరణము, శ్రీవెంకటేశ్వరున కంకితముగా షష్ఠ్యంతములు, నైమిశారణ్యమున శౌనకాదిమునులకు సూతుడు సంవరణ చరిత్రము వినిపింప దొరకొనుట, హస్తినాపురము అచటి చాతుర్వర్ణ్యము, చతురంగబలము, పుష్పలావికాదుల వర్ణనము, హస్తినాపురాధీశ్వరుడైన సంవరణుని కీర్తిప్రాభవములు, సూర్యపుత్రియైన తపతీసౌందర్యముల వర్ణనము, సంవరణ చరిత్రమును స్వర్భామాగీతప్రబంధములందు విన్న తపతి ఆతనియందు మరులుగొనుట, తపతీ మోహమును నారదుడు సంవరణునకు తెలుపుట, అది విన్న

సంవరణుని యనురాగము, సంవరణుడు మృగయావినోదమునకై బయలు దేరుట, ఆఖేటము, మధ్యాహ్నతపాయాసాపనోదనమునకై సంవరణుడొక సరోవరము చేరుట, అదే సమయమున తపతి తన తల్లి ఛాయాదేవి సాన్నిధ్యమును భజించుట, అచటి కామె సఖురాలు కీరవాణి వచ్చి తాను భూలోకమున చూచిన వింతలు విశేషములు ఛాయాదేవికి వినిపించుట, ఆ విశేషములందు సంవరణుని మృగయావినోదము ఏకాంతవాసముల ప్రసక్తి వచ్చుట, అది విన్న తపతి విరహముతో నిజమందిరమున కేగుట, ఆమె మోహావస్థలు, కీరవాణి తపతి చెంత కేగి ఆమె దీనావస్థకు కారణమడుగుట, తపతి తన యాశయమును తెలుపుట, కీరవాణి మందలింపు, తపతి నిశ్చయము, కీరవాణి తపతితో సంవరణుని దెచ్చి నీకప్పగింతునని యూరడించుట, తవతి కృతజ్ఞతాప్రకటనము లాదిగా గల వృత్తాంతమున్నది. కనుక తక్కిన కథాభాగము తరువాతి యాశ్వాసములం దుండియుండునని భావించవచ్చును.

గోపాలసూరి కవిత్వవైదుష్యాదులు తెలియుటకై మచ్చునకుగా కొన్ని పద్యము లుదాహరింతును.

గ్రంథ ప్రారంభమున శ్రీమహావిష్ణువును స్తుతించు పద్యమిట్లున్నది.

శా॥ శ్రీ రంజిల్ల మనోజ్ఞసౌధమున లక్ష్మీభూవధూటుల్ ప్రియో
దారస్వానురతానురాగ గరిమల్ తర్కింపగా గూఢసం
చారుండై చని భూమిదేవి సఘనాబ్జాతంబులన్ మూసి శ్రీ
నారిన్ చుంబనకేలి దేల్చు విభునిన్ భావింతు భావంబునన్. 1

శివపార్వతులను స్తుతించు పద్యములు :

సీ॥ ఎక్క కోడెలమిన్న మెక్కగా విన మెన్న జడముడిపై పాలకడలిపన్న
యొడలునిండ విభూతి యెడమడిక్కున నాతి కదకంట నమృతంబు వెడలురీతి
మెడను పాములజోడు మేటి గుబ్బలవీడు మొనసి కరంబున ముద్దు లేడు
ఎదను పున్కల చెన్ను నుదుటచిచ్చుల కన్ను సరిలేని కేశపుంజములు మిన్న
సకలదేశస్థు దఖిలయోగీంద్రహృదయ
జలజమధుపాయమానుండు శంకరుండు
భూరికారుణ్యరసఝరీపూర్ణదృష్టి
మించి మత్కావ్య మరసి పోషించుగాత. ౨

చం॥ తొడలపయి న్నిషణ్ణుడయి తొరపువేడ్క మనంబు నింద చ
ప్పడుచు కుమారునాస్యమున కోమలనీలనిజేక్షణంబులన్
బొడగని కప్పుకాటుకను బుద్ధి కరంబున మాటిమాటికిన్
దుడుచు గిరీంద్రకన్య దయతోడుత మత్కృతి పెంపు జేయుతన్. 6

ఇతరకవుల సానుభూతి నపేక్షించుచు కవి యిట్లనుచున్నాడు :

ఆ॥ కడుపునిండ కాన్పు గన్నవానికి నొరు
కాన్పుమీద కరుణ గలిగినట్లు
తాను కావ్యకర్త యైనవా డితరుల
కావ్యమరసి బ్రోచు గాదె జగతి. 12

హస్తినాపురమందలి బ్రాహ్మణుల యిండ్ల వర్ణన మీ క్రింది పద్యము :

మ॥ ఉదయాస్తంసమయార్పితాజ్యముఖభాగోల్లాన లీలాగత
త్రిదశశ్రేణికిరీటకోటినుమనోదివ్యన్మధుస్రీత ష
ట్పదహుంకారబహూకృతానవరతస్వాహానినాదంబులై
పొదలున్ తత్పుటభేదనాంతరవసద్భూదేవతాగారముల్. 37

హస్తినాపురయువకు లచటి పుష్పలావికలతో నాడు సరసోక్తులు :

సీ॥ మొదలొక కుసుమంబు గదియగాగీలించి కుసుమంబుపై కొన్ని కుట్మలములు
కుట్మలంబులమీద గొమరొప్పగా పూవు పూవుపై కైరవపుష్పయుగము
కైరవయుగముపై కమనీయతరముగా నుపరిలీనమిళిందయూథమైన
ఆజ్ఞార్థ మర్పించి యలరించి తిమాల్య మీనేర్పు బ్రహ్మకు నేరుగబోలు

దీని యర్థంబు జెప్పిన పూని నీదు
వాంఛితము దీర్తు నని పిన్నవయసువారు
పుష్పలావికలన మించు పువ్వుబోండ్ల 51
యాననము జూచి సరసోక్తులాడువారు.

క॥ ఇది బంధుజీవి కుసుమం
బిదుగో బలుతమ్మిమొగ్గ లివి గొన్నమ న
మ్మదమగు రసికుల కమ చె 52
న్నరగున్ సుమలావికాజనం బవ్వేటన్.

సంవరణునిపై నమరాగము గొన్న పాతాళలోకవాసి భోగినీమణుల పరిస్థితిని వర్ణించు పద్యము.

ఉ॥ భోగిజగంబులన్ వెలయు బోటులు సంవరణక్షితీశుపై
రాగము జెంద మన్మథశరంబులు మర్మము లుచ్చిపోవ పా
దాగమనంబు దప్పె చెవు లారయ సందియమయ్యె ఘోరతా
యోగములై వియోగమున నూర్పులు మోముల సుల్లసిల్లెడిన్. 69

తపతిపై మనసు గొన్న సంవరణుని వర్ణించుపద్యము :

సీ॥ ప్రణుతింవ లోకేశ్వరత్వ మాత్రమె కాదు కమలాననత్వంబు గలిగియుండు
శ్రీ మోహనత్వ సంసిద్ధిమాత్రమె కాదు ఘనసంభవదశత్వ మెనయుచుండు
సరవి రాజావతంసత్వమాత్రమె కాదు ధవళదేహత్వంబు దనరుచుండు
కనుగొన జైవాతృకత్వమాత్రమె కాదు రామాతనుప్రీతి ప్రబలియుండు
నహహ రాజన్యవరుడు దుస్సహవియోగ
భారపరిభూతుడై బ్రహ్మ శౌరి శర్వ
కైతవాప్తుల కెనయయ్యె చారులీల
ధూర్జటికి కంఠవైల్యంబు తొరవుగాదె. 101

మృగయావినోదమునకు వచ్చిన సంవరుణునికి స్వాగతమిచ్చిన వనవర్ణనము.

చ॥ వికసితపుష్పవక్త్రియయి విహ్వలభావగతాళినేత్రయై
యొకలతికాహిమాంశుముఖి యొక్క ధరారుహయావనాఢ్యు న
ల్మకొని నృపాలమౌళి కటముందటగా గల పద్మ మిత్రపు
త్రిక పరిరంభకేళులను దెల్పె ప్రమోదవిధానదక్షయై. 119

సంవరణుడు బడలిక తీర్చుకొన్న సరోవర పరిసరవర్ణనము :

సీ॥ హేలాచరత్కీరబాలాగరుద్వాత ఖేలావతత్పానకీలితంబు
దారాళసుమవారిపూరానుగమిళింద నారీరితారావ చారుతరము
వేలాతటీసంభవైలాలతోత్తాల తాలామచరకోకిలాలియుతము
కేళీగృహీభూతనాళీకసంఘాత పాళీసమంచన్మరాళయుగము

నిఖిలయువజనజనకలానిరతసరసి
జాశుగాదీర్ణసింహనాదానుకారి
బర్హి నినదంబు తత్సరఃపరిసరంబు
జగదధీశుండు సూచి యుత్సవము నొందె. 152

ఈ నా దిట్టి కృతులను తద్రచయితలను ప్రోత్సహించుట యరుదైనను ఆకృతల పేర్లు, కవుల పేర్లు సాహిత్య చరిత్రలకైనను ఎక్కుట అవసరమని భావింతును.

(వివేచన, డిసెంబరు 1978)

# శివరామలింగరాజు

## వీరశైవాచార సంగ్రహము

నావద్ద ఉన్న అముద్రితగ్రంథాలలో వీరశైవాచారసంగ్రహమనే పద్య కృతి ఒకటి. ఇది మూడాశ్వాసాల గ్రంథము. దీని రచన శాలివాహనశకం ౧౬౯౫ అనగా క్రీస్తుశకం 1773లో జరిగినది. కృతిభర్త పరమశివుడు. కృతికర్త శివరామరాజు లేదా శివరామలింగరాజు, క్షత్రియుడు, భారద్వాజస గోత్రం. తండ్రి పేరు హరిరాజు, తల్లి పేరు సీతమ్మ, గురువు గోకర్ణమఠాధీశ్వరుడైన సోమశేఖరుడు.

కాకతిసీమలో గాని చాళుక్యసీమలో గాని ఈనాడు క్షత్రియుల్లో వీరశైవులు లేరు. కాని రాయలసీమలో ఉన్నారు చాళుక్యసీమలో నాలుగైదు గోత్రాల క్షత్రియులే ఉన్నారు. భారద్వాజులు లేరు. తెలంగాణంలోను రాయలసీమలోను భారద్వాజు లున్నారు. బహుశః ఈ రచయిత రాయలసీమ వాడై యుంటాడని ఊహిస్తున్నాను. రచయిత తన జన్మస్థలం గురించి ఏమీ చెప్ప లేదు. ఇంటి పేరుకూడ చెప్పలేదు. కాని తన ఐదుతరాల పూర్వులనుగురించి మాత్రం చెప్పుకున్నాడు. ప్రథమాశ్వాసం 7-8 పద్యాల్లో వర్ణించబడిన ఈతని వంశక్రమం ఈవిధంగా ఉన్నది.



శంఖాన్వయుడు (బర్బరదేశాధీశుడు)
|
లింగరాజు
|
దోకరాశింగు (భార్య మేనకి)
|
రామచంద్రరాజు (భార్య ఉమ)
|
గోపీనాథరాజు (భార్య లక్ష్మి)
|
హరిరాజు (భార్య సీత)
|
శివరామరాజు (కృతికర్త)

ఈ వీరశైవాచారసంగ్రహం స్కాందపురాణంలోని శంకరసంహితకు తెలుగు అనువాదం. ఇది మతందృష్ట్యా ప్రాధాన్యం ఉన్న గ్రంథం చెప్పుకో దగిన సాహిత్యం ఇందులోలేదు. ఐతే రచయిత గొప్ప ధారాశుద్ధి గలవాడు; ఎంతగహనమైన తాత్త్వికవిషయాన్నైనా సరళంగా సులభంగా చెప్పగలవాడు. భాషాదృష్టితో పరిశీలిస్తే ఇందులో 19వ శతాబ్దంనాటికి కావ్యభాష ఎటువంటి పరిణామం పొందిందో తెలుస్తుంది. వీరశైవకవులు ప్రయోగించే కొన్నిపదాలు సమాసాలు ఇందులో ఉన్నవి.

ఉదాహరణకు కలుహారపుష్పము(కల్హారపుష్పం) అరహము(అర్హము), సుదరిసెన (సుదర్శన), పితురుతోషణము(పితృతోషణము), పితురులోకంబు (పితృలోకము), శ్రీరుద్రీయము (శ్రీరుద్రీయము) వంటి మాటలూ, పుష్పాంజ లొనర్చి, చిరజీవై, నేనేనౌదు వంటి సంధులూ, చౌరాసిలక్షజంతురాసుల వంటి సమాసాలూ ఉన్నవి.

ప్రథమాశ్వాసారంభంలో సూతుడు నైమిశారణ్యంలో ఋషులకు ఈవీర శైవాచారసంగ్రహం వినిపించినట్లున్నది. ఇది పరమశివుడు తొలుత కుమార స్వామికి బోధించిన విషయమని సూతుడు వినిపిస్తాడు. ఒకనాడు కైలాసంలో శివపార్వతులను శ్రీమహావిష్ణువు,బ్రహ్మ,సమస్తదేవతలు కొలుస్తుండగా కుమార స్వామి వచ్చి పరమశివుని స్తోత్రంచేసి తన సంశయాలు తీర్చవలసిందని కోరితే పరమశివుడు భక్తివిధములు, లింగార్చన క్రమం, లింగధారణస్థానములు, పంచముద్రల నిర్ణయం, భస్మపుండ్రధారణ, రుద్రాక్షధారణం, మాహేశ్వరుల దిపనచర్య, అర్చావిధానం, గంధాక్షతపుష్పపత్రభేదాలు, శివపూజ, మహేశ్వ రులు చేయవలసిన పనులు చేయగూడని పనులు, శివపంచాక్షరి, త్రికాలపూజ అతిథిపూజ, భోజనవిధులు మొదలైనవి వివరిస్తాడు.

ద్వితీయాశ్వాసంలో షట్స్థలనిర్ణయము, స్థలధర్మముల క్రమము, షడ్విధభక్తిమార్గములు, త్రివిధోపాసనలు, నిర్వాణవైభవము, షడ్విధ లింగ ములు, న్యాసము, మాహేశ్వరార్చనము, షడ్విధజ్ఞానలక్షణాచారము, మాహే శ్వరుల వర్తనము, తత్త్వవివేచనము, భక్తుల వర్ణనము, ఈశ్వరపదనిర్ణయము ఆశ్రమధర్మములు మొదలైనవి ఉన్నవి.

తృతీయాశ్వాసంలో శివయోగులకు చేసే దానముల విశేషఫలము, గోప్యార్పణములు, శ్వేతుడు పింగళుడు అనే తండ్రికొడుకుల కథ, శ్రీశైల

మాహాత్మ్యము, ఆనందయోగి ఉపదేశం, కర్మవిమోచనము, అతిథిపూజ, మాహేశ్వరపూజ, గురుపూజ, శివపూజ, అన్యదైవతముల నిరాసము, స్వధర్మ నిష్ఠ, సూతకములు, తత్త్వమసి వాక్యార్థము, ఫలశ్రుతి చెప్పబడినవి.

గ్రంథ ప్రారంభపద్యం ఈవిధంగా ఉన్నది.

క॥ శ్రీపార్వతీవధూధవ
తాపసహృదయాబ్జభృంగ ధనదార్చిత వి
ద్యోపాయనిలయ నిర్మల
శ్రీపతిచింతాంతరంగ శ్రీగురులింగా।

ఈ గ్రంథప్రాముఖ్యాన్ని కవి ఈవిధంగా చెప్పినాడు.

సీ॥ వరవీరశైవసుస్థిరసుధాసారంబు వీరమాహేశ్వరాచారవృత్తి
స్వస్వరూపాలోకనదమలముకురంబు అజ్ఞానమేఘఝంఝానిలంబు
విమలలింగాంగసంవిద్బ్రహ్మసూత్రంబు పాశదగ్ధోజ్జ్వలపావకంబు
అతులలక్ష్యార్థవాచ్యార్థనిర్ణయలక్ష్యమనగ వేదాంతసారార్థమైన

గీ॥ పరమశివతత్త్వశాస్త్ర మేర్పడి వెలుంగ
నరయగా స్కాందమను పురాణాంతరమున
ఘనులు శంకరసంహితాఖ్యానమనగ
నది తెలుంగున రచియింతు నభినవముగ.

వీరశైవులకు కులాల వివక్ష ఉండదు కనుక కవి తన వంశావతారం వర్ణించేముందు,

"క॥ వర్ణాశ్రమాన్వయంబుల
నిర్ణయములు కృతులయందు నిలుపుదురని నే
వర్ణింపదలచునెడ నే
వర్ణంబని తోచదయ్యె వచనార్థములన్.

క॥ అంగత్రివిధవిలక్షణ
లింగాంగికి నొక్కకులము లేదని మదిలో
నంగాభిమాని కేర్పడ
పొంగుచు నెరిగింతు తనువు పుట్టిన కులమున్" అని చెప్పుకున్నాడు. వంశక్రమముగురించి తాతతండ్రులగురించి చెప్పిన తరువాత తన పేరు ఈవిధంగా చెప్పినాడు.

క॥ శివరామరాజు పేరన్
భువి బిల్తురు నన్ను నురగభూషణ నేడీ
శివశాస్త్ర మూంధ్రభాషను
వివరించెద వీరశైవవిధు లేర్పడగన్.

గంథం ముగించే ముందు దీని ప్రాశస్త్యాన్ని మరల ఇట్లా చెప్పినాడు.

సీ॥ ఫలకామ్యకర్మ నంపాద్య సంహిత గాదు విషయభోగముల దుర్వ్యుత్తి గాదు
పరకామినీ మానభంగశాస్త్రము గాదు గానశాస్త్రంబుల కలిమి గాదు
గోత్రబాంధవమిత్రగురుహంత మిది గాదు కపటకర్మారంభకథయు గాదు
గాధాపరంపరల్ సాధించుటయు గాదు విమలసమ్యక్జ్ఞానవృద్ధికరము

గీ॥ బంధనిర్ముక్త మభిమానపాశదగ్ధ
మతులలింగైక్యనిష్ఠ లక్ష్యార్థసూక్తి
పరమకైవల్యమిది పరబ్రహ్మమయము
ధీజనోత్తము లిదియు సాధింపవలయు.

దీని తరువాత గ్రంథరచనాకాలం చెప్పినాడు.

సీ॥ చనినట్టి శాలివాహన శకాబ్దంబులు పాటింప వేయు నార్నూటిపైద
నిరవందగా నేబదేను ప్రమాదీచ విమలవత్సరము నాశ్వీజమందు
బహుళతృతీయలో భామవాసరమున రచియించినట్టి నిర్ణయచరిత్ర
వీరశైవుల సదాచారసంగ్రహ మిది పరిపూర్ణమయ్యె ప్రబంధరీతి

గీ॥ సలలితాచారనిష్ఠులు సాధుజనులు
నంతరింద్రియబాహ్యేంద్రియాదులెల్ల
నాత్మలింగామభావసాధ్యామభవులు
శివసమర్పకులై యభ్యసింపరయ్య.

ఇందులోని తేది క్రీ. శ. 14-10-1783కు సరిపోతుంది.

కృతిసమర్పణం ఈవిధంగా జరిగింది.

గీ॥ కరణములు మూటిసాక్షి గాగ విలక్ష్య
భావమున నిష్టలింగంబు ప్రాణలింగ

భావలింగంబులైయున్న బ్రహ్మమునకు
భక్తితోడుత కృతి సమర్పణము చేతు.

తృతీయాశ్వాసాంతగద్యం ఈవిధంగా ఉన్నది.

"ఇది శ్రీమదఖండ సచ్చిదానంద నిత్యపూర్ణ ఏకలింగైక్య నిష్ఠాపర వీరమాహేశ్వరసందోహ చరణకమలషండమకరందపానమత్తద్విరేఫమాన శ్రీమద్గోకర్ణమఠాధీశ్వర పంచవర్ణిగ యతిరాయపట్టభద్ర శ్రీసోమశేఖర దివ్యపాదారవిందబంభరుండైన శ్రీనందికేశ్వరకరనీరజగర్భోద్భవుండైన శ్రీశివరామలింగ ప్రణీతంబైన స్కాందపురాణాంతర శంకరసంహితాఖ్యానంబను వీరశైవాచారసంగ్రహంబునందు సర్వంబును తృతీయాశ్వాసము"—

ఈ తాళపత్రగ్రంథం ప్రతి వ్రాసినవారి వివరాలు చిట్టచివరన ఈ విధంగా ఉన్నవి.

"పరీధావి సంవత్సర ఆశ్వీజబహుళ దశమి శెనివారం మూడు ఝాములవరకు వీరశైవాచారసంగ్రహం ప్రెతిలో వున్నప్రకారం సున్నపు సోమయ్యకు పాటోజు బైరాగి వ్రాశి యిచ్చెను."

ఈ తేది క్రీ శ. 6-11-1852కు సరిపోతుంది. వ్రాయసకాని వాక్యాలు గతశతాబ్దం తెలుగు వ్యావహారికభాషకూ లేఖనసంప్రదాయానికీ ఉదాహరణలు.

(వివేచన, డిసెంబరు 1979)

# ఓరుగంటి లక్ష్మణ యజ్వ

గీర్వాణవాణి కాంధ్రులు కైసేసిన యమూల్యాభరణములందు సీతా
రామవిహారకావ్య మొకటి. దీనికి కర్త ఓర్గంటి లక్ష్మణ యజ్వ. ఈతడు
ఓర్గంటి లక్ష్మణసోమయాజి పౌత్రుడు; ఓర్గంటి శంకరసోమయాజి పుత్రుడు.
ఈతని కాల మిదమిత్థముగా తేల్చి చెప్పుటకు తగిన యాధారము లింతవరకు
లభించలేదు. అటులే ఈత డే ప్రాంతమునందుండినవాడో చెప్పుట కష్టము.
ఓర్గంటి యను నింటిపే రీత డాంధ్రుడనుటకు సాక్ష్యము.

ఉస్మానియా విశ్వవిద్యాలయమందలి సంస్కృత అకాదమీవారి లిఖిత
పుస్తకభాండాగారమున సీతారామవిహారకావ్యమునకు సంబంధించిన ప్రతు
లైదు కలవు. వీనిలో రెండు భిన్నకర్తృకవ్యాఖ్యానములతోడను, తక్కినవి
మూలశ్లోకములతోడను కలవు. ఈ ప్రతులన్నియు నసమగ్రములే యైనను
అన్నింటిని కూర్చినచో సమగ్రమగు మూలగ్రంథము సిద్ధమగును.

ఈ యముద్రితగ్రంథప్రతి యొకటి సవ్యాఖ్యానముగా మద్రాసు
ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నున్నట్లు వర్ణింపబడినది[1]. మరియు నందు
లోనే ఇండియా ఆఫీసు లైబ్రరీ కేటలాగులో కూడ వర్ణింపబడినట్లున్నది[2].
ఈ రెండు గ్రంథాలయము లందలి ప్రతులకన్న ఉస్మానియా విశ్వవిద్యా
లయము నందలి ప్రతులు విశిష్టమైనవి. మద్రాసు ప్రాచ్యపుస్తకభాండాగారము
నందును ఇండియా ఆఫీసు లైబ్రరీలోను గల ప్రతులు చంద్రికావ్యాఖ్యానమేత
తములు. ఏతద్వ్యాఖ్యాత విఠ్ఠల పండితుని పౌత్రుడును రామచంద్ర పండితుని
పుత్రుడును నగు తత్సత్ వైద్యనాథపండితుడు. ఉస్మానియా విశ్వవిద్యాలయ
మున గల ప్రతులందు చంద్రికావ్యాఖ్యానముతోపాటు మరియొక వ్యాఖ్యా

---

(1) Triennial Catalogue of Mss. Vol. III Part I Sans. A. Page 3215 No. 2334

(2) Nos. 3918 and 3919

నముగల ప్రతియును గలదు. ఈ వ్యాఖ్యానమునకు తత్త్వప్రకాశిక యని పేరు. దీనికర్త హర్షదేవసూనుడగు అవసథ్థి భగీరథుడు. చంద్రికావ్యాఖ్యానములో కొన్ని సర్గలును, తత్త్వప్రకాశికావాఖ్యలో కొన్ని సర్గలును, కేవల మూలశ్లోకములుగల కొన్ని సర్గలును కలిపినచో మొత్తము పంద్రెండు సర్గలు గల ఈ మహాకావ్యము సిద్ధమగును.

కృతికర్తయగు ఓర్గంటి లక్ష్మణయజ్వకాల మిదమిత్థముగా తెలియకున్నను వ్యాఖ్యాతకాలము కొంతవరకు తెలిసియున్నందున నీతడు అంతకన్న పూర్వుడని భావింపవచ్చును. గోవింద ఠక్కురుని కావ్యప్రకాశప్రదీపముపై ప్రభయను వ్యాఖ్యానమును, కావ్యప్రకాశమందలి యుదాహరణ పద్యములకు ఉదాహరణచంద్రికావ్యాఖ్యానమును, కువలయానందమునకు అలంకారచంద్రికావ్యాఖ్యానమును వ్రాసిన తత్సత్ వైద్యనాథసూరియే ఓర్గంటి లక్ష్మణాధ్వరివిరచిత సీతారామవిహారకావ్యమునకు చంద్రికావ్యాఖ్యానమును వ్రాసినవాడు. ఈ వైద్యనాథుడు క్రీ. శ. 1684లో ఉదాహరణచంద్రికను రచించినట్లు మహామహోపాధ్యాయ, డాక్టరు పి. వి. కాణే పండితుడును[3], డాక్టరు ఎస్. కె. డే పండితుడును[4], తెలిపియున్నారు. కనుక మన ఓరుగంటి లక్ష్మణయజ్వ అంతకన్న పూర్వుడుగా నుండవలెను. అనగా నాతడు పదునేడవ శతాబ్దము ప్రారంభముననో లేదా పదునారవ శతాబ్దము చివరనో ఉండి యుండును. తత్సత్ వైద్యనాథ పండితుడు సర్గాంతములం దిట్లు చెప్పుకొన్నారు.

"ఇతి శ్రీమత్పదవాక్య ప్రమాణాభిజ్ఞ ధర్మశాస్త్రధురీణ తత్సత్ రామభట్టాత్మజ వైద్యనాథసూరి విరచితయాం శ్రీ సీతారామవిహారకావ్యటీకాయాం చంద్రికాఖ్యాయాం ద్వాదశవర్గ కిరణః సంపూర్ణః".

పై వాక్యమువలన మొత్తము వ్యాఖ్యానము పేరు చంద్రిక యనియు ఒక్కొక్కసర్గ వ్యాఖ్యానము పేరు కిరణమనియు తెలియుచున్నది.

ఉస్మానియా విశ్వవిద్యాలయమున సీతారామవిహారమునకు మరియొక

---

(3) History of Sanskrit Poetics; Page, 415,

(4) Sanskrit Poetics; Page, 170,

వ్యాఖ్య కలదని మనవి చేసితిని. దీనికర్త అవసథి (అవసథ్య కాబోలు) భగీరథుడు తన్నుగూర్చి ఇట్లు చెప్పుకొన్నాడు.

"ఇతి శ్రీ కూర్మాచలేంద్రోద్యోతచంద్రాశ్రిత శ్రీ రుద్రచంద్రపురోహిత సోమపాయి బలభద్రపండిత గోత్రాపత్య హర్షదేవసూను ఆవసథి భగీరథకృతా యాం సీతారామవిహారటీకాయాం తత్త్వప్రకాశికాఖ్యాయాం పంచమ స్సర్గః"

ఈ భగీరథ పండితుడు కుమారసంభవ, మేఘసందేశ, రఘువంశ, శిశుపాలవధ, కిరాతార్జునీయ, నైషధీయ చరితములకే కాక కావ్యాదర్శము, దేవీ మాహాత్మ్యము, మహిమ్నస్తోత్రములకు కూడ వ్యాఖ్యానములు రచించినట్లు తెలియుచున్నది. ఈతడు కూడ పదునేడవ శతాబ్దమందున్న వాడట[5].

పై యిరువురు వ్యాఖ్యాతలును ఆంధ్రేతరులు. ఆంధ్ర దేశమున బుట్టిన కావ్య మాంధ్రేతర ప్రాంతములందు వ్యాప్తి గాంచుటకు శతాబ్దమో కనీసము అర్ధశతాబ్దమో పట్టియుండును గదా! కనుకనే ఓరుగంటి లక్ష్మణాధ్వరి పదునారవ శతాబ్దము చివరనో లేదా పదునేడవ శతాబ్దము ప్రారంభముననో ఉండి యుండునని యూహించితిని. ఈ కావ్యవ్యాప్తిని గూర్చి నరియొక యూహ. పూర్వము భారతీయకవిపండితు లందరకును కాశీ, నవ ద్వీపముల వంటివి కూడలి పట్టులుగా నుండెడివి. అన్ని రాష్ట్రములవారును అ వరస్వతీ నిలయము లందు కలిసికొనెడివారు. సీతారామవిహారకావ్య మిట్టి కూడలి పట్టునందైన పరరాష్ట్ర పండితుల నాకర్షించి యుండును.

సీతారామవిహారకావ్యము పంద్రెండు సర్గల మహాకావ్యము. ఇందు శ్రీరామచంద్ర యౌవరాజ్యపట్టాభిషేకపర్యంతమున్న కథమాత్రము వర్ణింపబడినది. ఆయా సర్గలందలి యితివృత్తమును, వాని శ్లోక సంఖ్యయు నీ పట్టిక వలన తెలియగలదు.

---

(5) A Critical study of Naisadhiya charitram, by Dr. A. N. Jani Pages 33 and 34.

| సర్గ | ఇతివృత్తము. | శ్లోకసంఖ్య. |
|---|---|---|
| I | అయోధ్యాపుర వర్ణనమ్ | 60 |
| II | వర్షర్తు వర్ణనమ్ | 64 |
| III | శరద్వర్ణనమ్ | 52 |
| IV | శాంతకన్యా వివాహః | 58 |
| V | వారాణసీ వర్ణనమ్ | 71 |
| VI | బిందుమాధవ సాక్షాత్కారవర్ణనమ్ | 51 |
| VII | విశ్వామిత్ర యాగోద్ధరణమ్ | 69 |
| VIII | సీతావర్ణనమ్ | 51 |
| IX | సీతా వివాహమ్ | 79 |
| X | సీతారామోద్యాన విహారః | 51 |
| XI | పుష్పాపచయాదికమ్ | 68 |
| XII | యౌవరాజ్యాభిషేకః | 52 |
| | | 706 |

కొన్ని ప్రతులందలి శ్లోకసంఖ్యలో ఒందు రెండు హెచ్చుతగ్గు లున్నవి. పైన పేర్కొనబడిన సర్గముల పేరులనుబట్టి ఈ కావ్యమందున్న కథ మిక్కిలి చిన్నదనియు, కేవల మిది వర్ణనాత్మకకావ్యమనియు మనము గ్రహింపగలము. V, VI సర్గములందలి విషయములు, అనగా వారణాసీ వర్ణనము మరియు బిందుమాధవసాక్షాత్కారవర్ణనములు కథానాయకుడగు శ్రీరామచంద్రుని కన్న మన జీవితమునకే ఎక్కుడు సంబంధించినవని ఊహించుచున్నాను. ఈ కవి వారణసీప్రముఖక్షేత్రములు పుణ్యమునకో పురుషార్థమునకో (విద్యార్జనమునకు) సందర్శించియుండును. కనుకనే మిక్కిలి యభిమానముతో వానిని తన కావ్యమున చొప్పించి యుండునని యూహించుచున్నాము. ఒకవేళ ఈకృతి వారణాసీ పుణ్యస్థలమున రచింపబడి యుండను వచ్చును. కనుకనే ఆంధ్రేతరపండితులను ఆకర్షించుట జరిగి యుండును.

ఈ కావ్యములో బాటు ఓర్గంటి లక్ష్మణయజ్వ ఇంకను బదు కృతులు రచించినట్లు దీని సర్గాంత పద్యములు సాక్ష్యమిచ్చుచున్నవి.

1. ద్వితీయ సర్గాంతమున

"ఓర్గంటి లక్ష్మణాధ్వరికృత సీతారామశోభనవిహారే
కయ్యటవివరణ సోదరకావ్యే వ్యగమద్ద్వితీయ సర్గోయమ్"

2. తృతీయ సర్గాంతమున

"ఓర్గంటి లక్ష్మణాధ్వరికృత సీతారామశోభనవిహారే.
శ్రీ గీతరామ సోదరకావ్యే వ్యగమ త్తృతీయ సర్గోయమ్"

3. చతుర్థ సర్గాంతమున

"ఓర్గంటి లక్ష్మణాధ్వరికృత సీతారామశోభనవిహారే
శ్రీ చమత్కారలహరీ సోదరకావ్యే చతుర్థసర్గోఽభూత్"

4 పంచమ సర్గాంతమున

"ఓర్గంటి లక్ష్మణాధ్వరికృత సీతారామశోభనవిహారే
గీతమహేశ్వర సోదరకావ్యే భవత్రపంచమః సర్గః"

5. షష్ఠ సర్గాంతమున

"ఓర్గంటి లక్ష్మణాధ్వరిత్కృత సీతారామశోభనవిహారే
సంగతి లక్ష్మణ సోదరకావ్యే భవ్రదత షష్ఠస్సర్గోయమ్"

అథోరేఖాంకితములగు ఉపర్యుక్తకృతులన్నియు మృగ్యములగుట మన దురదృష్టము. పై కృతులు ఓర్గంటి లక్ష్మణయజ్వ బహుముఖప్రతిభను, వివిధకృతినిర్మాణదక్షతను చెప్పక చెప్పుచున్నవి.

లక్ష్మణయజ్వ పూర్వసంస్కృతమహాకవుల రచనములనేకాక పూర్వాంధ్రకవుల రచనలనుగూడ బాగుగా జీర్ణముచేసికొన్నవాడు. పదునారవ శతాబ్దము వరకే పరాంకోటి నందుకొన్న మన ప్రబంధముల ప్రభావమీ కావ్యముపై స్పష్టముగా గనవచ్చుచున్నది. ఇంతియకాక ఆంధ్రదేశపు ప్రత్యేకతలుకొన్ని యీకావ్యమున ప్రవేశించినవి. ఆంధ్రేతరులగు వ్యాఖ్యాతలీ పట్టులందిని ఆంధ్రదేశమునకు సంబంధించినవని కంఠోక్తిగా చెప్పియున్నారు.

సీతారామవిహారమను కావ్యనామమే కొంత చిత్రముగా నున్నది. అటు సంస్కృతమందును ఇటు తెలుగులోను 'విలాసకావ్యము' లధికముగా

నున్నవేకాని 'విహారకావ్యము' అంతగా లేవు. జయదేవకృతమగు సీతా విహారమను కావ్యమొకటి సంస్కృతమున వినబడుచున్నది[6]. లక్ష్మణయజ్వ మేధాదక్షిణామూర్తి మంత్రోపాసకుడు. ఈ విషయము కావ్యారంభమందలి మూడవ శ్లోకము వలనను ఆరవసర్గమందలి మేధాదక్షిణామూర్తిస్తోత్రము వలనను తెలియనగును.

సీతారామవిహారకావ్యమున గల ప్రథమ శ్లోకమిది.

"అస్తి ప్రశస్తాఖిలలోకభూషా విభూషితద్వాదశయోజనైషా
విశుద్ధభావై ర్వినివిష్టమధ్యా విరాజమానా విబుధై రయోధ్యా." I-1

అయోధ్యాపురవర్ణనము చేయబూనిన కవి తన వినయము నిట్లు చాటుకొన్నాడు:

"వ్యాసం న వేదా న్నచతుర్ముఖోహం న వా గురుర్నైవ ఫణాభృదీశః
కథం త్వయోధ్యాపురవర్ణనాయ దక్షో భవిష్యామి దరం వినైవ" I-8

వినయసంపదతోబాటు ఆత్మాభిమానముగూడ దొడ్డగా గలవా డీలక్ష్మణకవి. భవభూతివలె ఈతడుగూడ తన ప్రయత్నమునుగూర్చి ఇట్లు చెప్పుకొన్నాడు :

"వైషమ్యవైరస్యవిషాదదగ్ధబుద్ధీ నభాగ్యాన్ప్రతి నైష యత్నః
జయంతు తే సత్కవయః కవిత్వరహస్యసర్వస్వవిదీవనో యే" I-9

అయోధ్యానగరము చుట్టున్న పరిఖావర్ణనసందర్భమున గల శ్లోకమిది :

"యే మా ముపాశ్రిత్య వసంతి సర్వే జనా ఇహాముత్ర చ పాలనీయాః
ఇతీవబద్ధం పరిఖా ఛలేనపాదే యయా కంకణ మావిభాతి" I-12

ఈపాదకంకణ మాంధ్రుల గండపెండారము. వ్యాఖ్యాత లీసందర్భమున "పాదే బద్ధం కంకణ మావిభాతి శోభతే న చ కంకణం కరభూషణ మిత్య మరకోశాదివిరోధః. ఆంధ్రాం దేశవిశేషే పాదే కంకణబంధస్య బిరుదత్వేన ప్రసిద్ధతయాదోషాభావాత్" అని చెప్పియున్నారు.

మణిఖచితములగు అయోధ్యాపుర సముత్తుంగ సౌధములందలి ముగ్ధల వర్ణించునప్పుడు కవి యాంధ్రదేశమునగల ఎసరన్నము వండు నాచారమును ప్రవేశపెట్టినాడు :

---

6. History of Classical Sanskrit Literature -M. Krisnnamachari, Page 645 (1937)

"చిత్రం యత్ర ప్రముగ్ధా బహుతరఖదిరాంగారబుద్ధ్యా మణీనాం
సంఘం నిక్షిప్య చుల్యాం తదుపరి కలశే చంద్రకాంతా పనద్ధే,
తోయం జాలాంతరాలస్థితశశికిరణై ర్వర్ధమానం హి రాత్రౌ
దృష్ట్వా పాకార్థ మేతత్ కలశగతజలే తండులాన్ ప్రక్షిపంతి." I-38

ఋష్యశృంగు నాకర్షించికొని తెచ్చుటకు పోయిన వేశ్య లావటువున కిడిన భక్ష్యముల నిట్లు వర్ణించినాడు :

"వనితా వటవే దదు స్తదా వటకాపూపసమేత మోదకాన్,
వరలడ్డుక భూరిపూరికా మధురా నన్నరసా న్మనోహరాన్." IV-34

ఈ సందర్భమున వ్యాఖ్యాత "ఆంధ్రదేశ ప్రసిద్ధభక్ష్యవిశేషాన్ దదుః" అని వ్రాసినాడు. వేశ్యలకును ఋష్యశృంగునకును జరిగిన సంభాషణమున హాస్యము బాగుగా పోషింపబడినది. ఇందు సులభపదఘటితములగు శ్లేష చమత్కారములును ప్రదర్శింపబడినవి.

"వయ మేక వచేన నిశ్చలాః సజపా ఊర్ధ్వకరా స్తపశ్చరాః,
చలపాదకటాక్షబాహవ స్త ఇమే సామజపా స్తపోధనాః". IV-37

దశరథమహారాజు సీతాకల్యాణమహోత్సవమున కయోధ్యనుండి మిథిలకు తరలిపోవునప్పుడు వర్ణింపబడిన వేడుకలు వినోదములు మున్నగు వానిలో నాంధ్రదేశప్రసిద్ధదశావతారాభినయములును, బొమ్మరివాంధ్ర అటలును ప్రవేశించినవి.

"మృదంగ వీణాపణవాణకోజ్జ్వలా దశావతారాభినయే ధురంధరా,
ప్రతస్థిరే వేషధరైంద్రజాలికా గుణే చ వంశే చ వినర్తనక్షమాః" IX-43

ఈ విధముగా నాంధ్రతాముద్ర లెడనెడ సీతారామవిహారకావ్య మంతటను గానవచ్చుచున్నని. శరద్వర్ణనము చేయునప్పుడు చెప్పిన

"జలనిర్గమేన వరనిర్ఝరిణీ పులినం క్రమాత్ ప్రకటయంత్యమలం,
నవసంగమేన కులవధూ శ్శనకైః జఘనప్రకాశనపరేవ బభౌ". III-6

అను శ్లోకము వాల్మీకి శరదృతువర్ణనమును జ్ఞప్తికి దెచ్చును. వర్షర్తువర్ణన సందర్భమున చెప్పిన

"గాఢం ఘనాలింగితసర్వగాత్రా ప్రభాకరస్పృష్టపయోధరా ద్యౌః,
అధోంబరే లంప్రవిభక్తరాగా బభూవ సంధ్యా సురజన్యలేప." II-12

అనుశ్లోకము కాళిదాసు (రఘువంశము XI–60) వర్ణనమును తలపింపజేయును.

సీతారామవిహారకావ్యమున నైదవసర్గము వారాణసీవర్ణనము. ఇది లక్ష్మణయజ్వకాలమునాటి కాశీపురమునకు దర్పణము. ఈ సర్గమున మణికర్ణికాష్టకము, గంగాష్టకము, తులసీషట్కము, భైరవాష్టకములు గలవు. వీనిలో ఒక్కొక్క శీర్షికనుండి యొక్కొక్క శ్లోక ముదాహరింతును.

మణికర్ణికాష్టకమునుండి :

"కరుణాం కురు మ య్యనన్యనాథే తరణే పాతకజాలకర్దనస్య,
అరుణాంశుక వేష్టితాంగయష్టే శరణం త్వాం మణికర్ణికే ప్రపద్యే." V-19

గంగాష్టకమునుండి :

"త్వదుత్సంగే గంగే విహరణవిహంగే మయి మిలత్
కృపాపాంగే సంగే తవ కరతరంగేణ సతి మే,
కుతః పాపం తాపం జనయతు సమీపం పరిజహత్
పరం ద్వీపం దీపం తమ ఇవ దురాపం ప్రజతిహి". V-30

తులసీషట్కమునుండి :

"తులసీం తలశీతసిరపూరాఽఽపరిక్రాంతజటాకలాపభారామ్,
ప్రణమామి తపోవిధానదక్షాం నిజభక్తార్తి విపాటనైకదీక్షామ్". V-41

భైరవాష్టకమునుండి :

"పరేతభూతజాతభీతభీతలోకవీక్షితం
కరాలహస్త తాలతాలరూపకోటిభిర్వృతమ్,
పటుం పటుం నటంత మాదిదేవ మావృతం సురైః
ముదా యదా కదాపి కాలభైరవం సమాశ్రయే". V-60

సీతారామవిహారకావ్యమున షష్ఠసర్గము బిందుమాధవసాక్షాత్కారవర్ణనము. దీనిలో మేధాదక్షిణామూర్తిస్తోత్రమును, విశ్వనాథాష్టకమును, బిందుమాధవ వర్ణనములును కలవు. ఓరుగంటి లక్ష్మణాధ్వరి, మేధాదక్షిణామూర్తి మంత్రోపాసకుడని తొలుత మనవిచేసితిని. దక్షిణామూర్తి స్తవము శంకరుల శివానంద లహరిని దలపించునట్లున్నది.

"ఇమం సర్వం గర్వం కలయ సుమ సర్వోత్తను విభో
సదా పూర్వం శర్వం సురవినుత చార్వంఘ్రి కమలం
సకృ న్నత్వాపి త్వా మహ నుగణయత్వాంతక మపి
స్థిరో భూత్వా ధృత్వా తవపద మధీత్వా చ విహరే." VI-9

విశ్వనాథాష్టకమునుండి :

"ఆత్మనామ ధామ ధీమ దామ పాపహారిణం
కామ భీమ సోమ సోమ సీమ మామకాశ్రయమ్,
వామ వామ వామ వామ దేవ దేవ కామదం
విశ్వనాథ మే వికాసనాథ మీశ మాశ్రయే". VI-15

నీలమేఘశ్యాముడగు బిందుమాధవుని వర్ణనమిది :

"నిజ భాషణనాద పూరితాశః స్తనితాపూర్ణచతుర్దిగంతరాలః,
త్రిదివేషు చతుర్భుజప్రసన్నః కృషిజీవిష్వివ నీలనీలమేఘః". VI-42

ఓరుగంటి లక్ష్మణయజ్వ కవితాపాటవమును జూచుటకు సీతారామవిహార కావ్యము మొదటిమూడు సర్గలును చివరినాల్గు సర్గలును ప్రతిశ్లోకప్రమాణములు. ఈతని కవితాకళనుగూర్చి స్థలాంతరమున నివేదింతును. ఇది కేవల మాతని పరిచయమున కుద్దేశింపబడిన వ్యాసము. లక్ష్మణసోమయాజి బిందుమాధవుని స్తుతించిన శ్లోక మొకటి యుదాహరించి దీని నింతటితో ముగింతును :

"దేవ త్వదీయచరితం విధిరప్రమేయం
కిం వర్ణయిష్యతి తనో స్తవ జాతజన్మా,
వాచామగోచరమహో మనసాం చ విద్వాన్
ఆనంద మేత్య న బిభేతి కుతశ్చ న త్వామ్" VI-45

(అభినందన కావ్యమాల, 1961)

# సారంగు తమ్మయ

వైజయంతీవిలాసమను వైష్ణవప్రబంధమను రచించిన సారంగుతమ్మయ కాలమునుగూర్చి భిన్నాభిప్రాయములు గలవు. అతని కాలమును గూర్చి యూహించుటకు తోడ్పడు రెండుపద్యములు వైజయంతీవిలాసమున నున్నవి. వానిలో మొదటిది గురుస్తుతి సందర్భమున గల పద్యము

"వందారుదాసజనతా
మందారున్ వేదశాస్త్రమహితప్రజ్ఞా
బృందారకగురు మద్గురు
కందాళప్పలగురున్ జగద్ధితు గొలుతున్" (I–11)

రెండవది ప్రభుస్తుతిసందర్భమున గల పద్యము.

"ఇనసమతేజులౌ నృపులనెల్ల మహమ్మదుషాహి యేలు నీ
యెనుబదినాల్గుదుర్గముల నేలిన యేలిక గోలకొండ త
ద్ఘననగరస్థలిన్ గరణికం బొనరించెడు తమ్మమంత్రి యా
జనపతి రమ్ము సొమ్మప ప్రజల్ జయవెట్ట గృహస్థులౌననన్" (I–30)

ఈ పద్యము లాధారముగా కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ్మయమంత్రి గోల్కొండరాజ్యము నేలిన కుతుబ్‌షాహీవంశమునం దైదవవాడగు మహమ్మద్‌ఖులీ ఖుతుబ్‌షాకాలమువా డనిరి.[1]

పైవానిలో మొదటిపద్యమున పేర్కొనబడిన తమ్మమంత్రిగురువగు కందాళఅప్పలాచార్యులును తెనాలిరామకృష్ణుని పాండురంగమాహాత్మ్యమునకు కృతిభర్త యగు విరూరివేదాద్రిమంత్రికి గురువగు కందాళఅప్పలాచార్యులును నభిన్నులనియు కాన తమ్మయమంత్రి తెనాలిరామకృష్ణునకు సమకాలీనుడనియు వీరేశలింగంపంతులుగారి యభిప్రాయము. ఈ యభిప్రాయమునకు

---

1. ఆంధ్రకవులచరిత్రము – 2వ భాగము, పు. 204 (1949)

భిన్నముగా కీ. శే. చాగంటి శేషయ్యగారు విరూరివేదాద్రిమంత్రికి గురువైన కందాళఅప్పలాచార్యుల తాత పురోక కందాళ అప్పలాచార్యులు సారంగు తమ్మయకు గురువనియు, రెండవపద్యమునగల మహమ్మదుషాహి కుతుబ్‌షాహి వంశమునందలి ఖులీకుతుబ్‌షా కాదనియు అతడు బహమనీసుల్తానులందు చివరివాడగు మహమ్మదుషా (1481–1518ఎ డి.) యనియు సోపపత్తికముగా వాదించి వైజయంతీవిలాసప్రబంధరచనము క్రీ.శ. 1510 ప్రాంతమునందు జరిగినట్లు సిద్ధాంతీకరించిరి.[2]

చాగంటివారు చూపిన యుపపత్తు లన్నియు సమంజసముగానే యున్నవి. కాని సుల్తాను సారంగతమ్మయను "రమ్మ పొమ్మని" యాదరించెడివాడట। రమ్మపొమ్మనునంతటి యాదరమును జూపుట దూరస్థుడగు. బహ్మనీ సుల్తానున కన్వయించుటకన్న సమీపస్థుడగు "కుతుబ్‌షాహి" సుల్తానున కన్వయించుట మేలుతరముగా నుండును. మీదు మిక్కిలి చాగంటివారు చెప్పెడి బహమనీ సుల్తాను అవంశములో చివరివాడు. అతనికాలముననే బహమనీ రాజ్యమంత రించెను. కనుక నాతడు "ఎనుబదినాల్గుదుర్గముల నేలిన యేలిక" యగుట పొస గదు. కాని కందాళఅప్పలాచార్యులగూర్చి చాగంటివారు చూపిన యుపపత్తులే సమంజసముగా నున్నవి. చిత్రభారతమున పేర్కొనబడిన కందాళప్పగురువే వైజయంతీవిలాసమున పేర్కొనబడిన కందాళప్పగురువని యూహించుటకు ఓరుగల్లు, గోల్కొండ పట్టణముల సామీప్యమునుగూడ కొంతతోడ్పడుచున్నది. ఐనను ఈవిషయమింకను పరిశీలింపవలసియున్నది.

సారంగు తమ్మయ్య గోల్కొండనగరమునకు కరణ మను మాట సత్యము. కరణ మనగా సామాన్యగ్రామకరణము కాదు. నగరమునకు కరణ మనగా మంత్రిత్వమంతటి పని. నేటి 'మేయరు' పదవివంటి దానాటి నగర కరణీకము. కనుక సుల్తాన్ 'రమ్మ పొమ్మ'ని యాదరించెడువాడు. ప్రజ లాతని వైభవమునకు 'జయ' వెట్టుచుండిరి. గృహస్థులౌనని మెచ్చుచుండిరి. ఇట్టి సారంగుతమ్మయ తెలుగుకవిగా మాత్రము మన కింతవఱకు పరిచితుడు. కాని యాతడు గీర్వాణవాణికిగూడ క్రైసేతలు చేసినవాడని తెలుపుటయే నాయుద్దేశము.

2. ఆంధ్రకవితరంగిణి. ౮వ సంపుటము. పు ౫౩–౫౪, (1951)

సారంగుతమ్మయ విశిష్టాద్వైతమతానుయాయి యనియు "పరిచితభగవద్భాగవతకైంకర్యవిధాను"డనియు వైజయంతీవిలాసాశ్వాసాంతగద్యములు చాటుచున్నవి.[3] ఏవంవిధగుణవిశిష్టుడు గనుకనే సారంగుతమ్మయి నారదీయ పురాణాంతర్గతనుగు హరిభక్తిసుధోదయమునకు సంస్కృతమున వ్యాఖ్యానము రచించెను. ఈ వ్యాఖ్యానమునకు, భక్తిసజీవని యనిపేరు. ఇది యిరువది యధ్యాయముల గ్రంథము. అధ్యాయాంతమున గల గద్య ఈ క్రింది విధముగ నున్నది.

"ఇతి సారంగతమ్మప్రభుణా విరచితాయాం హరిభక్తిసుధోదయ టీకాయాంభక్తిసంజీవనీవ్యాఖ్యాయాంప్రథమోధ్యాయః." ఈగద్యమున సారంగు తమ్మయ్య తన్ను ప్రభువుగా జెప్పికొనినాడు. మంత్రికులమున బుట్టిన పెద్ద కరణము సుల్తానులు 'తమ్మప్రభువుని' యొసర్చిన యాదరమున దాను గూడ స్వయముగా ప్రభువైన పిమ్మట నీవ్యాఖ్యానమును వ్రాసియుండును. అనగా వైజయంతీవిలాసప్రబంధరచనము తరువాతనే 'భక్తిసంజీవని' రచన జరిగి యుండును. వైజయింతీవిలాసము శ్రీరామచంద్రునకంకితము. శ్రీరామచంద్రుడు సారంగు తమ్మయ కిలువేల్పు. ఆ శ్రీరామచంద్రప్రభువును తమ్మయ తన వ్యాఖ్యారంభమున నిట్లు స్తుతించినాడు.

"శ్రీరామచంద్ర స్స తనోతు లక్ష్మీం
శ్రీలక్ష్మణాలంకృతదివ్యమూర్తిః,
యద్దర్శనా ద్దుఃఖ మపాస్య సర్వం
సద్యఃపరానంద ముపైతి లోకః".

దీని తరువాత నుతిరెండు శ్లోకము లున్నవి. వానిలో తమ్మయ తపను గూర్చియు, తనప్రయత్నమును గూర్చియు, తెలిపినాడు.

"యస్యౌదార్యమివాకలయ్య సతతం కుర్వన్తి వాసం దివి
స్వర్ధేనుప్రముఖావదాన్యసుజనా యో ప్యద్యాపి నేహాగతా,
శ్లాఘ్యస్సాధుగుణాన్వితో బుధజనై ర్భాగీరథీపట్టణే
సోఽయం మంత్రిధురంధరో విజయతే సారంగుతమ్మప్రభుః."

---

3. కీ.శే. వీరేశలింగంపంతులుగారు సారంగతమ్మయ 'మాధ్వమతానుయాయి' యనిరి.

"తే నేయం క్రియతే టీకా హరిభక్తిసుధోదయే,
భక్తిసంజీవనీ నామ్నా విద్వత్సంతోషకారిణీ."

పైశ్లోకమువలన సారంగుతమ్మయ 'మంత్రిధురంధరుం' డనియు, 'ప్రభు' వనియు తెలియుటేగాక గోల్కొండ పట్టణమునకు 'భాగీరథీపట్టణ' మని మఱియొక పేరుగూడ ఉన్నట్లు తెలియుచున్నది.

హైదరాబాదునగరమునకు 'భాగ్యనగర'మని పేరుండినట్లును అది సుల్తాన్ మహమ్మద్ ఖులీకుతుబ్‌షా ప్రియురాలివలన నేర్పడిన దనియు నొక యైతిహ్య మున్నది. కొందరిది సత్యమనియు మరికొంద రిది కట్టుకథ యనియు వాకొనుచున్నారు.

సారంగుతమ్మయ మహమ్మద్‌ఖులీ కుతుబ్‌షాకన్న పూర్వీకుడని భావించినచో నిజమున కీకథకు కాళ్ళు లేవని పైశ్లోకము రుజువు చేయుచున్నది. 'భాగీరథీపట్టణమే' భాగ్యనగరముగా మారెనని భావింపవలయును. ఒకవేళ సారంగుతమ్మయ ఖులీకుతుబ్‌షా కాలము (1580-1612) వాడే యని నిశ్చయమైనను నాతని ప్రియురాలు భాగామతి పేరుతో నేర్పడిన పట్టణము భాగీరథీపట్టణము కాజాలదు గదా। ఒకవేళ పూర్వము భాగీరథీనామముతో నుండిన పట్టణమే సుల్తాను భాగామతి పేరుతో భాగ్యనగరముగా మారెనో తెలియరాదు. భాగీరథినిగూర్చి మరియొక విశేషము. సుల్తాను మహమ్మద్ ఖులీకుతుబ్‌షా భాగీరథియను హైందవస్త్రీవలన (1566) జన్మించినట్లొక ఐతిహ్యమున్నది.[4]

ఒకవేళ ఈ భాగీరథి యనుపేరుతోడనే భాగరథీపట్టణ మనుపేరు వచ్చినచో సారంగుతమ్మయ కాలము మరికొంత ముందుకు పోవును. హరిభక్తి సుధోదయ వ్యాఖ్యానకారుడగు సారంగుతమ్మయ తన తండ్రితాతలమగూర్చి యేమియు చెప్పకొనలేదు. వైజయంతీవిలాసప్రబంధకర్త తాత మరియొక సారంగుతమ్మయ ఈవ్యాఖ్యానరచయిత కాగూడదా యన్నచో భాగీరథీపట్టణ వృత్తాంతము మఱి కొంత ప్రాచీన మగును. తాతగా రిట్టి గొప్పపురాణమునకు

4'History of Golconda, by Abdul Majeed siddiqui-Page 88 (1956)

అందులో తను మతమునకు సంబంధించినదానికి - వ్యాఖ్య వ్రాసియుండగా వైజయంతీవిలాసకర్త దానిని స్మరింపకుండునా? కనుక నీయిరువురు తమ్మయ లభిన్నులనియే భావింపవలయును. మీదుమిక్కిలి వైజయంతీవిలాసకర్త తాను 'పరిచితభగవద్భాగవతకైంకర్యవిధాను'డనని కంఠోక్తిగా చెప్పుకొనుటచే హరిభక్తిసుధోదయమునకు [ప్రహ్లాదాదిభాగవతుల చరిత్రమునకు] భక్తి సంజీవనీటీకను గూర్చిన వా డతడే యని మన మనుకొనవలెను. ఈ యముద్రిత కృతికి తాళపత్రప్రతి యస్మానియావిశ్వవిద్యాలయము సంస్కృత అకాడమిలో నున్నది. దీని వైశిష్ట్యముగూర్చి కాలాంతరమున నివేదింతును.

(శాంతి, 1961)

# పరశురామ పంతుల
# అనంతరామ పండితుడు

గీర్వాణభాషాయోష కమూల్యాభరణము లనాదిగా నవదరించుచున్నవా రాంధ్రులు. అట్టివారిలో పరశురామపంతుల అనంతరామపండితు డొకడు. ఈతడు సీతావిజయమను చంపూప్రబంధమును రచించెను. ఈ గ్రంథ మము ద్రితము. దీని ప్రతి కాకినాడ అంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున గలదు.

పదునెనిమిదవ శతాబ్దము పూర్వార్థమున తెలుగు గడ్డపై జన్మించిన మహానుభావుడు పరశురానుపంతుల లింగమూర్తి. లింగమూర్తి రతిమన్మథ విలాసము, జీవన్ముక్తి ప్రకరణము, బ్రహ్మనారద సంవాదము, తారక యోగము, మానస శతకము, సీతారామాంజనేయ సంవాదము, సీతపాట, మున్నగు వానిని రచించెను. ఇంతవరకు లోకమునకు దెలియని మరి రెండు శతకములు లింగమూర్తి రచనలు ఉస్మానియా విశ్వవిద్యాలయము సంస్కృత అకాడమీ తాళపత్ర గ్రంథములందున్నవి. అవి, 1. ఆత్మారామ 2. గోవింద శతకములు. లింగమూర్తి కుమారుడు రామమూర్తికవి శుకచరిత్రమను వేదాంతగ్రంథ నిర్మాత. పరశురానుపంతులవారి వంగడము లింగమూర్తి అదిగా అధ్యాత్మికవిద్య కాలవాలమై నేటికిని ఓరుగల్లునను తత్పరిసర గ్రామములందును వర్ధిల్లుచున్నది. లింగమూర్తి వసించిన గృహ మిప్పటికిని మట్టెవాడలో నున్నది. ప్రభుత్వమువారో ప్రజలో దీనిని స్వాధీనము చేసి కొని ఆంధ్రులపాలిటి పుణ్యతీర్థమట్లు పరిరక్షింపవలసినదీ పవిత్రగృహము.

లింగమూర్తికవి కైదవ తరమువాడు అనంతరామ పండితుడు. సీతా రామాంజనేయసంవాదమునకు పీఠిక వ్రాసిన శేషాద్రి రమణకవు లిచ్చిన లింగమూర్తి వంశావతార మిట్లున్నది.




ఈ పట్టికలో నైదవ తరమువాడగు అనంతరామయ్యయే సీతావిజయ చంపూ ప్రబంధ రచయిత. పైన పేర్కొనబడిన వంశక్రమమే సీతావిజయమందును అనంతరామపండితుని వరకును గలదు. కనుక నీతడు 19 వ శతాబ్దము మధ్యభాగమున నుండియుండును. అంత్యగద్యవలన నీతని తల్లి వేణాంబిక యనియు తెలియుచున్నది.

ప్రథమస్తబకాంతగద్య మిట్లున్నది.

"ఇతి శ్రీమత్సమస్తభువనప్రసిద్ధ మేధ్యతర భరద్వాజగోత్రాభరణాయమాన పరశురామాన్వయదుగ్ధాంబుధిసుధాదీధితినా, శ్రీ లక్ష్మీనారాయణపాదారవిందమరందాస్వాదానంద తుందిలేందిందిరాయమాననిజస్వాంతేన, శ్రీ రామకృష్ణసోమయాజికుటుంబినీ వేణాంబికాశుక్తిముక్తాఫలాయితేన, అనంతరామపండితేన, ప్రణీతే శ్రీ సీతావిజయాభిధాన చంబూ ప్రబంధే ప్రథమస్తబకస్సమాప్తః"—

చంపూప్రబంధమును చంబూప్రబంధమనుట తెలుగుదేశమున కొలదిగానైనను వాడుకలో నుండినదనుటకు నిది మరియొక యుదాహరణము. ఈ గ్రంథమున రెండు మూడు స్థలముల చంబూప్రబంధమనియే కలదు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు తన జైమినిభారతమున నీ పదమును ప్రాసస్థానమున ప్రయోగించుట సాహిత్యజ్ఞు లెరుగుదురు.

సీతావిజయమనగా శతకంఠ రామాయణము. ఆంధ్రేతర భాషలలో నీ శతకంఠరామాయణకథ యున్నదో లేదో నే నెరుగనుగాని తెలుగులో

మాత్రము సీతావిజయము, శతకంఠ రామాయణమను పేరులలో పద్య, గద్య, గేయ, యక్షగానాది వివిధప్రక్రియలం దనేకగ్రంథములు వెలసినవి. శతకంఠరామాయణకథ కాకరము వాసిష్ఠరామాయణమని డాక్టరు యస్వీ జోగారావుగా రనుచున్నారు.• శతకంఠరామాయణముల గూర్చి శ్రీ సాళ్వ కృష్ణమూర్తిగారు వ్రాసియున్నారు.*

ప్రకృత ముపలబ్ధమగుచున్న సీతావిజయ చంపూప్రబంధము సంపూర్ణముగా లేదు. కేవలము మూడు స్తబకములు మాత్రము దక్కినవి. ఇందులో గూడ కొన్ని కమ్మలు పోయినవి. కొన్ని శిథిలములైనవి. ఈ భాగము నాంధ్రలోకమునకు పరిచయ మొనర్తును.

సీతావిజయచంపూకావ్యము శ్రీ రామచంద్రస్తోత్రముతో నిట్లారంభమైనది.

శ్రీరామం సురరాణ్ముఖాసురవరై రారాధితాంఘ్రిద్వయం
రాకారాజముఖం సరోజనయనం రాజాధిరాజం ముదా,
శూరం సూరకులాంబురాశి శశినం దైత్యాంధకారారుణం
ధీరం వీరమరం (హం)స్మరామి సుఖదం స్వాంతే ససీతం సదా. 1-1

దీని తరువాత లక్ష్మీనారాయణుల స్తోత్రము, సరస్వతీ ప్రార్థనలు, ఆంజనేయ స్తోత్రము, విఘ్నేశ్వరస్తుతియు వరుసగా నున్నవి. ఆటుతరువాత అనంతరామవందితుని గురు(వంశ) పరంపర కలదు.

శ్రీరామం నముపాస్య కామదమజం యోంబాలపుర్యాస్థితః (తం)
తస్మాత్ప్రావ పురూన్వరాన్గురువరో లేభే విశాలం యశః,
యో వేదాంతవిచార సుందరతరగ్రంథాన్విరచ్యాంజసా
తం వందే గురులింగమూర్తి మనిశం బ్రహ్మస్వరూపం పరమ్. 1-7

శివ ఇవ విలసన్యస్స్వవరత్యా నితాంతం
విధిసుత సన్యో భక్తిభావేన దాంతమ్,

---

• ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర. పుట 376-454.
* విజ్ఞానసర్వస్వము. తెలుగు సంస్కృతి. పుట. 1040.

శుకమునిరివ సన్యో భూరివైరాగ్యశక్తం
మనసి గురువరేణ్యం చింతయే రామమూర్తిమ్. 1-8

దివి దివిజమునీశో నీత్య విజ్ఞానవంతం
రచయతి యతదోదోసక్తనం నారదోయమ్,
భవతి నమితవక్త్రో వ్యాసపుత్రో విరాగం
సదయహృదయమీశే లింగమూర్తిం గురుం తమ్. 1-9

కుర్వన్కీర్తిదతి యో మునైక్య మనిశం ప్రత్యక్పరబ్రహ్మణః
చిత్తే భక్తజనాయ నైజచరణాబ్జాతే గతాయాం తులమ్,
తత్త్వం బోధయతి ప్రశాంత మనులం దాంతం దయాతోయధిం
తం వందే గురుసార్వభౌమ మనమం శ్రీరామకృష్ణం గురుమ్. 1-10

పై శ్లోకములందు మొదటిదానిలో అంబాల ప్రసక్తి వచ్చినది. ఈ గ్రామము ఓరుగల్లు సమీపమున గలదు. ఈ గ్రామము కాకతి రుద్రాంబ పేరున నిర్మింపబడినది. వరశురామపంతులవారీ గ్రామమందున్నారు.(అంబాల శ్రీరామాంకితముగా సంస్కృతమున మరికొన్ని లఘుకృతులు గలవు. అట్టి వానిలో ఉద్దిమట్టి పాపయ్య విరచిత రాఘవాష్టక మొకటి. ఇదియు నముద్రితమే). గురుపరంపర తరువాత కాళిదాసాదిపూర్వకవుల యొక్కయు, నారదశుకకలశోద్భవవాల్మీకివ్యాస సుతాది తాపసులయొక్కయు స్తుతి గలదు।

అటు తరువాత కథాప్రారంభమగును. శంకరుడు పార్వతికి చెప్పినట్లుగా వ్యాసుడీ కథను నైమిశారణ్యమందలి మునులకు వినిపించును. ప్రథమ స్తబకమున మొత్తము 94 గద్యపద్యము లున్నవి. శ్రీరామాదుల జననమాదిగా రావణవధానంతరము శ్రీరామచంద్రు డయోధ్యానగరమునకు వచ్చి రామరాజ్యము స్థాపించినకథ 20 శ్లోకములలో క్లుప్తముగా వర్ణింపబడినది. రావణవధను విన్న అతని బంధువు శతకంఠుడు విజృంభించి ముల్లోకములవారిని బాధించుటయు, శ్రీ సుహావిష్ణు నాదేశమున నింద్రాది దేవతలును మహర్షులును అయోధ్యకు వచ్చి శతకంఠుని దౌష్ట్యమును, వాని బల పరాక్రమములను శ్రీరామున కెఱిగించుటయు, శ్రీరాముడు వారి కభయమిచ్చి వీడ్కొల్పుటయునను విషయము లీ ప్రథమస్తబకమున వర్ణితములు.

శ్రీరాముని కీర్తి ప్రాభవములు వర్ణించు శ్లోకములందొకటి.

"ధైర్యే సమీకృతో మేరుర్గాద్యవాన్ తుహినాచలః,
సుందరాద్రిరపి భ్రాంతః కథంస్యుర్యేనతే సమాః" 1-74

దశముఖునకు కుంభకర్ణునివలె శతముఖునకు రక్తబిందుడనువాడొక డున్నాడని శ్రీరామునితో దేవతలిట్లు చెప్పుదురు.

రక్తబిందురితి యామినీచరో, వర్తతేస్య నికటే సుహాబలః,
కుంభకర్ణ ఇవ రావణాంతికే, కుంభినీధరసమానవిగ్రహః. 1-91

శతకంఠ దశకంఠుల బలముల తారతమ్యము "సుమేరు సర్షపయోర్యావదం తరం తావదంతరం శతముఖ దశముఖయోః" అని చెప్పబడినది. మీదు మిక్కిలి శతముఖునకున్న కొన్ని విచిత్రశక్తులీ గద్యమున నిట్లు చెప్పబడినవి.

"అయి రఘువీర యస్య యామినీచరస్య విగ్రహాద్రుధిరం సర్షపమాత్రేణ యదా యుద్ధోర్వ్యాం పతిష్యతి తదైవ తద్బలవానన్యో దనుజో జాయతే తచ్ఛరీరాత్పతితాచ్ఛోణితబిందోస్తాదృశః పల లాశనః పునరపిజనిష్యతే, తదంగ ప్రపతిత రక్తబిందోశ్చాన్యో నిశాచరస్తత్సమవిక్రమవాన్ భవత్యతి ప్రసంగే నైవమేవ రక్షఃప్రవరాః కోటిశో జనిష్యంతే" 1-92

ద్వితీయ స్తబకమున మొత్తము 68 గద్యపద్యములున్నవి. దీనిలో షడృతువులును, చంద్రోపాలంభనాదులును, సీతారాముల వనజనకేళివిహారము లును వర్ణింపబడినవి. అనంతరామపండితుని రచనలో శబ్దాలంకారము లెక్కువ. గద్యములు తరచుగా ముక్తపదగ్రస్తములు. ద్వితీయ స్తబక ప్రారంభమున గల వసంతర్తువర్ణన మిది.

"శ్రీ మత్పల్లవతల్లజసముల్లసత్ప్రసూనసాయక నమిత్సముచితవాసంతి కాలతోదవసిత మహామంటపటలీవిభాసమానం, విభాసమానస్వాదుమన్మనో హరమరందబిందుసముదయాస్వాదానందతుందిల సమున్మత్తాళీముఖం, శిలీముఖాయమానసురభిరసాలకలికాప్రయోగ కృశీకృత ప్రియవియోగవద్యోషి దవయవ మదనం, మదనదన్మధుకర నికరసరస్సముదయసముదయ సారసం, సారసరసీకరణనిపుణసుపరసకణగణపరీత పాదపప్రకర మూలప్రదేశకాంతా రం, కాంతారచితవిస్తీర్ణవల్లీ వితానప్రేంఖోళికా ప్రకర ప్రేంఖద్బాలలలనా లీలం, లీలాహరిదంతసంతత ప్రసరత్ప్రసూన సౌరభం" (II-2)

ఈ గద్యమిటులే ముక్తపదగ్రస్తముగా నురి నాలుగింతలు సాగిపోయినది.

వర్షర్తువర్ణనాసందర్భమున గల కొన్ని శ్లోకములు.

"ననుకిర దననుం దిగంగనానాం
ధృటపటతుల్యపయోముచాం రజస్స్వమ్,
సులలితనపనీపవృక్షలేఖా
పురుపటవాస మివాభిరామగంధమ్" II-22

ఆ సమయముననే ఇంద్రగోపములవర్ణన మిట్లున్నది.

"తదేంద్రగోపాః కాశ్యపాృం, కురువిందా ఇవా బభుః,
మహేంద్రాయ బలం దాతుం, విన్యస్తా వర్షహేతవే." II-25

శరదృతువర్ణన నందర్భమున గల శ్లోకము.

"రామార్థం దేవతా యూథైర్ధారిత్ప్ర శ్రమయీతదా,
శుకాశ్రస్సగివాకాశే తతాశోభత శోభనా." II-34

హేమంతర్తువును వర్ణించు గద్యమున కొంతభాగ ముట్టంకింతును.

"నమాచరితహస్తద్వితీయ ప్వస్తికబంధతయా తుహినాతంకశంకయా హృదయరాజీవమివ రక్షయంతం, సతతదంతవిపంచికావాదనేన కంపమానాధరోష్ఠతయా శీతవేదనావనోదనాయ మంత్రజపం కుశలం కుర్వంతమివ స్థితం, నిబిడతరరోమాంచ సంచయకంచుకితకాయతయా సదయదైనదత్తతనూరుహబహులకంబలకృతదేహరక్షణమివ భిక్షానుటంతం దరిద్రజననికురుంబం" II-37

అనంతరామపండితు డెక్కువగా శబ్దాలంకారములను ప్రయోగించినాడని తొలుత మనవి దేసితిని. అందుకొక యుదాహరణము.

"నీలతమాల కదంబవిలీనం. నీలతమాలకశోభనవక్త్రే
మానవతీనుణి నేత్సి నవాముం, మానవతీర్థభవేక్షణ భాంతే" II-42

మూడవ స్తబకమున 67 గద్యపద్యము లున్నవి. ఈ స్తబకమంతయు శ్రీ సీతారామచంద్రుల శృంగారజీవితమున కంకితమైనది. కొన్ని పట్టులందీ వర్ణనములు మితిమీరినట్లున్నవి. మూడవ స్తబక మధికభాగము శిథిలము,

చంద్రోదయవర్ణన సందర్భమున గల శ్లోకమిది.

"చకాస కౌముదీ కామం, కౌముదం తన్వతీ ద్విజాన్
ప్రాచీదిక్కామినీకాంత నాసాముక్తా రుచిర్యథా" III-31

మన్మథ సామ్రాజ్య ప్రాభవ వర్ణన మిది.

"సీత్కారాణి కరాబ్జాత, ధూననం చాపి యోషితాం, 111-45
నయనోర్ధనిమేషాస్తు, మన్మథస్యాత్రతాం యయుః"

ఈ చంపూప్రబంధము సంపూర్ణముగా లభింపకుండుట విచారకరము. ఈ గ్రంథమున గల అంధ్రతాముద్ర మఱియొకటి గలదు. సాధారణముగా సంస్కృతకావ్యములం దొక్కొక సర్గలో నొకేరీరు ఛందము నాడబడుమ. తెలుగు ప్రబంధములందువలె నీ యనంతరామపండితుడీ సంస్కృతప్రబంధమున ప్రతి స్తబకమున అనేకవిధములగు ఛందముల నుపయోగించినాడు.

(సాహితి, జనవరి 1962)

# దిట్టకవి లక్ష్మణకవి

సంస్కృతసాహిత్యమునకు సేవచేసిన ఆంధ్రులందు దిట్టకవి లక్ష్మణకవి యొకడు. ఈతడు హనుమద్రామాయణమను నేకసర్గకావ్యమును రచించెను. లక్ష్మణకవి ఏయూరివాడో ఎప్పటివాడో ఇదమిత్థముగా తెలియదు. దిట్టకవియను నింటిపేరుగల ఆంధ్రకవి - రంగరాయచరిత్ర కర్త - దిట్టకవి నారాయణకవి సాహిత్య చరిత్రమున కెక్కినాడు. ఈతడు పదునెనిమిదవ శతాబ్ద ముత్తరార్ధమున నుండినవాడు. సంస్కృతకవియగు నీ దిట్టకవి లక్ష్మణకవి నారాయణకవికి బంధువగునో కాదో తెలియదు. కాని కొంత పూర్వుడనిమాత్ర మూహింపవచ్చును. దిట్టకవియను ఇంటిపేరప్పుడప్పుడే స్థిరపడుచున్నప్పుడో లేదా తానే ఆ బిరుదమును సంపాదించుకొని గృహనామముగా నుంచుకొన్నప్పుడో ఉన్నవాడీ దిట్టకవి లక్ష్మణకవి. ఇట్లూహించుటకు కారణమేమన లక్ష్మణకవి దిట్టకవియనియేగాక మండలవేముల యను నుపపదమునుగూడ ఇంటిపేరుగా వాడియున్నాడు. తొలుత వీరి యింటిపేరు మండలవేములవారు. ఇది గ్రామనామమువలన నేర్పడిన గృహనామము. తరువాత పురుషకారమున సంపాదించుకొన్న దిట్టకవియను బిరుదము ఇంటిపేరుగా మారియుండును. తండ్రికాలమునాడు మండలవేముల యనునది గృహనామముగా నుండి తన కవితాచాతుర్యమున నార్జించుకొన్న దిట్టకవి బిరుదము తనకును తరువాతవారికిని గృహనామ మగుటచే దిట్టకవి వారి కోవలో నీతడు మొదటివాడని చెప్పనొప్పును. మండలవేముల యను (మండలేముల) గృహనామము వైదికులందు గలదు. మరి దిట్టకవి యింటిపేరు వైదికులందున్నదో లేదో। శ్రీవైష్ణవులందు గూడ దిట్టకవి వారున్నారు. ఒకే యింటిపేరు పెక్కుకులములవారి కుండుట మన మెరుగుదుము. దిట్టకవి లక్ష్మణకవిది కౌండిన్యసగోత్రము. దిట్టకవి నారాయణకవిది కూడ కౌండిన్యసగోత్రము. కనుక నీ దిట్టకవి లక్ష్మణకవికూడ నియోగియని భావించుచున్నాను.

హనుమద్రామాయణము వ్యాఖ్యాన సమేతము. కవియే వ్యాఖ్యాతయై యుండునని యూహించుచున్నాను. హనుమద్రామాయణము వలన కవిని గూర్చి తెలియనగు నంశము లీటీరుగా నున్నవి.

ప్రారంభమున, "ఇహ ఖలు సంస్కృతాంధ్రభాషాకవనచాతుర్యధుర్యో దిట్టకవి లక్ష్మణార్యః । కావ్యం యశసేఽర్థకృతే ....... " అని యున్నది. దీనివలన దిట్టకవి లక్ష్మణకవి సంస్కృతాంధ్ర భాషాకవనచాతుర్యధుర్యుడవి తెలియుచున్నది. ఈతని ఆంధ్రభాషాకావ్యము లేమైనవో తెలియరావు.

కావ్యాంతమున కవినిగూర్చిన రెండు శ్లోకములీ తీరుగా నున్నవి.

1. "శ్రీమద్రామ వరప్రసాదకలనా సంప్రాప్తసారస్వత
శ్రీమద్దిట్ట కవీంద్ర లక్ష్మణసుధీవర్యేణ సంపూరితే,
షట్కాండేరిత యావదర్థకలితే సంక్షిప్త రామాయణే
శ్రోతృశ్రోత్రసుఖావహే విజయతే సర్గోఽ ద్వితీయస్సదా" (121)

2. "మండలవేములకులజః కౌండిన్యసగోత్ర కృష్ణకవి పుత్రః,
లక్ష్మణ సుకవిః కృతవాన్ సర్గేణైకేన రఘువతేశ్చరితమ్". (122)

మొదటి శ్లోకమువలన దిట్టకవి లక్ష్మణకవి శ్రీమద్రామవరప్రసాదకలనా సంప్రాప్త సారస్వతశ్రీమంతుడనియు, షట్కాండ రామాయణకథను సంక్షిప్త మొనర్చి ఏకసర్గమున నద్వితీయముగా వ్రాసినవాడనియు తెలియుచున్నది. ఈశ్లోకవ్యాఖ్యానమున నింటిపేరు ప్రసక్తి వచ్చినప్పుడు;

"దిట్టకవి రిత్యత్ర కపిశబ్దస్య విశేషణీ భూతాంధ్రనామఘటితత్వే కథం సమానాధికరణసమాన ఇతి న శంకనీయం న నామ్ని విప్రతిపత్తిరితి వ్యవహారాత్ యద్వా దృష్టశ్చాసౌ కవిశ్చేతినా దృష్టం యథాతథా కవయతీతి వా సమ్యగుపపత్తేః" అని కలదు.

రెండవశ్లోకమువలన వీరి మొదటి యింటి పేరు మండలవేముల వారనియు, వీరిది కౌండిన్యసగోత్రమనియు తెలియుచున్నది. కమకనే దిట్ట కవియను నింటిపేరు లక్ష్మణకవికాలమున నేర్పడి యుండునని యూహించి తిని. లక్ష్మణ కవి తండ్రి కృష్ణకవియై యుండునని యూహించితిని. 'కృ' అను నక్షరము తరువాత గ్రంథము శిథిలమైనది. కుండలీ కరణములందలి (ష్ణ కవి పుత్రః) అను నక్షరములు నా కవిత్వము. ఈ నా కవిత్వము నిజ మైనచో మన లక్ష్మణకవి యొక తండ్రి బిడ్డయగును తప్పైనచో కృష్ణకవి పుత్రుడే లక్ష్మణకవి యన్న పాపము నా కంటుకొనును. ఈ యొక్క శ్లోకము నకు వ్యాఖ్యానము లేదు. ఇదియే పట్టచివరి శ్లోకము. కవిని గూర్చిన విశేషము లంతకన్న నెక్కుడు తెలియవు.

ఇక కవికాలమును గూర్చి కొంత విచారింతము. ఈ హనుమద్రామాయణము ప్రతి మరియొకప్రతికి పుత్రికయని నిశ్చయముగా తెలియుచున్నది. దీని మాతృకకు సంబంధించిన ఒకటి రెండు కమ్మలీ ప్రతిలో మిక్కిలి శిథిలావస్థలో నున్నవి. ఐనను పుత్రికలో శిథిలమైన చోటులు కనుగొనుట కివి నాకు మిక్కిలి తోడ్పడినవి. పుత్రికను వ్రాసికొన్నవాడు తేదినిచ్చియున్నాడు. కాని సంవత్సరము వ్రాయబడిన భాగము విరిగిపోయి అందులో చివరియక్షర మొక్కటిమాత్రము కొనయూపిరితో నిల్చి పరిశోధకుల పాలిటి పారిజాతమైనది. అది యిట్లున్నది. ( .... రినాను సంవత్సర ఆశ్వీజ శు॥ ౧౫ భాను వారంవరకు హనుమద్రామాయణం సమాప్తం" కలువలపల్లెరా (నా?) రఙప్ప గారి ... ... )

సంవత్సరము పేరులో చివరియక్షరము 'ri' యని యుండుటచే అది సర్వధారి, వికారి, శార్వరి, రుధిరోద్గారి సంవత్సరములలో నేదే నొకటియై యుండును. 'రి' అంతముగా గల్గిన ఈ నాల్గు సంవత్సరములలో ఆశ్వయుజ శుద్ధపౌర్ణమి భానువారము కడచిన రెండు మూడు నూరేండ్లలో నెప్పుడు వచ్చెనాయని వెదకితిని. సర్వధారి, వికారి సంవత్సరములలో రానేలేదు. ఇక మిగిలినవి శార్వరి, రుధిరోద్గారి సంవత్సరములు శార్వరి సంవత్సరమున రెండుమారులు అనగా క్రీ.శ. 11-10-1840 మరియు క్రీ శ 12-10-1600 తేదీలు సరిపడుచున్నవి. రుధిరోద్గారిలో క్రీ. శ. 28-9-1623 తేది సరిపడుచున్నది. ఈ మూడింటిలో రెండు పదునేడవశతాబ్దము ప్రారంభమునకును ఒకటి పందొమ్మిదవ శతాబ్దము మధ్యభాగమునకును చెందినవి. నాకు జూడ ఈ ప్రతి మూడునూరులేండ్ల మునలిది గానట్లున్నది. అవస్థమాత్రము శిథిలముగా నుండుటచే మూడు నూరేండ్లనిపించినను ఈ ప్రతి శార్వరి (క్రీ.శ. 11-10-1840) సంవత్సరమున వ్రాయబడిన దనుకొందుము. దీని మాతృక ఇంతకన్న పూర్వపుదనుట నిశ్చయము. ఆ మాతృకకు చెందిన రెండు కమ్మలీ ప్రతిలో మిక్కిలి దీనావస్థలోనున్నవి. ఈవిధముగా మాతృక క్రీ.శ. 1800 ప్రాంతమునకో మరికొంత వెనుకకో పోవును. కవి యంతకన్న పూర్వుడనుట యిందలి సారాంశము. ఒకవేళ ఈ ప్రతియే క్రీ శ. 12-10-1600 లేదా క్రీ. శ. 28-9-1623 తేదీ లందొకదానికి సంబంధించినదైనచో దిట్టకవి లక్ష్మణకవి కనీసము పదునారవ శతాబ్దము వాడగును. ఇంతకన్న నెక్కుడుగా కవి కాలమునుగూర్చి చెప్పుటకు నాకాధారములు లభించలేదు.

ఈ హనుమద్రామాయణము ప్రతి (నెం. 1567) కాకినాడ ఆంధ్ర
సాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున గలదు. ఇది ౨౫ కమ్మలపై
వ్రాయబడినది. దీనిలో మొత్తము 122 శ్లోకములు గలవు. మొదటి రెండు
శ్లోకములు ఇష్టదేవతాప్రార్థనాదికములు. చివరి రెండుశ్లోకములు కవి చరిత్ర
మునకు సంబంధించినవి. ఈ నాలుగు శ్లోకములు పోగా మిగిలిన 118 శ్లోక
ములందు ఆరుకాండముల రామాయణకథ హనుమద్రామాయణముగా నిబద్ధ
మైనది. ఇందులో మొదటి 115 మంజుభాషిణీ వృత్తములు; తరువాతి 7
శ్లోకములు మాలినీ, శాలినీ, స్రగ్ధరా, ఉపజాతి, ద్రుతవిలంబిత, శార్దూల,
ఆర్యావృత్తములు.

దిట్టకవి లక్ష్మణకవియే తన గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసికొని
యుండును. వ్యాఖ్యాతృనామము వేఱుగా చెప్పబడక పోవుటచే కవియే
వ్యాఖ్యాతయునై యుండునని యూహించుచున్నాను. లక్ష్మణకవి నిజముగా
దిట్టకవి. ఈతడు రామాయణ మంతటిని 118 శ్లోకములందిమిడ్చి మంజు
భాషిణీ వృత్తము లన్నింటిని అనుప్రాస యుక్తముగా నడిపించి చక్కని ధారా
శుద్ధిగల కవిత్వమును రచించినాడు.

ప్రారంభమున గల ఇష్టదేవతాస్తోత్రాదిక శ్లోకము లిట్టున్నవి.

1. "వరదం భజామి శరదంబుదప్రభం ద్విరదం ముఖే శుభరదం తనౌ నరమ్
గణనాథ మాత్మగణనా వరేష్టదం శశిఖండ మండిత శిఖండ మీశ్వరమ్."

2. ప్రమితాక్షరోక్తి మమితాసురాంతకం స్మితభూషణం వితతభామతేజనమ్,
కలయామి చాపవలయాన్వితం ముదాశరధారిణం దశరథాత్మజంప్రభుమ్."

గ్రంథమున గల శ్లోకము లన్నింటికిని సాధారణమైన వ్యాఖ్యానము
గలదు. కాని ఒక్క ప్రథమశ్లోకవ్యాఖ్యానము మాత్రము కొంత దీర్ఘముగా
నున్నది. వ్యాఖ్యానమున కుపబలకముగా నిందు ఐదారు పూర్వగ్రంథము
లుదాహరింపబడినవి. కనుక ప్రథమశ్లోక వ్యాఖ్యానము నంతటిని ఉదాహ
రించుట యప్రస్తుతమైనను మంచిదమకొందును.

"వరదమితి వరం దదాతీతి వరదః తం, శరదంబుదస్య శరత్కాల
మేఘస్య ప్రభేవప్రభా యస్య తం తథోక్తం, ముఖే ఆననే, ద్విరదం గజ
రూపం, తనౌ శరీరే, నరం నుసుజరూపం, శోభనో రదో యస్య తం శుభ

రదం. ఏకదంతమిత్యర్థః, ఆత్మనః స్వస్య, గణనా సంఖ్యానం, సైవ పరం ప్రధానం, ఏషాం తేషామయమేవ ఆద్యః పూజ్య ఇతి న్వయమేవ గణయగా మిత్యర్థః, ఇష్టదం వాంఛితార్థదం, శశిఖండేన చంద్రశకలేన, మండితః అలంకృతః శిఖండః కాకపక్షోయస్య తం, గణనాథస్య వటుత్వా చ్ఛిఖండమండిత మిత్యుక్తం, యద్వా శిఖండశబ్దస్య మౌళి మాత్ర పరత్వే శశిఖండమండితమౌళి మాత్రపరత్వే శశిఖండమండిత మౌళిమితివా ద్రష్టవ్యం, యథోక్త ముపమన్యు స్తవే: "శశిఖండ శిఖండ మండనం, శరణం యామి శరణ్య మీశ్వర మితి ఈశ్వర మణిమాద్యైశ్వర్యయుక్తం, గణనాథం భజామీత్యన్వయః ఏతేన శ్వేతార్క గణపతి ధ్యానం సూచితం, తదుక్తం మంత్ర మహార్ణవే:-"కుందేందు చందనపయశ్శరదభ్రగౌరం, పాశాంకుశ స్వరదనాభయ పాణిపద్మమ్, ధ్యాయేత్కుమారగురు మిందుకళావతంసం, శ్వేతార్కరూప మిభరాజముఖం గణేశ"మితి. శరదంబుదప్రభత్వ చంద్రశేఖరత్వ గణపతిత్వేశ్వరత్వేత్యాది విశేషణైః పరశివస్యాపి భజనం సూచితం. ఆత్మాబద్ధావైపుత్రనామాని (?) నజీవశ్రుతేః నను ముఖే ద్విరదమిత్యత్రైవ ద్వౌ రదౌ యస్యసః ద్విరద ఇతి యౌగికార్థస్య సిద్ధత్వా చ్ఛుభరదమితి పునర్విశేషణే పౌనరుక్త్యావత్తిరితి చేత్ మైవం."దంతీ దంతావళో హస్తి ద్విరదో నేకపో ద్విప"ఇతి నామాను శాసనాత్ ద్విరదశబ్దో గజసామాన్య వాచకః అన్యథా యౌగికేర్థే :— "హేరదపి రుద అంబేహ (హేరదమవలంబేహ ?) మేకదంతం పిచండిలమ్, విఘ్నౌఘ కాననదాత్రం. వరరం ద్విరదం ముఖే"— ఇతి కవి సార్వభౌమాది ప్రయోగే ష్వద్విదంతస్య ఏకదంతత్వం కథం నవిరుధ్యేత అతః 'రూఢిర్యోగ మపహర' తీతి న్యాయేన ద్విరదాది శబ్దానాం రూఢార్థ స్యైవ వక్తవ్యత్వాన్న పౌనరుక్త్యం. అస్మిన్ సర్గే మంజుభాషిణీ వృత్త వృత్తం లక్షణంతు, 'కవితా సమ్మతా సజే సర్గ సంయుతైరచిరా (?) గణైస్సపది మంజుభాషిణీ" ఆదౌ సగణప్రయోగస్య కవికంఠపాశే, వహ్నియుతే పవమానే వహ్నిభయం। శుభమతో నైశ్శ్రేదితి. కవిగజాంకుశే చ, "సగణస్సర్వ సౌభాగ్యదాయక .... ... స్సర్వదా భవేత్, కర్తుః కారయితుశ్చైవ సగణో నపురోయ" దీతి. వాయుదేవతాకస్య సగణస్య వహ్నిదేవతాక రగణస్య (జఘన్యగ) త్వా ద్భావాచ్ఛుభప్రదాయకత్వం యుజ్యతే. యద్వా "దేవతావాచకాశబ్దా, యే చ భద్రాదివాచకా, తే సర్వే నైవ నింద్యాస్యుర్వర్ణతో గణతోపి వేత్యాదన్య

వరదశబ్దస్య దేవతావాచకత్వేన తస్యైవ శద్రనాచక వరశబ్దఘటితత్వేన చ, ఆద్యక్షరస్య (వ) కారస్య అమృతబీజత్వాత్ విచారో నాత్రకర్తవ్యః. అత ఏవ నగణస్య నిర్దుష్టత్వ మభిగమ్య రత్నాకరే లక్షణకారేణ అతిజగతి నామ్ని త్రయోదశ ఛందసి మంజుభాషిణీవృత్తం ప్రస్తార్య వినిర్మితమితి సర్వమపి నసుంజసం. అత్ర పాదచతుష్టయేపి ఏకస్మాదక్షరాత్పరస్థితస్య వర్ణద్వయస్య తదనంతర వర్ణ చతుష్టయాత్పరస్థితేన సజాతీయ వర్ణద్వయేన సహనియమేన ప్రాసస్య అమగతత్వాదనుప్రాసన్య జాతీయశబ్దాలంకార యో స్సంసృష్టిః"...

ఈ వ్యాఖ్యానమున వ్రాయసకాని తప్పులు కుప్పలుగా మన్నవి.[1] ఇందులో ఉపమన్యుస్తవము, మంత్రమహార్ణవము, కవి కంఠపాశము,[2] కవి గజాంకుశము, రత్నాకరము (వృత్త రత్నాకరము?) మున్నగు పూర్వలాక్షణికుల గ్రంథములేకాక కవిసార్వభౌముడు మొదలగు వారి ప్రయోగములును ఉట్టంకింపబడినవి. ఈ కవిసార్వభౌముడెవరో తెలియదు.

రెండవ శ్లోకముమంది గల వ్యాఖ్యానము లన్నియు లఘురూపమున నున్నవి. రెండవ శ్లోకమున లక్ష్మణకవికి ఉపాస్యదైవతమగు శ్రీరామచంద్ర మూర్తి ధ్యానమున్నది. ఇది కోదండరామమూర్తి ధ్యానమని వ్యాఖ్యానమున నిట్లున్నది :— "ఏతేన కోదండరామమూర్తి ధ్యానం సూచితం, నిర్ణ (యదీపి) కాయాం, వామేన పాణినా చాపం, దక్షిణేన శరం దధత్, రక్షశ్శిక్షావిధౌ దక్షో, ధ్యేయో రామో మహాద్యుతి" రితి. పై నుదాహరింపబడిన గ్రంథము నిర్ణయదీపిక యగునోకాదో. 'ని' యను నక్షరము సంపూర్ణముగకు 'ణ' యను నక్షరము నగముసు మాత్రము కలవు. 'ణ' తరువాత వలవల గిలక ఉండియుండినని భావించి 'నిర్ణ' యని వ్రాసి కుండలీకరణములందున్న (యదీపి) యను నక్షరములు పూరించుకొన్నాను. నాయూహ తప్పైనచో క్షంతవ్యుడను.

---

1. అస్మద్గురుపాదులు శ్రీబదాచార్య రఘునాథచక్రవర్తిగారి స్ఖాలిత్యములను సవరించుటలో నాకు సాయము చేసినారు.

2. చూడుడు. 'పుష్పాంజలి' మానపల్లి రామకృష్ణ కవిగారు. భారతి. అక్టోబరు 1927. పుటలు 34-43.

తరువాతి శ్లోకముల వ్యాఖ్యానములందు తరచుగా సమరకోశమును, వ్యాకరణ విషయములకై అష్టాధ్యాయియు, అడవదడప యాదవనిఘంటువును, సర్వలక్షణము, (నిఘంటువు ?) ను, అమరరత్నమాలిక యును, ఒకచోట 'కోకప్రీతిచకోరపారణపటు' వను భట్టమురారి ప్రయోగమును, మరియొక చోట "మందానిలా పూర్వకృతం దధానో" యను మాఘ ప్రయోగమును, "తస్యాలయో నిఖిలలోక" అను శ్లోకభాగము నిచ్చి దీపికా యనియును పూర్వోదాహరణము లిచ్చియున్నాడు.

లక్ష్మణకవి శైలి తెలియుటకై కొన్ని శ్లోకము లుదాహరింతును. కథా ప్రారంభపు శ్లోకము లివి.

"దశకంధరేణ భృశకంపితైస్సురై రభియాచితోధిక భియా సమన్వితైః.
మిహిరాన్వయే ఒజని హి రామనామతః కమలాపతిస్స విమలాంబుజేక్షణః." (3)

"వినయేన గాధితనయే సమాగతే కృతపూజనో విగతపూర్వకల్మషః,
అజనందనోపి నిజనందనం దదౌ యతయే సురారిహతయే సలక్షణమ్". (4)

"కుశికోద్భవేన రసికో వ్రజన్ తథా పథి తాటకాం ప్రమథితామరాం సహ
రఘుసంభవోపి లఘు సందధచ్ఛరం సుమనాశ్చకార శమనాలయాతిథిమ్" (5)

"సవనావనాయ పవనాస్త్రమోజసా దధతా సుబాహురధ తాటకాసుతః,
జ్వలనాశుగం చ బలనాశనేన తౌ కృశతాం గతౌ దశశతాంగసూనునా" (6)

తక్కిన శ్లోకములన్నియు నిటులే యనుప్రాసయుక్తములై రామాయణకథను క్లుప్తముగా చెప్పును.

వాలివధానంతరము సుగ్రీవుడు సుఖముగా రాజ్యమును పాలించుచున్న సందర్భమున వర్షాశరత్తులను ఒకే శ్లోకమున వర్ణించి కవి తన ప్రతిభను చాటుకొన్నాడు.

సతతానవగ్రహ తతాభ్రమండలా భృతనీలకంఠ కృతనృత్తకా జగత్,
స్వకులాయయుక్ఖగకులాథ వార్షుకీసమయాత్ప్రదోషసమయోయధోద్గతిః" (7)

దిట్టకవివి లక్ష్మణకవి తన ప్రయోగములందచ్చటచ్చటకొంత వైలక్షణ్యమును కనబరచినాడు. ఉదాహరణమునకు ;

"శరభంగకాద్యసుర భంజనోచితో యతి మండలం సధృతిమండలోర్చయన్,
తమగస్త్య సమ్మని మగణ్యవై భవం ప్రణనామ పుణ్యగుణనామకీర్తనమ్."(81)

పైశ్లోకమున ముని మండలమనుటకు యతిమండల మనినాడు. వ్యాఖ్యానమున
'మునిసమూహం' అని యర్థము కలదు.

లక్ష్మణు డింద్రజిత్తును సంహరించునప్పటి వర్ణన మిట్లున్నది.

"అథ లక్ష్మణే వితథలక్ష్మ సంధద ద్విజయుక్షియ స్వభుజయష్టి నిస్సృతః,
సుత మాగ్రహీంద్రజితమాచ్ఛినచ్ఛరైర్దనుజాధిపస్య మనుజాధిపానుజః" (96)

ఈ శ్లోకమున అగ్రహాశబ్దము తెలుగుదేశమున ప్రచారమందున్నట్లు కోవమను
నర్థమున వాడబడినది. వ్యాఖ్యానమున "సక్రోధస్సన్నిత్యర్థః" అని కలదు.

వ్యాఖ్యానమున అటనట "తెలుగు సంస్కృతము" తొంగి చూచు
చుండును. మీదుమిక్కిలి కొన్ని శబ్దముల కర్థము వ్రాయునప్పుడు కొంత
అశ్రద్ధ చేసినట్లు కూడ కాన్పించును. ఉదాహరణమునకు :

"విలసన్మహాస్త్ర బలసంవృతో ద్విష ద్గజభేదనోగ్ర రణభేరికారవః
మణిభూషణాశిఘృణిభూషితాంబరోనిరగాత్పురాత్ప్రచురగాత్రసౌష్ఠవః"(88)

దీని వ్యాఖ్యానములో గాత్రసౌష్ఠవశబ్దమునకు శరీరశోభ యను
అర్థమున్నది.

"అధరావణం విబుధరావణం రణాభిముఖం తదా దశముఖం సమాగతమ్,
అకరోత్తదా లఘుకరో వలోకయన్, భృశరంహసాననశరం శరాసనమ్"(99)

దీని వ్యాఖ్యలో లఘుకరః అనగా 'శీఘ్రహస్తస్సన్' అని కలదు. ఇటులే
"త్రిదివేశవైరి హృది వేగవచ్ఛరాన్, గ్రథితాంశ్చకార మథితామరాహితః,
రవివంశజోపి పవివద్దురాసదాన్, పురుషోత్తమోధ వరుషోపలోపమే "(103)

దీని వ్యాఖ్యానమున దురాసదాన్ అనగా దుస్సహాన్ అని కలదు.

(సాహితి - ఏప్రిల్ 1962)

# దేవులపల్లి అన్నపూర్ణేశ్వరశర్మ

కాల మిదమిత్థముగా తెలియని సంస్కృతకవులందు దేవులపల్లి అన్న పూర్ణేశ్వర శర్మ యొకడు. ఈతడు నరసింహవిజయవ్యాయోగమునకు కర్త. ఈ (No. 4698) తాళపత్రగ్రంథములో మూడువంతుల కమ్మలు పోయినవి. ఉండవలసిన ౧౫ కమ్మలలో ఆరుకమ్మలు మాత్రము మిగిలినవి. ప్రారంభపు రెండు కమ్మలును అటు తరువాత ౪, ౬, ౮, ౯, ౧౨, ౧౩, ౧౪ కమ్మలును పోయినవి. ఇక మిగిలిన కమ్మలాధారముగా కవిని గూర్చియు, అతని కవిత్వ మును గూర్చియు పరిచయము చేయుదును.

గ్రంథము మూడవ కమ్మతో ప్రారంభమైనది. ఇందులో ప్రస్తావన యందలి చివరిభాగము కొంత దక్కియుండుటచే కవి వంశావతారము తెలియ వచ్చుచున్నది. నటీసూత్రధారుల సంభాషణమున సూత్రధారుడు నటితో నిట్లనును.

"సూత్రధారః :— ఆః జ్ఞాతం.

శ్రీమద్దేవులపల్లి వంశతిలకః కౌండిన్యగోత్రోద్భవః
సంగస్తస్య సుతో హి వేంకటసుధీస్తత్కృష్ణనామా తతః
తార్తీయస్తనయశ్చ ధూతకలుషః శ్రీశో భ(నా)ద్రీశ్వరః
సుబ్బారాయసుధీస్తతోఽస్య తనయోన్నాఖ్యాభవత్సత్కవిః

నృసింహ విజయంనాను నూతనం వ్యాతనోత్కృతీ,
వ్యాయోగం సుధియాం ప్రీత్యై నహి గంభీరయా గిరా.

తదభినయేన ఏతత్పారిషదజనమనోమరాగముత్పాదయ"

దీనినిబట్టి నృసింహవిజయవ్యాయోగకర్తయగు అన్నపూర్ణేశ్వర శర్మ వంశావతార మిట్లుండును.

దేవులపల్లి అన్నపూర్ణేశ్వరశర్మ




చిట్టచివరన (15 వ కమ్మ) గద్య యీతీరుగా నున్నది.

"ఇతి శ్రీమత్త్రిభువనపవిత్ర కౌండిన్యగోత్రపయఃపారావారరాకాసుధాకరస్య నరహరిపాదారవిందనిష్యందమరందపానమిళిందాయమానమాననస్య సుబ్బారాయాభిధేయస్య సూనునా అన్నపూర్ణేశ్వరశర్మణా విరచితో నృసింహవిజయో నామ వ్యాయోగస్సమాప్తః"

కవి యెప్పటివాడో వీనివలన నిసుమంతయు తెలియరాదు. కవి నివాసస్థానము శోభనాచల ప్రాంతమని (మాజీవీడు సంస్థానము) ఊహింపవచ్చును. దేవులపల్లివారి కోవలో కొందరికి నరసింహస్వామి, మరికొందరికి శ్రీరామచంద్రుడును ఉపాస్యదైవతములని తెలియుచున్నది.

ప్రయోగాతిశయ మనబడు నీ ప్రస్తావనకూడ పూర్తిగాలేదు. నటీసూత్రధారు లిట్లు సంభాషించుకొనుచుండగనే ముఖ్యపాత్రప్రవేశమును సూచించుటకు ముందు నేపథ్యమునుండి యొక శ్లోకమిట్లు వినవచ్చును.

"శంభో శంభోస్తుతేధీః కమలజ విమలాప్యాదరంతే దురంగా
ఛీతిర్మా తే బిడౌజః సుఖమిహ శిఖికో దండి.కో మందనం స్యాల్,
చేతః ప్రాచేతసస్యాద్విమలతరమలం యాతునో యాతు భీతిః
వాయో శ్రేయోస్తు జేష్యే సకలదితిసుతాన్ రాజతాం రాజరాజః"

ఇది శ్రీ మహావిష్ణువు సకలదేవతలకును అష్టదిక్పాలకులకును అభయ మిచ్చుచు (నేపథ్యమునుండి) పఠించు శ్లోకము. ఇందులో దండి, ప్రాచేతస, రాజరాజ వంటి పదములు కేవలము యమ, వరుణ, కుబేరాదులను సూచించు నట్టివేనా లేక పూర్వకవి స్మరణమిందేమైన సూచితమా ? ఈ రాజరాజు కేవలము కుబేరుడేనా ? చాళుక్య రాజరాజున కేమైన సూచనగలదా ? చాళుక్య రాజరాజని యూహించుటకు నాకు ధైర్యము కలిగించిన దింకొక విషయమిందే గలదు.

ఐదవకమ్మలో శ్రీహరికిని గురువు(సురాచార్యు)నకును జరిగిన సంభాషణ మున్నది. గురుడు హిరణ్యకశిపునివలని బాధలచే ఆయా దిక్పాలకులును, దేవతలును, సూర్యచంద్రాదులును, ఎట్లు భంగపడినది నివేదించుచుండును.

చంద్రునకు 'గ్లౌ' సమాఖ్య హిరణ్యకశిపు భంగపాటుచే నెట్లు కలిగినదో బృహస్పతి తన వాక్చాతుర్యముచే నిట్లు వర్ణించి చెప్పును.

"దితిసుతపతికోపానుగ్రహాభ్యాం శశాంకః
క్షయముపచయ మాపన్నుద్భవై స్తద్భటౌఘైః,
అసకృదపి నితాంతం గ్లాపితః క్లాంతకాంతిః
తదవధి గదితో సౌ గ్లౌస్సమాఖ్యస్త్రిలోక్యామ్"

సురగురుని వాక్చాతుర్యమును మెచ్చుకొనుచు శ్రీహరి యిట్లనును.

"హరిః : అహో భవానేవ గురుర్గిరాం. యత ఏతచ్చాళుక్య వాక్యాని ప్రయుఙ్క్తే.
అపి కథమేతస్స నృశంసినస్య ఏతాదృశానదృశ పరాక్రమ స్సం
జాతః తదపివద సురగురో."

పైన పేర్కొనబడిన వాక్యములందలి చాళుక్యపదమున కర్థమేమి ? మొదటి 'రాజ రాజ' పదమును, ఈ 'చాళుక్య' పదమును అత్యాశగలనన్ను ఒకప్రక్కన పదునొకండవ శతాబ్దమున కీడ్చుకొని పోవుచున్నవి. అంత ప్రాచీనకృతి లభించుటయనది ఆంధ్రుల భాగ్యమున నుండునా యను నిరాశ మరియొకప్రక్కన మిక్కిలి బాధించుచునే యున్నది.

దేవులపల్లి అన్నపూర్ణేశ్వరశర్మ దేశకాలాదుల సంగతి యెట్లున్నను ఆతడు తెలుగువారు సగర్వముగా చెప్పుకొనజాలినంతటి గిరాంధురంధరుడు.

శ్రీమహావిష్ణువు సురగురుని వాక్చాతుర్యమును మెచ్చుచు "అహో భవానేవ గురుర్గిరాం" అన్నమాటలు అన్నపూర్ణేశ్వరశర్మకును చెల్లును.

లుప్తమైన భాగములందలి వృత్తాంతమును అందు వచ్చు పాత్రములును తెలియరావు. మిగిలిన ఆరు కమ్మలలో - మొదట నటీసూత్రధారులును ౩ వ కమ్మలో హరిగురులును, ౮ వ కమ్మలో రంగదాన, వసంత, వసంత కుసుమాకరులును, ౧౦-౧౧ కమ్మలలో శచీ, ఇంద్ర, నారద, జయంత, ప్రహ్లాద హిరణ్యకశిపు - పాత్రములును గలవు. నటీ, శచీ, సంభాషణములు ప్రాకృతములో నున్నవి. ఒక్కచో తక్క, తక్కినచోటులందు ప్రాకృత వాక్యములకు సంస్కృతచ్ఛాయలు కలవు.

అన్నపూర్ణేశ్వరశర్మ కవిత్వము తెలియుటకై అటనటగల కొన్ని శ్లోకము లుదాహరింతును.

సురాచార్యుడు శ్రీమహావిష్ణువునకు ఆయా దేవతలు హిరణ్యకశిపుచే పొందిన భంగపాటులను వినుపించు సందర్భమున గల శ్లోకము లందొకటి. ఇది సూర్యభగవానునకు పట్టిన దుర్గతిని చెప్పును.

దైత్యేద్ధోన్నత్త కుంభశ్చరపరశు లుతత్కంఠ భూభృత్సహస్రైః
రంభోజాప్తః ప్రకర్షం ముహురతి బలభిః కృత్తబింబోభి మూర్ఛన్,
అంభోద్యంబస్సు పర్యుషిత తనురన కృచ్ఛ్రాప్త సంజ్ఞస్త్రిలోక్యామ్
ఆఖ్యాం వైకర్తనీం తాం తదను సమగమత్తద్దయాపాత్రగాత్రః.

శోభనాద్రి పుణ్యక్షేత్రమును వర్ణించుచు రంగదాన వసంతులకు జరిగిన సంభాషణమునుండి యొకశ్లోకము. ఇది వసంతుడు పలికినది.

"ప్రాతాశోజ్జ్వల పీఠికాకృతవదం భూరాదిన వ్రప్రతీ
హారాక్రామిత సప్తలోక నికరం నిత్యాంతరాణచ్ఛికమ్,
ఏతద్గోపురముల్లలాన భువనశ్రేణీ తనోరీశితుః
లోకానాం ప్రకటీకరిష్యదివ తద్విశ్వస్వరూపం మహత్.

ఇదే సందర్భమున గల మరియొక శ్లోకము. గరుడవాహనమును వర్ణించు నీ శ్లోకము వసంతకు (సుమా) కరుని నోట వెలువడినది.

ఏనం తృణీకృత పురందర మద్రిభారమ్
కద్రూప్రజా విషదవానల నామధేయమ్,

వక్షః ప్రభంజన చలీకృతనర్మజాండమ్
పక్షీంద్ర మీక్షణయుగక్షణ మీక్షయామః.

శచీసమేతుడై యున్న ఇంద్రునకు నారదుడు నృసింహావతార ప్రాదుర్భవమును వర్ణించి చెప్పునప్పటి శ్లోకము.

"తచ్చాలా స్తంభలోంభోధరనికరసముజ్జృంభ గంభీరరావ
శ్శుంభజ్జంభద్విషద్విద్ధర దళనమిళద్దంభ దంభోళికేళిః,
వీక్షారూక్షస్ఫులింగక్షుభిత దితిసుతాధ్యక్షసూతేస్సమక్షమ్
రక్షామీక్షస్వశక్షద్యుతి వితతినృహర్యక్ష రూపోక్షరో భూత్.

హిరణ్యకశిపుడు శ్రీ నరసింహస్వామి పైకెత్తిపోవుటకు సూతుని రథము దెమ్మని చెప్పినప్పటి శ్లోకము. ఇదికూడ నారదుడు దేవేంద్రునకు వినుపించినదై యుండవలెను.

మాయావిస్మృభుగ్భిదాం భిదురభిద్దేత్యానిహత్య ద్విషం
జోషం చేష్టిత మాతనోమి సుమనోగుంభాశులోజ్యంతకమ్,
సూతాశ్వానయ సాశ్వ విశ్వకరణం జాంబూనదం స్యందనం
కో మేగ్రే నివసేదసహ్య బలినః ఫాలాక్షతుల్యోపి సన్.

వ్యాయోగాంతభాగమున గల గద్యభాగము.

"తదను మనుజగజరిపువపుర్ధర శ్రీధరః, సురపరిషది హాటకశిపు సుతమతిశాంతమతిం మతిమద్వరిష్ఠమిష్టదృష్టినావ్యష్టభ్య దేవరిపుభువాల్లభ్యం నిధాయ విధాతృప్రముఖ మఖభుజన్సభుజః సభుజగరిపువాహనః ఘృణీంద్రాలోకనే నా కలయ్య నాకలోకగమనాయ యాచితో వరాహనర స్తిరే శోభనాచలే వకలలోకవరిపాలనాయ వసామీత్యభిధాయ యథాయథం గంతుం తేషాం అనుజ్ఞాం దత్వాత్రావాసీ ద్భుభాచల ఇతి (నిష్క్రాంతాస్సర్వే)."

ఇంత చక్కని రచన చేసిన దేవులపల్లి అన్నపూర్ణేశ్వరశర్మ దేశకాలాదు లిదమిత్థముగా తెలియకపోయినను కనీసము గ్రంథమంతయునైనను లభింప దాయెను. ఇట్టి యుత్కృష్టకృతు లెన్ని కాలగర్భమున గలసిపోయినవో కదా!

నరసింహవిజయవ్యాయోగము వ్రాయబడియున్న ఆరు తాటియాకులకు అటునిటు కన్నాకులుగానున్న కమ్మలపై కొన్ని విశేషములు కలవు. ఇవి

వ్యాయోగమునకు గాని తద్గ్రంథకర్తకు గాని కనీస మా వ్రాయసకానికిగాని సంబంధించినవి కావు. ఈ పుస్తకపు యజమాని యెవరో వ్రాసికొన్న వ్రాతలై యుండును. గ్రంథము వ్రాయబడిన లిపికిని కన్నాకులపైమన్న లిపికిని భేదము గలదు. ప్రారంభపు కన్నాకునకు లోపలి భాగమున నీ శ్లోకము గలదు.

శ్రీశౌరిప్రియభక్తరక్త విబుధేష్వానక్తనర్వార్థద
త్వాం సర్వజ్ఞమహం మహత్సుకృతదం విజ్ఞాపనం జ్ఞాపయే,
యద్వేల్పూరి పురస్థితైస్సుకృతిభిర్దత్తం నివేశస్థలం
తన్నక్షత్ర కులాబ్జ తిర్మలధరా దేవేంద్ర పాయాన్మమ.

ఇందులో పేర్కొనబడిన వేల్పూరెచ్చట నున్నదో తెలియదు. ఈ నక్షత్ర(మొనలికంటి) తిర్మల ధరాదేవేంద్రు డెప్పటివాడో అంతకన్న తెలియదు. ఏ సుకృతు లేపారునకు వేల్పూరులో నివేశస్థలమిచ్చిరో దానిని లాగికొని 'కాశీలో గోహత్య చేసిన పాపం' ఎవరు ఒడిగట్టిరో తెలియదు. మొనలికంటివారిని గీర్వాణీకరించి నక్షత్రకులమ జేసి ఈ శ్లోకమును 'కట్టిన' వారెవరో తెలియదు.

రెండవ ప్రక్కనగల కన్నాకుమీద లోపలిభాగమున ఉబ్బసపుదగ్గునకు "బుద్ధిచాత అలోచించిన ఔషధయోగ ప్రకారము"ను కొన్నితూకముల, మావ కముల వివరములును గలవు. ఈ ఆకుపైననే వెలుపలి భాగమున తూకము లును మావకముల కొలతలును చెప్పు పద్యములు రెండున్నవి. ప్రాతకాలపు కొలతలను మరచిపోవుచున్న మనకివి కొంత వినోదమునైన కలిగించును.

1 క॥ ధర వరహా నిష్కమనస్
బరగున్ కర్షకము డబ్బు పలమన గిద్దన్
ధరణిన్ కుడుపము సోలగు
బరువడి ప్రస్థంబు మాని కలరున్ కృష్ణా.

2. క॥ ఆఢకమన కుంచంబును
ప్రౌఢిం ద్రోణం బనంగ బరగున్ తూమై
దృఢతర గోనెయు వాహము
బాధంబగు కాపడిలను భారంబనగన్.

(సాహితి, మే 1962)

# అయ్యవారు శాస్త్రి

పదునేడవ శతాబ్దము మధ్యభాగమున కందనోలు (నేటి కర్నూలు)లో నుండినవాడీ అయ్యవారు శాస్త్రి. ఈతడు 'సభారంజన'మను ఏకాంక రూపకమునకు కర్త. దీని తాటియాకులప్రతి యొక్కటిమాత్రము (నెం. 2392) కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమున గలదు. అది యిరువది తొమ్మిది కమ్మలపై వ్రాయబడి యున్నది. మొదటి యెనిమిది కమ్మలు పోవుటచే కవినిగూర్చిన విశేషములును, ఆతని పోషించిన ప్రభువును గూర్చిన విశేషములును పోయినవి. ఇంకొకప్రతి లభించిననేగాని ఆ విషయములు తెలియరావు. గ్రంథాంతమందలి యొక్క శ్లోకము మరియు గద్యవలనను కవి మరియు నాతని ప్రభువు దేశవామాదులు తెలియనగుచున్నవి. ముందుగా కవి దేశకాలాదులగూర్చి నాయూహలు ప్రకటించి తరువాత 'సభారంజన'ము నందలి విషయములు నివేదింతును.

చిట్టచివరనగల శ్లోకమును గద్యమును ఈతీరుగా నున్నవి.

శ్లో॥ శ్రీనిత్యానందరాయ ప్రభువరసకలశ్రేయసాం కల్పవల్ల్యై<br>
శృంగారాంతోధిపీచీవిచయతనుకళాభానితాళానుభూత్యై,<br>
శ్రీశాలిన్యై ర్యథవాన్యై రచితపువనిరాట్సంతతానందచర్యం<br>
భూమావాచంద్రతారం జయతు శుభకరం శ్రీ సభాకంజనాఖ్యమ్.

గద్య :- ఇతి శ్రీమదుభయభాషారచనాచమత్కృతినా రాజశ్రీ కందనోలు దేశాయ్యానందరాయాస్థానకవినా అయ్యవారు శాస్త్రిణా నిరూపితం రూపకం సభారంజనం నామ నర్వమేకాంకమ్॥—

వీనివలన అయ్యవారుశాస్త్రి ఆనందరాయాస్థానకవి యని తెలియచున్నది. శ్లోకములలో నిత్యానందరాయడనియు గద్యమున నానందరాయడనియు పేర్కొనబడిన నీ ప్రభువు కందనోలు దేశాయియట. దేశాయి, సర్దేశాయి,

దేశపాండ్య, దేశ్‌ముఖ్ మున్నగు బిరుదములు మహారాష్ట్రుల పాలనమున నెలసినవి. ఒకప్పుడు కర్నూలు బిజాపుర రాజ్యాంతర్భాగముగా నుండినది. అప్పుడచ్చట మహారాష్ట్రులు ప్రభుత్వము నెరపిరి. అట్టి వారిలో నీయానందరావొక్కడై యుండును.

Kurnool District Manual పుట29లో నిట్లు కలదు.

"In 1674 while Kurnool was under Bijapur, the district was visited by Sivaji the founder of the Maharatta dominions, on his way to the South He crossed the Kistna, at Nivartisangam, and after exacting three lakhs of rupees from Ananda Row, Desamukhl of Kurnool, he despatched his army to Hande Anantapur, and proceeded himself to the holy shrine at Srisailam."

శివాజీకి కప్పము కట్టిన అనందరావును, అయ్యవారు శాస్త్రిని పోషించిన అనందరావును ఒక్కరేయని యూహించుచున్నాను. అదే వంశమునకు చెందిన మరియొక అనందరావు కాగూడదా యన్నచో కావచ్చును కాకపోనచ్చును. ఇతరాధారములు లభించువరకు నీ యిరువురభిన్నులమకొనుట లెస్స. ఈ విధముగా అయ్యవారు శాస్త్రి పదునేడవశతాబ్ద ముత్తరార్ధమునకు చెందినవాడగును. ప్రారంభపుకమ్మలు పోవుటవలన కవినిగూర్చికాని యాతని పోషకునిగూర్చికాని ఇంతకన్న నెక్కుడు తెలియరాదు.

జటప్రోలు సంస్థానమున, నా సంస్థానమున కొకప్పుడు రాజధానిగా నుండిన పెంట్లవెల్లికి సమీపముప అయ్యవారుపల్లెయను గ్రామమున్నది. అది యిప్పటికిని ప్రసిద్ధకవిపండితుల కాటపట్టు. ఈపల్లెకును మన అయ్యవారు శాస్త్రికిని ఏమైన సంబంధముండెనో తెలియదు. ఈ పల్లె మన అయ్యవారు శాస్త్రికి జటప్రోలు రాజులిచ్చిన అగ్రహారమే మో యని నాయూహ. కర్నూలుకు సమీపమున నీ జటప్రోలు సంస్థానముండుటచే నిట్లూహించుటకు సాహసించితిని. నా యూహలు తప్పైనచో క్షంతవ్యుడను.

ఇక సభారంజన రూపకమును గూర్చి మనవి చేయుదును. పోయిన కమ్మలందిది యేజాతి రూపకమో కవి సూచించియుండును. చివరన మాత్రమీ విషయమై యేమియు చెప్పబడలేదు. బీజోపక్షేపక మెచ్చట జరిగినదో యెటుల

జరిగినదో తెలియదాయెను. ముఖమే లేనప్పుడు ముఖసంధి యెట్లుండును? తల లేని మొండెమును పట్టుకొని వ్యక్తి నిశ్చయము చేయుట కష్టముగదా! ఇక నిర్వహణ సంధినిబట్టి యూహింత మన్నచో నదియును లేదు. ఫలాగమమేమిటో తెలియదు. కేవలము వర్ణన ప్రధానముగా నడచిన రూపకమిది. గ్రంథాంత ర్భాగమున నీ సభారంజనమునకు మరియొక పేరేదియు లేదుకాని తాళపత్ర గ్రంథపు కన్నాకులపై సభారంజనమనియు హితకారీ యనియు నుండుటచే హితకారీ యనునది దీనికి మరియొక పేరై యుండునని తలంచుచున్నాను. సభారంజనమున నిరువురు ప్రధానపాత్రలు గలరు. ఇందిరామందిర పట్టణాధి పతియగు రసికావతంసుడను ప్రభువు మొదటివాడు; అ ప్రభువునకు సఖుడైన హితకారి యనువాడు (అమాత్యపుత్రుడు) రెండవవాడు. వీరి సంభాషణలు రూపకమంతటను వ్యాపించియున్నవి. పోయినకమ్మలు పోగా మిగిలినవాన్నిలో మొదట ప్రత్యక్షమగువాడు దౌవారికుడు. రాజునాజ్ఞ ననుసరించి హితకారిని ప్రవేశపెట్టి దౌవారికుడు వెడలిపోవును. వానిపని యంతటితోసరి. రసికావ తంసుడును హితకారియును వనవిహారము దేయుచుండగా ప్రవేశించి కొలది హాస్యసంభాషణము చేయువారు వనపాలుడు మరియు రాజానుచరుడు. వీరే ఇందలి పాత్రములు.

సభారంజనమున కందనోలు పట్టణమే ఇందిరామందిర పట్టణమై ఆనందరాయ ప్రభువే రసికావతంసుడై, అయ్యవారు శాస్త్రియే హితకారియై వెలసినా రనుకొనుచున్నాను. రాజసభాస్థానమునుండి రసికావతంస ప్రభువును హితకారియును కలసి వనవిహారమున కేగి సురల యాస్థానమును ప్రవేశించు ఒకదినపు (పగలు) కార్యక్రమ మిందలి యితివృత్తము ఈ వ్యవధిలో వారి కంటబడిన ప్రతివస్తువు, వారి యూహకందిన ప్రతివిషయము సభారంజనమున స్థానము కల్పించుకొన్నది.

అయ్యవారుశాస్త్రి పండితకవి. వైశేషికము మొదలు వైద్యశాస్త్రము వరకు సమయానుకూలముగా సభారంజనమున ప్రవేశించినవి. రసికావతం సుడును హితకారియును వనవిహారమునకు పోవుటకు సన్నద్ధులగునప్పటినుండి యీ వర్ణనము లారంభమైనవి. రాజుగా రలంకరించుకొనుట కద్దమును చూచు కొందురు, కనుక మొదట వర్ణింపబడినది అద్దము. అది యిట్లున్నది.

"ఆదర్శ! నభవతో దర్శనతోంతః ప్రవేశయసి సర్వాన్,
యస్య ముఖ శ్రీర్లోకే తస్య వశే సర్వలోకా స్యుః".

అద్దములో ముఖమును చూచికొని రాజుగారు తన చెవిపోగులోని ముత్యమును వర్ణించుకొన్న పద్యము.

"ముక్తాఫల మఖోల్లాసకరో రా (జ్ఞం) శ్రవోగ్రగః,
సువృత్తశ్చతురాకారో న కః ప్రభుహితో భవేత్."

వనవిహారమునకై ఇందిరామందిర పట్టణమునుండి బయలుదేరుచున్న సమయమున హితకారి యానగరమును ముక్తప్రదగ్రస్తమగు నొక దీర్ఘ వచనమున వర్ణించును. అటుతరువాత నీ శ్లోకముతో ముగించును.

"శ్రీమత్సర్వపురీరమా విజయలక్ష్మిలక్ష్మణప్రాభవా
సీమంతాయిత సూర్యసోమసరణీశృంగాగరంగస్మఖా,
సత్ప్రాకారనితంబబింబరశనా కల్పాయితస్వర్ధునీ
మేధ్యాసౌ న కథం హి సర్వవిబుధశ్రీమందిరేయం పురీ"

వనప్రవేశ మొనర్చినతరువాత ఇరువురును వారివారి కంటబడిన ప్రతి వృక్షమును వర్ణింతురు. ఆ వర్ణనములందొకప్పుడు శ్లేషచమత్కారములకు సంబంధించిన విషయములును ప్రవేశించినవి. ఈ తీరుగా అశ్వత్థ, బిల్వ, ప్లక్ష, ఉదుంబర, చూత, తాళ, శాల్మలీ, ఖర్జూర, భల్లాతకీ, అభయ, వృక్షాదులు వర్ణింపబడినవి.

ఇది యశ్వత్థవర్ణనము :

"చలదళసంతత చంచలదళ వానని కుంజరోత్థ భీతిః కా,
పూర్వం కుంజరరక్షా భవతా నారాయణేన నకృతా కిమ్."

వృక్షములతరువాత మాధవీ, కురవక సుమలతాదుల వర్ణనమున్నది. ఆ తరువాత సింహ, శార్దూల, వనవరాహ, కురంగ, చమరీమృగాదుల వర్ణనము గలదు.

ఇంతలో మధ్యాహ్నమగును. రసికావతంసుని కులదేవతయగు భవానీ మందిర మా వనమున నుండును. అచటనే పూజోపకరణములు సిద్ధముగా నుండును. అప్పుడు హితకారి యిట్లనును.

"మహారాజ ఇలో నిరూపయ. తరుణారుణకిరణప్రభాపరిధానసరసపారసముకుళకుచచూచుకాయిత భృంగీసంగీతద్విగుణిత హంసాస్పదపదారుణకంజాతా, జాతరూపసరూపకింజల్కాభరణప్రకాశా, కాశాంబరాడంబరసైకతశ్రోణితటా, తటవిటపినటత్కలాపి కలాపవేణీ వేణీబాహు రంగత్తరంగ హస్తసంజ్ఞయా మహారాజ(మాహ్వయంతీవ) పురస్థితా."

ఈ సందర్భమున, సరోవర, కమల, షట్పద, హంస, కుముద, మత్స్య, చాతక, నీలకంఠ, చకోర, చంద్ర, చక్రవాకముల వర్ణనమున్నది. వీనిలో చకోవర్ణన మీటిరుగా నున్నది.

"చకోర తారకోదార యోగోత్యస్తో నిరంతరం,
సహి చే చ్చంద్రికాపానం కథం ఖేచరముద్రయా."

ఇంతలో నేపథ్యమున కోలాహలము వినబడును. రసికావతంసుడు "కోయం విచార్యతా" మనును. అప్పుడు హితకారి "మహారాజ నకిమప్యస్మదనుచరేణాహూతైః ఫలకుసుమభారసమేతైః మహారాజదిదృక్షయాగతైః వనపాలైర్భవితవ్య" మనును. ఈ సందర్భమున రాజానుచరునకును వనపాలకునకును జరిగిన మోటుహాస్యపు సంభాషణ మొకించుక గలదు.

అటుతరువాత వనపాలుడు తెచ్చిన వివిధఫలకుసుమముల వర్ణనమున్నది. ఖర్జూర, జంబీర, ద్రాక్ష, మాతులుంగ, దాడిమీ, పనస, రంభా, నారికేళ, కపిత్థ, రసాల, బదరీ, జంబూ, కళింగ, ఉర్వారుక, బింబఫలము లీసందర్భమున వర్ణింపబడినవి. వీనిలో పనసవర్ణన మిట్లున్నది.

"పనస విహితమేవ బృహత్కుక్షిత్వం న యది కుత్ర వర్తంతే,
అభ్యంతరాణి తస్మాత్ కంటకిఫలతా తు సఫలతా భవతః"

ఫలముల తరువాత పుష్పములు వర్ణింపబడినవి. ఇచట మల్లికా, గంధఫలీ, కేతకీ వర్ణనలు గలవు.

ఒకవైపు మధ్యాహ్నపు టెండ తీవ్రముగా నుండగా మరియొకవైపు గాలి యాడకుండును. దీనిని పురస్కరించుకొని వ్యజనము వర్ణింపబడినది.

"వ్యజనమేవ పరోపకృతౌ కృతీ నహి పరః పరితోపి విచార్యతాం,
నను పరిభ్రమతాం చ నృణామహో స్వహితకార్యవశాన్మరుతామపి".

వ్యజనమునకు కట్టబడియున్న బర్హమును పురస్కరించుకొని బర్హి వర్ణనము, ఉశీరవర్ణనము, బంధురవర్ణనము లున్నవి.

ఇంతలో స్నానసమయనుగును. ఆ సందర్భమున పీఠము, చెంబు, విభూతి, శ్రీ ఫలము, స్థాలి, ఉద్ధరిణి మున్నగువాని వర్ణనములున్నవి. ఇది యుద్ధరిణి వర్ణనము.

"ఉద్ధరిణి ! సర్వవిదుషా ముద్ధరణే జీవనస్య తే సృష్టిః,
నో చేత్పత్రాస్థితినుత్స్వార్థః కస్య తాదృశం భాగ్యమ్"

చండికాయతనమున పురోహితు డెదురుచూచుచుండగా రసికావతంసుడును హితకారియును దేవ్యాలయము ప్రవేశించి పూజాదికము లొనర్తురు. ఈ యదనున దేవిని స్తుతించిన శ్లోకము లిట్లున్నవి.

"అంబ ! జగతో వలంబన మంబా త్వైనైవ విహితమిహ భూయః,
అవలంబయ మాం కృపయేత్యుక్తిః పునరుక్తమితి మయా నోక్తా".

"చండి ! తవచండశాసన మండజగమనాదిధార్యమవనిధుర్యం,
చండాదిదైత్యఖండన భండన చాతుర్యకార్య భటవిస్తార్యమ్".

"వందేహం జగదంబాం వందితసురమందరీ కృపాలంబాం,
సుందరముఖాబ్జ కచరోలంబా మంబరవిలాసి సునితంబాం."

"వాణీం వీణాయత్తామాణవ మధ్యాంశుకోల్లసత్పాణీం
వేణీ విహితలతాంతశ్రేణీ మేణీదృశం చ సుశ్రోణీం."

"భ్రమరామలక భ్రమరాం భ్రమరాహిత్య ప్రభావహృద్భ్రమరాం,
అమరీశ్రమరీతిహరా మధరీ మధురీ ధురీణ పతిభావ్యాం."

దేవీప్రసాదముమ స్వీకరించిన తరువాత భోజనమునకు సిద్ధమగురురు. ఇక కావలసిన దేమున్నది ! వర్ణభాజనము మొదలు పానపాత్రము వరకును పులుసు మొదలు పంచభక్ష్యపరమాన్నములుమ వర్ణింపబడినవి. శాకములందు వర్ణింపబడినవి, మధుర శాకం, రాజగిరి, మెంధి, ఉపోదకి మొదలగునవి. కూరగాయలందు కూష్మాండము, వార్తాకము, కారవల్ల, పటోలము, కోశాతకి అలాబు, సూరణము మొదలగునవి చేరినవి. అటుతరువాత హింగు, సిద్ధార్థము

మరీచము, భక్ష్యములు, పరమాన్నము. హయ్యంగవీనము, సైంధవము, తింత్రిణీఫలము వర్ణింపబడినవి వీనిలో కొన్నింటివర్ణనము లుదాహరింతును.

పటోల (పొట్లకాయ) వర్ణనమిట్లున్నది.

"పటోల దీర్ఘాకృత్యాపి లాఘవకేన సాధితం,
పాషాణవహనాదిభ్యః సాధనేభ్యః కిమార్జితమ్"

కూష్మాండ (గుమ్మడికాయ) వర్ణనమిట్లున్నది.

"కూష్మాండ సర్వమధురో ప్యబలాదుర్భేద్య సాధువృత్తోసి,
బాల్యే సర్వాపథ్యం భవదాచరణం కిమేత దుపపన్నమ్"

ఇంతవరకు చెప్పబడిన విషయమంతయు 24 తాళపత్రములందున్నది. 25వ పత్రము పోయినది. కనుక భోజనానంతర మేమిజరిగినదో అది 25వ కమ్మలో పోయినది. బహుశః భుక్తాయాస వర్ణనముండియుండును. 26 కమ్మలో మరల రాజుగారు పురమునకు తిరిగిపోవుటకు సిద్ధముగా నుందురు.

పురప్రవేశ సందర్భమున పౌరాంగనల వర్ణనము, అటుతరువాత సభా వర్ణనము, సింహాసనవర్ణనము, వితానవర్ణనము, ఉపబర్హణ, కాకితపత్ర, సులోచన, లేఖినీ, దీపస్తంభ, ధూపకళికా, ఛురికా, వీణాదుల వర్ణనమున్నది. వీనిలో కాగితము వర్ణనమిది.

"కాకితపత్రే! కస్యహి కాచస్యాప్యానసేహి మాలిన్యం,
శతపరిమితమపితాళం సహి తాదృశ మత్రగామితా తస్మాత్."

ఇటుల కొంతసేపు కడచిన తరువాత హితకారి "మహారాజా! సకలకళా ప్రవీణ కళావత్యాసహ సరససంభోగశృంగార మనుభవితు మయమేవావసరః" -అనును. దీనినిబట్టి రసికావతంసుని భార్య కళావతియని తెలియుచున్నది. వయస్యుని మాట దాటరానిదని రాజుగారందురు. అప్పుడు హితకారి యిట్లా శీర్వదించును.

శ్లో॥ "రాజన్ సామ్రాజ్యలక్ష్మీ విభవవిలసితః సర్వదిక్కుంభికుంభ
ప్రోద్యన్ముక్తాఫలశ్రీ సహచర యశసాఖ్యాత విద్వద్గణశ్రీః,
త్వం పుత్రైః పౌత్రవర్గైరతిముదితమనాశ్చాయురారోగ్యభాగ్యం
ధృత్వా సంపూర్ణకామో భవ భవగృహిణీ పూజయా చంద్రతారమ్॥"

అటుతరువాత రసికావతంసు డొక శ్లోకమిట్లు వర్ణించును.

"జయంతి బహుధా సుధామధురబంధురతాబంధుర
ప్రబంధరచనా చమత్కృతి కృతార్థసద్వైభవాః,
ప్రసూనచయసౌరభైః ప్రనవధేనుదుగ్గాంచితై
ర్వచోభిరభితస్సభాం ప్రభవ ఏవ సంభావితుమ్."

అటుతరువాత హితకారి "మహారాజ భవత్సహాయేనానుభూత సదానందవార్ధి కల్లోల మాలికా కేళికావైభవః మహారాజ స్యాజ్ఞాపూర్వకం మామకాగమాపేక్షామీక్షితుం కృపావతీం మత్ప్రియాం ప్రతిగచ్ఛామి" యని నిష్క్రమించును. అందరును నిష్క్రమింతురు. ఈ చివర వాక్యములవలన హితకారి భార్య కృపావతియని తెలియుచున్నది. పైన పేర్కొనబడిన ఒండురెండు శ్లోకములందు నిర్వహణసంధి సమాప్తి యెట్లు కలిగినదో నాయూహ కందుట లేదు. 'సదానంద వార్ధికల్లోల' ఇత్యాది వాక్యమున కందనోలి దేశాయి యగు ఆనందరావు స్ఫురించుచున్నాడు. పోయిన కమ్మలు పోగా మిగిలిన శిథిల భాగములను పూరించుకొని అయ్యవారు శాస్త్రి సంస్కృత సాహిత్యసేవను నా యోపినంత ప్రదర్శించితిని. +

+ వ్రాతతప్పులను సవరించుకొనుటయందును, శిథిలములు పూరించుకొనుటయందును నాకు తోడ్పడినవారు మద్గురుపాదులు శ్రీమదాచార్య రఘునాథ చక్రవర్తిగారు. కర్నూల్ మాన్యువల్ సంప్రదించుటకు మార్గదర్శకులు, డాక్టరు నేలటూరు వెంకటరమణయ్యగారు. ఈ యిరువురకును కృతజ్ఞుడను.

(సాహితి, జులై 1962)

# పింగళి ముత్తాజీ మంత్రి

కాల మిదమిత్థముగా తెలియరాని సంస్కృత కవులందు పింగళ (ళి?) ముత్తాజీమంత్రి యొకడు. ఈతని కృతి సాంబోదయమను చంపూప్రబంధము. దీని యసమగ్రప్రతి యొక్కటి మాత్రము (నెం. 3682) కాకినాడ–ఆంధ్ర సాహిత్యపరిషత్పుస్తకభాండాగారమున గలదు. ఈ యసమగ్రచంపూకావ్యము మొత్తము 88 తాటాకులపై నున్నది. ప్రథమాశ్వాసమున 87 గద్య పద్యములును ద్వితీయాశ్వాసమున 45 గద్యపద్యములును సవ్యాఖ్యానముగా నున్నవి. సాంబోదయమందలి ఇతివృత్తము శ్రీకృష్ణునకు జాంబవతియందు సాంబు డుదయించుట. ఉపలబ్ధభాగమున నున్న కథనుబట్టి నష్టమైన భాగమే యధిక మని తెలియుచున్నది.

గ్రంథకర్తయును, వ్యాఖ్యాతయును గొప్ప పండితులు. ఈగ్రంథమును వ్రాసికొన్న వారెవరోకాని ప్రతిపంక్తియందును వ్రాత తప్పులున్నవి.* గ్రంథావతారిక వలనను, ఆశ్వాసాంతగద్యలవలనను తెలియనగు గ్రంథకర్త, మరియు వ్యాఖ్యాతలగూర్చిన విశేషములు మొదట నివేదింతును.

గ్రంథావతారికయందలి మొదటి మూడు శ్లోకములలో, వినాయక, త్రిభువనేశ్వరీ, శివుల స్తోత్రములున్నవి. తరువాత రెండు శ్లోకములందు మాతాపితృవందన మీతీరుగా నున్నది.

"శ్రీకాంతా చపలా (నగేంద్రతనయా) చండీ కునామ్నీ మహీ
జల్పాకీ చతురాననస్య వనితా భాగీరథీ భంగభాక్,
కావాస్యా స్సర్వశో భవంతి సుదృశో ధీరాస్తువంతీతి యాం
తాం .మే మాతరమానమామి శిరసా తిమ్మాంబికా మన్వహమ్.

---

* సద్గురుపాదులు శ్రీ మదాచార్యరఘునాథ చక్రవర్తిగారి సాయము లేకున్నచో వ్రాత తప్పులతోనున్న ఈ గ్రంథము నాకర్థమయ్యెడిదే కాదు.

"జాగర్త్యభ్యుదయో భువీహ కమలోల్లాసాయ యస్సద్విజాం
శ్చక్రాఖ్యాంశ్చ సుధీః ప్రమోదయతి యో దూరం తమో నిక్షిపన్,
సోయం మజ్జనకో నమజ్జనదయాశీలీ దిశాళీవలత్
తేజో భానుబుధోత్తమో విజయతాం శశ్వత్తరాం (శ్రేయ)సా".

ఈ శ్లోకములవలన కవి తల్లిపేరు తిమ్మాయుంబయనియు తండ్రి భానుబుధోత్తముడనియు తెలియుచున్నది. ప్రథమాశ్వాసాంతగద్యమున కవిని గూర్చిన వివరములింతకన్న నధికముగా గలవు.

"ఇతి శ్రీమత్సకలలోక విఖ్యాతపవిత్ర భారద్వాజగోత్రతిలక పింగళాన్వయ పయోధిరాకాసుధాకరేణ, అశ్వలాయనీశాఖాచార ప్రవర్తకేన, శ్రుతిస్మృతీతిహాస పురాణాధ్యయనలోధాచరణప్రచారణధురీణేన, ఆశ్రితవిద్వద్బృందాభీష్టప్రదాన సంతన్యమాన యశోవితానవ్యాప్త దిగంతరాళేన, త్రిభువనేశ్వరీ పాదారవిందమరందాస్వాదానందతుందిలేందిందిరాయమాణ నిజాంతరంగేణ, అద్వైతరాద్ధాంతనిష్ఠాగరిష్ఠేన, భానుజీప్రధానతిమ్మాంబికా గర్భశుక్తిముక్తాఫలేన, శ్రీమతా ముత్తాజీమంత్రిశిఖామణినా ప్రణీతే సాంబోదయాభిధాన చంబూప్రబంధే ప్రథమాశ్వాసః"

ఈగద్యమువలన పింగళిముత్తాజీ మంత్రి భారద్వాజగోత్రుడని తెలియుచున్నది. కళాపూర్ణోదయ కృతికర్త పింగళి సూరనార్యుడును, ఆధునికులగు ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారును గౌతమగోత్రులు. తెలంగాణమున ఓరుగల్లు, కరీంనగరం, . హైద్రాబాదు మండలములందు పింగళివారున్నారు. వీరు భారద్వాజ గోత్రులు. కనుక ముత్తాజీ మంత్రికూడ తెలంగాణమువాడై యుండునని యూహించుచున్నాను. తానాషా కాలమందుండిన మప్రసిద్ధ సోదరులు అక్కన్నమాదన్నలుకూడ పింగళివారు మరియు భారద్వాజ గోత్రులు. తెలంగాణమందలి ఈ పింగళివా రొకప్పుడు మహారాష్ట్రులను వాదమొకటి కలదు. కాని దీనికి చారిత్రకాధారములు లేవని విజ్ఞులందురు. ఐనను భానూజీ, ముత్తాజీ వంటి పేరులు కొంత మహారాష్ట్రివాసన గలవిగానే కన్పట్టుచున్నవి. అక్కన్న మాదన్నల తండ్రిపేరుకూడ భానూజీమంత్రి. సాంబోదయ కృతికర్తయగు మన పింగళ ముత్తాజీమంత్రి తండ్రిపేరు కూడ భానుజీ ప్రధాని. గోత్రము, తండ్రిపేరు లొకటిగా నుండుట జూచి మాదన్నకే

ముత్తాజీ యను మరియొక పేరుండి యుండినని కొంత ఆత్యాశతోడి యూహ చేసితినిగాని చారిత్రకులు అక్కన్న మాదన్నల తల్లిపేరు భాగ్యమ్మ యని నారు. ముత్తాజీ తల్లిపేరు తిమ్మాంబ యగుటతో నాయూహ సరిపడుటలేదు.

ఈగద్యమువలన ముత్తాజీమంత్రి త్రిభువనేశ్వరీమంత్రోపాసకుడనియు తెలియుచున్నది. చంపూకావ్యమును చంబూప్రబంధమనుట పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుని నాటినుండియే తెలుగునాట వరిపాటియని విజ్ఞులెరిగిన విషయమే. ముత్తాజీమంత్రి తెలుగువాడు కావున (తెలుగు ప్రబంధములందువలె) తన సంస్కృతచంపూకావ్యమునగూడ తెలుగు మర్యాదను ప్రవేశపెట్టి ఆశ్వాసములుగా విభజించినట్లీ గద్యమః సాక్ష్యము.

ఇక వ్యాఖ్యాతృపీఠిక నారయుదము. ఈ పీఠికలో మొదటిశ్లోకమిట్లున్నది.

"ధ్యాత్వా నిత్యమనీశ మీశమనిశం న్యగ్రోధమూలాలయం
ధృత్వా చేతసి దేశికేంద్రచరణం సర్వాభిలాషప్రదమ్,
జ్ఞా (త్వా)లంకృతభవ్యకావ్యపదవీం వ్యాఖ్యాతి కృష్ణస్సుధీః
మత్వా ప్రాజ్ఞహితం గభీరహృదయం సాంబోదయం సోదయమ్."

వ్యాఖ్యాతయగు కృష్ణపండితుడు దక్షిణామూర్త్యుపాసకుడని దీనివలన దెలియుచున్నది. తెలుగు పద్యములందువలె పైశ్లోకమున ప్రాసనియమము పాటింపబడుట గమనింపదగిన విషయము. రెండవ శ్లోకమున వినాయక స్తుతియు, మూడవ శ్లోకమున సరస్వతీ స్తోత్రమును, నాల్గవ శ్లోకమున కృతికర్త ప్రశంసయు కలవు. ఐదవశ్లోక మీ విధముగా నున్నది.

"సోవర్యచూడామణి భవ్యకావ్య
వ్యాఖ్యానమాఖ్యాపిత గూఢభావ్యా (పమ్?)
కావ్యేతి (త్ర?) విశ్వేశ్వరపండితేంద్రో
వ్యదీపయత్సుందరమూర్య గోష్ఠ్యామ్"

ఈ విశ్వేశ్వరపండితుడెవరో తెలియదు. కృష్ణపండితునికంటె పూర్వము ఈతడు కూడ సాంబోదయమునకు వ్యాఖ్యానము రచించినవాడై యుండును. కృష్ణపండితుడు తన వ్యాఖ్యానమునకు కృష్ణకౌతూహలమను పేరు పెట్టినట్లు చెప్పుకొన్నాడు.

"సాంబోదయాఖ్య సత్కావ్య వ్యాఖ్యా విఖ్యాతలక్షణా
కృష్ణకౌతూహలాఖ్యా మే ప్రఖ్యాతిం భజతాం చిరమ్"

వ్యాఖ్యాత రచించిన ఆశ్వాసాంతగద్యమీతీరుగా నున్నది.

"ఇతి సర్వమంగళాలింగిత దివ్యమంగళ విగ్రహపరిగ్రహశాలి శ్రీ దక్షిణామూర్తి దేవతాసార్వభౌమ మహామంత్రనిరంతరచింతన సంపత్సంపాదితనిరవద్యహృద్య విద్యావైశద్యస్య నిఖిలపతివ్రతాశిఖామణి శ్రీకాయమాంబా...పండితాఖండలనశాస్త్రలి సంతతసంతన్యమాన సంఖ్యావత్పుండరీకమండల చండాంశోః శ్రీ మద్రాఘవదైవజ్ఞాన్వయ పయఃపారావారతారాధిపస్య శ్రీకృష్ణపండితమణేః కృతాయాం సాంబోదయవ్యాఖ్యాయాం కృష్ణ కుతూహల సమాఖ్యాయాం ప్రథమాశ్వాసః"—

ఈగద్యమునగల కాయమాంబ ఎవ్వరో తెలియదు. ఆమె పేరు తరువాత రెండు మూడక్షరములకు చాలినంత స్థలమూరక వదలబడియున్నది. ఆమె ఏ సంస్థానమునకు ప్రభ్విణియో? ఆ యాస్థానమున రాఘవదైవజ్ఞాన్వయుడైన ఈ కృష్ణపండితు డుండెను కాబోలు. జాతకసారసంగ్రహకర్త రాఘవభట్టును ఈ రాఘవదైవజ్ఞుడును ఒక్కరగుదురో కారో తెలియదు. ఈ గ్రంథ మాధారముగా కవి మరియు వ్యాఖ్యాతలగూర్చిన విశేషము లింతకన్న నెక్కుడు తెలియరావు.

ఇక సాంబోదయ చంపూప్రబంధము నారయుదము.

ద్వారకాపుర వర్ణనముతో నీకావ్య మారంభమైనది. దీనిలో ప్రథమ శ్లోక మీవిధముగా నున్నది.

"అస్తి ప్రశస్తతరవస్తుభిరుల్లసంతీ పూర్ద్వారకా జగతి మందిరమిందిరాయాః,
తర్కోనుమస్ఫురతి నూనమనూనలక్ష్మ్యా యస్యాః సురేంద్ర నగరీ నగరీయసీతి"

అటుతరువాత చాతుర్వర్ణ్యము, చతురంగబలము, ప్రాకారము, సౌధపంక్తి, ఉపవనాదుల వర్ణనములు మన తెలుగు ప్రబంధములందువలె వరుసగా నున్నవి. శ్లేషచమత్కారములతో శబ్దార్థాలంకారములతో అభేదాధ్యవసాయములతో నీ వర్ణనలు ముత్రాజీమంత్రి ప్రౌఢకవితా సంపదను అడుగడుగునను చాటుచున్నవి. ఉదాహరణమునకై వీనినుండికొన్నిగద్యపద్యములనుట్టంకింతును.

రాజమండలవర్ణన మిట్లున్నది.

"స్వోదయేన కుముదం కళావతా, నిత్యవిష్ణుపదభాజ్యాదంచయత్,
రాజమండల మిహ ప్రకాశతే, పాలయద్విజకులం తమోపహమ్."

ఇది ప్రాకార వర్ణనము.

"అష్టాపదేష్టకచితో వరణః ప్రభాతి, తస్యామహానవదిశైల యివ ద్వితీయః,
యత్కూటకోటిగణనాంరచయన్నివాస్తే,భానుఃకరైర్దశశతైరుపకంఠభాగే"

సౌధముల వర్ణన మిట్లున్నది.

"సౌధాస్సౌధాస్సైంధవీకేళిశైలా,రాజంతే஽స్యాం వైజయంతం జయంతః,
సంక్రాంతా యన్మౌళినీలాశ్మభాసా, స్వర్గంగాభేప్యంచితేవార్కపుత్ర్యా"

అటుతరువాత నొక ప్రౌఢగద్య మీ తీరుగానున్నది.

"అపిచ వినీలతమాలకాననాభిః పృధుల కుచభాసమానాభిః, కమనీయ రసాల దంతచ్ఛదరమణీయాభిః, కాంచన కర్ణికార రచితశోభాభిః, శుకపిక మధురస్వరలసంతీభి ర్విలాసినీభిశ్చ; వికసత్కమలముఖరాజంతీభిః, ఇనకర లాలితాభిస్సతీభిః కమలినీభిశ్చ; లతాతనుపత్రభంగరచనాచణై ర్దక్షిణైర్నాయకైర్గంధవహైశ్చ; ధర్మశాస్త్ర కలాలంకర్మణైః ప్రత్యర్థిదానసముచితభూరి కాండైశ్శూరైరుదారైశ్చ;గదోక్షేపప్రవీణతరై ర్వైద్యవల్లభైర్యోధవరైశ్చ దీవ్యమానా ద్యౌరివ దీవ్యత్కవిబుధగురుసద్గణా, సురపురీవ సురుచిరాప్సరోవర విహారమాణ బృందారకరాజి ర్వసంతశ్రీరివ సురభిసుమనోభరితా, పుండరీకాక్షవక్షస్థలీవ వైజయంతీ లక్ష్మీవిరాజమానా, వామదేవతనురివ నిరంతరాశ్రితా, సరసిజభవపరిషదివ క్రతుదక్షవసిష్ఠబ్రహ్మసమాధ్యాసితాపి రాజవంశాకీర్ణాపి నాన్యోన్యవిమర్దసంజాత తాపా వరిశీలితకృష్ణవత్మాపి దూరీభూత తమోజాతా, ఖర్వేతరసర్వతోముఖవాహినీసమాశ్రిత ప్రతోశిరవ్యపేతజల సంసర్గా సాధులోకసమాక్రాంతాపి పుణ్యజనదవీయసీ ద్విజిహ్వానాం వసతిం భోగవతీంచ కింపురుషనికరాకీర్ణామలకాం చ న్యక్కుర్వతీ విశాలాపి చ కల్యాణీ మధురాయోధ్యాసతీ బహునగరమయీవ రాజతే సేయం రాజధానీ"—

ఈ విధముగా ద్వారకాపురమును వర్ణించి ఆ పురమందుండునట్టి శ్రీకృష్ణభగవానుని వివిధగద్యపద్యచూర్ణికాదులందు విపులముగా వర్ణించినాడు.

శ్రీ కృష్ణుని కీర్తిప్రతాపముల వర్ణనమిది.

"కీర్తిప్రతాపౌ కిలదంపతీవ, త్రైలోక్యసౌధే లసతస్తు తస్య,
శంకే శశాంకద్యుమణీ తనూజా తయోరిమౌ పాండురచండరూపౌ."

శ్రీ కృష్ణుని దానశాస్త్రముల యుగపద్దర్శన మిది.

"ధర్మం గృహీత్వాపి గుణప్రదీప్తం సమార్గణవ్రాతమహో ముమోచ,
తథాపి రాజంతమిమం సమిత్యాం, ప్రత్యర్థిదానప్రవణం వదంతి."

అతని సౌందర్యమునకు దర్పణ మీ శ్లోకము.

"నిలింపశంపానయనాంతరంగ, ప్రకంపనసంపాదకమస్య రూపమ్,
కింవర్ణయామ్యస్య లతాంతధన్వా లావణ్యభూర్యస్య యతఃకుమారః."

ఆపైన రుక్మిణీకృష్ణుల వివాహ మొక్కశ్లోకమున వర్ణింపబడినది. అటుతరువాత జాంబవతీవివాహవృత్తాంత మారంభమైనది. ఇది ప్రథమాశ్వాన మందలి 34-87 గద్యపద్యములందును లభించినంతవరకున్న ద్వితీయాశ్వాసపు 45 గద్యపద్యములందును సాగినను వివాహము జరుగకపూర్వమే గ్రంథము లుప్తమైపోయినది.

సత్రాజిత్తు వర్ణనము, అతడు సూర్యునారాధించి శమంతకమణిని సంపాదించుకొని పురము ప్రవేశించుట, పౌరులా మణిప్రభావమున వెలుగు సత్రాజిత్తును సూర్యుడని భ్రాంతిపడి శ్రీకృష్ణునకు నివేదించుట, సత్రాజిత్తు దినచర్య, శమంతకమణిని ధరించి ప్రసేనుడు వేటాడబోవుట, మృగయా విహారము, సింహము ప్రసేనుని చంపుట, జాంబవంతుడా సింహమును చంపి శమంతకమణిం గొంపోయి తన కూతునకు లీలా కందుకముగా నిచ్చుటలు 34 నుండి 50 వరకు గల గద్య పద్యములందు చెప్పబడినవి.

ఇంతవరకు జరిగిన కథలో హరివంశమునకుగాని భాగవతమునకుగాని భిన్నమైన కల్పనలెట్టివి లేవు. ఇది చంపూకావ్యము గనుక ప్రారంభమందలి పుర వర్ణనాదు లతిదీర్ఘముగా సాగినవి. కాని ఇచ్చటినుండి కొలది మార్పులు కథలో కానవచ్చుచున్నవి. తెలుగు హరివంశములో జాంబవంతుడు శమంతక మణిని తన కుమారునకు కేళీకందుకముగా నిచ్చినట్లున్నది. తెలుగు భాగవత ములో "నొక్కబాలిక కెదురఁ దర్శనీయకేళీకందుకంబుగా వ్రేలంగట్టబడి"

నట్లున్నది. ఈ బాలిక జాంబవతియో లేక యామె చెల్లెలో తెలియదు కాని సాంబోదయచంపూకావ్యమున జాంబవంతుడు జాంబవతి కిచ్చినట్లున్నది.

"జాంబవాన్ మణిమాదాయ, దాయాదాయి దదే ముదే,
లీలాకందుకయామాన, బాలాకృతి రసావపి."

ముత్తాజీమంత్రి తన కావ్యప్రణాళికకు కావలసిన కథాకల్పన మిచ్చటి నుండి ప్రారంభించినాడు. హరివంశము భాగవతము మున్నగువానిలో నీ సందర్భమున శమంతకమణిని వెదకుచు శ్రీకృష్ణుడు వచ్చుట జాంబవంతునితో పోరాడుట లాదిగాగల కథయుండును. సాంబోదయకావ్యమున శ్రీకృష్ణాగమన మిప్పుడులేదు. ఈ పట్టున నిచ్చట నారదాగమనము గలదు. నారదాగమన మొక చిన్న చూర్ణికయందీ విధముగా వర్ణింపబడినది.

"అథ కదాచన యదృచ్ఛయా సంచరమాణః సస్వరమాణ వీణాపాణి వాణీజానిసూను ర్గాంగతో గాంగతోయచ్ఛాయకాయ ప్రభానికాయైరశదిశా యావతస్య చందనలేపమాపాదయన్ మోదయన్మేదినీంచ పాదన్యాసైరుత్కేతనం నికేతనం జాంబవతో విడంబితాంబర రత్నడంబరం విభ్రాజదంబర రత్నస్థగితం నిగనిగద్యుతిపటలజటిలసభాభవనం ప్రవివేశ"—

ఇట్లు ప్రవేశించిన నారదుని జాంబవంతుడు యథోచితముగా పూజించును. ఈ యిరువురు కూర్చొనియుండగా జాంబవతి ప్రవేశించి తండ్రి యంకతలమున గూర్చుండును. ఈ పట్టున జాంబవతీ వర్ణనము అష్టశ్లోక కులకమున గలదు.

"సంఫుల్లమల్లికాగర్భ కబరీభారబంధురా,
ద్వ్యారివేందుకరాంకూర మిళజ్జలదభాసురా"

"ఆకర్ణాంతనటత్త్రాంచల్లోచనాభ్యాం మనోహరా,
మీనాభ్యాం సంచరిష్ణుభ్యామివ లావణ్యసాగరే"

"న్యస్తకస్తూరికాక్లుప్తచిత్రకప్రోల్లసన్ముఖీ,
కళంకాంకురసంకాశశశాంకేవ విభావరీ"

"సౌవర్ణకర్ణికోదీర్ణ నూత్నరత్నప్రభాయుజా,
గండమండలభాగేన జితదర్పకదర్పణా"

"మౌక్తికం బిభ్రతీ శుభ్రమదభ్రం నాసికాపుటే,
మంజుపుంజీభవన్మందహాసభ్రమద విభ్రమమ్"

"చంచత్కలరవోదంచత్కాంచీబద్ధకటీతటీ,
నదన్మరాళపాళీకపులినేవ తరంగిణీ"

"చేతేన విలసన్ముక్తాతారకామాలభారిణీ,
భాస్వరా శశిరేఖేవ సాంధ్యరాగేణ శోభితా"

"రుచిరా కుచయుగ్మేన సద్యోహృద్యేన సముద్యతా
సరసీవ మహాపద్మ కోశద్వంద్వేన మంజులా"

అటుతరువాత జాంబవంతుడు తనకూతుచే నారదునకు ప్రణామము చేయించును. నారదుడామెను పురుషోత్తముని వరుడుగా పడయుమని దీవించును. జాంబవంతుడు తన కూతునకు దగిన వరునిగూర్చి నారదునడుగును. నారదుడు శ్రీకృష్ణుడు తగినవాడని యాతని రూపగుణాదులను, అతిలోక శక్తులను విపులముగా వర్ణించును. నారదుడు శ్రీకృష్ణుని వర్ణించిన సందర్భమందున్న కొన్ని శ్లోకములు మనకు శ్రీకృష్ణ కర్ణామృతమును దలపించును. అట్టివానిలో నొక్కశ్లోకము :

"మందాకినీ కోకనదావళీషు, మందారభూమీరుహ వల్లవేషు
తత్పాదపీఠీ సుషమాసమృద్ధిం, విలోకయామో వయమాదరేణ"

శ్రీకృష్ణుని రూపగుణానుకీర్తనమును విన్న జాంబవతి మనస్సు ఆతనియందు లగ్నమగును. ఆమె తదేకాసక్తచిత్తయగును. నారదుడు వెడలిపోవుమ. ఇంతటితో ప్రథమాశ్వాసము ముగిసినది.

వసంతవర్ణనముతో ద్వితీయాశ్వాస మారంభమగును. మధుమాస వర్ణనము చేయు ప్రౌఢదీర్ఘ గద్యమొకటి గలదు. అటుతరువాత జాంబవతి విరహ మతివేలముగా వర్ణింపబడినది. ఈపట్టునగల రెండు మందాక్రాంత వృత్తముల నుదాహరింతును.

"చిత్రేచిత్రే రచితమచితం రూపధేయం మురారే
ర్దర్శం దర్శం నిమిషరహితై రక్షిభిరీక్షణీయమ్.
కన్యా సద్యః పరవశతయా చిత్తమస్మిన్నిధాయ
ప్రాప్తా హంత స్థిరతరతనూ సాకమద్వైతసిద్ధిమ్"

"ఆలింగత్యాశ్చకితహరిణీలోచనాయా ముకుందం
చేతోవృత్యా వపుష కలికాబృందతుల్యం లతాభే
స్ఫీతం జాతం విపులపులక వ్రాతమస్యాః ప్రకామం
మారోదారప్రహరణధియా నిర్మితం వర్మశంకే."

జాంబవతి పొందిన దశావస్థలు విపులముగా వర్ణింపబడినవి. జాంబవతి చెలికత్తెలామెకు శిశిరోపచారములు చేయుదురు. ఆమెను పలువిధములుగా మారడించి వనవిహారమునకు గొంపోదురు. వనమందలి వివిధవృక్షలతాదులు, కోకిలారావములు జాంబవతికింకను మన్మధోద్దీపకములగును. ఆమె తన చెలికత్తెలకు తన బాధనెరిగించును. ఈ నివేదనము సుమారు పరుమూడు శ్లోకములందున్నది. వానిలో నొకటి రెండు శ్లోకములు.

"స్మరాయుధోత్తా పనతేజనార్థ, మంగారపుంజం మధులోహకారః
ప్రవాళరాశిం వనితా। యమాళా, భస్త్రానిలైః ప్రజ్వలయత్యుదారమ్"
"నానాగమఖ్యాతమ నీతమాలం వాసంతికేవ ప్రమదాః। కదాహమ్
స్ఫురత్ప్రసూనస్తబకస్తనీతం, పరిష్వజేమ ప్రియమాదరేణ."

విరహక్లిన్నయగు జాంబవతిని వర్ణించు చివర గద్యమిది.

"ఇతి బ్రువాణా నీలవేణీ సా పునః పునర్వికస్వరేణ పికస్వరేణ చ ప్రసభ ముచ్చరతా చంచరీకసంచయఝంకారేణా వ్యథాంగుర తరంగితయా రాజకీర కూజిత మధురాయా చ నిరవధిప్రసరతా చందనాచల మందిరతుంద పరిమృజగంధవహ కందళేన చ ప్రత్యగ్రజాగ్రతా కుసుమవిసర విలసనేన చ పంచాననగళరవప్రపంచేన కలభీవ, దుర్జయపర్జన్యగర్జితేన మరాళీవ, శిఖావలముఖావలత్ కేకయా భుజంగీవ, దిగంత విసృమర దవదహనోష్మణా కురంగీవ, శరదవసర విసరత్కౌముదీపూరేణ పద్మినీవ, వివర్ణా విభీతా కంపమానా ప్రతప్తా వరిమ్లానా చ బభూవ"—

ఈ గద్య వ్యాఖ్యానముతో గ్రంథమాగిపోయినది. దీనివలన లభించిన గ్రంథభాగమునకంటె లుప్తమైన భాగమే యధికమని తెలియుచున్నది.

సంస్కృతకావ్యమర్యాద ననుసరించి కాక పింగళముత్తాజీ మంత్రి సాంబోదయ కావ్యమున ఒకే యాశ్వాసమున వివిధవృత్తములు తెలుగు ప్రబంధములందు వలె అడుగడుగునను వాడెను. గ్రంథము నమగ్రముగా లభింపకపోవుట విచారకరము.

(సాహితి, సెప్టెంబరు 1962)

# చంద్రభట్టు ఈశ్వరప్ప

పార్వతీపరమేశ్వరుల పరిణయగాథ లెందరో మహాకవులకు కావ్య వస్తువులైనవి. కవికులగురువు కాళిదాసు కాలమునుండి నేటివరకును అటు సంస్కృతమందును ఇటు దేశభాషలందును రచయితలీ వస్తువును గ్రహించి తమ తమ యభిరుచుల కనుకూలముగా మలచుకొనుచున్నారు. అట్టివారిలో చంద్రభట్ట ఈశరప్ప యొకడు. ఈతని కృతి పార్వతీపరిణయచంపూకావ్యము.

పార్వతీపరిణయచంపూకావ్యములు వ్రాసినవారింకను ఇద్దరు సంస్కృత కవులున్నారు. ఒకరు ఈశ్వరసుమతి[1]; రెండవవారు కందుకూరి రామేశ్వరుడు[2] వామనభట్టభాణుడు మున్నగువారు రచించినవి ఈ పేరుతో నున్న నాటకములు. చంద్రభట్టఈశ్వరప్పకృత పార్వతీపరిణయచంపూ కావ్యము (నెం. 376) కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తులో గలదు. ఇది ౨౩ తాళపత్రములపైనున్నది. వ్రాత చక్కగానే యున్నను వ్రాయసకాని పొరపాటులు మిక్కిలి దొరలినవి.

చంద్రభట్ట (చంద్రాభట్ల) ఈశ్వరప్ప ఏకాలమువాడో ఏయూరివాడో ఇదమిత్థముగా తెలియదు. కాని వ్రాయసకాడిచ్చిన తేదినిబట్టి కొంత యూహింప వచ్చును. ౨౩వ కమ్మపైన కవి వ్రాసికొన్న అశ్వాసాంతగద్య మున్నది.

"ఇతిశ్రీమదీశ్వరప్పాభిధానబుధవిరచిత పార్వతీపరిణయ నామధేయ చంపూప్రబంధే పంచమస్సర్గః."

దీని తరువాత,

1. తంజావూరు కేటలాగు 6వ సంపుటము నెంబరు 3694, పుటలు 2569-2571.
2. History of classical Sanskrit literature M. Krishnamachariar Page 519 Para 544.

"సిద్ధార్థినామసంవత్సర భాద్రపద బ. ౩. గురువారంనరికి పార్వతి పరిణయం సంపూర్ణంగాను చంద్రభట్ట సుబ్బన్న వ్రాయడమైనది." యని యున్నది. దీనిలో తిథి మొదట ౫ గా వ్రాసి తరువాత ౩ గా దిద్దినట్లున్నది. తదియ యగుచో ఈ తేది క్రీ. శ. 16-9-1619 కి సరిపోవును. పంచమి యగుచో క్రీ. శ. 19-9-1799 కి సరిపోవును. ఇది తదియ యనియే నా యూహ. గ్రంథమును ఎత్తి వ్రాసికొన్న తేదియే 16-9-1619 A. D యగుచో గ్రంథకర్త ఇంతకు పూర్వుడనుటలో సందేహము లేదు. చంద్రభట్ట ఈశ్వరప్ప కనీసము పదునారవ శతాబ్దము వాడగును. ఈ గ్రంథమును వ్రాసిన వ్రాయసకాడు కూడ చంద్రభట్ట వంశమువాడే। ఈతడు గ్రంథకర్తకు కొడుకో, మనుమడో, మునిమనుమడో కావలయును. ఇంతకు మిక్కిలి గ్రంథ కర్త దేశకాలములు తెలియరావు.

గ్రంథావతారికలో మొదటి యైదుశ్లోకములు ఇష్టదేవతాస్తోత్రాదికములు. వినాయక, శివ, సరస్వతీ, బాలకృష్ణ, గురుస్తోత్రము లీ శ్లోకములందు గలవు గురుస్తుతి చేయు శ్లోకమిట్లున్నది.

"సదాశివగురుం భజే సకలధీరనిత్యస్తుతం
ద్విజాధిపతిసేవితం వివిధవేదవక్త్రాంబుజమ్,
స్ఫుటస్ఫటికమాలికాస్ఫురితకంబుకంఠం సదా
శ్రితప్రకరవాంఛితప్రబల దివ్యవస్తుప్రదమ్." ౭

ఆటుతరువాత ౮ నుండి ౪౩ వరకున్న శ్లోకములలో తన వంశావ తారమును వర్ణించుకొన్నాడు. చంద్రభట్టవారి వంశక్రమ మీ తీరుగానున్నది.



4. విశ్వపతి
(భార్య : సుభద్ర)

సదాశివుడు
(భార్య : హనూనూంబ)

5. రామేశ్వరుడు
(భార్య : లచ్చమ్మ)

విశ్వేశ్వర సదాశివ సుబ్రహ్మణ్య సర్వేశ్వర వేంకట 6. ఈశ్వరప్ప రామనాథ
(కృతికర్త).

ఈశ్వరప్ప తన యన్నలలో మూడవవాడగు సుబ్రహ్మణ్యుని గీర్వాణాంధ్ర కవితాధౌరంధర్యము నిట్లుగడించినాడు.

"గీర్వాణాంధ్రకవిత్వయుక్తిచతురస్తస్యామజాగ్రేసర
(సు)బ్రహ్మణ్యబుధో విభుస్థల సమానీతామితాలంకృతిః,
ఏకైకప్రహరోర్జిత ద్విశతకస్సంగీత భిక్షాప్రద
స్సాక్షాన్మానుషవేషపోషణపటుశ్శేషో యథా శోభతే" 39

ఈ యవతారికా భాగమందే ఈశ్వరప్ప తన రచనోద్యోగము నిట్లు సవినయముగా చాటుకొన్నాడు.

"ప్రాచ్యాం రోహితవట్టకందుకరుచిం జిత్వా నిశానాయకే
జాతే వంచితహేమమంజులరుచౌ జంబీరసస్వేచ్ఛయా,
బాలః స్వల్పధియా యథా నిజకరాదానే తు కామస్తథా
చంపూం సంప్రతి పార్వతీపరిణయప్రఖ్యాం కరిష్యే ముదా" 6

పార్వతీపరిణయచంపూకావ్యమున నైదు నన్నాహములు కలవు. ఈ యైదు నన్నాహములందున్న గద్యపద్యముల సంఖ్య 223. అవతారికలోనున్న గద్యపద్య సంఖ్య 44. ఈ విధముగా మొత్తము 267 గద్యపద్యము లీ కావ్యమున గలవు.

కథాప్రారంభము హిమాద్రి వర్ణనముతో మొదలైనది.

"శ్రీమానస్తి సమస్త పర్వతపతిర్నామ్నా హిమాద్రిర్మహాన్
కశ్చిద్దివ్యపతేర్దిశి ప్రకటయన్నాత్మీయ విస్తారతామ్,

పార్వత్యాఖ్యా ముదయా స్తపర్వతయుగం ద్వాభ్యాం నిజాభ్యాం గిరి
స్వామిత్వేనవితోదయన్నివ సురైస్సాకం మఖాంశాదనః" I-1

హిమవంతుడు మేనకను పెండ్లియాడుట, మైనాకజననము, పార్వతీ జననము, నఖశిఖపర్యంతము పార్వతీవర్ణనము (12—28) ప్రథమసన్నాహమున గలవు.

ద్వితీయసన్నాహమున నారదాగమనము. నారదుడు పార్వతిని దీవించి వెడలుట, సూర్యాస్తమయ నిశా, తారకా, చంద్రోదయ, చంద్రాతప, సూర్యోదయ, వర్ణనములును, పార్వతి తన చెలికత్తెలతో నాడుకొనుట, హిమవంతుడామెను చూడవచ్చుట, పార్వతి తండ్రికి మొక్కుట, అతడు పార్వతిని నీకేమి కావలయునో కోరుకొమ్మనుట, పార్వతి తనకేమియు వలదని చెలికత్తెలతో నాడుకొందు ననుట, హిమవంతుడు వెడలిపోవుట యను వృత్తాంతములును గలవు. తపము సేయుటకై శివుడు హిమాద్రి కరుదెంచుట, భద్రతీర్థమను తపోవన వర్ణనము, శివుని తపస్సు, ఇది తెలిసిన పార్వతి తల్లిని భద్రతీర్థాశ్రమముని సేవకై యనుజ్ఞ వేడుట, పార్వతి భద్రతీర్థాశ్రమమున కేగి శివుని సేవించుట, దేవత లింద్రునికి తారకాసురుని దుశ్చేష్టితము లెరిగించుట, ఇంద్రుడు దేవతలతో బయలుదేరి బ్రహ్మలోకమున కేగి బ్రహ్మకు తారకాసురుని బాధ లెరిగించుట, బ్రహ్మ శివుని తపమును దేవతల కెరిగించి పార్వతీశివుల పరిణయమైనచో కుమారుడు జన్మించి తారకాసురుని పరిమార్చునని చెప్పుట, ఇంద్రుడు సకలదేవతలతో మన్మథుని కడకేతెంచి శివతపోభంగమునకై పురికొల్పుట, రతీదేవి మన్మథుని వారించుట, మన్మథుడు రతీదేవి వెంటరా చైత్రునితో కలసి భద్రతీర్థమున ప్రవేశించుటలను కథలు గలది తృతీయసన్నాహము. చతుర్థసన్నాహమున మన్మథుడు శివతపోభంగము చేయ ప్రయత్నించి భస్మసాత్కృతుడగుట, రతీవిలాపము, శివుని వరము, పరిభూత యగు పార్వతి స్వగృహమున కేగి తలిదండ్రులను తపము చేతునని యనుజ్ఞ వేడుట, పార్వతీదేవి తపము, శివుడు కపటవటురూపమున పార్వతి కడకు వచ్చి సంభాషించుట, శివుడు సాక్షాత్కరించి పార్వతికి తన కోరిక నెరింగించుట, ఎవరి నివాసములకు వారు వెడలిపోవుటలను వృత్తాంతములు గలవు.

శివప్రేరణమున సప్తర్షులరుంధతీసమేతులై హిమాలయమునకు వచ్చుట, పెండ్లిముచ్చటలు, ఋషులు సఫలమనోరథులై తిరిగిపోవుట, శివుని పెండ్లి

సన్నాహము, బ్రహ్మవిష్ణ్వాదిసమస్తదేవతలు శివుని వివాహమునకు తరలి వచ్చుట, పార్వతీశివుల పరిణయము, వధూవరులు క్రీడాతల్పమును చేరు కొనుటలను, కథలు గలది పంచమసన్నాహము.

ఈశ్వరప్ప కాళిదాసవిరచితకుమారసంభవము నాదర్శముగా నిడుకొని పార్వతీ పరిణయచంపువును రచించినట్లున్నాడు. కాని కథలో నొకచోట చిన్న మార్పొకటి కలదు. కుమారసంభవములో ఇంద్రుడు తన మనమున మన్మథుని స్మరించినంతనే యాతడింద్రుని సన్నిధికి వచ్చినట్లుండ పార్వతీ పరిణయమున దేవేంద్రుడు స్వయముగా మన్మథనివాసమునకు పోయినట్లు కలదు.

ఈ చంపూకావ్యము కొంత ప్రాచీనమైనది కనుకను తరతరములుగా వ్రాయసకాండ్రు చేసిన పొరపాటు లిందు చాల గలవు. కొన్నిచోట్ల పాణినీయ వ్యాకరణవిరుద్ధప్రయోగములు కూడ కలవు. ఇవి వ్రాయసకాండ్రవలన నేర్పడినవో స్వయముగా కవికృతములో తెలియదు. "విపరాభ్యాం జేః" యను సూత్రమునకు విరుద్ధముగా 'విజయతి' యను పరస్మైపదరూపమును రెండుమూడు చోట్ల ప్రయోగించినాడు. రెండు మూడుచోట్ల యతిభ్రంశము లున్నవి. అవతారికలో తన వంశావతారమును వర్ణించుకొనునప్పుడు తన తాతగారి భార్య సుభద్రమగూర్చి యిట్లు చెప్పినాడు.

"తస్య విశ్వపతేర్భార్యా రేజే కృష్ణార్పితాంతరా,
సుభద్రాఖ్యా సుభద్రేవ న నామ్నైవార్థతోపి సా" 23

నీలాచలస్వామి యగు జగన్నాథునికి నీరాజన మిచ్చునప్పుడు "సుభద్రా ప్రాణనాథాయ" యందురనియు సుభద్ర (భద్రకాదు) శ్రీకృష్ణుని ప్రియురాలనియు, ఈ విషయమున నేదో పొరపాటున్నదనియు పూర్వమొకప్పు డేదో పత్రికలో ఆ యపపాతమును తొలగించి శ్లోకమును సవరించి ఎవరో వ్రాసి నట్లు చదివితిని. కాని ఈశ్వరప్పవంటి పదునారవ శతాబ్దపు సంస్కృత కవి కూడ సుభద్ర కృష్ణార్పితాంతర యనుట ఈ సంప్రదాయ మెంత ప్రాచీనమైనదో తెలియుచున్నది. ఈతప్పు క్రొత్తగా దొరలినది కాదన్నమాట.

ఈశ్వరప్ప కవిత్వము తెలియుటకై పార్వతీపరిణయమునుండి కొన్ని శ్లోకము లుదాహరింతుము:

పార్వతీదేవి పాదములు వర్ణించునప్పటి శ్లోక మిట్లున్నది.

"రాత్రౌ సుధాంశురిపురేత్య విజృంభణం మే
హంతీతి పర్వతసుతాం ప్రతి సాధు జప్త్వా
పద్మం తదీయచరణావతరం ప్రపద్య
తత్పంజ్ఞయా విజయతే కిము నిత్యజృంభమ్" I-14

ఆమె యూరువులను వర్ణించు గద్యమిది.

"తత స్తదీయ సుందరతరోరుయుగళ మిథకరరంభాస్తంభప్రముఖే ష్వఖండకండూలత్వ వలాశకాండ ద్రోణామూల విశ్లేషాది దోషానాపాద్య స్వసైవ (స్వతఏవ?) పరస్పరసాదృశ్య మలభత." I-16

పై గద్యమునకును వసుచరిత్రమునందలి "సతి యూరుద్యుతిఁ జెందఁ బూని" యను పద్యమునకుమ (II-37) గల పోలిక గమనింపదగినది.

రాగిడి, ముత్యాలసరములు మున్నగు భూషణముల నలంకృతమైన పార్వతీదేవి కేశపాశమును, ఆమె ముఖమును వర్ణించు శ్లోకముతో ప్రథమ సన్నాహము ముగిసినది.

"శ్రీ వాలపాశ్యాంచిత మధ్యదేశో ముక్తానరాలంకృత కేశపాశః,
తస్యాశ్చకాశే కిల పూర్ణచంద్ర మధ్యం వియత్తారక వేష్టితం వా" I-28

శుక్రోదయమును వర్ణించు శ్లోక మీ తీరుగా నున్నది.

"చంద్రప్రియో విశతి సంగమకాంక్షయేతి
రాత్రిస్త్రియా గగననర్మగృహే ప్రదృష్టః,
అన్యోన్యగాత్రపరిలేపనగంధపూర్ణః
శుక్రాభిధానచషకో విరరాజ శుక్లః" II-20

మన్మథుడు తన ఇంటికి వచ్చిన ఇంద్రునిజూచి సంతోషములో నిట్లనును.

"రాజన్నీరజనుర్యథైవ వికచే దాదిత్యవీక్షావశా
ద్వర్షాత్రిస్యవిలోకనార్భుజ(గ)ఝగ్గాత్రం యథా గోత్రభిత్,
తద్వన్మానసమద్య మామకమపి త్వద్దర్శనాద్వల్లభా
చ్ఛక్తస్తోత్రమహం న కర్తుమధునా సంక్రందనాఖండల" III-37

పార్వతీదేవి తపము చేయనిశ్చయించినప్పు డామె తలిదండ్రు లిట్లు మందలింతురు.

పంచాగ్ని మధ్యాదితపః ప్రయత్నః సంచారణం చ క్వ వనప్రదేశే,
కించ క్వబాలే తరుణప్రసూనచందన్మృదుత్వం తవగాత్రమత్ర." IV-20

పార్వతి తపమును పరీక్షింపవచ్చిన వరమశివుడు కుహనావటురూప మున శివుసుపాలంభించును. పార్వతికి వైముఖ్యము గలిగించుటకై యాత డిట్లనును.

"జానామి జానామి తవానుభావం
జాగర్తి జాగర్తి తదష్టమూర్తౌ,
భావస్తదాపి ప్రచురాన్ గుణాం స్తాం
తత్సన్ని విష్టాన్వికృతాన్ ప్రవక్ష్యే." IV-34

"కాలకూటాశనో వాయుభుగ్భూషణః
క్రూరశుంకాలచర్మాంశుకో యాచకః,
ప్రేతకాంతారసంచారణే తత్పరః
కిం వృతస్స త్వయా భీకరశ్రేష్ఠయా." IV-35

"మూలికారూపకాపాలికాశీధర
శ్శోభనీ ముఖ్య దుష్పాశికాభీష్టదః
అంగరాగీభవద్భూతిక శ్శూలికః
కిం వృతస్స త్వయా భీకరశ్రేష్ఠయా. IV-36

పెండ్లికొడుకైన శివుని వర్ణన మిట్లున్నది.

"జటాజూటాశ్చంభోస్సవది హరిలోష్టిషవసనం
సుంధాంశుస్త్రత్యః ప్రభవతి మహాభాషికమపి,
గలాలంబా ముక్తావళిరురగరాజస్స్వహ మణిః
కరాదిస్వాన్సర్వాః కటకముఖభూషామహితః" V-32

ఈ కావ్యము చిట్టచివర శ్లోకమున పార్వతీపరమేశ్వరుల రహః కేళి వర్ణింపబడినది.

"కల్యాణప్రదయో స్తయోస్త్రిజగతామాస్వాదితామూల్యతి
త్తాంబూలాదివదార్థయోః కృతబహిస్తాతవ్యవాయాత్మయోః,
పర్యాయాత్కను మేషు వశ్యమనసా [illegible]
రచ్చిన్నాత్మ (మదృశ్యత) [illegible]." V-61

(సాహితి, నవంబరు 1962)

# భారద్వాజ రామాచార్యుల

# భద్రగిరి చంపూ

శ్రీరామచంద్రుడు తెలుగు ప్రజానీకానికి బాగా మనసుకెక్కిన దైవం తెలుగువారిలో చాలామంది శ్రీరామచంద్రుణ్ణో లేక అతని భక్తుడైన ఆంజనేయుణ్ణో కొలిచేవారున్నారు. రామాయణేతివృత్తం గల కావ్యాల సంఖ్య కూడా తెలుగు సాహిత్యంలో ఎక్కువపాలే పంచుకొన్నది. శిష్టులేకాక జానపదులు పాడుకొనే పాటల్లోకూడా రామాయణానికి సంబంధించినవి నూర్లకొలది ఉన్నవి త్యాగరాజు, గోపరాజుల వంటి శ్రీరామ భక్తుల మూలంగా కర్ణాటక సంగీతంకూడా పునీతమైంది గీర్వాణభాషలో రచన చేయగల్గిన తెలుగువాళ్ళు దాదాపు ౪౦ రామాయణాలు సంస్కృతంలో వ్రాసినారు వీటిలో చాలాభాగం అముద్రితం.

తెలుగు దేశంలో ఉన్న శ్రీరామక్షేత్రాలలో భద్రాచలం గొప్పది. సీతారామలక్ష్మణులు అరణ్యవాసం చేసినప్పుడు గోదావరీతీరాన ఈ పుణ్యభూమిలోనే సంచరించినారని మనవాళ్ళ నమ్మకం. తెలుగులోను, సంస్కృతంలోను భద్రాచల మాహాత్మ్యన్ని, తెలిపే గ్రంథాలున్నాయి. రామదాసు అనే బిరుదు పొందిన కంచెర్ల గోపరాజుగారి కీర్తనలు హరిదాసుల పుణ్యాన తెలుగుదేశం నాలుగుమూలలా వ్యాపించినాయి. ఈ భద్రాచల శ్రీరామచంద్రుని మీద సంస్కృతంలో కూడా అనేకకావ్యాలు చమ్పూకావ్యాలు స్తోత్రాలు ఉన్నవి. ఐతే ఇందులో అధికభాగం తాళపత్రాల్లో మూలుగుతున్నవి. వీటిని వెలుగులోనికి తేవటానికి మళ్ళీ ఏ రామదాసో బందిఖానా బాధలు పడవలె కాబోలు. ఈ ప్లవంగ శ్రీరామనవమి సందర్భంగా భద్రాచల స్వామి పేర ఉన్న భద్రగిరి చమ్పూకావ్యాన్ని ఆంధ్రలోకానికి పరిచయం చేయటమే ప్రకృతం నా కర్తవ్యం.

భద్రాచల క్షేత్రమహిమనూ, అక్కడ జరిగే చైత్రోత్సవాన్నీ విపులంగా వర్ణించటానికి పుట్టిందీ కావ్యం. దీని రచయిత రామాచార్యులు. రచయిత తండ్రిపేరు వేంకటాచార్యులు, తాతపేరు రామాచార్యులు. ఈయన ఏ ఊరివాడో, ఏ కాలంవాడో ఇదమిత్థంగా చెప్పటానికి వీలులేదు. ఇంటిపేరు కూడా తెలియదు. బహుశః ఈతడు 17–18 శతాబ్దాల వాడై ఉంటాడనీ, ఆ ప్రాంతానికి పాలకులు పాల్వంచ జమీందారులైన అశ్వారావుల ఆస్థానానికి సంబంధించినవాడై ఉంటాడని ఊహిస్తున్నాను. కావ్యాంతంలో కవి తన తండ్రి తాతలను గూర్చి, తనను గూర్చి ఇట్లా చెప్పుకున్నాడు.

"భారద్వాజ కులార్ణవామృతకర శ్రీరామవర్యస్య యః
పౌత్రో వేంకట (దేశికస్య మహతః) పుత్రశ్చ తేనాదరాత్,
రామాఖ్యేన మనీషిణా వి(రచితే చంపూ ప్రబంధే మహాన్)
(భద్రాద్రీశ) మహోత్సవామృతయుతే భాగోఽద్వితీయోఽభవత్."

రచయితను గూర్చిన వివరాలు ఇంతకంటె ఎక్కువ ఏమీ తెలియవు.

ఈ చమ్పువు రెండు భాగాలుగా ఉన్నది. మొదటి భాగానికి ధ్వజాధిరోహణ వర్ణనమని పేరు. రెండవ భాగానికి ఏ పేరుందేదో? చివరి గద్యమున్న కమ్మ విరిగి పోయింది కనుక ఆ పేరు తెలువదు.

ఈ కావ్య ప్రారంభశ్లోకం ఇట్లా ఉన్నది :

శ్రీమద్భద్రవగాధిరాజ విలసత్సౌధాగ్ర భాగోజ్జ్వల
జ్వాలాభీల మవక్ర విక్రమ మహం చక్రేశ్వరం సశ్వరమ్,
ఛేత్తుం బంధ మలింధనాగ్ని శమదం దుర్వారగర్వాధిక
క్రవ్యాద క్షరితా క్షతక్షతరుహై న్నిత్యః ప్రశస్యం స్తువే.

మొదటి భాగములో భద్రాచల మాహాత్మ్యం అక్కడి ఉత్సవాలు మొదలైనవి వర్ణింపబడ్డాయి. సాయంకాలం జరిగే ధ్వజారోహణ వర్ణనంతో ఈ భాగం సమాప్తమౌతుంది. రెండో భాగం మరునాడు ఉదయం అక్కడ జరిగే తిరునాళ్ళు, వీధులు, యాత్రికులు, ఉత్సవాలను వర్ణించటానికి ఉద్దేశించింది. దీనిలో చమ్పూకావ్యం లక్షణాలు వీధీ లక్షణాలు కలసి ఉన్నాయి. ఇందులో ప్రధాన పాత్రలు ఇద్దరు. శ్రీరంగంనుండి భద్రాచలంలో జరిగే ఉత్సవాలు

చూడటానికి వచ్చిన పద్మాక్షుడు ఆతని ప్రియురాలు బిబ్బోకవతి. వర్ణనలు చాలా భాగం పద్మాక్షుని నోటినుండి వస్తవి. మధ్యమధ్యన సంభాషణలు కూడా ఉన్నవి. ఈ రెండుపాత్రల గూర్చి ప్రారంభంలో ఈ శ్లోకం ఉన్నది.

"చైత్రోత్సవం దాశరథే ర్విలోకితుం
భద్రాద్రి ధామ్న స్తరుణీసమాగతౌ,
పద్మా(క్ష) బిబ్బోకవతీ సమాఖ్యయా
ప్రఖ్యాం గతౌ కౌచన రంగవానినౌ"

ఈ కావ్యం కాకతీయులనాటి ఓరుగల్లును వర్ణించే క్రీడాభిరామాన్ని తలపిస్తుంది.

పద్మాక్షుడు తన ప్రియురాలు బిబ్బోకవతితో కలిసి స్నానంచేసి ఆలయంవైపు నడుస్తాడు. ఆలయ గోపురాలకు దూరం నుండే ఇట్లా నమస్కరిస్తాడు.

కనకకలశరాజ శ్రీపరీక్షాం విధాతుం
విపులగగనశాణోల్లేఖనే నోన్నతేభ్యః,
సతతరతినహానాం సాధుపారావతానాం
విహరణశరణేభ్యో గోపురేభ్యో నమోస్తు.

అక్కడినుంచి కొంచెం ముందుకు నడువగానే గోదావరి కనబడుతుంది.

ఆ ఉభయులూ గోదావరికి నమస్కరించి వర్ణిస్తారు. గోదావరీ వర్ణనం చేసే శ్లోకాల్లో ఒకటి.

పులినజఘనరమ్యా చక్రవాక స్తనీయం
తరళతర తరంగ ప్రోచ్ఛలన్మధ్యరేఖా,
సరిదిహ చపలాక్షీ స్వచ్ఛ డిండీరహాసా
విహగకుల నినాదైర్నో శుభం పృచ్ఛతీవ.

భద్రగిరిని వర్ణించే శ్లోకాల్లో ఒకటి

శ్రీ భద్రశైలం సుకృతైకమూలం
భజేను వేలం జలధౌఘనీలం,

శ్రీయోవిశాలం విలసద్రసాలం
(శ్రి)తానుకూలం శ్రిత దేవజాలం.

ముఖమంటపానికివచ్చిన తర్వాత పద్మాక్షుడు శ్రీరామచంద్రమూర్తిని ఇట్లా స్తుతిస్తాడు.

నమో స్త్వసుర వైరిణే జనకభూ మనోహారిణే
హృదంతరవిహారిణే మతిమతాం సుధాహారిణే,
శ్రితావనవిచారిణే శ్రుతివనాం(త సంచా)రిణే
సదా సుకృతకారిణే దశరథాత్మజా కారిణే,

అటుతరువాత అక్కడకి వచ్చిన దేవతలు వారు జరిపే పూజా విధానాలు అన్నీ విపులంగా వర్ణించబడ్డాయి.

మొదటిభాగం చివరిశ్లోకం ఇట్లా ఉన్నది:

శ్రీకంఠః కమలాననశ్చ భగవాన్ పృథ్వీనభో దేవతే
శక్రస్సప్తమహర్షయ స్సురగురుర్వ్యాస్వాన్ కళానాం నిధిః,
నక్షత్రాణి కులాచలాశ్చ సకలా ఆశాశ్చ దిక్పాలకై
స్సాకం భూమి సుతాపతేః స్థిరతరం శంసంత్వి మే మంగళమ్.

అటుతరువాత బిబ్బోకవతితో పద్మాక్షుడు తన విడిదికి వెళ్ళిపోతాడు.

మరునాటి ఉదయవర్ణనంతో రెండవభాగం ప్రారంభం ఔతుంది. ఇద్దరూ కలిసి విపణివీథులు తిరుగుతారు ఒక విపణిలో కస్తూరి కొనవచ్చిన ఒక స్త్రీ, అమ్మే బేహారి ఇద్దరూ (తుమ్మెదమూలంగా) ఏ విధంగా భ్రమ పడుతారో వర్ణించే చక్కని శ్లోకం ఒకటి ఉంది.

కస్తూరీమోదలోభా దధిగతమచలం నిస్తులాయాం తులాయాం
కస్తూరీ(తి) ద్విరేఫం (వ)ణిగభితులయన్ ప్రస్తుతానాం క్రయాయ,
అస్తోకం పాణిపద్మే నగరమృగదృశాం న్యస్తవాన్ తేన పశ్చా
వి స్తీర్ణోడ్డీన మారాత్తదను పురజ(నా) హస్తతాళం పశ్(చ)క్రుః.

ఇట్లా వీథుల్లో తిరుగుతుంటే పద్మాక్షునికి తన గ్రామంవాడు ఎన్నో ఏండ్లక్రిందట ఉత్తరదేశానికి ధనమూ కీర్తి అర్జించటానికి వెళ్ళిపోయినవాడు

విశ్వేశ్వరభట్టు అనే పాతస్నేహితుడు కనిపిస్తాడు. ఉత్తరదేశమంతా దిగ్విజయం చేసివస్తున్న ఆవిశ్వేశ్వరభట్టు తాను విన్నవీ కన్నవీ తానుచేసిన ఘనకార్యాలు మిత్రునికి చెప్పతాడు.

సీతారాములను కల్యాణానికి ముందు అలంకరించే ఘట్టం చాలా విపులంగా సాగింది.

సీతమ్మవారి అలంకారం ఇట్లా ప్రారంభమైంది.

"కలశజలధికన్యాం సర్వలోకైకమాన్యాం
జనకయజనజన్యాం వాంఛితానాం వదాన్యాం,
హృతనత జనదైన్యాం రాఘవేంద్రోరనన్యా
మలమకురుత ధన్యా మాళివర్గోఘశూన్యామ్.

"కాంచీగుణేన కలకింకిణికేన సింధు
కాంచీ సుతా కటితటీ గ్రథితా కయాచిత్,
పంచాస్త్రకార్ముకగుణ ప్రవరేణ రామ
వంచాననన్య విజయోద్యమశాలి సేవ"

అటుతరువాత సీతారాముల కల్యాణం వర్ణింపబడింది. ఆ కల్యాణానికి నానాదేశాల ప్రజలూ పాలకులూ వస్తారు. అందులో పాల్వంచ జమీందారులైన అశ్వారావుల వర్ణనం ప్రత్యేకంగా సాగింది. కనుకనే ఈ కవి అశ్వారావుల ఆస్థానియై ఉంటాడని ఊహిస్తున్నాను.

"శ్రీమద్భిర్వసుభిస్సదా సుమనసా మానందసంధాయకో
ధున్వన్ పంకజసంగమం ప్రతిదినం ఛేత్తారివర్గశ్రియామ్,
నిత్యం సత్పథసంచరః కువలయోల్లాసాధివాసోదయ
(స్సో సా)వశ్వమహీశ్వరో విజయతే వశ్వాయ భానుర్యథా."

"అశ్వినేయోజ్జ్వలో హ్యశ్వరాయ ప్రభు
శ్శాశ్వతీం సంపదం విశ్వతః పృష్టతః,
అశ్వవాప్తుం తదా విశ్వసన్ భూసుతా
ధీశ్వరం చామరం శశ్వదా ధూనతే."

"శ్వేతం ఛత్రం త్వశ్వభూపానుజేన
స్పీతం దధ్రే రాఘవస్యోపరిష్టాత్,
భూతం రాకా రాజబింబేన ముక్తా
స్యూతం తారారాజి సంవేష్టితేన"

సీతారాములు తలంబ్రాలు పోసుకొనే ఘట్టం ఇది:

"సువర్ణశోభనాక్షతానిమౌ నఖేల మక్షతా
కరాంబుజద్వయేన తౌ సదాశ్రితావనోన్నతౌ,
వధూవరౌ ప్రవర్షత స్తదాముదా సమర్షత:
వరస్సరస్య మూర్ధని ప్రసూనగంధవర్షిణీ"

"ముక్తా విదేహతనయాంజలి శుక్తికాంత
ర్ముక్తా రఘుక్షితివరస్య సరుత్తమాంగే,
నక్తాన్సమస్త తనుషు ప్రబభుర్వికాసో
ద్యుక్తా: ప్రసూననికరా ఇవ పారిజాతే"

అటుతరువాత రథోత్సవాదులు కూడ విపులంగా వర్ణింపబడినవి. రాత్రి కాగానే సీతారామలక్ష్మణులు ఆలయప్రవేశం చేస్తారు.

"దక్షిణ: పరమపాయ శిక్షణే
లక్ష్మణశ్చ నృపలక్షణాన్విత
పక్షివాహనవతో వ్యదక్షిణం
నక్షమావ్య ముదితో రరక్ష న:"

తెల్లవారి లేచి మళ్ళా ఆ యిద్దరు పురావలోకనానికి వెళ్తారు. ఆ భద్రపురి వర్ణనం యిది.

"విచిత్ర రమ్యోచ్చ పతాకమాలినీం
సుధావిధౌతోన్నత సౌధశాలినీం,
దృశాం ముదం భద్రపురీం విధాయినీం
దదర్శ తాం (సౌర) పురాతిశాయినీం"

సీతారాముల రథోత్సవాన్ని చూడవచ్చిన పల్లిజనం వర్ణనమిది.

"అంతశ్చంచలపీవర స్తనయుగం శ్యానాభిబద్ధోల్లల
త్కూర్పాసా హృది సంధితాంజలిపుటా స్సిపాదిభూషావహా:,

స్కంధారూఢశిశుప్రజాః పశుసమా గ్రామ్యోచ్చ భాషాజుష
స్సేవంతే విధు మాదరాత్పరమిమా పల్లీవధూటీజనాః"

రథోత్సవవర్ణనంలో కొన్నిచోట్ల ఉపయుక్తమైన వివిధవృత్తాలపేర్లు కూడా పేర్కొన్నాడు కవి.

"సోయం రాఘవనందనోఖిలజనా నానందయన్ స్యందనే
భక్తైర్భాగవతైర్నిషేవితతనుః క్ష్మాజానుజాభ్యాం యుతః,
అస్తే నిస్తుల మాత్నరత్న రుచిర శ్రీమాలికాం దోలికాం
యశ్చక్రే సమరే పురాసురమృగాన్ శార్దూల విక్రీడితం."

"అనుపమమణిభూషణాంచితా భా
స్మనుకులనాథవధూరథోపరిస్థా,
దనుజరిపునుతాసు తాపకృచ్ఛ
స్తనుతరకల్పలతేవ పుష్పితాగ్రా.

ఈ విధంగా ఐదు దినాలు జరిగే సీతారాముల కల్యాణోత్సవాలు కవి విపులంగా వర్ణించినాడు.

నేనుమాత్రం ఇంతవరకూ ఆ భద్రాచల సీతారాముల కల్యాణోత్సవాలు చూడలేదు. అవి ఇప్పటికీ ఇట్లాగే జరుగుతున్నాయో లేదో తెలువదు. ఈ రామాచార్యుల భద్రగిరి చమ్పూప్రబంధం చదివి భద్రాచలంలో జరిగే ఉత్స వాలను మనోదర్పణంలో దర్శిస్తున్నాను. ఆ రామచంద్రమూర్తి తలుచుకుంటే ఈ రామాచార్యుల కావ్యం వెలుగులోనికి రాదా? అక్కడికి పోలేని నావంటి వారు నురికొందరైనా దీన్ని చదివి ఆనందిస్తారు కదా।

(ఆంధ్రజనత 19-4-1967)

# 'బాలసరస్వతి' తిరుమలబుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు

శ్రీశైలపూర్ణు లాదిగా తిరుమలబుక్కపట్టణం వారి వంశము కవనవైభవమునకును, పాండిత్యప్రకర్షకును, పేరెన్నికగన్నది. ఈ వంశమువారి ముద్రితాముద్రితగ్రంథములు బండ్ల కెత్తవచ్చును. వీరి వంశవృక్ష మీవిధముగా నున్నది.






పైవంశవృక్షమున కట్టకడపట పేర్కొనబడిన బాలసరస్వతి శ్రీనివాసాచార్యులవారి సాహిత్యసమీక్షయే ప్రకృతము నా యుద్దేశము. తిరుమలబుక్కపట్టణంవారి తొలినివాసము కడపమండలమందలి బుక్కపట్టణము. రెండవ శ్రీనివాసతాతాచార్యుల ద్వితీయపుత్రులైన మూడవ అణ్ణయాచార్యులవారును, తృతీయపుత్రులైన శ్రీనివాసాచార్యులవారును సురపురము సంస్థానాధీశ్వరులైన సామినాయకుని [1752–1778] ఆహ్వానమును పురస్కరించుకొని రాజగురువులై సురపురమున స్థిరపడిరి.[1] ఆ యిరువురు సోదరుల చరిత్ర ముక యద్భుతగ్రంథము. వారి రచనములు పరశ్శతములు.[2] ఈ అణ్ణయాచార్యులవారి కుమారులు, వారి సోదరులైన శ్రీనివాసాచార్యులవారి శిష్యులు నైన కిరీటి

1. Surapuram Chiefs & Sanskrit Writers : Prof V. Raghavan, Journal of the Andhra Historical Research Society, Vol. XIII April 1941.

2 గోలకొండ కవుల సంచిక. పుట 394.

వెంకటాచార్యులవారి సాహిత్య జీవితము మరియును అద్భుతావహము. శ్రీనాథకవి సార్వభౌముని సాహిత్య క్షేత్రయాత్రలట్లు కిరీటి వెంకటాచార్యులవారి సాహిత్య క్షేత్రయాత్రలు కవిపండితులకు గగుర్పాటు కలిగించునవి.[8] కిరీటి వెంకటాచార్యులవారి చిన్నాయనగారైన శ్రీనివాసాచార్యులవారు నిగమాంతదేశికుల యపరావతార మందురు. వారి మనుమని మనిమనుమలే బాలసరస్వతి, తర్కతీర్థ, ఘంటాశతశ్లోకకవి బిరుద విభ్రాజి శ్రీనివాసాచార్యులవారు [1862—1920]. వీరు శేషమాంబా బుచ్చివెంకటాచార్యులను పుణ్యదంపతులకు పాలమూరు మండలమందలి ఆత్మకూరు సంస్థానమున జన్మించిరి. సురపురమున స్థిరపడిననాటి నుండియు ఈ వంశమువారికి గద్వాల, వనపర్తి ఆత్మకూరు, జటప్రోలు సంస్థానములు విహారభూములైనవి. ఆటుతరువాత క్రమముగా వీరిలో కొందరు ఆత్మకూరు సంస్థానమున స్థిరపడిరి.

పూవు పుట్టగనే పరిమళించునట్లు శైశవమునుండియే శ్రీనివాసాచార్యుల ప్రతిభావిలాసములు గుబాళించినవి.

ఏకాదశవర్షప్రాయము వరకే శ్రీనివాసాచార్యులు తమతండ్రిగారికడ సాహిత్యము, అలంకారగ్రంథములు ముగించిరి. అనాటికే సంస్కృతాంధ్రములందు కవిత్వ మల్లుట ప్రారంభించిరి. పదునారవయేట తర్కశాస్త్ర మభ్యసించుటకై మైసూరుకు పోయిరి. మైసూరు ఆస్థానకవిపండితులకీ బాలకవి ప్రతిభ యబ్బుర మనిపించినది. మైసూరు మహారాజులైన చామరాజేంద్రులు శ్రీనివాసాచార్యులకు 'బాల సరస్వతి' బిరుద మిచ్చి సత్కరించిరి. పరకాల మఠాధీశ్వరులును రాజగురువులును నైన శ్రీరంగనాథబ్రహ్మతంత్ర పరకాల స్వామివారికడ శ్రీనివాసాచార్యులవారు తర్కవేదాంతము లభ్యసించిరి. సజ్జయం తాతాచార్యులవారికడ వివిధప్రాకృతములు నేర్చిరి. చామరాజేంద్రులవారితని ప్రతిభాపాండిత్యముల కలరి కాశీ నవద్వీపములందున్నతవిద్య గడించుటకై యుపకారవేతన మిచ్చిరి. శ్రీనివాసాచార్యులవారు కాశిలో అద్వైత వేదాంతమును స్వామిశాస్త్రిగారి యొద్దను, న్యాయశాస్త్రకోడమును, జాగదీశిని కైలాసచంద్రశిరోమణి భట్టాచార్యులవారియొద్దను చదివిరి. ఆటుతరువాత నవద్వీపమునకు పోయి మీమాంసా శాస్త్రము నాపోశనము పట్టిరి. నవద్వీపపండితమండలివా రాయనకు 1884 లో 'తర్కతీర్థ' బిరుద మిచ్చిరి. ఈ విధముగా

---

8. శారదామంజీరము, పుట 87, సికింద్రాబాదు. 1971.

సమస్తశాస్త్రములు నేర్చి, కవిత్వపటుత్వమునను శాస్త్రసిద్ధాంతరాద్ధాంతములందును తమకు సాటివారు లేరనిపించుకొని తనుమాతృదేశమునకు బయలుదేరిన శ్రీనివాసాచార్యులవారు మార్గమున దగిలిన ఉత్తరాది సంస్థానములు చూచి యచటి పండితులతో వాదములందు గెలిచి సమస్తభారత సాహిత్య జైత్రయాత్ర చేసిరి. దర్భంగా, జోధ్‌పూర్, బుంబీరత్రియా, గ్వాలియర్, కోటాంజరీ, ఇందూరు, ధారానగర్, జమ్మూకాశ్మీరభూపతులు లా సరస్వతీ యపరావతారమునకు వెలలేని కానుక లిచ్చి తమ పేరోలగములందు నమ్రశిరస్కులై యభినందించి యభిమానించిరి.

శ్రీనివాసాచార్యులవారు గంటకు నూరుశ్లోకము లవలీలగా చెప్పెడువారు. అందుకే వారికి 'ఘంటా శతశ్లోకకవి'యను సార్థకమైన బిరుదము లభించినది. వారి యవధానములు సమకాలికపండితులను, విద్యావేత్తలను, ఉన్నతాధికారులను, సంస్థానాధీశ్వరులను ఆశ్చర్యసాగరమున నోలలాడించినవి. వారు బళ్ళారి, కడప, పెనుగొండ, తాడిపత్రి, మద్రాసు,[4] బనగానపల్లి మొదలైన చోట్ల అనేకావధానము లొనర్చి కీర్తితో పాటు ధనకనకవస్తువాహనములు పుష్కలముగా సంపాదించుకొనిరి. ఈ విధముగా శ్రీనివాసాచార్యులవారు దేశమంతయు తిరిగి తమసాహిత్య జైత్రయాత్రలు ముగించుకొని జన్మస్థలమైన ఆత్మకూరులో స్థిరముగా నుండిపోయిరి. ఆత్మకూరు సంస్థానాధీశ్వరులు ఆచార్యులవారిని తన ఆస్థానమందు ప్రధానవిద్వాంసులుగా నుంచుకొని అనేకాగ్రహారము లిచ్చిరి. శ్రీనివాసాచార్యులవారు కవిపండితులుగా తాము సన్మానము నందుటతో తృప్తిపడలేదు. బ్రహ్మామృతవర్షిణి యను నొకసంస్థను నెలకొల్పి ప్రతివత్సరము వేదపండితుల నాహ్వానించి తను సొంతధనముతో సన్మానించుచుండిరి.

ఒకప్పుడు తిరుపతివేంకటకవులు ఆత్మకూరు సంస్థానమునకు పోయి తదాస్థానవిద్వాంసులును ధర్మాధికారులు నైన శ్రీనివాసాచార్యులతో తలపడి శాస్త్రవాదమున నోడిపోయిరి. తిరుపతి వేంకటకవులు తెలుగులో గొప్పకవులే యైనను సంస్కృతమున నాశుకవిత్వము చెప్పుటయందును, సమస్త శాస్త్రవైదుష్యమునను శ్రీనివాసాచార్యులవారే మిన్నలు. ఆ వాస్తవ మెరుగనివారు

4. 31-3-1903 నాటి "రాజహంస" పత్రికలోను, 6-4-1903 నాటి 'మద్రాస్‌మేల్' పత్రికలోను ఈయవధాన కార్యక్రమము విపులముగా ప్రకటితమైనది.

కొందరు ఇటీవల పత్రికలందును గ్రంథములందును శ్రీనివాసాచార్యులవారే పరాభూతులైనట్లు వ్రాయుట సత్యదూరము. నాటి విశేషము లెరిగినవారు కొందరిప్పటికిని తెలంగాణమున గలరు. బాలసరస్వతుల మనుమలు శ్రీమాన్ కవితార్కికసింహాచార్యులవారివలనను, తిరుపతి వేంకటకవులకు గద్వాలలో నాతిథ్యమొసగిన మహాపండితులు శ్రీగుండేరావుహర్కారేగారివలనను జిజ్ఞాసువులైనవారు సత్యమారయవచ్చును.

బాలసరస్వతి శ్రీనివాసాచార్యులవారి ముద్రితాముద్రితగ్రంథములు పెక్కులున్నవి. 1. నంజరాజచంపూః, 2. దుర్మదనిర్మథనమ్, 3. జాంబవతీపరిణయమ్, 4. తత్త్వమార్తాండ ప్రభామండలమ్, 5. రాజశేఖరచరితమ్, 6 సురపుర వేంకటగురు చరితమ్ 7. శతఘంటావధానమ్, 8. శ్రీనివాసవిలాసః 9. వీరశైవశిరస్తాడనమ్, 10. దుర్విగ్రహనిగ్రహమ్, 11. కిరీటి వెంకటాచార్య విజయవైజయన్తీ, 12. రాజవంశరత్నావళీ, 13. లక్ష్మీసరస్వతీదండకమ్, 14 విష్ణుస్తుతివ్యాఖ్యా, 15. రహస్యత్రయసారార్థః, 16. గంగాస్తుతిః, 17. ఆంగ్లేయ జర్మనీ యుద్ధవివరణమ్, 18. ప్రపత్తిపదవీ, 19. హయగ్రీవపంచాశత్, 20. నరకేసరిస్తుతిః, 21. దశావతారస్తోత్రమ్, 22. విజయదశమీనిర్ణయః మొదలైనవి వారి సంస్కృతరచనములు.

పై కృతులలో నేడపడైన శతఘంటావధానమ్ అనునది శ్రీనివాసాచార్యులవారు కడప, ప్రొద్దుటూరు, బళ్ళారి, మద్రాసు నగరములందవధానములు చేసినప్పుడు చెప్పిన శ్లోకములు గల చిన్న సంకలనము. దీనిని సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యులు పండిత డి. గోపాలాచార్యులుగారు ప్రకటించిరి.[5] అవధానపద్యములతోపాటు ఏడవ ఎడ్వర్డు పట్టాభిషేక సందర్భమున చెప్పిన 23 శ్లోకములును, భవానీసంగమేశ్వరస్తుతియు దీనిలో నున్నవి. శ్రీనివాసాచార్యులవారు విశిష్టాద్వైతులైనను, శైవభక్తులు కొందరు శివునిపై స్తోత్రరూపమైన శ్లోకములు చెప్పవలసినదిగా కోరినపుడు వా రీభవానీసంగమేశ్వరస్తుతిని చెప్పిరి. ఇది వారి సహృదయతకు తార్కాణము. ఈ స్తుతినుండి నుచ్చునకుగా మూడు పద్యములు

'ప్రసవిత్రీమాఖ్యాం వలయితనిశాన్తం కిమపి త
త్ప్రశాన్తం జ్యోతిర్నః ప్రథయతు శశాంకార్ధముకుటమ్,

5. ఆనందముద్రణాలయము. మద్రాసు. 1903.

నిదానం లోకానాం నిరవధిచిదానందలహరీం
దధానం భక్తానాం శమథనహృదానందనచణమ్.'

'సురాసురశిరస్తటీమకుటచుమ్బిపాదామ్బుజం
చరాచరకుటుమ్బినం శమథనాశయాలమ్బనమ్,
ధరాధరకుమారికా స్మరవిలాసలోలాశయం
జనాస్తుహినభాస్వరం భజత సంగమాధీశ్వరమ్.'

'అరాళచలకున్తలం పరమరాశయనాఞ్చితం
ప్రవాళమృదులాధరం సితకరాభికాస్యప్రభమ్,
స్మరామి పురవైరిణః కమపి నిత్యనేత్రోత్సవమ్.'

మద్రాసు అవధానసందర్భమున శ్రీనివాసాచార్యులవారు వివిధప్రాకృతములలో నాశువుగా చెప్పిన పద్యములును ఇందులో కలవు. ఇంతకుపూర్వము పేర్కొన్న వారిరచనములందు 19, 20 సంఖ్యలు గల హయగ్రీవపంచాశత్, నరకేసరిస్తుతిః అనునవికూడ ప్రాకృతమున రచించినవే.

శ్రీనివాసాచార్యులవారి రచనములందు పదునొకండవదిగా పేర్కొన్న "కిరీటి వెంకటాచార్య విజయవైజయన్తీ" నాటక మముద్రితము. దీనిప్రతి యొకటి నాచెంత నున్నది. ఇది యెనిమిదంకముల నాటకము. దీనిలో మూడవ అణ్ణయాచార్యులవారి కుమారులును, సురపుర సంస్థానధీశ్వరులైన వెంకటప్ప నాయకుని [1773-1802] యాస్థానకవులు రాజగురువులునైన కిరీటి వెంకటాచార్యులవారి సాహిత్యజీవితము చిత్రితమైనది. దానితోపాటు గద్వాల, ఔకు, సురపురము, పూనా సంస్థాన వైభవములును సమకాలీన విద్యావైదుష్యముల చరిత్రములును చిత్రితములైనవి. దీనిని తిరుమల శ్రీనివాసుని బ్రహ్మోత్సవ సందర్భమున ప్రయోగించుటకై శ్రీనివాసాచార్యులవారు వ్రాసినట్లు ప్రస్తావనలో నున్నది.

ప్రారంభమందలి నాందీపద్య మీవిధముగా కలదు :

"కారుణ్యేన కిరీటినే ప్రవితరన్నధ్యాత్మవిద్యామృతం
ద్వారానేన విరోధినో విదళయన్ శాస్త్రేషు సాధీయసా,
తస్మై తస్య యశశ్శశాంకధవళం తన్వన్ ధరామండలే
శ్రీమాన్ శ్రీనిధి రచ్యుతః ప్రదిశతు శ్రేయాంసి భూయాంసి నః".

సూత్రధారుడు నాటకకర్తను తత్కృతిని ఈవిధముగా పరిచయ మొనర్చినాడు:

"ఆసర్వం స్మృత మద్య మారిష సఖే యత్తర్క తీర్థాభిధ
శ్రీమాన్ బాలసరస్వతీ బిరుదభాక్ సంఖ్యావతా మగ్రణీః,
నిశ్శంకం ఘటికాశతం కవయితా నిస్తంద్రకీర్తిచ్ఛట
శ్రీనివాసార్యసుహాకవి ర్విజయతే భూమండలీభూషణమ్."

"యో బ్రహ్మమృతవర్షిణీం నిరుపమాం నిర్మాయ దివ్యాం సభాం
తస్యాం పండితమండలీః ప్రతిసభం దిగ్దేశతో మేలయన్,
తద్వ్యాదానవకర్ణ్య కర్ణమభగాన్ సమ్మానయిత్వాదరాత్
క్షౌశేయైః కలధౌతభాజనచయైః కాశ్మీరజైః రాంకవైః".

"స్వేతచ్ఛత్రచ్ఛాయా చుంబితాంగః ప్రస్మేరాభ్యాం విజితశ్చామరాభ్యామ్,
యోధిష్ఠాయాందోళికాం హేమచిత్రాం దేశే దేశే సంచరత్యంచితశ్రీః."

'యః కిల శఠమర్షణాన్వయ సుధార్ణవపూర్ణిమేందుస్సకలకలావిలాసినీ వివిధవిట్వోకవిలోకనైకలోలుపమానసః, భగవద్రామానుజముని పరమాచార్య భూత శ్రీమన్నాథమునివంశావతంసః, పంక్తిపావనః, స్వయమాచార్యపూరుషశ్చ, ఏతేన కృతమస్తి వేంకటార్యవిజయవైజయన్తీనామకం నాటకం సామాజికోద్దిష్ట సకలగుణవిశిష్టం తేన సర్వాంశ్చేమా ననురంజయిష్యే.'

ఈనాటకమందలి యితివృత్తము సంగ్రహముగా నిట్లుండును :

ప్రథమాంకమున తిరుమల బుక్కపట్టణమువారి వంశావతారము, అణ్ణయాచార్యులు వారిసోదరులు శ్రీనివాసాచార్యులు బుక్కపట్టణమునుండి సురపురమునకు వచ్చి రాజగురువులుగా స్థిరపడుట, శ్రీనివాసాచార్యులవారి శుశ్రూష యొనర్చిన కిరీటి వెంకటాచార్యులు మరియు నితరసహాధ్యాయుల విద్యాభ్యాస విశేషములు, ఆహోబలమఠాధీశ్వరులైన శ్రీనివాసయతీంద్రులు గద్వాలకు వచ్చి శ్రీనివాసాచార్యులవారిని సురపురమున చూడగోరుట, శ్రీనివాసాచార్యులవారి యాకస్మికమరణవార్త విని యతీంద్రులు చింతించి వారి వైదుష్యమును, వారొనర్చిన ఘనకార్యములను కొనియాడుట కలదు.

ద్వితీయాంకమున సురపురమున శ్రీనివాస యతీంద్రులు కిరీటి వెంకటాచార్యుల వైదుష్యమును పరీక్షించుటకై వారితో వాదింతురు. యతీంద్రులవారు విశిష్టాద్వైత పక్షమున, కిరీటి వెంకటాచార్యులవారు అద్వైతపక్షమున వాదించుట యిందలి విచిత్రము.

తృతీయాంకమున నీవాదమే విపులముగా ప్రదర్శితమైనది ఈయిరుపురు పండితులు 15 దినములు వాదించుకొందురు. వాదమున గెలువలేక యతీంద్రులు వెంకటాచార్యుల నోడించుటకై నృసింహు నుపాసింతురు. హయగ్రీవోపాసనముతో వెంకటాచార్యులవారు ప్రతిక్రియ యొనర్తురు. వెంకటాచార్యులవారి పాండిత్యమునకు వాదనైపుణ్యమునకు, కవితాచాతురికి మెచ్చి యతీంద్రులవారు వాదమునుండి విరమించుకొని వెంకటాచార్యులవారికి విజయపత్రిక నొసంగి సన్మానింతురు. ఈయంకమున వెంకటాచార్యుల కవితాచాతుర్యమును ప్రదర్శించు చిన్నచిన్నస్తోత్రములు- దశావతారస్తోత్రము, భావశతకము మొదలైనవి కలవు.

చతుర్థాంకమున సురపురసంస్థానాధీశ్వరులును, వారి రాణియు వెంకటాచార్యులవారిని గూర్చియు వారి పూర్వులను గూర్చియు సంభాషించుకొనుచుందురు. ఇంతలో నొకదూత వచ్చి వెంకటాచార్యులుగా రలుకతో సురపురము విడిచి పోవుచున్నా రని చెప్పును. రాజుగారు వెంటనే వేంకటాచార్యులవారికడకు పోయి విచారించగా సంస్థానోద్యోగుల యనౌచిత్యప్రవర్తనము వారి యలుకకు కారణ మని తెలియును. రాజుగారుద్యోగులను మందలించి ఆచార్యులవారిని ప్రార్థించి మరలించుకొనివచ్చి సన్మానము లొనరింతురు.

పంచమాంకమున కిరీటివెంకటాచార్యులవారు పూనాస్థానవిద్వాంసుల గెలుచుటకై ప్రస్థానింతురు. నానాఫర్నవీస్ మంత్రిగా పేష్వామాధవరావు పాలించు దినము లవి. మాధవరావుపేష్వా మరాఠీభాషలో నడిగిన ప్రశ్నలకు వెంకటాచార్యులవారు ఆమాటలే ప్రయోగించుచు సంస్కృతమున సమాధానము లిచ్చు విచిత్రసన్నివేశ మిందు గలదు.

షష్ఠాంకమున వెంకటాచార్యులవారు పూనా సంస్థాన పండితులతో ద్వైతాద్వైత విషయమున వాదించి విజయు లగుదురు. పూనా ధర్మాధికారులు వెంకటాచార్యులవారు నవద్వీపపండితుల నోడించిన విషయమును గూడ ఇందులోనే ప్రస్తావింతురు. పేష్వా మాధవరావుగారు ఆచార్యులవారికి వేయినూట పదారు లిచ్చి సన్మానము చేయుదురు.

సప్తమాంకముకూడ వెంకటాచార్యులవారి శాస్త్రార్థముల కంకితమైనది. వెంకటాచార్యులవారి నెదిరించలేని పూనాసంస్థాన పండితులు ఈర్ష్యాళువులై ఆచార్యులవారి నోడించుటకు పురుషోత్తమశాస్త్రి యను నొత్తరాహుని రావింతురు. వీరివాదము 17 దినములు సాగినది. ఆచార్యులవారిని వాదమున గెలుచుట

యసంభవమని 17 వనాటిరాత్రి పురుషోత్తమశాస్త్రి ఆచార్యులవారి నంతమొందించుటకు బగళాప్రయోగ మొనర్తురు. కాని హయగ్రీవానుగ్రహమున ఆచార్యులవారాగండము తప్పించుకొందురు. మంత్రప్రయోగ మొనర్చిన పురుషోత్తమశాస్త్రియే బగళాశక్తి కెర యగుదురు. ఆచార్యులవారు విజయు లగుదురు.

అష్టమాంకమున వెంకటాచార్యులవారు తిరుమలకు శ్రీనివాసదర్శనమునకై పోదురు. వారు తిరుమల చేరునప్పటికే కాలాతీత మైనందున అర్చకులు స్వామివారి మందిరద్వారములు మూయుదురు. ఆచార్యులవా రెంత బతిమాలినను అర్చకులు తలుపులు తీయరు. అప్పుడు కుపితులై వెంకటాచార్యులవారు వెంకటేశ్వరస్వామినే యి ట్లుపాలంభింతురు:

"ఐశ్వర్యమదమత్తోఽసి, మాం న జానాసి కేశవ,
పరైః పరిభవే ప్రాప్తే, మదధీనా తవ స్థితిః"

వెంటనే ద్వారములు తెర్చుకొనును. అచ్చటి పూజారులు పండితులు ఆశ్చర్యపడి ఆచార్యులవారిని బతిమాలి సన్మానింతురు. తిరుమల తిరుపతి ధర్మాధికారియైన మహంతు హత్తీరాంబాబా వెంకటాచార్యులవారి గురువులును పితృవ్యులును నగు శ్రీనివాసదేశికుల మహత్త్వము స్వయముగా నెరిగినవా రగుట ఆచార్యులవారిని సత్కరించి ఘనముగా సన్మానింతురు. దీనితో నాటకకథ ముగియును చిట్టచివరన భరతవాక్య మిట్లున్నది.

"నిర్దోషనిత్యమధురాణి నిరామయాని
శాస్త్రాణి నిత్యసుభగాని జయంతు లోకే,
నిత్యాదృతా నృపతిభి స్సదృశాం సభా శ్చ
వాక్సౌరభీ చ సుభగా సతతం కవీనామ్."

నేను కూడ నిర్దోషనిత్యమధురములు నిరామయములు నిత్యసుభగములు నైన శాస్త్రములు జయించుగాక అనియే కోరుచున్నాను కీర్తిశేషులగురించిన సత్యాసత్యములు తెలియక, తెలిసికొన ప్రయత్నించక సాహసోక్తులకు ఆధునికులు పూనుకొనరాదని సప్రశ్రయముగా కోరుచు ఈ విజయవై జయంతికానాటకము ప్రభుత్వమువారో ప్రజాసంస్థలవారో ప్రకటింపవలెనని వేడుచున్నాను.

(అక్షరార్చన, 1972)

# ఆలూరి సూర్యనారాయణ వాజపేయయాజి

తెలుగువారికి ఆశుచిత్రకవిత్వాల మీద అభిమానం కొంచెం ఎక్కువ. ప్రాచీనకాలంనుండి ఈనాటివరకు మన తెలుగు కవులు ఇటువంటి క్రతువులు చేస్తునే ఉన్నారు. దీనికి కారణం మన సాహిత్యం చాలావరకు రాజాశ్రితం కావటమే అనుకుంటాను. రాజులకూ మంత్రులకూ వారి నాశ్రయించుకొన్న మంత్రిదండనాథులకూ సాహిత్యవినోదం కల్పించటానికి మన పూర్వకవుల్లో కొందరు ఈ ప్రక్రియలను బాగా సాధన చేసిఉంటారు. వీళ్ళ సాధనలు కేవలం తెలుగు కవిత్వానికే పరిమితం కాలేదు. సంస్కృతరచనలు చేసిన తెలుగువాళ్ళు కూడా తమ పాండితీప్రతిభలకు తార్కాణంగా ఈ వినోదాలు ప్రదర్శించినవారున్నారు. అటువంటివారిలో ఏకదినప్రబంధకర్త ఆలూరి సూర్యనారాయణ వాజపేయయాజి ఒకడు

రెండవ వెంకటపతిరాయలు విజయనగరసామ్రాజ్యం పాలిస్తున్న (1586-1614) కాలంలో రాయవేలూరును లింగమనాయకుడనే సామంతుడు ఏలుతుండేవాడు. అతని తండ్రి చినబొమ్మనృపాలుడు (1549-1579) కవి పండితపోషకుడేకాక స్వయంగా గొప్ప గాయకుడు కవి. జయదేవుని గీత గోవిందం వలె అతడు రామాయణం ఆరుకాండలు వివిధరాగతాళాలతో గేయాలు, మధ్యమధ్యన శ్లోకాలు కూర్చి సంగీతరాఘవమనే కృతిని సంతరించినాడు. అప్పయదీక్షితులవారిని చాలాకాలం పోషించినాడు. చినబొమ్మనాయకుని కొడుకు లింగయనాయకుడు కూడా మేటి పరాక్రమశాలి; కవిపండితులపాలిటి కల్పతరువు. శిథిలమైపోయిన విజయనగరసామ్రాజ్యాన్ని మళ్ళా ఒక కొలికికి తెచ్చిన ప్రతాపశాలి రెండవ వెంకటపతిరాయలు. అంతటి రాయలనే ఎదిరించి యుద్ధమిచ్చినవాడు లింగమనాయకుడు. వేలూరుకోట

విజయనగర సైన్యాలకు కొరుకుడు పడకపోతే, దామెర్ల కరిచెన్ననాయకుడనే విజయనగరసామంత సైనికాధికారి మోసం చేసి ఆ కోటను పట్టుకుంటాడు. అంతటితో ఈ నాయకుల పాలనం వేలూరులో అంతరించిపోతుంది.

లింగయనాయకుని ఆస్థానంలో కవులు పండితులు గాయకులు నర్తకులు అప్పుడప్పుడు విద్యాగోష్ఠులు జరిపేవారు. అట్టివారిలో ఆలూరి సూర్యనారాయణయజ్వ కొలికిపూస. ఒకనాటి విద్యాగోష్ఠిలో మాటమీద మాట వచ్చి కవిపండితులు పంతాలాడుకుంటారు. ప్రభువు సమక్షంలో ఆస్థానసభ్యు లిచ్చిన ఇతివృత్తం స్వీకరించి సూర్యనారాయణయజ్వ ఒక్కనాడే ఒక ప్రబంధం సంస్కృతంలో వ్రాస్తానని శపథం చేస్తాడు. చేసిన శపథం మేరకు ఆశువుగా సన్నూటముప్పై శ్లోకాలతో నాలుగుసర్గల కావ్యం ఏకధాటిగా చెప్పుతాడు. ఈ కావ్యంలోని ఇతివృత్తం అర్జునుడు ద్రౌపదీవిషయమైన సమయం భంగం చేసినందుకు తీర్థయాత్రలకై పోయి ఉలూచీచిత్రాంగదాసుభద్రలను వివాహం చేసుకొని రావటం. కవి మాత్రం దీనికి ఏకదినప్రబంధమని పేరు పెట్టుకున్నాడు. ఇది అముద్రితం.

ఆలూరివారి కుటుంబం వైదికకర్మలకూ పాండిత్యానికీ కాణాచి. సూర్యనారాయణ వాజపేయం చేసినవాడు. అతని తలిదండ్రులు జ్ఞానాంబాయజ్ఞేశ్వర సుహాగ్నిచిత్తులు. ఆ మహాగ్నిచిత్తు మహోపాధ్యాయబిరుదాంచితుడు కూడా. ఈ విషయాలన్నీ కవి తన అశ్వాసాంతపద్యాల్లోను గద్యల్లోను చెప్పుకున్నాడు.

ప్రథమసర్గలో ఇంద్రప్రస్థవర్ణనం, ధర్మరాజు కీర్తిప్రాభవాలూ, పరిపాలనం, అర్జునుడు సమయభంగం చేసినందుకు తీర్థయాత్రలకై బయలుదేరటం, గంగనుండి పాతాళానికి పోవటం, ఉలూచివలన బభ్రువాహనుడు జన్మించటం, అక్కడినుండి కావేరీతీరం రావటం, పాండ్యదేశవర్ణనం, పాండ్యరాజు కూతురు చిత్రాంగదతో ప్రణయం, పంచహ్రద సేవనం, ద్వారకాగమనం ఉన్నవి.

రెండవసర్గలో అర్జునుడు సుభద్రమీది కాంక్షతో ద్వారకబయట ఒక వటవృక్షం క్రింద ఉండి శ్రీకృష్ణుని స్మరించటం, సత్యభామాకేళీలోలుడైన కృష్ణుడు విజయుని స్మరణం గ్రహించి మందహాసం చేయటం, సత్యభామ అనుమానపడి నవ్వుకు కారణం అడగటం, కృష్ణుడు యథార్థం చెప్పటం, కృష్ణుడు అర్జునుని దగ్గరకిపోయి సుభద్రాపరిణయానికై ఒక పన్నాగం

చెప్పటం, అర్జునుడు కుహనాపరివ్రాజకుడుగా రైవతకాద్రిచెంత ఉండటం, వసంతావిర్భావం, అర్జునుని విరహం, బలరామకృష్ణులు రైవతకాద్రికి పోవటం, కుహనాయతి దర్శనం, చాతుర్మాస్యాలకు ఆ పరివ్రాజకుని తమ అంతఃపురానికి ఆహ్వానించటం, అంతఃపురోద్యానంలో ఉంచి సుభద్రను పరిచర్యలకై నియోగించటం, వారి వర్ణనలు, అర్జునుని విరహం, సుభద్రకు విజయునిమీది ప్రేమ, పరివ్రాజకుడు సుభద్రకు సాముద్రికం చెప్పటం, ఆమె కోరికపై అర్జునుని రూపపరాక్రమాలు వర్ణించటం ఉన్నవి.

మూడవసర్గలో సుభద్ర చెలికత్తె కుహనాయతికి సుభద్ర విరహం వర్ణించి చెప్పుతుంది. యతి సుభద్రతో అర్జునుడు ఆమెకోసం పడే విరహం వర్ణించి చెప్పుతాడు. సుభద్ర అతనివద్ద సెలవు తీసుకొని సౌధానికి పోతుంది. వర్షావర్ణనం, వర్షామేఘాలవలన ఆమె విరహం మరింత వృద్ధికావటం, కుహనాయతి పట్టలేక సుభద్రతో తన గుట్టు చెప్పుకోవటం, వాళ్ళ రహఃక్రీడలు వర్ణింపబడినవి.

నాల్గవసర్గలో మాయాపరివ్రాజకుడు మన్మథమంత్రం జపిస్తుంటాడు బలరామకృష్ణులాతనికి నమస్కరించి సెలవు తీసుకొని సముద్రద్వీపంలో జరిగే శివుని ఉత్సవాలకు పోతారు. సముద్రవర్ణనం, జలక్రీడలు, శివపూజలు జరుగుతవి. కృష్ణుడు బలరామునికి తెలియకుండా ద్వారక చేరుకుని సుభద్రార్జునుల పెండ్లిప్రయత్నం చేస్తాడు. ఇంద్రుడు, శచీదేవి, బృహస్పతి వచ్చి పెండ్లి జరిపిస్తారు. బలరాముడిది తెలిసి కోపానికి వస్తే కృష్ణుడు శాంతింపజేస్తాడు. సుభద్రార్జునులు ఇంద్రప్రస్థానికి బయలుదేరుతారు. సాయంకాలవర్ణనం, చంద్రోదయ వర్ణనం, మార్గమధ్యంలో మాత్నవధూవరుల విశ్రాంతి, శృంగారం, ప్రభాతం, మరల ప్రయాణం, ఇంద్రప్రస్థం చేరుకోవటం, ద్రౌపది సుభద్రను ఆశీర్వదించటం, ధర్మరాజు శ్రీకృష్ణాది యాదవులను రావించి సుభద్రార్జునుల వివాహోత్సవం చేయటం, వధూవరుల ఊరేగింపు పౌరకాంతలుచూడటం, అందరూ తిరిగి రాచనగరు చేరుకోవటంతో ఈ కావ్యం ముగుస్తుంది. ఈ కావ్యంలో ఉలూచీచిత్రాంగదాసుభద్రలు ముగ్గురి ప్రణయవృత్తాంతం ఉన్నా, సుభద్రార్జునుల ప్రణయానికే ఇందులో ప్రాధాన్యం ఎక్కువ. ఇంత అళువుగా కూర్చిన కావ్యమైనా సాహిత్యసంపదకు సరసభావాలకు అలంకారాలకు వర్ణనలకూ ఇందులో లోటు లేదు,

ఈ క్రిందిప్రార్థనతో ఏకదినప్రబంధం ప్రారంభమౌతుంది.

స్ఫురతు మే గురురంఘ్రినఖప్రభాదళితసంతమసే హృదయాంతరే,
అధి కథా కరకంకణకుండలీ క్వణితశంకితశంకరసంస్తుతః.

భవతు భూపసభా విదుషాం పురః విదధతః కృతిమేకదినే మమ,
కుశలదాయి శివే తవ వీక్షణం కుశలమున్మిషితేన జగత్కృతౌ.

ఆటుతరువాత ఈక్రింది ఇంద్రప్రస్థవర్ణనతో కథ ప్రారంభిస్తాడు.

కురుకులోద్భవరాజయశస్సుధా రసవిలిప్త మహీమయదర్పణే,
సురపురప్రతిబింబవిలోలితం విజయతే పురమింద్రపదాంకితమ్. I-8

ధర్మరాజు పరాక్రమప్రాభవాలు వర్ణించే ఈ పద్యం ఎంత సొగసుగా
న్నదో గమనించండి.

పుమభిలాషఫలై ర్ధృతమూ ర్తిభిశ్చతసృణాం చ దిశాం విజయైరివ,
స హి చతుర్భిరశోభి సహోదరైర్హరిరివోచ్చభుజైరతిదుస్సహైః. I-8.

పుమభిలాషపదంతో చతుర్విధపురుషార్థాలను చెప్పటమేకాక నలుగురు
తమ్ములతోడి యుధిష్ఠిరుణ్ణి చతుర్భుజుడైన హరితో పోల్చటం గొప్పగా
ఉన్నది.

పాండ్యరాజు కూతురు చిత్రాంగదను వర్ణించే శ్లోకాల్లో ఒకటి.

ముఖరుచిప్రవల్లహరీ స్తనక్షితిధరప్రతిఘాతవివర్తితా,
ఝుతయుగీ పరితస్ఫురతి ధ్రువం భుజయుగీతి భుజంగశిశుభ్రువః. I-62

ఇది అల్లసానివారి భ్రుకుటీభుజంగయుగళీ అనే మాటను జ్ఞాపకం
చేస్తుంది. ఆ చిత్రాంగదను చూచినప్పటి విజయుని వర్ణించేది ఈక్రింది శ్లోకం.
దీనిలోని అలంకారౌచిత్యం రమణీయం.

ధృతినిధేరపి వీక్ష్య నృపాత్మజాం విలులితం హృదయం విజయస్య తాం
అపి శిలోత్తమమిందుమణిం కళా ద్రవయతే నవనీతవదైందవీ. I-98

అర్జునుడు రైవతకాద్రిచెంత ఉన్నప్పుడు వసంతం వస్తుంది. అంతట
కింశుకాలు సహకారాలు పూసినవి. విరహంతో బాధపడేవారికి ఇవి ఇంకా
అపకారం చేస్తవి. వాటి పేర్లను కవి ఏ విధంగా చమత్కరించినాడో గమ
నించండి.

వియోగిహృద్రక్తనిపీత శేషతేశారుణాస్యే కిల కీరసంఘే,
చంచ్వాగుణాత్కింశుకనామయోగ్యేతేఖ్రమేణాజనికింశుకాఖ్యా II-37

స్మరద్రవత్వాపైరివ పల్లవౌఘైరంగారసంపూతనఖై రవాపుః,
పాంథాన్ వినిర్భర్త్య సహస్మరేణ చూతా యథార్థం సహకారనామ. II-38

ఈ వసంతాగమంతో విజయునికి సుభద్రావిరహం భరింపరాని దౌతుంది. అవట్టువ వసంతోపాలంభనం చేసే ఈక్రింది శ్లోకం పండితరాజు "జాత్యా విహీనో న వివేకుమీష్టే" అనే మాటలను తలంపుకు తెస్తుంది. మీదుమిక్కిలి శ్లేషరామణీయకం కూడ దొడ్డది.

స్వకామభాక్మాధవబద్ధసఖ్యః నుప్యర్జునం హంతి ముహుర్వసంతః,
పలాశవర్గస్య వికాశహేతోః క్వ జాతిహీనస్య భవేద్వివేకః. II-47

సుభద్రవిరహావస్థను ఆమె చెలికత్తె కుహనాయతికి దీర్ఘంగా వర్ణించి చెప్పుతుంది. ఇంత అళువుగా చెప్పిన కావ్యంలో పదాలపొందిక, నాదసౌందర్యం, అలంకారౌచిత్యం ఎట్లాపాటించినారో గమనించండి.

స్పందనమానతరుబృందమంజరీ స్యందమానమకరందబిందుభిః,
దందశూకగరశైరివావృతం మందవాతమసకృద్భజత్యసౌ. III-13

కంఠసీమని కరోత్యసౌ ముహుర్నీలనీరజనబద్ధమాలికాం,
విభ్రమద్భ్రమరకైతవక్షరత్ క్ష్వేళబిందుమివ కాళలోగినీమ్. III-14

చిత్తభూశరగదున్మరున్నిభ శ్వాసవీచిభిరతిప్రకంపితమ్,
సా బిభర్తి రతికామనర్తితం కందుకద్వయమివ స్తనద్వయమ్. III-15

ధ్యానన(మవదనా కుచస్థలే వీక్ష్య బింబితమియం నిజాననం,
హంత హంతుమయమంతికాగతశ్చంద్రమా ఇతి భయేన మూర్ఛతి. III-17

వర్షాకాలవర్ణనం దీర్ఘంగా సాగింది. కవి మనస్సులో ఏ రాజకీయానుభవాలు మెదలినవో కాని ఈ వర్షావర్ణనం గమనించండి.

యత్ర సైకతమభూత్పురా హ్రదః తత్ర యత్ర స చ తత్ర సైకతమ్,
వ్యత్యయం వ్యతనుతైష వారిలో నూతనప్రభురివాధికారిషు. III-54

కుహనాయతి తన రహస్యం సుభద్రతో ఎంత గడుసుగా చెప్పుకుంటాడో చూడండి.

కేవలం హరిరవైతి మాం ప్రియే సత్యయా చ సహ భీష్మకన్యయా,
వేష ఏష బలవిప్రలిప్సయా కల్పితః కమలలోచనేన మే. III-78

ఇక్కడ బలవిప్రలిప్సయా అంటే బలరామవిప్రలంభేచ్ఛయా అని అర్థం. సుభద్రార్జునుల రహఃక్రీడలను వర్ణించే సరసమధురమైన ఈ పద్యం గమనించండి.

దైవత్రైద్విజ నిపీడితా సుధా వాసుదేవసహజాధరే కృతా,
తత్ర చ ద్విజనిపీడితైవ సా కర్మ నశ్యతి న దేశభేదతః. III-92

ఇందులో ద్విజశబ్దంమీద శ్లేష ఉన్నది.

ద్వారకనుండి ఇంద్రప్రస్థానికి బయలుదేరిన సుభద్రార్జునులు మార్గమధ్యంలో ఒక రాత్రి విశ్రమించి తెల్లవారగానే లేస్తారు. అప్పటి సుభద్రా వర్ణనం శ్లోకాలు చూడండి.

వాతాహృతనవాంభోజ సౌరభ్యేన సహార్జునః,
సుభద్రాముఖసౌగంధ్య తారతమ్యం పరీక్షతే. IV-91

లాక్షా లక్ష్మీం దదౌ పాదే కుంతలే కుంకుమశ్రియం,
బాలాతపః సుభద్రాయాః కర్ణే కమలపురాతామ్. IV-92

కావ్యాంతంలో కవి తన తలిదండ్రుల గూర్చి, తనప్రభువు సభలో చేసిన ప్రతిజ్ఞగూర్చి తనకావ్యరచన గురించి ఇట్లా చెప్పుకున్నాడు.

శ్రీ యజ్ఞేశ్వరయజ్వన స్సితకరాదాలూరివంశాంబుధే
ర్జానాంబా సుషువే యమధ్వరివరం శ్రీసూర్యనారాయణం,
తస్య శ్రీమతి లింగయప్రభుసభామధ్యే ప్రతిజ్ఞాకృత
శ్రీమానేకదినప్రబంధసుకృతౌ సర్గశ్చతుర్థోఽజని IV-115

నాడీభిర్ద్వివసస్య నవ్యమచిరాదవ్యాహతోహాస్పదైః
శబ్దార్థైః ప్రభుసభ్యసమ్మతకథావృత్తక్రమై ర్యంత్రితం,
యత్కావ్యం నిరమాయి సంప్రతి మయా తస్మిన్ హఠాత్కారతః
ప్రాప్తం దోషముపేక్ష్య కేవలగుణగ్రాహీ బుధస్తుష్యతు. IV-116

స్వస్యగుణావిష్కరణ ప్రయోజనాత్పగౌరవాదపి వా,
త్రింశద్ఘటికనిబంధన సాహసతో వా సతాం ముదేస్తు మే కావ్యమ్. IV-117

ఈ కావ్యాంత గద్యం ఇట్లా ఉన్నది.

ఇతి శ్రీమహోపాధ్యాయ శ్రీమదాలూరి యజ్ఞేశ్వర మహాగ్నిచిత్పుత్రేణ జ్ఞానాంబా గర్భశుక్తిముక్తామణినా శ్రీ సూర్యనారాయణ వాజపేయయాజినా విరచితాయా మేకదినప్రబంధకృతౌ చతుర్థస్సర్గః.

తెలుగువారి అముద్రితసంస్కృతకృతు లెన్నో ప్రాచ్యపుస్తక భాండాగారాల్లో మూలుగుతున్నవి. వాటికి సూర్యాలోకన మెప్పుడో!

(వివేచన, డిసెంబరు 1977)

# పిల్లలమఱ్ఱి వెంకటపతిసూరి

నావద్ద ఇంకా మిగిలిన తాళపత్రాలు తిరగవేస్తుంటే రాజేశ్వరవిలాస మహాకావ్యానికి సంబంధించిన 12 కమ్మలు కంటపడినవి. ఈ కావ్యం ఎన్ని ప్రకరణముల గ్రంథమో ఎంత గ్రంథమో సరిగా తెలియదు. లభించిన 12 కమ్మల్లో కృతిభర్త రాజేశ్వర భూపాలుని వంశావళీప్రకరణం కొంత, అలంకార ప్రకరణం కొంత, నాయకప్రకరణం కొంత ఉన్నవి. ఈ కమ్మల్లోనే దాదాపు ఇన్నూరు శ్లోకా లున్నవి. మహాకావ్యమనే పేరునుబట్టి ఎవరైనా ఇదొకకావ్యం అనుకోవచ్చు, కాని ఇదొక సాహిత్య.శాస్త్రగ్రంథం. విద్యానాథ కవి ప్రతాపరుద్రచక్రవర్తిపేరుతో వెలయించిన ప్రతాపరుద్రీయంవలె పిల్లలమఱ్ఱి వెంకటపతి సూరి రాజేశ్వరభూపాలుని పేరుతో వెలయించిన సాహిత్య గ్రంథం ఇది.

కృతికర్త కౌశికసగోత్రుడూ, పిల్లలమఱ్ఱి నాగలింగసోమయాజి పుత్రుడూ ఐన వెంకటపతిసూరి. ఈతని నివాసం ఏదో, కాలం ఏదోఇదమిత్థంగా తెలియదు. కృతిభర్త మహాజని నాగాంబాలక్ష్మీనారాయణులనే బ్రాహ్మణదంపతులకు వేములవాడ రాజరాజేశ్వరస్వామి వరప్రసాదంగా పుట్టినవాడు; భాగాపుర నివాసి. కృతిభర్త పూర్వులచరిత్ర చాలాగొప్పది. వీళ్ళది గౌతమగోత్రం. మూలపురుషుడైన కీర్తిమన్నృపాలుడు బదరికాశ్రమంలో లక్ష్మీనారాయణుని సేవించి తత్ప్రసాదంగా సంతానం పొందినవాడు. ఆయన మునిమనుమడు నరసింహభూపతి ఆసాకేతము ఆకాశి పాలించినవాడు. ఈయనకు ఆరవతరం లోనివారైన కాశీనాథ, జగన్నాథ, ఉమానాథులనే సోదరత్రయం సాకేతము పాలిస్తూ నిజామల్కుతో యుద్ధముచేసి గెల్చినవారు. ఉమానాథుని మనుమడు లక్ష్మీనారాయణ ఢిల్లీశ్వరునిచేత బెంగాల్ సుబేదారుగా నియుక్తుడైనాడు. ఈయన మనుమడు చంద్రచూడుడు పంఢరిపురి విఠలేశుని వరప్రసాదంగా విఠల, కృష్ణ, ధోండారాములనే ముగ్గురు కొడుకులను కన్నాడు. వీరికి ఢిల్లీశ్వరుడు మహాజనీ, దేశముఖీ ఇచ్చినాడు. బహుశః ఆనాటినుండి ఈ దేశ

ముఖులకు మహాజని ఇంటిపేరైనది. విఠలుని మునిమమమడు గోపాలరాయుడు మత్స్యపురీ (మచిలీబందరు) పాలకుడు. ఆయనకు ఎనమండుగురు సంతానం. అందులో రెండవవాడైన లక్ష్మినారాయణ స్తంభాద్రి (ఖమ్మంమెట్టు)దేశం జయించినాడు. ఈ లక్ష్మినారాయణకు నాగాంబ, వెంకమాంబ అనే ఇద్దరు బిడ్డలూ, రాజేశ్వరుడనే కొడుకూ పుట్టినారు. ఈ రాజేశ్వరభూపుడు వేములవాడ రాజరాజేశ్వరస్వామి ప్రసాదం. ఈతని పేరులోనే ఈ రాజేశ్వరవిలాస మహాకావ్యం వెలసినది. రాజేశ్వరభూపాలుడు భాగాపుర (భాగ్యనగరం—హైదరాబాదు) నివాసి. ఇతనికి రత్నమ్మ, లలితమ్మ అని ఇద్దరు భార్యలు. ఇతని కాలం కూడ ఇదమిత్థంగా తెలియదు గాని మన రాజధానీనగరం హైదరాబాదుకు భాగాపురమనే పేరున్న నాటివాడు కనుక 16వ శతాబ్దంవాడై యుంటాడని ఊహించవచ్చు. గ్రంథకర్త పిల్లలమఱ్ఱి వెంకటపతిసూరి కూడ ఆతని సమకాలికుడై ఉంటాడు. వంశావళీప్రకరణం ముగింపు ఈ విధంగా ఉన్నది.

"బాలన్యగ్రోధవంశోత్ర (సు విమలపయో) రాశిరాకాశ(శా)ంకః
సంపూర్ణ బ్రహ్మతేజః స్ఫుట ముఖకములోల్లాస విద్యామతందః,
నాగార్యో యస్య సాక్షాత్కృతనగతనయా కాంతమూర్తిః పితాఽఽసీ
దేనం శ్రీవెంకటార్యం ప్రమదయుతు ము(దా) సాదుకారుణ్యవారః.
"ఇతి కౌశికసగోత్ర బాలన్యగ్రోధ కులకలశాబ్ధి సుధా(కర) శ్రీనాలింగ సోమయాజితనూభవ శ్రీవెంకటపతిసూరివిరచితే రాజేశ్వరవిలాసే మహాకావ్యే వంశావళీప్రకరణం నామ ప్రథమోఽంకః."

రచయిత రాజేశ్వరవిలాసమును మహాకావ్యమన్నారు. వంశావళీప్రకరణం ముగింపులో నాటకంలోవలె ప్రథమోఽంకః అన్నారు; మరి రెండు ప్రకరణములను సాహిత్యశాస్త్రగ్రంథంలోవలె నాయక ప్రకరణమని, అలంకారప్రకరణమని పేర్కొన్నారు.

ప్రథమప్రకరణం వివరణ వ్రాయనకాడు—

"భారద్వాజ మునీంద్ర గోత్ర (విమల) క్షీరాబ్ధి రాకాశశీ
శ్రీకృష్ణార్య పితా సురామ విబుధః శ్రీరాజమా(ంబా ప్ర)సూః
శ్రీరాజేశ్వరభూపచంద్ర సువిలా సాఖ్యం ప్రబంధం లిఖన్"

అని చెప్పుకున్నాడు. ఈశ్లోకంలో మూడవపాదం ఎగిరిపోయినది. ఇక అనుగ్రంగా లభించిన ఈ మూడు ప్రకరణాలనుండి అచ్చటచ్చటి కొన్ని శ్లోకాలు ఉదాహరిస్తాను.

మూలపురుషుడైన కీర్తిమన్నృపాలుని వర్ణించే శ్లోకాలు-

తదక్షపద్గోత్ర సుధాపయోధౌ జాత స్సుధాధామవదుజ్జ్వలాంగః
శ్రీకీర్తిమన్నామనృపాలవర్యస్త్వన్వర్థకోఽభూ ద్యశసైవ నూనమ్. (98)

రాజర్షి (౧ద్ర) స్సుగుణజలధిస్సోఽపి సత్పుత్రకా మో
లక్ష్మీనారాయణవదనరోజాతయుగ్మం హృదబ్జే,
ధ్యాయన్ తస్య స్ఫురితబదరీకాశ్రమే తాపసేంద్రైః
స్థిత్వా సాకం మనుమపి జపన్ భాతి సాక్షాదివాజః॥ (99)

నిజాములు నోడించిన సాకేతపాలకులైన సోదరత్రయం గూర్చి చెప్పిన శ్లోకాలు-

శూరా స్సాహసికా స్త్రయ స్సమధిక ప్రావీణ్యవంతో ధను
ర్విద్యాయాం గజవాజిరాజిరథ సంపత్తి ప్రసేనాశతాః,
సాకేతే నగరే వి(నో) దనకశాలాః ప్రైర్నిశాయాపనం
కుర్వంతః పరిపాలయంతి విషయానర్థ్యాదితేయద్రుమాః. (144)

(త)దంతరే తన్నృపవీరదేశానాక్రమ్య దోర్దండజితారివర్గాః,
మ్లేచ్ఛానిజాములు్కముఖాగ్రసైన్యయుతాబబంధుర్నగరంచ తేషామ్. (145)

ఈ వంశంవారికి ఢిల్లీశ్వరుడిచ్చిన దేశముఖీని గురించి చెప్పినశ్లోకం-

నృపా స్త్రయస్తే బహుభాగ్యవంతః అనేకమాతంగరథాశ్వవంతః,
తత్రైవ ఢిల్లీనగరాధిపాథాత్ మహాజనీ దేశముఖత్వ మాపుః. (211)

మచిలీబందరు సాలకుడైన గోపాలరాయని వర్ణించే శ్లోకం-

శ్రీ గోపాల మహీ(ప)తిః కులకరోదాంత స్తపస్వీ పరం
ధర్మాత్మాఽమితవిక్రమో ద్విజకులాలంకారరూపోఽపి సః,
శ్రీమన్ మత్స్యపురే వరే చ నివసన్ తద్రాజ్యకార్యస్య వై
తత్రస్థాన్ విషయా న్వశాద్రఘు(పతి)రమ్యానివాసాలయత్. (216)

ఈ గోపాలరాయని కొడుకూ, కృతిభర్తతండ్రీ ఐన లక్ష్మీనారాయణుని వర్ణనం ఈ విధంగా ఉన్నది.

రాజాఽసౌ కులశేఖరం కిల తత శ్రీరాజమాంబా సతీ
గర్భప్రోజ్జ్వలశుక్తిమౌక్తికమణిం రాజేశ్వరాఖ్యం సుతమ్,
(లేభే పే)ములవాడ పూర్ణవసన శ్రీరాజరాజేశ్వరో
మానాథస్య వరాన్మహేంద్రవదిమాం యో భూమి మద్యావతి. (234)

సోఽయం రాజేశ్వరనృపవరో రాజమాంబా సుసాధ్వీ
లక్ష్మీనారాయణ నరవయోశ్శైశవే మాతృపిత్రోః,
క్రీడాలాపై స్సకలనిసర్గోపికానందయో స్సం
తోషం కుర్వ న్నివ మురరిపు స్సన్ రరాజ ప్రకామమ్ (235)

తయా మహిష్యాంబికయాఽబ్జముఖ్యా సామ్రాజ్యదీక్షాకలిత స్స రాజా
భాగాపురే పాలితవాన్ స్వరాజ్య మాసాగరా త్త్రత పస న్నయేన. (243)

ఇక అలంకారప్రకరణంనుండి కొన్నిశ్లోకాలు ఉదాహరిస్తాను.
ఉపమాలంకారమునకు-

శ్రీరాజేశ్వర భూపతికంఠీరవమంగజోపమాత్మానమ్,
సంరక్షితభూపాలం రక్షతు లక్ష్మీపతిః పరఘ్నం తమ్. (1)

సాదృశ్యలక్ష్మీ రుభయో ర్విభాతి య తోపమా సా గదితా కవీంద్రైః,
రాజేశ్వరేంద్రక్షితిపాలకీర్తి ర్జ్యోత్స్నేవ గౌరీ దివ మాధురోహ (2)

ద్వయోర్యత్ర వర్ణ్యాయతస్సామ్యమాస్తే, మతా సోపమేయోపమేతి ప్రసిద్ధా
శ్రియా రాజరాజక్షమాపాలమౌళిర్విజృంభతే చంద్రవ త్తద్వదిందుః. (3)

రూపకాలంకారమునకు-

త్రేధా రూపక మీర్యతే తదభిధా తద్రూపతారంజనం
స్యా ద్వర్ణ్యస్య నియంత్రితం విషయిణా యత్రాధికత్వోక్తితః,
న్యూనత్వానుభయోక్తిత స్సమధికో రాజేశ్వరేంద్రప్రభుః
సాక్షా(త్) జిష్ణు రలంకృతా నమభవ ద్గౌ ర్యేన సాకల్యతః (10)

రాజేశ్వరేంద్రవసుధావరచక్రవర్తీ దేవాధిపః (సద) శచీప్రియతాంవిహాయ,
ఆనందయన్ననుదినం విబుధాన్ ప్రకామం జిష్ణుః
సమాదృతబలాతిశయ శ్చకాస్తి. (11)

అపహ్నుతికి-
శుద్ధాపహ్నుతి రన్యారోపార్థో ధర్మనిహ్నవో యత్ర,
నామీ సురాజనృపతే స్సుగుణాః కిం తర్హి రత్నజాలాని. (12)

"నయుక్తికోయత్ర కా ధర్మనిహ్నవోఽబుధా స్తమాహుఃకిల హేత్వపహ్నవమ్
అయం న చేందుః కమలామమోదకో హరి
ర్న సౌమ్య స్సహి చక్రపాలకః." (20)

ఫలోత్ప్రేక్షకు-

కమలభవకులానా మంశుమాలీ విలాసం
స్వయ ముదయ ముదారం యాతి నూనం విధాతుమ్,
అహ మయమితి మన్యే లోకబంధోః స్వభావః
ప్రమితికరణ మస్మిన్ (వచ్మి)రాజేశ్వరేంద్రమ్. (30)

సంబంధాతిశయోక్తికి-

శ్రీనిత్యోత్సవ రాజరాజనృపతి ర్దానోత్సవే ష్వర్థినాం
మేరుం వా వితరిష్యతీతి కణవక్కాలేన చిత్కేన వా,
ఇత్యాలోచ్య సహస్రపాదమపి చ జ్ఞాత్వా జగచ్చక్షుషం
ప్రాదక్షిణ్యవిధేః సురాః స్వవసతి త్రాణే రవిం మేనిరే. (35)

శబ్దార్థవృత్తి దీపమునకు—

శ్రీరాజరాజస్య కథాః ప్రతీతాః సతాం ప్రకామం జనయంతి హర్షమ్,
ప్రతీవ భూపాలక దుర్విధానాం మనోరథానాం (జన ). (48)

ఈ ప్రకరణం ఇంతటితో తెగిపోయినది.

నాయకప్రకరణం ఈవిధంగా ప్రారంభమైనది.

శ్రీలక్ష్మీనారాయణాజ్ఞా విధాయకః,
రాజరాజేశ్వర మహీనాయకః ప్రతివసతి.

అపారిజాతోఽపి సపారిజాతోవనీపకాపేక్షితపూరణేన,
అమందరాగోఽపి సమందరాగః ప్రతీ (క్ష్య) పర్గే (ఘ) న ధైర్యవృత్త్యా.

అటుతరువాత ధీరోదాత్తనాయక లక్షణ లక్ష్యములు చెప్పే శ్లోకాలున్నవి. ఇవి బాగా శిథిలమైనవి. ఈ ప్రకరణంలో తొమ్మిది శ్లోకాలు ఒక దీర్ఘ గద్యం మాత్రం మిగిలినవి. ఈ గ్రంథం సమగ్రప్రతి మరెక్కడైనా దొరికితే తెలుగు జమీందారీల చరిత్రకూ వారి సంస్కృతసాహిత్యపోషణకూ క్రొంగొత్త సమాచారం లభిస్తుంది. వేములవాడ రాజరాజేశ్వరస్వామివారికి అరకొరలేని నివేదనంకూడ కాగలదు. ఇందులోని కుండలీకరణముల్లోని శిథిలపూరణాలు నావి.

(వేములవాడ రాజరాజేశ్వరస్వామి సంస్కృతకళాశాల వార్షిక సంచిక 1981-1982)

రచయిత :— బిరుదురాజు రామరాజు

జననం :— శా. శ. ౧౮౪౭ క్రోధన, చైత్ర బహుళ సప్తమి, గురువారం, ఉత్తరాషాఢ (16–4–1925, 4-40 A. M.) దేవునూరు, వరంగల్ తాలూకా, పెరిగినది మడికొండ.

తల్లిదండ్రులు :— బిరుదురాజు లక్ష్మీదేవి, నారాయణరాజు

పెంచినవారు :— బిరుదురాజు లలితమ్మ, రాఘవరాజు

విద్య :— దేవునూరులో వీధిబడి, మడికొండలో ప్రైమరీ హనుమకొండలో ఇంటరు మీడియేటువరకు. హైదరాబాదులో బి.ఏ. నిజాం కళాశాల (1949); ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. తెలుగు (1951) పిహెచ్.డి (1956) ఎం.ఏ. సంస్కృతం (1960) P. G. Diploma in Linguistics (1966)

ఉద్యోగము :- 1951 నుండి లెక్చరర్, 1957 నుండి రీడర్, 1968 నుండి ప్రొఫెసర్, తెలుగు శాఖాధ్యక్షత 1973-1984; 1967–1974 వరంగల్ స్నాతకోత్తర కేంద్రంలో, తక్కిన కాలం విశ్వవిద్యాలయ కళాశాలలో.

రచనలు :— తెలుగువీరుడు 1952, వీర గాథలు 1954, తెలుగు జానపద గేయ సాహిత్యము 1958, మరుగుపడిన మాణిక్యాలు 1961, ఉర్దూ తెలుగు నిఘంటువు 1962, Folktales of A. P. 1974, Folklore of A.P. 1978, శ్రీ సత్య సాయి విన్నపములు 1981, South Indian Folksongs 1984, నూరు పరిశోధనాత్మక వ్యాసములు.

సంపాదనము :- తెలంగాణా పల్లెపాటలు 1960, త్రివేణి 1960, కుతుబ్షాహి సుల్తానులు– ఆంధ్ర సంస్కృతి 1962, శతసప్తతి 1979.

అముద్రిత గ్రంథపరిష్కరణము :- (తెలుగు) ప్రసన్నరాఘవనాట్య ప్రబంధము 1962, రామాభ్యుదయము 1965, శివరాత్రి మాహాత్మ్యము 1966, సకలజీవ సంజీవనము 1984, (సంస్కృతము) వసుచరిత్రమ్ 1966, జాంబవతీ పరిణయమ్ 1969, శృంగారశేఖరభాణమ్ 1969, రామాయణ సార తిలకమ్ 1972.

అనువాదములు :- గురుగోవిందసింగు చరిత్ర 1966, ప్రేంచంద్ 1971, జాతకకథలు 1984.

అముద్రితములు :— Contribution of Andhra to Sanskrit Literature, నేను నా స్వామి, తెలంగాణా పల్లెపాటలు, పరిష్కరించిన ప్రాచీన సంస్కృతాంధ్రకృతులు, తెలంగాణా కవిమిత్రులు.